సాధన గ్రంథ మండలి - 84.

# శంకరగ్రంథరత్నావళి

(ఆత్మజ్ఞానోపదేశవిధి, మాయావివరణము,
ఉపదేశసాహస్రి, పఞ్చీకరణము)

[పఞ్చీకరణ వార్త్తికము – శ్రీసురేశ్వరులు]



ద్వితీయ సంపుటము

అనువాదకులు :
శతావధానులు
శ్రీ వేలూరి శివరామశాస్త్రి



ప్రకాశకులు :
సాధన గ్రంథ మండలి, తెనాలి.

కాపీరైటు] 1963 వెల : రు. 4–00

# ఆ త్మ జ్ఞా నో ప దే శ వి ధి

## పీ ఠి క

పుడమిలో పుట్టెడు మతములు. ఏమతమువారి కా మతమును ఆ మతగ్రంథమును ఆ మతాచార్యులును ప్రమాణము. ఇంతియకాక యెవరెఱిగినది వారికి సత్యము. మఱి సత్యమో ఒకటిగాని రెండు కాదు. అనఁగా సత్యము వస్త్వధీనముకాని కర్త్రధీనము కాదు. మూగురు గ్రుడ్డివారు ఒక ఏనుఁగును తడిమిచూచి, వారిలో తొండము తడిమి చూచినవాఁడు ఏనుఁగు రోఁకలివలె నున్నదని అనినటులును, తోఁక తడిమిచూచినవాఁడు ఇనుపగరిటెవలె నున్నదని యని నటులును, చెవులు తడిమిచూచినవాఁడు చేఁటవలె నున్నదని యనినటులును సత్యము కర్తృతంత్రముకాక వస్తుతంత్రమే యగును. కావున ఆయాయి మతగ్రంథములఁ జదువువారికి 'ఖండాంతరములందలి యితరమతములకంటెను, భరతఖండము నందును గల యితరమతములకంటెను శాంకరమత విశేష మేమి?' యను ప్రశ్న సహజముగాఁ గలుగును. శంకరు లీ ప్రశ్నకు సమాధానమో యన ఈ ఆత్మజ్ఞానోపదేశవిధిలో —

> 'ఆత్మకు ప్రమాణాపేక్ష లేదు, వేదమేని ఆత్మను పరిచ్ఛిన్నము చేయఁజాలదు, అనఁగా వేదము చెప్పినది గాన ఆత్మ కలదని మనము నమ్మనక్కఱలేదు.'

అను నర్థమును నాలవఖండమున ౧౦ – ౧౧ వాక్యములలో వ్రాసిచ్చిరి. ఇంతియకాక ఉపదేశసాహస్రి ౯౭ – ౯౮ మొద

లగు వాక్యములలో ఈ యర్థమునే మెట్టుమీఁద మెట్టుగా ప్రస్తరించిరి. సరియ, ఇటులగుచో 'ఆత్మ నెఱుఁగు టెటులు?' అను ప్రశ్న తాటితో దబ్బనమువలె వచ్చును. దానికి ఈ గ్రంథమునందే నాలవఖండమున అవస్థాత్రయ శోధనమును సమాధానముగా జెప్పినటులు మనము కనుఁగొనఁగలము:—

"ఆత్మ తమకంటె వేరని మెలకువయు కలయు నిదురయు అను నీ మూడవస్థలును ఎటులు చెప్పగలవు?

ఇవి ఉండబట్టియే.

అనగా?

మెలకువ యున్నపుడు కలగాని నిదురగాని ఉండదు. కల వచ్చినపుడు మెలకువగాని నిదురగాని ఉండదు. నిదుర పట్టినపుడు కలగాని మెలకువగాని ఉండదు. ఈ యవస్థ లనిత్యములు. కాని ఈ మూడవస్థలందును ఆత్మ ఉండును.

అది యేమి? నిదురలో ఆత్మ ఎక్కడ ఉన్నది?

లేకేమి? నిదురనుండి లేచిన ప్రతివాఁడును 'నిదురలో నాకేమియు తెలియలేదు' అని యనును. అనగా 'అపుడు విషయానుభవము లేదు' అను సంగతి ప్రతివానికి తెలియునని తెలుచున్నది. కావున నిదురలో విషయానుభవము లేదనియు ఆత్మ ఉన్నదనియు కచ్చితముగా చెప్పవచ్చును."

[అను అర్థము కల వాక్యములు చూ. ४ - ३, ५, ७.]

కావున ఆత్మ కలదని తెలుపుటకు ఏదో ఒక గ్రంథము గాని ఒక మతాచార్యుడుగాని చెప్పిరికావున గ్రుడ్డిగా మనము నమ్మఁబనిలేదు. ఇంతియకాదు, ఆప్తవాక్యము ప్రమాణమే

కావచ్చుననియు నమ్మనక్కఱలేదు. ఎవనికివాఁడు అవస్థాత్రయము ననఁగా జాగ్రత్ స్వప్న సుషుప్తులను పరిశోధించి ఆత్మ యీమూఁటిని చూచుచున్నదనియును ఈ మూఁటికి మిగిలియు నున్నదనియును భక్తివిచారాదులచే సమాధిలో అనుభవము గొనవచ్చును. ఇది అద్వైతస్థితి. ఈ విషయమును గౌడపాదులు ఉపదేశింపఁగా గోవింద భగవత్పాదులు అనుభవమునకు తెచ్చుకొని శ్రీ శంకరుల కుపదేశించిరి. తమ పరమగురువులు గౌడపాదులు చెప్పినదానినే శంకరభగవత్పాదులు తమభాష్యములందును ప్రకరణములందును* వివరించిరి. ఇటులు వీరు మనకును ప్రపంచమునకును ఇచ్చినది వేదాంతముకాని (వేద+అంత) మతము కాదు. మతమున భేదము ఉండవచ్చును. మతభేదము ఉండుఁగాక, వస్తుభేదము ఉండదు. సత్యము వస్తుతంత్రమేకాని కర్తృతంత్రము కాదని మఱి యొకమాఱు అనుకొందము.

'ఖండాంతరములందలి యితరమతములకంటెను, భారతీయేతరమతములకంటెను మనమతమున కేమి ప్రాశస్త్యము?' అను ప్రశ్నను ఇచట ముమ్మొదట చేసిన చందముగనే ఒకానొకరు ఒకచో ప్రశ్నింపఁగా శృంగేరిపీఠాధిపతులగు శ్రీ శివాభినవ నృసింహభారతీభగవత్పాదులు —

"నాయనా! మతములయెడను, భిన్నభిన్నాభిప్రాయములు వెలువరించు వ్యాఖ్యాతలయెడను, శాస్త్రైకదేశమూలకమయిన దర్శనములయెడను [పూర్వమీమాంసవంటివి], రూప

---

* శాస్త్రైకదేశవిషయం శాస్త్రకార్యాంతరే స్థితమ్
ఆహుః ప్రకరణం నామ గ్రంథభేదం మనీషిణః॥

కాతిశయోక్తులతోఁ జెప్పఁబడిన **తత్త్వపు** పాటలయెడను, (Mysticism) ఇంకను ఇట్టివానియెడ నీప్రశ్న ఒప్పునుగాని యివి యేవియు **వేదాంతము** కావు. వేదాంతమని యేది చెప్పఁబడునో దాని ఆరంభ దశలందుఁగూడ నీ ప్రశ్నకు ప్రత్యుత్తర మొసఁగఁ బని యుండదు. కాని వేదాంతమని యేది చెప్పఁబడునో అది వీని అన్నిటికిని సాక్షాద్భిన్నము. ఇపుడు నీ యడిగిన ప్రశ్నకు ప్రతివచనముతోఁడనే యది అంకురార్పణ మొనరించును. 'సత్యమును కనుగొనుట' అను విషయము నది యెత్తుకొని తన కెవరితోఁడను ఎవరిసంప్రదాయముతోఁడను ఎవరి మతముతోఁడను ఎవరి వ్యాఖ్యావిశేషములతోఁడను వివాదము లేదనియును, అది ఏసంప్రదాయమునకును ఏ తెగకును ఏకోవకును ఏతోయమునకును ఏజాతికిని ఏలింగమునకును ఏసమ్మకమునకును జెందదనియును 'సర్వే జనాస్సుఖినో భవన్తు' అనియును జెప్పును. వలయునేని —

> స్వసిద్ధాన్తవ్యవస్థాసు ద్వైతినో నిశ్చితా దృఢమ్
> పరస్పరం విరుధ్యన్తే తైరయం న విరుధ్యతే॥ ౩-౧౭
>
> వైతథ్యం సర్వభావానాం స్వప్న ఆహుర్మనీషిణః
> అన్తస్థానాత్తు భావానాం సంవృతత్వేన హేతునా॥ ౨-౧
>
> అస్పర్శయోగో వై నామ సర్వసత్త్వసుఖో హితః
> అవివాదోఽవిరుద్ధశ్చ దేశితస్తం నమామ్యహమ్॥ ౪-౨

అను గౌడపాదులవారిని చదివి జీర్ణించుకొనునది" అని చెప్పిరట. విస్తర మెఱుఁగఁగోరువారు శ్రీసుబ్రహ్మణ్యఅయ్యర్ రచించిన The Philosophy of Truth or Tatvajnana అను గ్రంథమును, మైసూరు రామకృష్ణాశ్రమ మఠాధిపతులు

స్వామి శాంభవానందులు ప్రచురించిన దృగ్దృశ్యవివేకమునం గల శ్రీ సుబ్రహ్మణ్య అయ్యర్ Foreword ను, బెంగుళూరు వాస్తవ్యులగు శ్రీ కె. యే. కృష్ణస్వామి అయ్యర్ రచించిన Vedanta or Science of Philosophy అను గ్రంథ మును జూచునది.

ఈ శివాభినవ నృసింహ భగవత్పాదులు కడు నుదా సీనులును పరమ వైరాగ్యసంపన్నులును అని అందఱకును తెలిసిన విషయమే. వారి దర్శనమున కేఁగిన ఒక కవి—

"కారూణా మథ దారూణా మశ్మనా మథ వేశ్మనామ్
నృసింహ భారతేర్ ద్రవ్య మయోగ్యా అయోగ్యా వృథా వృథా"

అని చెప్పెనని విందుము.

ఈ సచ్చిదానంద శివాభినవ నరసింహభారతీ భగవత్పా దులు సదాశివేంద్ర సరస్వతీ స్తుతి రచించిరి.

శంకర భగవత్పాదుల భాష్యము లొకయెత్తు, ప్రకర ణము లొకయెత్తు. భాష్యములు పారావారములు. ప్రకరణ ములు పల్వలములు. 'పాఠకులకు తెలిసెనా లేదా?' యని విచారింపక వర్షించుచుఁబోవు వాఙ్ముఖములు భాష్యములు. పాఠకుల యెట్టెదుటఁ గూర్చుండి కైకొన్న విషయమును సమ గ్రముగా తెలియుచందమున నుపదేశించు ఒజ్జలు, నెచ్చెలు లును ఈ ప్రకరణములు.

శ్రీ శంకరుల ప్రతి ప్రకరణగ్రంథమునందును అనుభూ తితో పెనవేసికొనిన క్రొత్తదనమును గాంభీర్యముతోడి కామ నీయకమును కానిపించును. ఎన్ని పర్యాయములు చదివినను తనివుతీఱని గొప్పదన మీ ప్రకరణగ్రంథము లన్నిటను గలదు.

ఈ ప్రకరణగ్రంథములను కంఠమణులనుగాఁ జేసికొనిన అమ్మమ్మలను తాతయ్యలను నా తరమువా రెఱుఁగుదురు. నా పిదప వచ్చిన తరమువా రీ కంఠమణులనే ఎఱుఁగరు. ఇక తాల్చుటేఁటు? దాల్చు టెఱుఁగనే యెఱుఁగరు. మంచిది.

ఈ యాత్మజ్ఞానోపదేశవిధి పరిమాణమునం దెంత చిన్నదియో గుణమునం దంత దొడ్డది. దీని శైలి కిదియ సాటి.

## ఉ ప దే శ సా హ స్రి

## పీ ఠి క

ఉపదేశసాహస్రి ప్రథమభాగము గద్యబద్ధము. ద్వితీయ భాగము పద్యబద్ధము. మూఁడు ప్రకరణములు గద్యబంధమునను, పదునెనిమిది ప్రకరణములు పద్యబంధమునను; నూటబదునాఱు వాక్యములు గద్యబంధమునను, ఆఱునూఱుల యెనమన్నాలుగు శ్లోకములు పద్యబంధమునను వెరసి యిన్నూఱు తక్కువ వేయి గద్యపద్యములును ఇందుఁ గలవు. ఈ గ్రంథమునందు వేయి యుపదేశములు కలవో లేవో నేను లెక్కించి చూడలేదు. దీనఁ గల యుపదేశములు లెక్కపెట్టి దీని పేరునకు వేయి యుపదేశములని యర్థమో అనేకోపదేశములని యర్థమో నిర్ణయించుట గణకులగు విమర్శకులకు వదలుదును.

గద్యబంధమగు ప్రథమభాగమే యీ సంపుటమున ముద్రితమయినది. ఈ సంపుటమును గద్యసంపుటముగా నుంపఁదలఁచుటయే సంపూర్ణగ్రంథమునుండి యీ ప్రథమభాగమును

విడఁదీసి యిందుఁ జేర్చుటకుఁ గల కారణమని అనుకొందును. ఇటులు విడఁదీసినను చెడిపోవున దేదియు లేదు.

ఈ ప్రకరణములు మేలిమిముద్దలు. గద్దుసత్త్వములఁ జిలికి చిలికి చేతఁబెట్టిన వెన్నముద్దలు. ఇవి 'మమ్ము అనుభవమునకుఁ దెచ్చికొనుము తెచ్చికొను'మను మేలుకొలుపులు. శ్రీ చంద్ర శేఖర భారతీస్వామివారికి న్యాసమిచ్చి శృంగేరీమఠాధిపతుల గను జగద్గురువులనుగాఁ జేసినట్టియు కొవ్వూరుస్వాములవారని పేరుపడినట్టియు అన్వితార్థము కలట్టియు శ్రీ నిత్యానంద స్వాములవా రూరూరను ఈ ప్రకరణగ్రంథముల నూటిపోసి మహోపకారము చేసిరి. (వీరు ఏలూరుదాపున నున్న గుండు గొలనులో బ్రహ్మీభూతులయిరి.)

శంకరగ్రంథ రత్నావళియం దీ ప్రకరణ గ్రంథములను గూడఁ జేర్పఁదలఁచి శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు చేసిన మేలును జిజ్ఞాసువులగు తెలుఁగునాటివారు తమ తలఁపులో నాటఁగలవారు.

చిరివాడ
వయా - తేలప్రోలు.
(కృష్ణాజిల్లా)

ఇట్లు,
వేలూరి శివరామశాస్త్రి

—♦—

# ఆమోదము

శంకరగ్రంథరత్నావళి ప్రథమసంపుటము నేటికి తొమ్మిది సంవత్సరములక్రితము ప్రకటింపబడినది. అందు శ్రీ ఆచార్యుల వారి వాఙ్మయసుధ పాఠకలోకము ఆస్వాదించినది. మండలికి తగిన ఆర్థికసంపద లేమిచే నేటివఱకు ద్వితీయసంపుటము ప్రచురింపబడలేదు. అద్వైతరసపిపాసువులగు ఆంధ్రుల ఆదరాభిమానములతో నేడు ద్వితీయసంపుటము ప్రకటించితిమి. ఇందు ౧ ఆత్మజ్ఞానోపదేశవిధి, ౨ మాయావివరణము, 3 ఉపదేశసాహస్రి (గద్యప్రబంధము), ౪ పఞ్చీకరణము (శ్రీ సురేశ్వరుల వార్తికముతో) అను నాలుగు గ్రంథములు గలవు.

౧ ఉపదేశసాహస్రి (పద్య ప్రబంధము), ౨ అజ్ఞానబోధిని, 3 ఆత్మానాత్మవివేకము, ౪ తత్త్వబోధ, ౫ అపరోక్షానుభూతి (సురేశ్వరులు), ౬ ప్రబోధ సుధాకరము, ౭ శతశ్లోకీ, ౮ స్వాత్మనిరూపణ – అను ప్రకరణగ్రంథములు క్రమముగ 3, ౪ సంపుటములుగ ప్రకటింపబడును.

కోరినతోడనే ఈ ద్వితీయ సంపుటమును వివరణతో ననువదించి మాకొసఁగిన శతావధానులు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

శంకరకింకరులు, శంకరసారస్వత పఠనాభిలాషులు అగు శ్రీ ఆర్. సి. ఎల్లారెడ్డిగారు (రామనపల్లె) ఈ ద్వితీయ సంపుటమునకు 12 రీముల కాగితము నిచ్చిరి. మఱియు డాక్టరు. శ్రీ బెండపూడి పేర్రాజుగారు (వాల్తేరు), శ్రీ జూలూరి జగదీశ్వరయ్యగారు (సికింద్రాబాదు), శ్రీ మంతెన సత్యనారాయణ

రాజుగారు (చెరుకుమిల్లి), శ్రీ బయన అబ్బయ్యగారు (విజయవాడ), శ్రీ కోగంటి తిరుపతయ్యగారు (తెనాలి), శ్రీ ఆమంచి వీరరాఘవయ్యగారు (తెనాలి), శ్రీ కుప్పా వీరరాఘవశాస్త్రిగారు (తెనాలి), శ్రీ కప్పర శ్రీరామచంద్రమూర్తిగారు(తెనాలి) కీ. శే. చింతలపాటి శివరామశాస్త్రిగారు – వీరందరును యథోచితముగ నీ ద్వితీయసంపుటి ముద్రణకు సహాకరించిరి.

వీరికి శ్రీ శంకరాచార్యులవారు ఇతోధిక ఆయురారోగ్య ఐశ్వర్యములు, ధర్మబుద్ధియు ననుగ్రహించుగాక.

క్రమముగా **శ్రీ** ఆచార్యులవారి గ్రంథములన్నియు ఉపనిషత్తులు, భాష్యములు అనువాదముతో ప్రకటింపబడును. మా యీ కృషికి ఆంధ్రుల సంపూర్ణసహాకారమును కోరుచుంటిమి.

శుభకృత్-మార్గశిరము<br>20–12–1962

వ్యవస్థాపకుడు<br>బులుసు సూర్యప్రకాశశాస్త్రి<br>సాధనగ్రంథమండలి, తెనాలి.



# శ్రీ ము ఖ మ్

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకర
భగవత్పాదప్రతిష్ఠిత శ్రీ కాఞ్చీ కామకోటిపీఠాధిప
జగద్గురు శ్రీమచ్చంద్రశేఖరేంద్రసరస్వతీ శ్రీపాదైః
దేశానుసారేణ శ్రీమజ్జయేంద్రసరస్వతీ శ్రీపాదైః
శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రివిషయే
క్రియతే నారాయణాస్మృతిః

శ్రీ శంకరగ్రంథ రత్నావళ్యాః ఆంధ్ర్యనువాదేన సాకం సాధనగ్రంథమండలిద్వారా క్రమశః ప్రకాశనే శ్రద్ధావతా భవతా ప్రకాశితః తదీయః ప్రథమభాగః అస్మత్సమక్షం సమర్పితః ।

కర్మ - భక్తి - జ్ఞాన - యోగాః శ్రుతిబోధితాః యథామర్యాదం వివిచ్యానితరసాధారణ్యారీత్యా ఉపదిష్టవతాం పరమేశావతారభూతానాం శ్రీ భగవత్పాదానాం గ్రంథరత్నాని ఆంధ్రభాషాజ్ఞానా ముపకారాయ ప్రచారయితుః భవతః సర్వమంగళాజానికృపయా సర్వాణ్యపి మంగళాని భూయాసు రిత్యాశాస్మహే॥

యాత్రాస్థానమ్ : త్రైయాత్రికుటి
శుభకృదాశ్విన బహుళనవమీ

— నారాయణాస్మృతిః





శ్రీ చన్ద్రశేఖరేన్ద్ర
సరస్వతీ మహాస్వామినః
శ్రీకాఞ్చీ కామకోటి పీఠమ్.



శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామినః

శ్రీశృఙ్గేరి శారదాపీఠమ్.

ఓం

# ఆ శి ష ః

## "శ్రీ శృంగేరీ శ్రీ జగద్గురు సంస్థానమ్"

శ్రీమ త్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పదవాక్య ప్రమాణ పారావారపారీణ యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమా ధ్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠ తపశ్చక్రవ ర్త్యనా ద్యవిచ్ఛిన్న శ్రీ శంకరాచార్యగురు పరంపరా ప్రా ప్త షడ్దర్శన స్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనా ధీశ్వర సకల నిగమాగమ సారహృదయ సాంఖ్యత్రయప్రతిపాదక వైదికమార్గప్రవ ర్తక సర్వతంత్ర స్వతంత్రాది రాజధానీ విద్యా నగరమహారాజధానీ కర్ణాటకసింహాసనప్రతిష్ఠాపనాచార్య శ్రీమ ద్రాజాధిరాజ గురుభూమండలాచార్య ఋష్యశృంగ పురవరా ధీశ్వర తుంగభద్రాతీరవాసి శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక శ్రీజగద్గురు శ్రీచంద్రశేఖరభారతీస్వామి గురుకరకమలసంజాత శ్రీ జగద్గురు శృంగేరీ శ్రీమదభినవ విద్యాతీర్థస్వామిభిః అస్మ ద త్యన్తప్రియశిష్యాణామ్ తెనాలినగర వా స్తవ్యానామ్ సాధనగ్రంథమండలీ - సంపాదకానామ్ బ్రహ్మశ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిణామ్ విషయే నారాయణస్మరణపూర్వకం విరచితా ఆశిషః సముల్లసన్తు॥

విద్యా హి ద్వివిధా పరా చైవా పరాచ తత్ర పరవిద్యా ధిగమే నైవ జీవనం చరితార్థమ్ । తత ఏవ జనన మరణక్లేశ ప్రహాణిః నిత్యానందావా ప్తిశ్చ । పరవిద్యా హి భక్తి-విర క్తి-శాన్తి - దాన్తి - వివేక ముముక్షాదీని సాధనా న్యపేక్షతే । తదభావే పరవిద్యాయాః ఫలపర్యవసతి విపర్యాస్యాత్ ।

సమస్తే ప్యాన్ధ్రదేశే పరవిద్యాయాః సాధనానాం చ యథాశాస్త్రమ్ ప్రతిష్ఠిత్యై ప్రసృత్యై చ సాధన - గ్రంథ మండలీం - ప్రతిష్ఠాప్య చతుర్దశభ్యో వత్సరేభ్యో బహూన్ అధ్యాత్మగ్రన్థాన్ ఆన్ధ్రానువాదైశ్చ సహ ప్రకాశ్య ఆన్ధ్ర లోకానాం మహతీం ఉపకృతిం అకుర్వన్ భవన్తః భవత్ప్రకాశితాః శంకరగ్రంథరత్నావలీ, సిద్ధాన్తకల్పవల్లీ, భారతీయతత్త్వశాస్త్రమ్, భారతీయదర్శనమ్ ఇత్యాదయో గ్రన్థాః అస్మాభిః తత్ర తత్రావేక్షితాః యథాశాస్త్రమ్ గ్రథితా ఇమే గ్రంథాః జిజ్ఞాసూనాం లోకానాం అపేక్షాపూరకా ఇత్యస్మదాశయః ।

ఇతః పరమపి శంకరసూక్తయః సకలా అపిసానువాదం ప్రకాశనీయా ఇతి భవదాశయం తదనుగుణ ముద్యమం చ అనుమోదామహే వయమ్ । గురువిత్తవ్యయాయాస - సాధ్యేస్మిన్ కర్మణి ఆస్తికాలోకాః సహాకారం వితీర్య శ్రేయః శ్రయేరన్నిత్యాశాస్మహే ।

శ్రీ శారదా చంద్రమౌలీశ్వరయోః అకమ్పయా అనుకమ్పయా భూయాసుర్మంగల పరంపరాః॥

శ్రీ

పెరవలి<br>(ఆంధ్రప్రదేశః)<br>8-6-1961

— ఇతి శ్రీ నారాయణ స్మరణమ్.



ఓమ్

# శ్రీ గాయత్రీ పీఠమ్

## బ్రహ్మైవ సత్యమ్.

జగద్గురు శ్రీమదాదిశంకర భగవత్పూజ్యపాద ప్రతిష్ఠాపిత దక్షిణామ్నాయసంజ్ఞిక శ్రీశృంగగిరిపీఠాధిష్ఠిత శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరభారతీ పూజ్యపాదైః తత్కరకమలసంజాత శ్రీశ్రీశ్రీ మదభినవ విద్యాతీర్థ పూజ్యపాదైశ్చ సదయాభ్యనుజ్ఞాత శ్రీ గాయత్రీపీఠాధిపత్య విరాజమానైః, తైరేవ పూజ్యపాదై రను గృహీత తురీయాశ్రమ యోగపట్టైః, పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీస్వామిభిః, "శంకరగ్రంథ రత్నావళీ" ద్వితీయ సంపుట ప్రచురణసమయే శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి ప్రభృతీనాం సాధనగ్రంథ మండలి సభ్యానాం శ్రేయోఽభివృద్ధయే నారాయణస్మరణ పూర్వకం విరచితా ఆశిషః సముల్లసంతు తరామ్.

ధర్మోద్ధరణకు రామకృష్ణాద్యవతారము లెట్లో, అటులనే జ్ఞానోద్ధరణమునకును అవతారములు గలవు. కలియుగములో అట్టి అవతారపురుషులు శ్రీశంకరభగవత్పూజ్యపాదులు. యజుర్వేద మంత్రభాగమునకు మధ్యలో మణివలె విరాజమానమగుచున్న నమకములో పరమేశ్వరుని గూర్చి 'వ్యుప్తకేశాయ చ' అని వర్ణింపబడినది. వ్యుప్తకేశిత్వము సన్యాసిలక్షణముగదా! ఆ పరమేశ్వరుని సన్యాసావతారము కలియుగములోని శ్రీశంకరులే.

శ్రీ శంకరులు ఊనషోడశవయస్కదశలో భాష్యములను ప్రకరణగ్రంథములను స్తోత్రములను ౧౫౦ పైగా రచించినా రంటే వారు సామాన్యమానవులా? సర్వజ్ఞపీఠాధిరోహణము చేసి, సరస్వతీదేవిచేతనే సర్వజ్ఞ బిరుదమును పొందినవారు సామాన్యమానవులా? కాదు, వారు నిస్సంశయముగ అవతారపురుషులే. సృష్టి పుట్టినతరువాత ఇట్టి మేధావి పుట్టలేదని (the greatest intellect creation has ever seen) ప్రఖ్యాత పాశ్చాత్య మేధాసంపన్నులు అంగీకరించినారు.

శ్రీ శంకరుల జ్ఞానబోధను లోకమునకు అందజేయు నుత్తమ పవిత్రసంకల్పముతో సాధన గ్రంథ మండలివారు శ్రీ శంకరుల గ్రంథరత్నములకు ఆంధ్రానువాదము గావించి "శంకరగ్రంథ రత్నావళి" అనుపేరుతో ప్రకటించుట ఎంతయు ముదావహము.

ఇట్టి అమూల్యమైన ఆధ్యాత్మిక సేవచేయుచున్న సాధన గ్రంథమండలివారికిన్ని, ఆ మండలి స్థాపకులైన శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారికిన్ని ఆంధ్రదేశము ఎంతయు ఋణపడి యున్నది. వీరలకు సకలశ్రేయస్సులు కలుగుగాక అని

— మా నారాయణ స్మరణపూర్వక ఆశీస్సులు.

—♦—

# ఆ శీ స్సు

గుంటూరునగరస్థ శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ విద్యాశంకర
పదమూలవేశప్రకాశిత జగద్గురు శ్రీ సదాశివానంద
భారతీ మహాస్వామి కరకమలసంజాత
పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీ శ్రీనృసింహానందభారతీస్వామి

సాధనగ్రంథమండలి స్థాపింపబడినది మొదలు మే మెఱుగుదుము. మొట్టమొదటగా సాధకుల కనుకూలములగు మార్గమున కరదీపికవలె సాధనమార్గములను ప్రకటించుచు సాగిసాగి ఈ సాధనగ్రంథమండలి అచిరకాలమున ఉద్గ్రంథప్రకటనము ద్వారా ఆంధ్రలోకమున కపారశ్రేయమును గూర్పగలిగి వాసి గడించినది. శ్రీ శంకరగ్రంథరత్నావళి శీర్షికతో ఈ గ్రంథమండలి శ్రీ విద్యాశంకరభగవత్పాదుల కృతులను ప్రకటింప బూనుకొనుట మిక్కిలి ప్రశంసింపదగియున్నది. శ్రీ విద్యాశంకర భగవత్పాద శ్రీపరదేవతాప్రసాదమున ఈ సాధనగ్రంథమండలి ఇతోధికాభ్యుదయమును పొందగలదు అని మా

శుభకృత్ - మార్గశిర పంచమీ
భానువాసరము 2-12-62

— నారాయణస్మరణము.

# శంకర గ్రంథ రత్నావళి

## మహారాజపోషకులు – శాశ్వతము రు. 250 లు.

శ్రీ పిసుపాటి వెంకట్రామశర్మగారు Ph. D. — కరవది
,, ఆర్. సి. ఎల్లారెడ్డిగారు — రామనపల్లె
,, వెల్లంకి దొరయ్యగారు — నల్లజర్ల
(శ్రీ రామకృష్ణ భక్త సంఘ స్థాపకులు)

## రాజపోషకులు – శాశ్వతము రు. 125 లు.

గౌ॥ శ్రీ ఆలపాటి వెంకట్రామయ్యగారు — తెనాలి
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురపాలక, గృహనిర్మాణశాఖామాత్యులు)
శ్రీ జంధ్యాల లక్ష్మీనృసింహస్వామివారు — తెనాలి
,, గోటేటి సత్యనారాయణమూర్తిగారు — కాకినాడ
(Dt. Prohibition Officer)
,, పిసుపాటి బంగారుభొట్లుగారు — కరవది
,, జంధ్యాల లక్ష్మీనరసింహశాస్త్రిగారు — గుంటూరు
,, తవ్వా శ్రీరాములుగారు (మునిసిపల్ చైర్మన్) — తెనాలి
,, ఘంటా చిట్టెయ్యగారు (కంట్రాక్టరు, P.W.D.) — నల్లజర్ల
(శెక్రటరీ, శ్రీ రామకృష్ణ భక్త సంఘము)
,, సీరుకొండ వీరరాఘవరావుగారు (కంట్రాక్టరు, P.W.D.) ,,
(అధ్యక్షులు, శ్రీ రామకృష్ణ భక్త సంఘము)

## పోషకులు – ప్రతిసంవత్సరము రు. 25 లు.

శ్రీ

☞ పై మూడు తరగతులవారికి "శంకర గ్రంథ రత్నావళి" సంపుటములన్నియు నుచితముగ నీయబడును. మహారాజపోషకులకు సాధనగ్రంథమండలి ప్రచురణలన్నియు పారితోషికముగా నీయబడును.

# విషయసూచిక

## ౧. ఆత్మజ్ఞానోపదేశవిధిః



## ౨. మాయావివరణము - మూలము



## ౩. మాయావివరణము - తాత్పర్యము

# ఉ ప దే శ సా హ స్రి

## శిష్యప్రతిబోధ విధిప్రకరణమ్ ౧

## కూటస్థాఽద్వయాఽఽత్మబోధ ప్రకరణమ్ ౨

## పరిసంఖ్యాన ప్రకరణమ్ ౩



## ప ఞ్చీ క ర ణ మ్



శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం,
నమామి భగవత్పాదం శఙ్కరం లోకశఙ్కరమ్.

# శంకర గ్రంథ రత్నావళి

## ఆత్మ జ్ఞానోపదేశ విధిః

### ప్రథమ ఖండః

అథాత్మ జ్ఞానోపదేశ విధిం వ్యాఖ్యాస్యామో ముముక్షవే శ్రద్దధానాయ యతయే వీతరాగాయాత్మలాభాత్ పరలాభాభావాత్. ౧

అర్థము

ఆత్మలాభాత్ = ఆత్మలాభముకంటె [ఆత్మ లాభమనగా ఆత్మజ్ఞానము, తన్ను దా దెలిసికొనుట] పరలాభ - అభావాత్ = ఎక్కుడగు లాభము లేక పోవుటచే । ముముక్షవే = ముక్తి కోరువారి కొరకును [జాత్యేక వచనము] శ్రద్ధధానాయ = శ్రుతిమీదను గురువుమీదను నమ్మకము కలవాని కొరకును । యతయే = సన్న్యాసి కొరకును । వీతరాగాయ = విరక్తి కలవాని కొరకును । ఆత్మజ్ఞానోపదేశ విధిం = తన్ను దెలిసికొనుటకు గురువుకడ ఉపదేశము పొందదగు నియమమును । వ్యాఖ్యాస్యామః = వక్కాణించుచున్నాము.

తాత్పర్యము

తన్ను తాను తెలిసికొనుటకంటె అధికమగు లాభము వేరొకటి లేక పోవుటచే మోక్షము గోరువారికిని శ్రుతి

యందును గురువునందును నమ్మకము కలవారికిని సన్న్యాసులకును విరాగులకును గురువుకడ ఆత్మజ్ఞానము పొందదగు విధిని వివరించుచున్నాము.

విశేషము

బ్రహ్మజ్ఞానము కల గురువు ఉపదేశించినచో అది సఫలము కాగలదు.

ద్రష్టుర్ దృశ్యోఽన్య ఇతి ప్రసిద్ధో లోకేఽథ క ఆత్మేతి? ౨

అర్థము

ద్రష్టుః = చూచువానికంటె। దృశ్యః = చూడదగినది। అన్యః = వేరయినది। ఇతి = అని। లోకే = లోకమునందు। ప్రసిద్ధః = తెల్లము। అథ = అట్టియపుడు। ఆత్మా = ఆత్మ। కః ఇతి = ఎవడు? (ప్రశ్న)

తాత్పర్యము

చూడబడునది చూచువానికంటె (తనకంటె) వేరయినదని అందరకును తెలియును (తానుండగా చూడబడు వస్తువులుండగా ద్రష్టయు దృశ్యము (౧) అనునవి విడివిడివని అందరకును దెలియును) కాగా చూచునట్టి ఈ తాను (ఆత్మ) ఎవరు?

విశేషము

(౧) ద్రష్టను జ్ఞాతయనియు దృశ్యమును జ్ఞేయమనియును అందురు.

దేహ స్తావ దాత్మా న భవతి, రూపాదిమ త్త్వే నోప లభ్యమానత్వాత్, యథాఘటాదయో రూపాది మంత శ్చక్షు రాదికరణై రుపలభంత ఏవం దేహోఽపి రూపాది మాం శ్చక్షురాదికరణై రుపలభ్యతేఽయమితి (౩) యథాదాహ్య ప్రకాశ్య కాష్ఠాది వ్యతిరిక్తో దాహక ప్రకాశకోఽగ్ని స్తథా దృశ్యా ద్దేహా ద్ద్రష్టా వ్యతిరి క్త ఆత్మా సిద్ధః (౪) ఏతస్మా దపికారణాద్దేహాద్ద్రష్టా వ్యతిరి క్త ఆత్మా, స్వాపమరణాది కారణాత్ (౫) యస్మిన్ కాలే దేహం సంవ్యాప్య వ ర్తత ఆత్మా కాష్ఠాదివ త్తదా దేహో వ్యవహారయోగ్యోభవతి, యదా దేహా దపసర్పతి తదా దేహః కాష్ఠాది సదృశోభవతి ; తస్మాద్దేహ వ్యతిరి క్త ఆత్మా సిద్ధః. ౬

అర్థము

దేహస్తావత్ = శరీరము । రూపాదిమ త్త్వేన = ఆకారా దులు కలదిగా । ఉపలభ్యమానత్వాత్ = తెలిసికోబడుటచే । ఆత్మా, న, భవతి = ఆత్మకాదు, । యథా = ఎటులు । రూపాది మంతః = ఆకారాదులుకల । ఘటాదయః = కుండలు మొద లగునవి । చక్షురాదికరణైః = కన్నులు మొదలగు ఇంద్రియ ములచేత । ఉపలభ్యంతే = తెలిసికొనబడుచున్నవో । ఏవం = ఇటులు । రూపాదిమాన్ = ఆకారాదులుకల । దేహోఽపి = శరీరముకూడ । చక్షురాదికరణైః = కనులు మొదలగు ఇంద్రి యములచేత । అయమితి = ఇది యని । (ఇంద్రియములకు

(ప్రత్యక్షమగువస్తువును మనము 'ఇది' యని వాడుదుము) ఉపలభ్యతే = తెలిసికొనబడుచున్నది. 3

యథా = ఎటులు । దాహక ప్రకాశకః = కాల్చునదియు ప్రకాశింపచేయునదియు నగు । అగ్నిః = అగ్ని । దాహ్యా ప్రకాశ్య కాష్ఠాది వ్యతిరిక్తః = కాల్పదగినవియు ప్రకాశింప చేయదగినవియు నగు కట్టెలు మొదలగు వానికంటె వేరో । తథా = అటులు । ద్రష్టా = చూచునట్టి । ఆత్మా = ఆత్మ । దృశ్యాత్ = చూడదగిన । దేహాత్ = దేహము కంటె । వ్యతిరిక్తః = వేరువాడుగ । సిద్ధః = ఏర్పడెను. ర

స్వాప, మరణాది దర్శనాత్ = నిద్ర, చావు మొదలగునవి కనబడుటయును । ఏతస్మాదపి కారణాత్ = ఈ కారణము వలన గూడ । ఆత్మా = ఆత్మ (తాను) । దేహావ్యతిరిక్తః = శరీరము కంటె భిన్నుడు. ౫

యస్మిన్ = ఏ । కాలే = కాలమునందు (ఎపుడు) । ఆత్మా = ఆత్మ । దేహం = దేహమును । సంవ్యాప్య = వ్యాపించి । వర్తతే = ఉండునో । తదా = అపుడు । కాష్ఠాదివత్ = కట్టెలు మొదలగువానివలె । వ్యవహారయోగ్యః భవతి = అటు ఇటు తిరుగుటకును, పనిపాటులు చేయుటకును తగిన దగుచున్నది । యదా = ఎపుడు । దేహాత్ = దేహమునుండి । అపసర్పతి = తొలగుచున్నదో । తదా = అపుడు । దేహః = దేహము । కాష్ఠాది సదృశః = కట్టెలు మొదలగువానివంటిది । భవతి =

అగుచున్నది । తస్మాత్ = కావున । ఆత్మా = ఆత్మ । దేహ వ్యతిరిక్తః = దేహముకంటె వేరుగా । సిద్ధః = తేలినది. ౬

## తాత్పర్యము

ఆకారాదులుగల ఘటాదులు కన్ను మొదలగు ఇంద్రియములచే కనుగొనబడుచున్నవి । ఆకారాదులుగల శరీరము గూడ ఎదుటనున్న వస్తువువలె (౧) కనుగొనబడుచున్నది । ఇటులు రూపము రంగు మొదలగునవి కలదిగా చూడబడుటచే దేహము ఆత్మ కాదు. ౩

వస్తువులను కాల్చను ప్రకాశింపజేయనుగల అగ్ని కాల్పబడునట్టియు ప్రకాశింప జేయబడునట్టియు వస్తువులకంటె వేరయినటుల చూచు తాను (ఆత్మ), చూడబడు దేహము కంటె వేరని సిద్ధమయినది. ౪

దేహమునకు నిద్ర మృతి మొదలగునవి (౨) కలుగుచుండుటను నీ హేతువుచే గూడ ఆత్మ శరీరము కంటె వేరు. ౫

అగ్ని కట్టెనంతయు వ్యాపించినటులు ఆత్మయు శరీరమునంతయు వ్యాపించినపుడు (౩) శరీరము పనులు చేయగలదియు కదలికకలదియునగుచున్నది. ఆత్మ శరీరమును విడిచినపుడో ఆ శరీరము కట్టెలు మొదలగువానివలె అగుచున్నది ; కావున శరీరముకంటె వేరని సిద్ధమయినది ఆత్మ (౪) లేక తాను. ౬

విశేషము

(౧) ఆత్మయో యీ జగత్తునందెల్లయు తానే యని తెలిసి కొనును. 'యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా భూ ద్విజానతః' ఈశావాస్య. (౨) మూర్ఛ(౩) జాగ్రదవస్థయందు ఆత్మ శరీరముతో తాదాత్మ్యము చెందినపుడు (అగ్ని కట్టె యెల్లెడల వ్యాపించుట దృష్టాంతము. ఆత్మ శరీరతాదాత్మ్యము దార్ ష్టాంతికము) పనిపాటులు చేయును. శరీరము బండి; ఆత్మ బండినితోలువాడు. సుషుప్తిలో ఆత్మ దేహతాదాత్మ్యమును విడనాడును. అపుడు కదలిక మెదలిక లుండవు. (౪) ఇటులు సిద్ధమయినది ఆత్మకాని మరి అనాత్మకాదు.

చక్షురప్యాత్మా న భవతి, రూపగ్రహణ సాధనత్వాత్, ప్రదీపవత్ (౬) యథాప్రదీపేన కరణేన రూపముపలభ్యతే తథా చక్షుషాఽపి కరణేన రూపముపలభ్యతే (౭) ఏవమేవే తరాణ్యపి కరణాని. ౯

అర్థము

ప్రదీపవత్ = దీపమువలె । రూపగ్రహణ సాధనత్వాత్ = రూపమును ఎరుగుటకు ఉపకరణమగుటచే । చక్షురపి = కన్ను గూడ । ఆత్మా న భవతి = ఆత్మకాదు. (౬) యథా = ఎటులు । కరణేన = ఉపకరణమగు । ప్రదీపేన = దీపముచే । రూపం = రూపము । ఉపలభ్యతే = తెలియబడుచున్నదో । తథా = అట్లు । కరణేన, చక్షుషాపి = ఇంద్రియమగు, కంటిచేగూడ । రూపం = రూపము । ఉపలభ్యతే = తెలియబడు చున్నది. (౭)

ఏవమేవ=ఇటులే । ఇతరాణి=వేరగు । కరణాన్యపి=ఇంద్రియములును. (ఆత్మకావు) ౯

తాత్పర్యము

దీపము ఇది కుండ, ఇది బండ యని తెలుపు పనిముట్టు. కన్నుకూడ అట్టిదేకాన ఆత్మకాదు. ౭

పనిముట్టగు దీపముచే రూపము తెలియబడినటులు పని ముట్టగు కంటిచేగూడ రూపము తెలియబడుచున్నది. ౮

మిగిలిన ఇంద్రియములచేగూడ శబ్దస్పర్శ రసగంధములు తెలియబడునుగాన ఏ యింద్రియమును ఆత్మకాదు. (పనిముట్టు పనిగొనువానికి ఉపయోగించును. ఇచట పనిగొనునది జీవ-ఆత్మ). ౯

మనోఽప్యాత్మా న భవతి, దృశ్యత్వాత్, కరణత్వాచ్చ ప్రదీపవత్. ౧౦

అర్థము

మనోఽపి = మనస్సుగూడ। ఆత్మా నభవతి = ఆత్మకాదు । దృశ్యత్వాత్ = దృశ్యమగుటచేతను । కరణత్వాచ్చ = కరణము గూడ నగుటచే । ప్రదీపవత్ = దీపమువలె.

తాత్పర్యము

మనస్సుగూడ ఆత్మచే ఆలోచింపదగిన విషయము, మరియు ఆత్మకు దీపమువలె పనిముట్టు. కావున మనస్సుగూడ మిగిలిన ఇంద్రియములతో పాటు ఆత్మకాదు.

బుద్ధిరప్యాత్మా న భవతి, దృశ్యత్వాత్ కరణత్వాత్ ప్రదీప వత్. ౧౧

అర్థము

దృశ్యత్వాత్ = విషయముగుటవలనను । కరణత్వాత్ = సాధనముగుటవలనను । ప్రదీపవత్ = దీపమువలె । బుద్ధిరపి = బుద్ధియు । ఆత్మా న భవతి = ఆత్మ కాదు.

తాత్పర్యము

బుద్ధి ఎరుకకు విషయము. మరియు ఆత్మ దేని నేని నిశ్చ యించుటకు ఇది ఉపకరణము. కావున బుద్ధియు మనస్సు వలెనే ఆత్మ కాదు.

ప్రాణోఽప్యాత్మా న భవతి సుషుప్తౌ చైతన్యాభావాత్ (౧౨) ప్రాణస్యేతరస్మిన్ కాలే భృత్య స్వామినోరివ సంకీర్ణ యో ర్నజ్ఞాయతే కస్యేదం చైతన్యమితి (౧౩) సుషుప్తేతు పున ర్విజ్ఞాన రహితః ప్రాణ ఉపలభ్యతే (౧౪) కరణో పరమా ద్విజ్ఞానాభావః ప్రాణస్యేతిచేన్న, స్వామిని వ్యా ప్రియమాణే కరణోపరమా భావా ద్రాజ పురుషవ దత ఏవ న ప్రాణస్యైతాని । యః స్వాపేనోపరత స్తస్యైతాని కర ణాన్యుపరతాని. ౧౫

అర్థము

ప్రాణోఽపి = ప్రాణముగూడ । ఆత్మా న భవతి = ఆత్మ కాదు. సుషుప్తౌ = నిదురలో । చైతన్యాభావాత్ = ఎరుక లేనందువలన. ౧౨

### తాత్పర్యము

నిదురలో (౧) తానున్నటులు ప్రాణమునకు తెలియదు కాన ప్రాణముగూడ (౨) ఆత్మ కాదు. ౧౨

### విశేషము

(౧) ఒక్క నిదురలో నే కాదు, మఱి మూర్ఛాదులలోను (౨) బుద్ధివలె.

### అర్థము

ఇతరస్మిన్ = నిద్రకంటె వేరగు । కాలే = సమయమందు । సంకీర్ణయోః = వేరుపరపరాని । భృత్యస్వామినోరివ = బంటు దొరలవలె నున్న వీరిలో।కస్య ఇదం చైతన్యం = ఎవరిదీ తెలివి అని । నజ్ఞాయతే = తెలియబడదు. ౧౩

### తాత్పర్యము

తుల్యవేషభాషలు కలిగి పరిజనులతో పరివేష్టితులయిన రాజభృత్యులలో రాజెవడో బంటెవడో తెలియనిదే కన బడు పరిభవమంతయు వారిలో నెవరిదో తెలియ నటులు నిదురకంటె వేరయిన అవస్థలలో కనబడు చైతన్యము ప్రాణముదో లేక ఆత్మదో తెలియదు. ౧౩

### అర్థము

సుషుప్తే తు పునః = నిద్రయందన్ననో । విజ్ఞానరహితః = తెలివిలేని । ప్రాణః = ప్రాణము । ఉపలభ్యతే = కనబడు చున్నది. ౧౪

తాత్పర్యము

నిద్రలో జ్ఞానరహితమై (౧) ప్రాణము పట్టుపడుచున్నది.

విశేషము

(౧) 'తౌహ పురుషం సుప్త మాజగ్మతుః, తమేతై ర్నామభి రామన్త్రయాఞ్చక్రే, బృహన్ । పాండర వాసః! సోమ! రాజన్! ఇతి । సనో త్తస్థౌ, తం పాణినా పేషం బోధ యాఞ్చకార, సహో త్తస్థౌ' ౨-౧-౧౫ బృహ — శాంకర భాష్య — చూ.

అర్థము

కరణోపరమాత్ =కరణ=ఇంద్రియములయొక్క । ఉపర మాత్ =విశ్రాంతివలన । ప్రాణస్య=ప్రాణమునకు । విజ్ఞానా భావః = తెలివిలేదు । ఇతి చేన్న = అని చెప్పరాదు । స్వామిని=ప్రభువు । వ్యాప్రియమాణే=పనిచేయుచుండగా । కరణోపరమాభావాత్ = ఇంద్రియములకు విశ్రాంతి లేక పోవుటవలన । రాజపురుషవత్ = బంట్లవలె । అత ఏవ = కావుననే । ఏతాః = ఈ యింద్రియములు । నప్రాణస్య = ప్రాణమునకు సంబంధింపవు । ఉపరతాని = ఊరకయున్న । ఏతాని = ఈ । కరణాని = ఇంద్రియములు । యః = ఎవడు । స్వాపేన=నిద్రచే । ఉపరతః = విశ్రమించెనో । తస్య=అత నికి సంబంధించినవి. ౧౫

తాత్పర్యము

ఇంద్రియములు పనిచేయక ఊరకుండబట్టి ప్రాణము చైత న్యము లేనటులు కానవచ్చుచున్నదని అనుమానింపదగదు ।

ద్వారపనిచేయునెడల బంట్లు ఊరక కూర్చుందురా? కావుననే నిద్ర కతన (౧) ఉపరమించిన యింద్రియములు ప్రాణము నకు సంబంధించినవికావు మరి నిద్రపోవుచున్నవానివి. ౧౬

విశేషము

(౧) నిదురలో బుద్ధి అజ్ఞానమునందు మునుగగా ఇంద్రియ ములు తాముగా పనిచేయజాలవు. (౨) నిక్కముగ నాత్మకు నిద్రాద్యవస్థలు లేవు। ఈ యవస్థలు బుద్ధివి। అట్టి బుద్ధితో అసత్యమగు తాదాత్మ్యము పొంది నందున ఈ యవస్థలు తనవివలె తోచును. ౪-౩-౭ బృహం - చూ. ౨-౩-౨౦. బ్ర. సూ.

యదాఽసౌ బహి ర్నిర్గత్య కరణా న్యధితిష్ఠతి, తదా సర్వాణి కరణాని స్వస్వవిషయే ప్రవర్తన్తే, యదా జాగ్రత్ స్థితి నిమిత్తం కర్మోద్భూతం భవతి తదాస్వాపా దుపరతో భవతి. (౧౬) తత్ క్షయే సర్వాణి కరణాని గృహీత్వా బుద్ధ్యుపాధి సంపర్క జనిత విషయ విజ్ఞానేన స్వప్నం సుషుప్తం వా గచ్ఛతి. ౧౭

అర్థము

యదా = ఎప్పుడు। అసౌ = ఈ జీవాత్మ। బహిఃనిర్గత్య = వెలువడి। కరణాని = ఇంద్రియములను। అధితిష్ఠతి = అధిష్ఠిం చునో। తదా = అప్పుడు। సర్వాణి కరణాని = అన్ని యింద్రి యములు। స్వస్వవిషయే = తమ తమపనులలో। ప్రవర్తన్తే =

మెలగును । యదా = ఎపుడు । జాగ్రత్ స్థితి నిమిత్తం = జాగ్రదవస్థా హేతుకమగు । కర్మ = కర్మ । ఉద్భూతం భవతి = ప్రసక్తమగునో । తదా = అపుడు । స్వాపాత్ = నిదురనుండి । ఉపరతో భవతి = విశ్రమించును. ౧౬

తత్ క్షయే = ఆ కర్మ తీరినపుడు । బుద్ధ్యుపాధి సంపర్క జనిత విషయ విజ్ఞానేన = అజ్ఞానమను ఉపాధియొక్క కలయికచే బొడమిన చిదాభాసునిచే (చిదాభాసు డిచట విషయ విజ్ఞానమునకు అర్థము । విషయ విజ్ఞానము చిదాభాసునిచే కలుగునుగాన ఇటులు చెప్పబడెను.) సర్వాణి కరణాని = అన్ని ఇంద్రియముల సామర్థ్యమును । గృహీత్వా = తనలో ఉపసంహరించుకొని । స్వప్నంవా = కలనుగాని । సుషుప్తంవా = నిద్రను గాని । గచ్ఛతి = పొందును. ౧౭

## తాత్పర్యము

కర్మ అనుభవింపవలసి వచ్చినపుడు జాగ్రదవస్థ కలుగును. అపుడు జీవాత్మకు నిద్ర తొలగును. ఆత్మ యిటులు వెలువడి (౧) యింద్రియముల నధిష్ఠించును. (౨) అవు డింద్రియములు తమ తమ విషయములలో వర్తించును. ౧౬

జాగ్రదవస్థకు నిమిత్తమయిన కర్మ తరగినపుడు జీవాత్మ బుద్ధి యను ఉపాధితో కలసినందున, కలిగిన (3) విషయ విజ్ఞానముచే ఇంద్రియముల నన్నిటి నుపసంహరించుకొని కలనుగాని నిద్రనుగాని పొందుచున్నది. ౧౭

## విశేషము

(౧) సుషుప్తియందు జీవుడు బుద్ధిలోను బుద్ధి అజ్ఞానము లోను మునుగును. బుద్ధితో తాదాత్మ్యము చెందిన జీవుడు బుద్ధితోపాటు అజ్ఞానమునుండి బయటికి వచ్చినటులుండును. (౨) అపుడు బుద్ధి ఇంద్రియములను తమ తమ పనులలో నియమించును. (3) అజ్ఞానముచే పొడమినదియు అంతఃకరణము నందుఉండి అభివ్యక్తమయినదియు అగు ఒకానొక జ్ఞానముచే (ఇది చిదాభాసునిచే కలిగినది. ఇది ఇంద్రియ జ్ఞానము నెఱుగుటకు కరణము) ఇంద్రియముల శక్తిని తనలో నుపసంహరించుకొని—'ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ' బృహ ౨-౧-౧౭—'విజ్ఞానేన అంతఃకరణ గతాభివ్యక్త విశేష విజ్ఞానేన ఉపాధి స్వభావజనితేన శంకరభాష్య.—'ఉపాధిః అంతఃకరణం తస్య స్వభావః – తదుపాదాన మజ్ఞానం. తేన జనిత మంతఃకరణగత మభివ్యక్తం విశేష విజ్ఞానం చైతన్యాభాస లక్షణం తేన కరణే నేత్యర్థః' ఆనందగిరి 'ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ = ప్రాణశబ్ద వాచ్యేంద్రియజన్యం జ్ఞానం మనసాసహా దాయే త్యర్థః = మనసుతో పాటు ఇంద్రియజన్య జ్ఞానమును తనలో నుపసంహారించుకొని' అని రంగరామానుజులు. ర-౨-౧-౧౭, ర-3-౯ బృ.

ఏవం స్థాన త్రయ మనవరతం గచ్ఛతి ౧౭
కర్మ నిమిత్తం చేదం గమనాగమనమ్. ౧౮

అర్థము

ఏవం=ఇటులు (ఆత్మ) అనవరతమ్=ఎల్లప్పుడును। స్థాన త్రయమ్=ముచ్చోటులను। గచ్ఛతి పొందుచున్నది. ౧౮

మనసః=మనస్సుయొక్క। ఇదమ్=ఈ। గమనాగమ నమ్=రాకయు పోకయు। కర్మనిమిత్తమ్=కర్మకారణకము। చ=మరియు=కామముగూడ ఇందులకు కారణము. (౧౯)

తాత్పర్యము

జీవు డెపుడును (౧) ఇటులు జాగ్రత్ స్వప్న సుషుప్తులను పొందును. ౧౮

జీవుని (౨) యీ అనుభవములకు (3) గతకర్మలును అజ్ఞానమును కోరికలును కారణము. ౧౯

విశేషము

(౧) ముక్తి పొందువరకును ఈ యవస్థలను పొందుచునే యుండును. (౨) ఈ యనుభవములు నిక్కవములు కావు; కాని నిక్కవములైనటులు కనబడును. ఇచట మనశ్శబ్దము జీవాత్మను చెప్పును. ౬-౭-౨ ఛాందోగ్య - చూ. (౩) నిద్రా వస్థలో కర్మభోగము లేదు। ఇది జాగ్రత్ స్వప్నములకు కారణము.

స్వప్న జాగరితే గచ్ఛతి పునః స్థాన ద్వయనిమిత్త కర్మోద్భూత శ్రమాపనోదనాయ సుషుప్తమపి గచ్ఛతి. ౨౦

### అర్థము

(ఆత్మ) స్వప్న జాగరితే = కలను మెలకువను గచ్ఛతి = పొందుచున్నది । పునః = మరల । స్థాన ద్వయ నిమిత్త కర్మో ద్భూత శ్రమాపనోదనాయ = రెండవస్థలకు కారణమయిన కర్మవలన కలిగిన శ్రమను పోగొట్టు కొనుటకొరకు । సుషుప్త మపి = నిద్రనుగూడ । గచ్ఛతి = పొందుచున్నది: ౨౦

### తాత్పర్యము

ఆత్మ స్వప్నావస్థను జాగ్రదవస్థను అనుభవించి (౧) ఈరెండ వస్థలకు (౨) కారణమగు కర్మవలన కలిగిన అలసటను పోగొట్టు కొనుటకు మరల సుషుప్తిని (3) గూడ (౪) పొందుచున్నది.

### విశేషము

(౧) చేసికొనిన కర్మఫలముల ననుభవించుటకు (౨) ౪-3-౧౯ బృ, (3) నిద్రావస్థకు కర్మములు కారణము కావు. మఱియు నిద్రావస్థలో కర్మ ఫలానుభూతి లేదు. (౪) అనుభ వింపదగిన దేదియు లేనపుడు ఆత్మ స్వస్వభావముననే యుండును.

ప్రాణోఽపి తద్ధర్మ వశాదేవ శరీరం పాలయన్ వర్తతే స్వప్న సుషుప్తయో ర్జాగరిత ఇవ మృతి భ్రాంతి పరిహారాయ. ౨౧

### అర్థము

జాగరితేఇవ = జాగ్రదవస్థయందువలె । స్వప్నసుషుప్త యో రపి = స్వప్న సుషుప్త్యవస్థలయందును । ప్రాణః = ప్రాణము ।

తద్ధర్మవశాదేవ = స్వస్వభావవశమువలననే। మృతి భ్రాంతి పరిహారాయ = చచ్చిపోయెనను భ్రాంతిని పోగొట్టుటకు। శరీరం= దేహమును। పాలయన్ వర్తతే= కాపాడుచుండును.

తాత్పర్యము

ప్రాణము స్వవిలక్షణ స్వభావముచే (౧) జాగ్రత్ స్వప్నములందువలె నిద్రావస్థయందును 'శరీరము చచ్చిపోయిన' దను భ్రాంతిని పోగొట్టుటకు శరీరమును రక్షించుచుండును. ౨౧

విశేషము

(౧) స్వప్న నిద్రావస్థలందు ఊపిరి ఆడకుండిన యెడల శరీరము చనిపోవును. జీవుడు కర్మఫల మనుభవించుటకు ఈ శరీరము పుట్టెను. ఊపిరి ఆడనిచో శరీరము నశించును। దాన జీవునకు కర్మ ఫలానుభవము ఉండదు. కావున ప్రాణ మీ అవస్థాత్రయమునందును పనిచేయుచునే యుండును. ఇది ఇంద్రియమని సాంఖ్యాదులు. కాదని బాదరాయణులు. ౨-౪-౯ బ్ర. సూ. చూ.

అహ మప్యాత్మా న భవతి, సర్వై రాత్మత్వే నాభిమతోఽపి ప్రత్యగాత్మ వివేక రహితైర్ దృశ్యత్వాత్ ఘటాదివదేవ. (౨౨)వ్యభిచారాత్ (౨౩) సుఖదుఃఖాద్యనేక విశిష్టత్వాచ్చ, సంసార విశిష్టత్వాచ్చ, కృశత్వ స్థూలత్వాది ధర్మ విశిష్ట దేహవత్. ౨౪

## అర్థము

ప్రత్యగాత్మ వివేకరహితైః = జీవాత్మ ప్రత్యగాత్మల వివేకజ్ఞానములేని । సర్వైః=అందరచేతను । ఆత్మత్వేన=ఆత్మగా । అభిమతోఽపి = అనుకోబడినప్పటికి । ఘటాదివదేవ = కుండ మొదలగు వానితోపాటు । దృశ్యత్వాత్ = దృశ్యమగుట జేసియు । (౨౨) వ్యభిచారాత్ = నిద్రావస్థలో లేకపోవుట జేసియు, (౨౩) కృశత్వ స్థూలత్వాది ధర్మ విశిష్ట దేహవత్ = సన్నము లావు మొదలగు ధర్మములతో గూడుకొనిన దేహమువలె । సుఖదుఃఖాద్యనేక విశిష్టత్వాచ్చ = సుఖము దుఃఖము మొదలగు పెక్కు గుణములతో కూడుకొని యుండుట జేసియు, సంసార విశిష్టత్వాచ్చ = సంసార ధర్మములతో కూడుకొనుట జేసియు; అహమపి = అహంకారము గూడ । ఆత్మా = ఆత్మ । నభవతి = కాదు. ౨౪

## తాత్పర్యము

రెండు నేను లున్నవి. వానిలో నొకటి అహంకారము లేక జీవాత్మ. మరియొకటి (దానికిని లోపలనున్న) సాక్షి లేక అంతరాత్మ లేక ప్రత్యగాత్మ. ఈ రెంటికిని భేదము తెలియనివారు అహంకారమే ఆత్మ యని అనుకొందురు. కాని అది ఆత్మకాదు. ఏల? కుండలు మొదలగునవి ఎటుల దృశ్యములో అహంకారముగూడ అటులే దృశ్యము. మరియు ఇది (౧) నిదురలో అంటిపెట్టుకొని (అను స్యూతమయి) యుండదు. శరీరమున కున్నటులు అహమునకును సుఖ

(౨) దుఃఖాదులగు సంసార ధర్మములును (3) కృశత్వము, స్థూలత్వము మొదలగు ధర్మములు ఉన్నవి. కావున ఈ అహంకారముగూడ (౪) ఆత్మ కాదు. ౨౪

వి శే ష ము

(౧) అహంకారము నెరుగు ఆత్మ జాగ్రత్ స్వప్నము లందును నిద్రావస్థయందును ఉండును గాని నిద్రావస్థలో అహము ఉండదు. (౨) ఈ గుణములు సాంసారికములు. ఇవి ఉన్న అహంకారము సంసారి. ఆత్మ కసలు గుణములే లేవు. ఛాం-౭-౨౫-౧ చూ. (3) కోరిక అసూయ మొదలగునవి. (౪) ప్రాణమువలె.

**యద్యేవం దేహాది ష్వనాత్మత్వం, ఆత్మశంకా కుత ఇతిచే ద్ద్రష్టు ర్దృశ్యవివేకాభావాత్..** ౨౫

ఇతి ప్రథమః ఖండః

ఏవం=ఇటులు । దేహాదిషు = దేహము మొదలగువాని యందు । అనాత్మత్వం యది = ఆత్మధర్మము లేనియెడల । ఆత్మశంకా = ఆత్మ యను సందియము । కుతః = ఎటులు । ఇతిచేత్ = అను నెడల । ద్రష్టుః = ద్రష్టకంటె (చూచు వానికంటె) దృశ్యవివేకాభావాత్ = దృశ్యము (చూడఁ బడునది) వేరను వివేకము లేకపోవుట వలన. ౨౫

తా త్ప ర్య ము

దేహము మొదలుకొని అహంకారమువరకు గల వానిలో ఆత్మ ధర్మము లేనిచో ఇది ఆత్మ అని ఎటులు తోచును ?

చూచువానికిని చూడఁబడుదానికిని వేఱిమి కలదని తెలిసి కొనక పోవుటవలన. ౧

### విశేషము

(౧) సంసారులు ఒకొకపుడు దేహమును ఇంద్రియమును మనస్సును బుద్ధిని అహంకారమును 'నేను నేనని' వ్యవహరింతురు. ఇవన్నియు దృశ్యములు. వీని అన్నిటిని చూచుచు (ద్రష్ట) వీనికి వేరుగా ప్రత్యగాత్మ కలడనియు అతనియందే ఇవి అన్నియు అధ్యస్తము లనియు వీరికి తెలియదు.

ఇది ప్రథమఖండము

## ద్వితీయః ఖండః

అథ స ఆత్మా క ఇత్యుక్తేభ్యః సర్వేభ్యో వ్యతిరిక్త ఆంతరతమః, ఆకాశవత్ సర్వగతః, సూక్ష్మో నిత్యోనిరవయవో, నిర్గుణో, నిరఞ్జనో, గమనాగమనాది క్రియారహితోఽహఙ్కార మమకారేచ్ఛా ద్వేష ప్రయత్నరహితః స్వయం జ్యోతి స్స్వభావోఽగ్న్యుష్ణవత్ సవితృ ప్రకాశవదాకాశాదిభూతరహితో, బుద్ధ్యాది కరణరహితః, సత్త్వాది గుణరహితః, ప్రాణాది వాయుభేదరహితోఽశనాయా పిపాసా శోకమోహ జరామరణ ప్రాణబుద్ధి శరీర ధర్మరహితో య స్సర్వప్రాణి హృది స్థితః, సర్వబుద్ధే ర్ద్రష్టా, స ఆత్మేతి. ౧

### అర్థము

అథ = ఇక। [అనగా తనకు సంబంధించిన వానిలో ఏదియు కానియెడల] సః = ఆ। ఆత్మా = ఆత్మ। కః = ఎవడు? ఎట్టివాడు? ఇతి (చేత్) అనుచో — ఉక్తేభ్యః = చెప్పబడిన। సర్వేభ్యః = అన్నిటికంటె। వ్యతిరిక్తః = వేరయినవాడు। ఆంతరతమః = ఈ చెప్పబడిన అన్నిటికంటె మిగుల లోపలివాడు। ఆకాశవత్ = ఆకాశమువలె। సర్వగతః = ఎల్లెడ నున్నవాడు। సూక్ష్మః = సూక్ష్మమైనవాడు। నిత్యః = ఎల్లపుడుండువాడు। నిరవయవః = అవయవములు లేనివాడు। నిర్గుణః = గుణములు లేనివాడు। నిరఞ్జనః = మచ్చయను

మాట లేనివాడు । గమనా గమనాదిక్రియా రహితః = వెళ్లుట వచ్చుట మొదలగు క్రియలు లేనివాడు । అహంకార మమకారేచ్ఛా ద్వేష ప్రయత్న రహితః = 'నేను' 'నాది' అను భావములును, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము ఇవి లేని వాడును । అగ్న్యుష్ణవత్ = అగ్నికి వేడిమివలె । సవితృ ప్రకాశవత్ = సూర్యుని (నకు) ప్రకాశము వలె । స్వయం జ్యోతి స్స్వభావః=స్వభావముచే స్వప్రకాశుడు । ఆకాశాది భూత రహితః = ఆకాశము మొదలగు పంచభూతముల సంపర్కము లేనివాడు । ప్రాణాది వాయుభేదరహితః = ప్రాణము మొదలగు వాయుభేదములు [అపానోదాన వ్యాన సమానములు] లేనివాడు । అశనాయా పిపాసా శోకమోహ జరామరణ ప్రాణబుద్ధి శరీరధర్మరహితః=ఆకలి, దప్పి, వంత, మోహము, ముదిమి, చావు, ప్రాణము, బుద్ధి, శరీరధర్మ ములు లేనివాడు । మరియు, యః = ఎవడు । సర్వప్రాణి హృది=అన్ని ప్రాణుల హృదయమునందు । స్థితః = ఉన్న వాడో । మరియు, సర్వబుద్ధేః=అన్ని బుద్ధులను । ద్రష్టా = చూచువాడో । సః = అల్లతడు । ఆత్మేతి = ఆత్మ యని । ఉచ్యతే = చెప్పబడును. ౧

## తాత్పర్యము

తనకు సంబంధించిన వానిలో ఏదియు కానియెడల ఆత్మ యనువాడెవడు, ఎట్టివాడు అని అడుగుచో చెప్పుచున్నాము: లోగడ చెప్పినవాని కన్నిటికిని వేరయినవాడు మరియు వాని

అన్నిటికంటె లోపలివాడు, ఆకాశమువలె అంతట నున్న వాడు, అణువున కణువగువాడు, నిత్యుడు, అవయవ హీనుడు, నిర్గుణుడు, వాడు కలియు మాఁగును లేనివాడు, రాక పోక మొదలగు పనులు లేనివాడు, 'నేను' 'నాది' యను తలపుగాని, ఇచ్ఛా ద్వేష ప్రయత్నములుగాని లేని వాడు, అగ్నికి వేడిమివలె సూర్యునకు ప్రకాశమువలె ఎరుకయే స్వభావముగా గలవాడు, పంచభూత సంపర్కము లేనివాడు, ఇంద్రియములు, గుణములు, ప్రాణాదులు, ఆకలి దప్పులు, శోకమోహములు, జరామరణములు, శరీరము లేనివాడు ఆత్మ. ఇంతియకాక ఎవడు అందర హృదయములం దుండి అందరి బుద్ధులను జూచునో అత డాత్మ. ౧

సర్వబుద్ధి విశిష్టత్వే నోపలభ్యమానత్వాత్ సర్వప్రాణి హృదిస్థ ఇత్యుచ్యతే, న పున స్సర్వగతస్య నిరవయవ స్యాత్మనో బుద్ధ్యాధారత్వం సంభవతి యథాకాశస్య న కశ్చి త్పదార్థ ఆధారో భవతి. ౨

అర్థము

సర్వబుద్ధి విశిష్టత్వే నోపలభ్యమానత్వాత్ = ఎల్లబుద్ధులతో కూడియున్న చందముగా కానుపించుటవలన । సర్వప్రాణిహృదిస్థ ఇతి = ప్రాణు లన్నిటియు హృదయమునందు ఉన్నవాడని । ఉచ్యతే = చెప్పబడును । పునః = కాని । సర్వగతస్య = సర్వవ్యాపకుడును । నిరవయవస్య = అవయవ

హీనుడును అగు । ఆత్మనః = ఆత్మకు । బుద్ధ్యాధారత్వం = బుద్ధి ఆధారమగుట । నసంభవతి = పొసగదు । యథా = ఎటులనగా । ఆకాశస్య = ఆకాశమునకు । కశ్చిత్ పదార్థః = ఏ పదార్థమును। ఆధారో న భవతి = ఆధారముకాదో (తథా = అటులు).

### తాత్పర్యము

ఆకాశమునకు ఏ వస్తువును ఆధారము కానటులు వ్యాపకుడును నిరవయవుడునుఅగు ఆత్మకు బుద్ధి ఆధారము (౧) కానోపదు. ఇటు లయినను బుద్ధు లన్నిటితోః సంబంధ (౨) మున్నటులు కానిపించుటవలన ఆత్మ అందర హృదయములందు ఉండునని చెప్పనగును. ౨

### విశేషము

(౧) స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి? స్వే మహిమ్ని ౭-౨౪-౧ ఛాం. = అయ్యా! ఆత్మకు నెలవు ఏది? తన మహిమయే.
(౨) అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుణ్డరీకం వేశ్మ దహరోఽస్మి న్నంతరాకాశ స్తస్మి న్యదన్త స్త దన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్య మితి. ఛాం. ౮-౧-౧ = ఈ బ్రహ్మపురమందు హృదయము అను సూక్ష్మమగు నింటిలో సూక్ష్మమగు ఏ బయలు కలదో అచట వెతకికొనునది, అదియు తెలిసికొనదగినది.

కథం పున రహఙ్కార మమకారేచ్ఛా ద్వేష ప్రయత్న రహిత స్యాత్మనో ద్రష్టృత్వ మిత్యుచ్యతే? ద్రష్టృత్వం

నామ దర్శనక్రియాకర్తృత్వమ్ (౩) యది దర్శనక్రియాం కరోతీత్యాత్మా ద్రష్టా స్యాత్తదా శేషబుద్ధి ద్రష్టృత్వం నోపపద్యతే, విరోధా ద్యథా దేవదత్తస్య క్రియానురోధేన యుతాయుత సిద్ధ కరణాది స వ్యపేక్షయా గమనాగమనాది క్రియాకర్తృత్వమ్. ౪

### అర్థము

అహంకార మమకా రేచ్ఛా ద్వేష ప్రయత్న రహితస్య = 'నేన'ను భావము కాని 'నాది' అను భావముకాని ఇచ్ఛా ద్వేష ప్రయత్నములు గాని లేని। ఆత్మనః పునః= ఆత్మకన్నో। ద్రష్టృత్వమ్ = ద్రష్టృత్వము। కథమితి (చేత్) ఎటు లని అడుగుచో। ఉచ్యతే = చెప్పబడుచున్నది। ద్రష్టృత్వం = ద్రష్టృత్వము। దర్శనక్రియా కర్తృత్వం నామ = చూచుట అను క్రియలో కర్త యగుటకదా! (3) ఆత్మా = ఆత్మ। దర్శనక్రియాం = చూచుట యను పనిని। కరోతి ఇతి = చేయుచుండుట జేసి। ద్రష్టా స్యా ద్యదితదా = ద్రష్ట యగునేని। అశేషబుద్ధి ద్రష్టృత్వం = అన్ని బుద్ధులను జూచుట। న ఉపపద్యతే = పొసగదు। విరోధాత్ = పొసగు నని చెప్పుట విరుద్ధ మయిన దగుట వలన। యథా = ఎటు లనిన। దేవదత్తస్య = దేవదత్తునకు (తెలుగు భాషలో ఎవడో పుల్లయ్య అనిగాని ఎల్లయ్య అనిగాని అన్నట్లు సంస్కృతములో దేవదత్త పదమునకు వాడుక) క్రియాను రోధేన = క్రియననుసరించి। యుతాయుత సిద్ధ కరణాది

సవ్యపేక్షయా = యుత సిద్ధములు, అయుత సిద్ధములు నగు ఉపకరణములనుబట్టి (స్వతంత్రములైన యుపకరణములు యుత, సిద్ధములు. ఉదా॥ గొడ్డలి, కొడవలి మొ॥ అవయవి మొదలగు వానినుండి విడదీయరాని ఉపకరణములు అయుత సిద్ధములు. ఉదా॥ చేయి, వేలు, గోరు మొ॥) గమనాగమ నాది క్రియాకర్తృత్వమ్ = వెళ్లుట వచ్చుట మొదలగు క్రియలలో కర్తృత్వము (ఏర్పడును గదా). ౪

## తాత్పర్యము

అహంకారముగాని మమకారముగాని ఇచ్ఛగాని ద్వేషము గాని ప్రయత్నముగాని లేని యాత్మ ద్రష్ట(౧)యగు టెటులు? చూచుట యను పని చేయు వాడుకదా చూచువాడు! చూచుట యను పని చేయుటచే ఆత్మ ద్రష్ట యగునేని బుద్ధుల నన్నిటిని జూచు టెటులు పొసగును? కాగా ఇటు లనుట విరుద్ధము(౨). వచ్చుట పోవుట మొదలగు క్రియలలో నెవనికేని కర్తృత్వ మేర్పడుటకు ఆ యా క్రియల అపేక్ష యుండును. మరియు నా యా క్రియలు నిష్పన్నము లగుటకు కర్తకంటె వేరయినవియు కానివియు నగు కరణముల అపేక్ష యుండును. 3-౪

## విశేషము

(౧) ఇచట ద్రష్ట యనగా కేవలము చూచువాడే కాక అన్నిటి నెరుగువాడు అని అర్థము. (౨) ఎవడేని యే కాలమున సర్వబుద్ధులను చూడజాలడుగాన ఇటులనుట విరుద్ధము.

నో భయ ప్రకార కరణ సంబంధరహిత స్యావిక్రియస్య దృగ్రూప స్యాత్మనో దర్శనక్రియా స్యాత్. ౫

అర్థము

ఉభయ ప్రకార కరణ సంబంధ రహితస్య = ఇరు తెగలగు కరణములతోడి సంబంధము లేని । అవిక్రియస్య = వికారము లేని । దృగ్రూపస్య = చూపే (జ్ఞానమే) రూపుగా గల । ఆత్మనః=ఆత్మకు । దర్శనక్రియా = చూచుట యను క్రియ । నస్యాత్ = ఉండదు ౫

తాత్పర్యము

రెండు రీతులగు కరణములతో సంబంధముగాని మార్పు గాని లేనట్టి చిత్ స్వరూపునకు చూచుట యను క్రియలో కర్తృత్వము పొసగదు. ౫

యస్య తు పునః కరణాది సవ్యపేక్షయా ద్రష్టృత్వం, తస్యాల్పవిషయ ద్రష్టృత్వం, క్రమ ద్రష్టృత్వ మద్రష్టృత్వ మన్యథా ద్రష్టృత్వం స్యాత్, పరిణామిత్వాత్, కరణాదినిమిత్త సవ్యపేక్షత్వా చ్చ, చిత్రప్రదీపవదేవ. ౬

అర్థము

యస్యతు పునః = ఎవ్వని యేని । ద్రష్టృత్వం = ద్రష్టృత్వము । కరణాది సవ్యపేక్షయా = కరణములు మొదలగు వాని సాయముచే చూచుటయో । తస్య = అలవాని ద్రష్టృత్వము । అల్పవిషయ ద్రష్టృత్వం = కొలది

విషయముల జూచుటగాని। క్రమద్రష్టృత్వం = ఒకదానిని జూచిన పిదప మఱొకదాని జూచుట గాని। అద్రష్టృత్వం = చూడకపోవుట గాని। అన్యథా ద్రష్టృత్వం = ఉన్న దానిని వేఱుగా జూచుట గాని। స్యాత్ = అగును। చిత్తప్రదీప వదేవ = అచ్చముగా దీపముతో బోల్పదగిన చిత్తమువలెనే। పరిణామిత్వాత్ = పరిణామి యగుటవలన। కరణాదినిమిత్త సవ్యపేక్షత్వాచ్చ = కరణములు మొదలగువాని అపేక్ష (సాయము) ఉండుట వలనను.

## తాత్పర్యము

కరణాదుల సాయముతో జూచువా డెవడేని యగు గాక, వాని ద్రష్టృత్వము దీపముతో బోల్పదగిన చిత్తము యొక్క ద్రష్టృత్వము వంటిదే యగును. చిత్తము ఏకొలది వస్తువులను మాత్రమే చూడగలదు. మరియు ఒకవస్తువును చూచిన పిదపనే మరియొక వస్తువును చూడగలదు. ఒకొకపుడు చూడను జాలక పోవును. (౧) ఇంకొకపుడొకదానికి బదులింకొక దానిని (౨) జూచును.

## విశేషము

(౧) మరియొక వస్తువుమీద లగ్నమయి యున్నపుడు ఎదుటగల వస్తువునే చిత్తము చూడజాలదు. (౨) మందాంధకారములో తాడును జూచి పామని భ్రమపడును.

నైవ మాత్మనోఽల్పవిషయ ద్రష్టృత్వం, క్రమద్రష్టృత్వ మద్రష్టృత్వ మన్యథా ద్రష్టృత్వం చేష్యతే, విక్రియాఽ

భావాత్, కరణాది నిమిత్త నిరపేక్షత్వాచ్చ, వ్యతిరేకేణ చిత్త ప్రదీపవత్. ౭

## అర్థము

విక్రియాభావాత్ = వికారము లేకపోవుట వలన । కరణాదినిమిత్త నిరపేక్షత్వాచ్చ = కరణములు మొదలయిన కారణముల అపేక్ష లేనందువలనను । ఆత్మనః = ఆత్మకు । ఏవం = ఇటులు । అల్పవిషయద్రష్టృత్వం = కొలది వస్తువులను జూచుటగాని । క్రమద్రష్టృత్వం = ఒకదాని వెంట మరొకదాని జూచుటగాని । అద్రష్టృత్వం = చూడకపోవుటగాని । అన్యథాద్రష్టృత్వం = ఒకవస్తువును ఇంకొకవస్తువుగా చూచుటగాని । నేష్యతే = అనుమతింపబడదు । వ్యతిరేకేణ చిత్తప్రదీపవత్ = (ఆత్మ) దీపము బోలిన చిత్తము వంటిది కాకపోవుటచే. ౭

## తాత్పర్యము

మార్పు చెందునదియు, కరణాదులు లేక చూడజాలనిదియు నగు చిత్తమువలె గాకపోవుటచే ఆత్మ అల్పద్రష్టకాని, క్రమద్రష్టగాని, అద్రష్టగాని, అన్యథాద్రష్టగాని కాదు. ౭

కథం బుద్ధ్యాత్మనోః సంయోగ ఇత్యుచ్యతే. ౮

## అర్థము

బుద్ధ్యాత్మనోః = బుద్ధికిని, ఆత్మకును । సంయోగః = కలయిక । (కథమ్) ఇతి (చేత్) = ఎటులు అనినచో । ఉచ్యతే = చెప్పబడుచున్నది. ౮

## తాత్పర్యము

అట్టి యప్పుడు ఆత్మకు బుద్ధితో సంయోగ మెటులు ?

ఇతో౽పిచ సంబంధ స్సంభవతి, సూక్ష్మత్వాత్, స్వచ్ఛత్వా న్నిరవయవత్వా చ్చోభయోః సంబంధ యోగ్యతా భవతి. (౯) తత్ర శుద్ధ ప్రకాశరూప ఆత్మా, స్ఫటికమణి కల్పా చ బుద్ధి రప్రకాశ స్వరూపా సతీ. ప్రకాశ సన్నిధి మాత్రేణ ప్రకాశ స్వరూపా భవతీతి కృత్వా, బుద్ధ్యాత్మనో రాధ్యాసిక స్సంయోగ ఇత్యుచ్యతే. (౧౦) న పున రమూర్త యోర్బుద్ధ్యాత్మనో ర్జతుకాష్ఠవత్ సంశ్లేష స్సంభవతి. ౧౧

## అర్థము

ఇతో౽పి = ఈ చెప్పబోవు హేతువుల వలన । సంబంధః = సంబంధము । సంభవతి = కలుగుచున్నది । ఉభయోః = బుద్ధ్యాత్మలు రెండును । సూక్ష్మత్వాత్ = సూక్ష్మములగుట వలన । స్వచ్ఛత్వాత్ = నిర్మలము లగుట వలన । నిరవయవత్వాచ్చ = అవయవములు లేనివగుట వలనను । సంబంధ యోగ్యతా = కలయికకువీలు । భవతి = అగుచున్నది. ౯

## తాత్పర్యము

బుద్ధియు ఆత్మయు సూక్ష్మములు (౧) నిర్మలములు (౨) నిరవయవములును (౩) గాపున ఈ రెండును కలియుట కవకాశము కలదు. ౯

## విశేషము

(౧) ఇంద్రియముల కంటె సూక్ష్మములు (౨) అజ్ఞానము లేమి ఆత్మయు, ఆత్మచైతన్యమును ప్రతిఫలింప జేసికొను శక్తికలిమి బుద్ధియు స్వచ్ఛములు. (౩) బుద్ధి ఘటాదుల వంటిది గాక నిరవయవము. ఆత్మయు నిరవయవము. ౯

## అర్థము

తత్ర = ఆరెంటిలో । ఆత్మా = ఆత్మ । శుద్ధ ప్రకాశ రూపః = స్వచ్ఛమగు ప్రకాశమే స్వరూపముగా గలది । స్ఫటికమణికల్పాచ = స్ఫటికమువంటి దయ్యు । బుద్ధిః = బుద్ధి । అప్రకాశ స్వరూపాసతీ = ప్రకాశ స్వరూపము కాని దగుచు । ప్రకాశ సన్నిధి మాత్రేణ = ప్రకాశము దాపున గలంత మాత్రమున । ప్రకాశస్వరూపా = ప్రకాశ స్వరూపము । భవతీతి కృత్వా = అగుటజేసి । బుద్ధ్యాత్మనోః = బుద్ధ్యాత్మల । సంయోగః = కలయిక । అధ్యాసికః = అధ్యాసచే కలిగినది । ఇతి = అని । ఉచ్యతే = చెప్పబడుచున్నది. ౧౦

## తాత్పర్యము

బుద్ధి స్ఫటికమువంటి దయినను (౧) స్వప్రకాశము కాదు. అనగా తనంత దాను ప్రకాశింప నేరదు. ప్రకాశ స్వరూపమయిన ఆత్మ దాపుగా నున్నంత మాత్రమున అది ప్రకాశించును. ఇటు లీ రెంటికిని పోలికయున్నది. కావున ఈ రెంటి కలయికకు వీలున్నది. ఈ కలయిక అధ్యాసవలన. (౨) ౧౦

### వి శే ష ము

(౧) చిత్ స్వభావము లేకపోవుట వలన (౨) ఒకదాని ధర్మము నింకొకదానిపై నారోపించుట అధ్యాసము. ఆత్మ ధర్మ మిచట బుద్ధియం దారోపిత మైనది. బుద్ధి ధర్మ మాత్మ యందును ఆరోపిత మయినపుడును అది అధ్యాస యనబడును. ఇది తాదాత్మ్యాధ్యాస.

### అ ర్థ ము

అమూర్తయోః = కానదగు రూపములేని । బుద్ధ్యాత్మనోః = బుద్ధికిని ఆత్మకును । జతుకాష్ఠవత్ = లక్క చెక్క లకువలె । సంశ్లేషః పునః = కలయిక మాత్రము । నభవతి = కాదు. ౧౧

### తా త్ప ర్య ము

మూర్త ద్రవ్యములు కొన్ని ఒండొండు అంటుకొనును. మూర్తములగు లక్కయు చెక్కయు చక్కగా అంటుకొనును. బుద్ధ్యాత్మలు మూర్తములు కావు. కావున వీని కలయిక అట్టిది కాదు. మరి అధ్యాసచే కలిగినది. ఆత్మధర్మము బుద్ధి యందును బుద్ధిధర్మ మాత్మయందును ఆరోపించి యీరెంటికిని కలయిక కలదని అనుకొనుట అధ్యాసవలన. ౧౧

అన్యాపేక్షత్వా చ్చ ద్రష్టృత్వస్య, యథాఽహఙ్కార మమకారేచ్ఛా ప్రయత్న రహితస్యాదిత్యస్య ప్రకాశ స్వరూప సన్నిధి మాత్రే ణావిక్రియమాణేన ప్రకాశేన

ప్రకాశకత్వ మన్యథా ప్రకాశకత్వాభావా త్తస్యైవం ప్రకాశ స్వరూప సన్నిధి సత్తా మాత్రేణ వర్తమాన స్యాదిత్యస్య ప్రకాశకత్వ మధ్యారోప్యతేఽజ్ఞైః ప్రకాశ్యాభివ్యక్త్యపేక్ష యైవమేవ సర్వవిక్రియా విశేష రహిత స్యాత్మనో దృగ్రూపస్య చైతన్యస్వరూపేణావ్యతిరిక్తేన సర్వప్రత్యయ సాక్షిణో దృశ్య సన్నిధి మాత్రేణ ద్రష్టృత్వ ముపచర్యతే బుద్ధ్యాది దృశ్యాభి వ్యక్త్యపేక్షయాఽన్యథా ద్రష్టృత్వాభావాత్.

౧౨

అర్థము

అన్యాపేక్షత్వాచ్చ = ఇతరవస్తువుల సంబంధము (ఉనికి) వలనను । ద్రష్టృత్వం = ద్రష్టృత్వము ఏర్పడును । యథా = ఎటులనగా । అహఙ్కార మమకారేచ్ఛా ప్రయత్న రహితస్య = 'నేను' 'నాది' ఇచ్ఛ, ప్రయత్నము ఈ మొదలగునవి లేని । ఆదిత్యస్య = సూర్యుని యొక్క । ప్రకాశస్వరూప సన్నిధి మాత్రేణ = ప్రకాశ స్వరూపము సన్నిధియందు ఉండుటచేతనే । అవిక్రియమాణేన = మార్పు చెందని । ప్రకాశేన = వెలుగుచే । ప్రకాశకత్వం = ప్రకాశకత్వము (కర్తృత్వము అని చెప్పబడునో) అన్యథా = దీనికంటె వేరుగా (అనగా ప్రకాశ స్వరూప సాన్నిధ్యేతరముగా) తస్య = సూర్యునకు । ప్రకాశకత్వాభావాత్ = ప్రకాశకత్వము (కర్తృత్వము) లేదో । ఏవం = ఈరీతిగా । ప్రకాశ స్వరూప సన్నిధి సత్తామాత్రేణ = దాపున ప్రకాశ స్వరూ

పము యొక్క ఉనికిచేతనే । వర్తమానస్య = ఉండుచున్న । ఆదిత్యస్య = సూర్యునకు । ప్రకాశకత్వం = ప్రకాశింపజేయుట । ప్రకాశ్యాభి వ్యక్త్యపేక్షయా = ప్రకాశింప జేయదగిన (వస్తువులయొక్క) అభివ్యక్తిని బట్టి । అజ్ఞైః = మూఢులచేత । అధ్యారోప్యతే = ఆరోపణ చేయబడుచున్నదో । ఏవమేవ = సరిగా ఈ చందముగనే । బుద్ధ్యాది దృశ్యాభి వ్యక్త్యపేక్షయా = బుద్ధి మొదలగు దృశ్యముల అభివ్యక్తిని బట్టి । సర్వ విక్రియా విశేష రహితస్య = ఏ వికారమేని యే విశేషమేని లేనట్టియు । దృగ్రూపస్య = దృగ్రూపుడైనట్టియు । సర్వ ప్రత్యయ సాక్షిణః = అన్ని బుద్ధులకు, బుద్ధి వృత్తులకు సాక్షియయిన । ఆత్మనః = ఆత్మయొక్క । అవ్యతిరిక్తేన చైతన్య స్వరూపేణ = తనకంటె వేరుకాని చైతన్య స్వరూపముతో । దృశ్యసన్నిధిమాత్రేణ = దృశ్యములగు బుద్ధ్యాదుల సామీప్య మాత్రము చేతనే । ద్రష్టృత్వం = ద్రష్టృత్వము । ఉపచర్యతే=ఆరోపింపఁబడుచున్నది । అన్యథా=ఇంకొకవిధముగా । ద్రష్టృత్వాభావాత్ = ద్రష్టృత్వము లేకపోవుటవలన. ౧౨

## తాత్పర్యము

ఇతర వస్తువుల సాన్నిధ్యమును బట్టియే ఆత్మ ద్రష్టయని చెప్పబడుచున్నాడు. సూర్యుడును ఇతర వస్తువుల సాన్నిధ్యమును బట్టియే ప్రకాశకుడు (కర్మసాక్షి-జగచ్చక్షువు) అని చెప్పబడుచున్నాడు. సూర్యునకు 'నేను' అని కాని 'నాది' అని కాని ఒక కోరిక కాని ఒక పూనికగాని ఇంకను ఇటువంటి

వేవిగాని లేవు. ఇటులు లేకున్నను ఈ ప్రపంచము నాది దీనిని నేను ప్రకాశింపఁ జేయవలయును అను నీ మొదలగ కోరిక లతనికి లేవు) అతని సాన్నిధ్య మాత్రమున చీకటి పోయి వెలుగువచ్చి సర్వము ప్రకాశించుట వలన అతఁడు ప్రకాశకుడయినాడు గాని వేరురీతిగా అతనికి కర్తృత్వరూపఁ మగు ప్రకాశకత్వము లేదు. ఇటులు లేకున్నను తెలియఁ వారు అతనికి ఈ ధర్మము నారోపింతురు. ఇటులే దృశ్యము లగు బుద్ధ్యాదులు చైతన్యముకంటె వేరుకాని ఆత్మ దాపున నుండుటచే ఆత్మ ద్రష్టయని చెప్పబడుచున్నాఁడు. ౧౨

తస్య కథం సర్వవిక్రియా విశేష రహిత స్యాత్మనః కర్తృత్వ మిత్యుచ్యతే - చుంబకవద్ భ్రామకవత్ (౧౩) యథా చుంబకో భ్రామకః స్వరూప సన్నిధి సత్తామాత్రేణ లోహస్య ప్రేరకో భవ త్యేవమేవ సర్వవిక్రియా రహితోఽప్యాత్మా కారకావభాసకో భవతి (౧౪) తత్ర కారకావభాసకత్వం నామ కర్తృత్వోపచార నిమిత్తమ్(౧౫) బుద్ధ్యాదీని కరణాని కారకాణ్యుచ్యన్తే (౧౬) తాని చైతన్యావభాసితాని స్వ స్వ విషయేషు ప్రవర్తన్తే (౧౭) తత్రైవం సతి సర్వ విక్రియా రహిత స్యాత్మనః కర్తృత్వ ముపచర్యతే (౧౮)

## అర్థము

సర్వవిక్రియా విశేష రహితస్య = ఎల్ల వికారముల తోడను రహితుడగు । తస్య = ఆ । ఆత్మనః = ఆత్మకు । (కథం) కర్తృత్వమితి (చేత్) = కర్తృత్వ మెటు లనిన । ఉచ్యతే = చెప్పబడుచున్నది । చుంబకవత్ భ్రామకవత్ = సూదంటురాతివలె । (౧౩) యథా = ఎటులు । చుంబకో భ్రామకః = సూదంటురాయి । స్వరూప సన్నిధి సత్తా మాత్రేణ = తాను, దాపున ఉన్నమాత్రమున । లోహస్య = లోహమునకు (సూది మొ॥ వానికి) ప్రేరకః = కదలించునది । భవతి = అగుచున్నదో । ఏవమేవ = ఈ దెసనే । సర్వ విక్రియా రహితోఽపి = ఏ వికారముగాని లేనివాడయ్యును । ఆత్మా = ఆత్మ । కారకావభాసకః = వ్యాపారము చేయు వానిని ప్రకాశింప జేయువాడు । భవతి = అగుచున్నాడు । (౧౪) తత్ర = అయ్యెడ । కారకావభాసకత్వంనామ = కార కములను ప్రకాశింప జేయుటనునది । కర్తృత్వోపచార నిమిత్తం = కర్తృత్వారోపణ హేతుకము. (౧౫) బుద్ధ్యా దీని = బుద్ధి మొదలగు । కరణాని = ఇంద్రియములు । కార కాణి ఇతి = కారకము లని । ఉచ్యన్తే = చెప్పబడుచున్నవి. (౧౬) చైతన్యావ భాసితాని = చైతన్యముచే ప్రకాశింపఁ జేయఁబడిన । తాని = ఆ యింద్రియములు । స్వస్వవిష యేషు = తమతమ విషయములందు । ప్రవర్తన్తే=ప్రవర్తించు చున్నవి । (౧౭) తత్ర = ఆ యా విషయములందు । ఏవంసతి=

ఇటులు అగుచుండగా (ఇంద్రియము లిటులు ప్రవర్తించు చుండగా) సర్వవిక్రియా విశేషరహితస్య = ఏ విశేషము లేని। ఆత్మనః = ఆత్మకు । కర్తృత్వం = కర్తృత్వము । ఉపచర్యతే= ఆరోపింపఁబడు చున్నది. ౧౨

తాత్పర్యము

మార్పుగాని విశేషణములుగాని లేని ఆత్మ కర్త (౧) యెటులగు నని అడిగినచో చెప్పుచున్నాము—సూదంటు రాతికి కర్తృత్వ (౨) మెటులో అటులు. ౧౩

తాను దాపున ఉన్నంత మాత్రమున సూదంటురాయి సూదిని కదల్చును. అటులే నిర్వికారుడగు ఆత్మ వ్యాపారము (క్రియలను లేక పనులను) చేయు వానికి అవభాసకుడు. ౧౪

ఈ విషయమున పనిచేయువారికి సాక్షిమాత్రముగా నుండుటజేసి ఆత్మ కీ కర్తృత్వ మారోపింపబడుచున్నది. ౧౫

బుద్ధి మొదలగు కరణములు కారకములు (౩) ౧౬

చైతన్యముచే ప్రకాశింప జేయుబడి అవి తమ తమ విషయ ములను వ్యాపించును. ౧౭

ఇది యిటులుండగా వికారముగాని విశేషముగాని లేని ఆత్మ యందు కర్తృత్వ మారోపింప బడుచున్నది. ౧౮

విశేషము

(౧) 'ఏష హి కర్తా ద్రష్టా శ్రోతా మన్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః' ప్రశ్న-౪-౯.

(౨) ఆత్మకు కర్తృత్వ ముపాధి నిమిత్తము. 'యథా చ తక్షోభయథా' బ్రహ్మ ౨-౩-౪౦. కర్తృత్వాధికరణము. చూ. (౩) క్రియను పుట్టించునది కారకము. కర్త కర్మ మొదలగునవి కారకములు.

ఏవ మాత్మానం కథం బుద్ధ్యా విజానీయా దితి తన్న శక్యతే వక్తుమ్; బుద్ధే రవభాసకత్వా దాదిత్య జ్యోతిర్వత్; (౧౯) యథాఽదిత్యో రూపేణ న ప్రకాశ్యతే తథాఽత్మా న దృశ్యతే బుద్ధ్యా. ౨౦

అర్థము

ఏవం=ఇటులు కాగా । ఆత్మానం = శుద్ధమగు ఆత్మను । బుద్ధ్యా = బుద్ధిచే । కథం = ఎటులు । విజానీయాత్ = ఎఱుగ నగును । ఇతి (చేత్) = అను నెడల । తత్ = అది । వక్తుం = చెప్పుటకు । న శక్యతే = వీలు కాదు । ఆదిత్య జ్యోతి ర్వత్ = సూర్యునికాంతివలె । బుద్ధేః = బుద్ధిని । అవభాసకత్వాత్ = ప్రకాశింపజేయువా డగుటవలన. ౧౯

యథా = ఎటులు । ఆదిత్యః = సూర్యుడు । రూపేణ = రూపము చేత (ఆకారము, రంగు) న ప్రకాశ్యతే = ప్రకాశింప జేయబడడో । తథా = అటులు । ఆత్మా = ఆత్మ । బుద్ధ్యా = బుద్ధిచే । నదృశ్యతే = చూడబడడు. ౨౦

తాత్పర్యము

ఇటు లగుటచే శుద్ధచైతన్యమును బుద్ధిచే (౧) చూడ నగునని చెప్పుటకు వీలులేదు. ఏలన సూర్యకాంతి ఘటమును

ప్రకాశింప జేసినట్లు చైతన్యము బుద్ధిని ప్రకాశింప జేయును. ఇట్టియెడ బుద్ధియే చైతన్యమును ప్రకాశింపజేయు నను టెటులు? ౧౯

ఏరూపమేని సూర్యుని ప్రకాశింప జేయలేదు. (సూర్యుడే రూపములను ప్రకాశింప జేయును) అటులే ఆత్మ బుద్ధిచే ప్రకాశింప జేయబడదు. ౨౦

## వి శే ష ము

(౧) 'దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా' అను శకము, 'బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్' అను గీతయు ఇట జూడ దగినవి.

ఏతస్మా దప్యాత్మా న దృశ్యతే బుద్ధ్యా, బుద్ధేర్వేద్యాయా వేదితృత్వానుపపత్తేః (౨౧) యది తస్యా అపి వేద్యాయా వేదితృత్వం స్యా త్తదా, వేద్యతా న స్యాత్, ప్రకాశయో రివ. ౨౨

## ఇతి ద్వితీయః ఖండః

## అ ర్థ ము

**ఏతస్మాదపి** = ఈ కారణము వలనను గూడ । **బుద్ధ్యా** = బుద్ధిచే । **ఆత్మా** = ఆత్మ । **నదృశ్యతే** = చూడబడదు । **వేద్యాయాః** = దృశ్యమగు । **బుద్ధేః** = బుద్ధికి । **వేదితృత్వ** = ద్రష్టృత్వము యొక్క । **అనుపపత్తేః** = ఉపపత్తి లేక పోవుట వలన. ౨౧

వేద్యాయా అపి = తెలియదగినది అనగా దృశ్యమయిన దైనను। తస్యాః = ఆ బుద్ధికి। వేదితృత్వం = ద్రష్టృత్వము। స్యాత్ తదా = అగునేని, అపుడు। వేద్యతా = తెలియదగిన దగుట (దృశ్యత) న స్యాత్ = లేకపోవును। ప్రకాశయో రివ = రెండు దీపములకు వలె. ౨౨

### తాత్పర్యము

దృశ్యమగు బుద్ధి ద్రష్ట యగుటకు వీలులేదను నీ హేతువుచే గూడ ఆత్మ బుద్ధిచే చూడబడదు. (౨౧) దృశ్యము గూడ ద్రష్ట యగునేని దృశ్యత్వమే లేకపోవును. ఎట్లనగా రెండు దీపములలో ఏ యొకటియు రెండవదానికి భాసకము కాదు. ౨౨

ఇది ద్వితీయఖండము

# తృతీయః ఖండః

తత్ర జాగ్రత్ స్వప్న సుషుప్తా న్యుపన్యస్యన్తే, బుద్ధే రవస్థా విశేషణాని; తేషాం పరిత్యాగార్థ మాత్మ విశుద్ధి ప్రతిపాదనాయ చ. ౧

## అర్థము

తత్ర = ఆ ద్రష్టృ దృశ్యములలో (దృశ్యమైన) । బుద్ధేః = బుద్ధియొక్క । అవస్థా విశేషణాని = అవస్థా విశేషములగు । జాగ్రత్ స్వప్న సుషుప్తాని = జాగ్రత్ స్వప్న సుషుప్తులు । ఉపన్యస్యన్తే = వివరింపబడుచున్నవి; తేషాం = వానిని । పరిత్యాగార్థమ్ = విడనాడుటకును । ఆత్మవిశుద్ధి ప్రతిపాద నాయచ = ఆత్మయొక్క అసంగతను తెలుపుటకును. ౧

## తాత్పర్యము

మెలకువ, కల, నిద్ర - ఇవి బుద్ధి అవస్థలు. ఆత్మను వివిక్తముగా తెలియుటకు వీనిని విడనాడవలెను గావున వీనిని (౧) వివరించుచున్నాము. ౧

## విశేషము

(౧) అగ్నికి వేడిమి సహజము. దానిని అగ్నినుండి వేరు పరప వీలులేదు. ఇటులే ఈ యవస్థలాత్మవగు నెడల ఆత్మ నుండి వేరుపరప వీలులేదు. అనగా విడనాడ వీలులేదు. అటులు విడనాడుటకు వీలు కాదేని ఆత్మ శుద్ధము కాదు. అని చెప్పనగును.

తత్ర జాగ్రన్నామ చక్షురాదీని కరణా న్యాదిత్యా ద్యను గృహీతాని స్వ స్వ విషయేషు ప్రవర్తన్తే, తత్ర బుద్ధి రపి కరణవ్యాపార మనుభవతి. ౨

## అర్థము

తత్ర = ఆ యవస్థా త్రయములో । జాగ్రన్నామ = జాగ్రదవస్థ యనగా । చక్షురాదీని = కనులు మొదలగు । కరణాని = ఇంద్రియములు । ఆదిత్యా ద్యనుగృహీతాని = సూర్యుడు మొ॥ వానిచే సాయము చేయబడి । స్వ స్వ విష యేషు = తమ తమ విషయములందు । ప్రవర్తన్తే = ప్రవృత్తి కలవగుచున్నవి । తత్ర = అట్టి ప్రవృత్తిలో । బుద్ధి రపి = బుద్ధియు । కరణవ్యాపారం = కరణముయొక్క వ్యాపా రమును । అనుభవతి = అనుభవించుచున్నది.

## తాత్పర్యము

ఈ మూడవస్థలలో జాగ్ర దవస్థ యను నిది : సూర్యుడు, దీపము, ఇంద్రియాధి దేవతలు, (౧) వీరి సాయముతో కనులు మొదలగు ఇంద్రియములు కుండ మొదలగు విషయ ములను (౨) కనుగొనును. అపుడు బుద్ధియు (౩) కరణ ముగా పనిచేయును. (४) ౨

## విశేషము

(౧) తమ తమ విషయముల గ్రహించుటకు ప్రతి ఇంద్రి యమునకును ఒకానొక దైవము సాయము కావలెను. (౨)

ఏ ఇంద్రియ మాఇంద్రియమునకు సంబంధించిన విషయమునే గ్రహించును. ముక్కు చూడదు. కన్ను మూచూడదు. ఇటులే ఇతరేంద్రియములును. (3) ఇతరేంద్రియములవలెనే బుద్ధియు కరణ మగును. ఏ క్రియనేని నిర్వర్తించుటలో అత్యంత సాధకమయినది కరణము. చెట్టును కొట్టుటలో గొడ్డలి కరణము. ఇటులే తమ తమ విషయములలో ఇతరేంద్రియములును కరణములు. (4) బాహ్య వస్తువుల ఆకారము వంటి ఆకారమును జెందును.

ప్రత్య గాత్మని ప్రత్యగాత్మ చైతన్య వజ్జాతో భయాత్మికా బుద్ధిర్ ద్రష్టృ దృశ్యాకారా విపరిణమతే; తత్ర ప్రత్యగాత్మేతి కస్మాదాత్మావిశిష్యతే? వ్యభిచారిణామనాత్మత్వఖ్యాపనార్థమ్.౩

**అర్థము**

ప్రత్యగాత్మని = ('అధ్యస్తా' అనిగాని 'సన్నిధేస్థితే' అనిగాని అధ్యాహారము) ప్రత్యగాత్మమీాద అధ్యస్తమైన, లేక ప్రత్యగాత్మ సన్నిధిలో నుండగా । బుద్ధిః = బుద్ధి । ప్రత్యగాత్మ చైతన్యవత్ = ప్రత్యగాత్మ చైతన్యమువలె । జాతా = అయి । ఉభయాత్మికా = ద్రష్టృ దృశ్యోభయ రూపముగా । విపరిణమతే = పరిణమించును । తత్ర = ఆ యెడ । ఆత్మా = ఆత్మ । ప్రత్యగాత్మేతి = ప్రత్యగాత్మయని । కస్మాత్ = ఎందువలన । విశిష్యతే = విశేషింప బడుచున్నది? వ్యభిచారిణాం = ఆత్మ ధర్మ మెడబాయు వానికి । అనాత్మత్వఖ్యాపనార్థమ్ = ఆత్మత్వము లేదని తెలుపుటకు.

తా త్ప ర్య ము

చైతన్యము ప్రతిబింబించి (౧) బుద్ధి ద్రష్టవలె దృశ్యము వలె (౨) ఇరుదలగా పరిణమించును. దేహము మొదలుకొని అహము వరకు గల వస్తువు లొకదానికంటె మరొకటి లోపలివి. ఇవి తమ ఉనికిని ఎప్పుడో ఒకప్పుడు కోలుపోవునవి. ఇది యేదియు ఆత్మ కాదని చెప్పుటకు ఆత్మకు ప్రత్యక్ అను విశేషణము. 3

వి శే ష ము

(౧) బుద్ధి జ్ఞానము లేనిది. అటులయ్యును జ్ఞానము కలదానివలె విషయముల ఆకారమువంటి ఆకారము చెందుట ప్రతిబింబిత చైతన్యము కతముననే. (౨) ద్రష్ట = కర్త లేక నేను.

తత్ర బుద్ధ్యాదీని కరణాని ఘటాదివద్ దృశ్యభూతాన్యపి బాహ్యాపేక్షయా తారతమ్య క్రమేణ ప్రత్యగాత్మ సంయోగా దాత్మానో భవన్త్యుదక స్యాగ్ని సంయోగ ఇవోష్ణత్వం, న త్వా త్మన స్తత్సంయోగా దనాత్మత్వం సంభవ త్యుదక సంయోగా దివాగ్నే రనుష్ణత్వం. ౪

అ ర్థ ము

తత్ర = నిత్యత్వములేని అనాత్మ వస్తువులలో । బుద్ధ్యాదీని = బుద్ధి మనస్సు మొదలగు । కరణాని = కరణములు, ఘటాదివత్ = (ఇవి) కుండ మొదలగు వానివలె । దృశ్య

భూతాని అపి = దశ్యము లయినను । బాహ్యాపేక్షయా = బాహ్యామును బట్టియు (బుద్ధి కంటె మనస్సు, మనస్సు కంటె కన్ను ఈ రీతిగా ఇంద్రియములు ప్రత్యగాత్మకు ఒకదానికంటె ఇంకొకటి బయటివి అగుట బట్టి) తారతమ్యక్రమేణ = తరతమ భావముల ననుసరించి । ప్రత్యగాత్మ సంయోగాత్ = ప్రత్యగాత్మ సంయోగమున జేసి । ఆత్మానః = ఆత్మలు । భవన్తి = అగుచున్నవి । ఉదకస్య = నీటికి । అగ్నిసంయోగే = అగ్ని సంబంధము కలిగినపుడు । ఉష్ణత్వమివ = వేడిమివలె । ఆత్మనః తు = ఆత్మకు మాత్రము । తత్సంయోగాత్ = ఆ కరణ సంబధము వలన । ఉదకసంయోగాత్ = నీటి సంపర్కము వలన । అనుష్ణత్వమివ = చల్లదనమువలె । అనాత్మత్వం = జడత్వము । న సంభవతి = సంభవింపదు. ౪

## తాత్పర్యము

నిత్యము కాని అనాత్మ పదార్థములలో బుద్ధ్యాదులగు కరణము లొక ప్రోవు. ప్రత్యగాత్మ సంబంధముచే ఇవి ఆత్మ (౧) అనిపించుకొను చున్నవి. ఒకపుడు మనము బుద్ధి మొదలగువానిని ప్రధానముగా జేసికొని నేను నేను అని వ్యవహరింతుము. ఇట్టి వ్యవహారములలో శ్రోత్రాదులగు ఇంద్రియములకంటె మనస్సు దానికంటె బుద్ధియు అంతరములు. ఇంతియకాక వీనిలో తరతమ భావ మున్నది. ఈ కారణములబట్టి అంతరతమమగు ఆత్మతో కలుగు సంబంధము (౨) నందలి తేడావలన ఈ యింద్రియాదులలో ఒకపుడు

౬కటియు, ఇంకొకపు డింకొకటియు ముఖ్యమును అముఖ్యము నగు ఆత్మగా వ్యవహరింపబడును. అగ్గి తగులగనే నీరు వేడెక్కినటులు ఇంద్రియాదులును అంతరాత్మ సంబంధము వలన ఆత్మలని అనిపించుకొనును. కాని అగ్నిమీద నీరు పోసినచో అది చల్లబడి పోయినటులు ఇంద్రియ సంపర్కము వలన ప్రత్యగాత్మ మాత్రము మారదు. ౪

## విశేషము

(౧) ఘటాదులవలె జ్ఞానమునకు విషయములైనను, దేహమును, ఇంద్రియములను, బుద్ధిని, అహమును, మనము మన మనియే తలతుము. దీనివలన 'నేను' గా వీనిని వ్యవహరింతుము. దేహముగాని మిగిలినవిగాని తిన్నగా లేనపుడు 'నేను బాగుగా లేను' అని పలుకుదుము. కాని ఇవి కోశములు. కాన దృశ్యములు. (౨) ఆత్మ ప్రతిబింబము కతన (3) విషయములకంటె శరీరము ఆంతరము. దీనికి ప్రత్యగాత్మ సంబంధము ఉండుటవలన ఒకపుడు దానిని పురస్కరించుకొని 'నేను' అనియు, ఇంకొకపుడు 'నాది' అనియు వ్యవహరింతుము. ఈ దెస ఇది ఆత్మ, దేహము కంటె ఇంద్రియములును, వానికంటె మనస్సును, దానికంటె బుద్ధియు, దానికంటె అహమును ఆంతరతరములు. అంతరతమమగు ఆత్మసంబంధము కలిమి వీనికి ఆత్మ వ్యవహారము.

న త్వాత్మనః ప్రత్యగాత్మత్వం కదాచిదపి వ్యభిచరత్యాత్మాభ్యంతరే వస్త్వంతరాభావాద్ బుద్ధ్యాదీనా మివాత

ఏవాత్మా ప్రత్యగాత్మవిశేషణార్హః ఏవంచ సత్యవ్యభిచారిత్వం ఖ్యాపితం భవతి. ౫

## అర్థము

బుద్ధ్యాదీనా మివ = బుద్ధి మొదలగు వానికివలె । ఆత్మ న్యంతరే = ఆత్మలోపల । వస్త్వంతరాభావాత్ = మరొక వస్తువు లేక పోవుటవలన । ఆత్మనః = ఆత్మకు । ప్రత్య గాత్మత్వం = అన్నిటికంటె లోనిదగుట । న వ్యభిచరతి = మార్పు చెందదు । అత ఏవ = కావుననే । ఆత్మా = ఆత్మ । ప్రత్యగాత్మ విశేషణార్హః = లోలోపలిదని విశేషణము ఉప యోగింపదగినది । ఏవం చ సతి = ఇటులు కాగా । అవ్యభి చారిత్వం = నిత్యత్వము । ఆత్మత్వం=ఆత్మత్వము । ఖ్యాపితం= ప్రకటితము । భవతి = అగుచున్నది. ౫

## తాత్పర్యము

బుద్ధి మొదలగు వానిలోవలె (౧) ఆత్మలో వేరొక వస్తువులేదు. కావున అది ప్రత్యగాత్మగా గాక (౨) యిం కొక రీతిగా ఉండదు. కాన (౩) ఆత్మ ప్రత్యగ్విశేషణమునకు దగియున్నది. ఈ రీతిగా ఆత్మ నిత్యమనియు శుద్ధమనియు తేటగా తెలియుచున్నది. ౫

## విశేషము

(౧) బుద్ధి వెనుక సాక్షి ఉన్నది. (౨) 'ఏషత ఆత్మా సర్వాంతరః' [౩-౪-౧ బృ] = 'ఈ నీ యాత్మ, అన్నిటికంటె లోపలిది. (౩) ఇది ౨ వ వాక్యమునకు ప్రత్యుత్తరము.

తత్ర ప్రత్యగాత్మ చైతన్య పజ్జ్వలితా ధీర్ ద్రష్టృదృశ్యా కారా విపరిణమతే, దృశ్యా ద్యుపరక్తా సతీ దృశ్యాకారా, మూషా నిషక్త ద్రుత తామ్రాదివత్. ౬

## అర్థము

తత్ర = ద్రష్ట్రాకారమును దృశ్యాకారమును చెందు సందర్భమున । ప్రత్యగాత్మ చైతన్యవత్ = అంతరాత్మ చైతన్యమువలె । జ్వలితా = వెలుగొందిన । ధీః = బుద్ధి । ద్రష్టృ దృశ్యాకారా = ద్రష్టృదృశ్యాకారము గలదిగా । విపరిణమతే = మార్పు చెందును. (అని చెప్పబడెను అని అధ్యాహారము) దృశ్యాది = దృశ్యము మొదలగు వానితో । ఉపరక్తాసతీ = సంయోగము పొందినదగుచు । మూషా నిషక్తద్రుత తామ్రాదివత్ = మూసలో పోయబడిన రాగి మొదలగు లోహమువలె । దృశ్యాకారా = దృశ్యముయొక్క ఆకారమువంటి ఆకారమును (పొందుచున్నది). ౬

## తాత్పర్యము

ప్రత్యగాత్మ సంయోగమున ప్రత్యగాత్మ ప్రకాశమువలె కనిపించుచు బుద్ధి ద్రష్టృ (౧) దృశ్యాకారముగా పరిణమించు నని వెనుక చెప్పబడెను. (3 వాక్యము. చూ.) బుద్ధి విషయాది సంపర్కముచే మూసలోపోసిన రాగి మొదలగు వానివలె విషయాకారము తాల్చును. (౨) ౬

విశేషము

(౧) మాండవ వాక్యమున విశేషము ౧-౨ చూ. (౨) ఇంద్రియద్వారమున.

తత్రైవం సతి తదుభయసాక్షిణః కాలాకాశాదివత్ సర్వగతస్య నిరవయవ స్యావిక్రియస్య, దృగ్రూప స్యాత్మనో జాగరణ మివ భవతి. ౭

అర్థము

తత్ర ఏవం సతి = బుద్ధి యిటు లుభయాకారముగా పరిణమించినపుడు । తదుభయ సాక్షిణః = ద్రష్టృ దృశ్యములకు రెంటికి సాక్షి యయినట్టియు । కాలాకాశాదివత్ = కాలమువలెను, ఆకాశమువలెను । సర్వగతస్య = వ్యాపకుడయినట్టియు । నిరవయవస్య = అవయవములు లేనట్టియును । అవిక్రియస్య = మార్పు లేనట్టియు । దృగ్రూపస్య = చిత్స్వరూపుడైన, ఆత్మనః = ఆత్మకు । జాగరణమ్ భవతి ఇవ = జాగ్రదవస్థ కలిగినటు లగును. ౭

తాత్పర్యము

ఇది యిటులు జరిగినపుడు (౧) ఆ ద్రష్టృ దృశ్య సాక్షియు కాలము ఆకాశము (౨) మొదలగువానివలె ఎల్లెడ వ్యాపకుడును (౩) నిరవయవుడును అవిక్రియుడును చిద్రూపుడు నగు ఆత్మకు జాగ్రదవస్థ (౪) కలిగినటులుండునని (౫) అందురు.

## విశేషము

(౧) బుద్ధి చూచునదిగను చూడబడునదిగను మారి నప్పుడు, (౨) ఆత్మకు దిక్కాలములకువలె పరిణామముగాని స్పందముగాని లేదు. (౩) చూచుబుద్ధికిని సాక్షి (౪) ఇంద్రియములచే విషయముల నెరుగుట జాగ్రదవస్థ (౫) జాగ్రదవస్థకు సాక్షియగు ఆత్మకు ఈ జాగ్రదవస్థ ఆరోపితము. ౧ వ ఖండ - ౧౨, ౧౫ వాక్యముల మీఁదగల విశేషములు చూ.

అథ పునస్సాధీ రూపాద్యాకారవాసనావాసితా రూపాద్యన్తరేణ పుష్పపుటికేవోభయాత్మికాఽవిద్యా కాలకర్మభిః ప్రేష్యమాణా సంస్కారరూపా దృశ్యత్వేనైవాఽవతిష్ఠతే, తద్దర్శనం స్వప్న ఇవ భవతి, తదనుకారిత్వా దాత్మనో జలచంద్రవత్. ౮

## అర్థము

అథ = పిదప । పునః = మరల (జాగ్రదవస్థకు కారణమగు కర్మము ముగియవచ్చి స్వప్నావస్థా కారణమగు కర్మ ఫలోన్ముఖము కాగా) సా = ఆ । ధీః = బుద్ధి । రూపాద్యాకార వాసనావాసితా = రూపము మొదలగువాని ఆకారముల సంస్కారముచే వాసితమై । రూపాద్యన్తరేణ = రూపము మొదలగునవి లేకయే । పుష్పపుటికేవ = పూలబుట్టవలె । ఉభయాత్మికా = (ద్రష్టృ) దృశ్యాకారమై । అవిద్యాకాలకర్మభిః = అవిద్యచే కాలముచే కర్మముచే ।

ప్రేక్ష్యమాణా = ప్రేరితమై । సంస్కారరూపా = సంస్కారమేరూపముగా కలదై (ఆత్మసన్నిధిలో అని అధ్యాహారము) దృశ్యత్వేనైవ = చూడదగినది గానే అనగా విషయము గానే । అవతిష్ఠతే = ఉండును । ఆత్మనః = ఆత్మ । జలచంద్రవత్ = నీటిలో ప్రతిబింబించిన చంద్రునివలె । తదనుకారిత్వాత్ = బుద్ధి యెటులున్న అటువలె కనిపించునదగుటవలన । తత్ = ఆ । దర్శనం = అనుభవము (ఆత్మకు అని అధ్యాహారము) స్వప్నమివ = కలవలె । భవతి = అగును. ౧

## తాత్పర్యము

స్వప్నావస్థ పొందదగిన కర్మ సమకూరినపుడు బుద్ధిరూపాదులుకల బాహ్యవస్తువుల సంస్కారములను బొంది బాహ్యవస్తువుల (౧) సంపర్కము లేకయే చూచునదియు చూడబడునదియుగా మారును. పూలబుట్టను ఇందుల కుదాహరణముగా చెప్పవచ్చును. తనలో పూలు లేకున్నను చూడగనే పూలబుట్ట పూలసంస్కారమును కలిగించును. మరియు బుద్ధి ఆత్మ సాన్నిధ్యమున కాలకర్మావిద్యావశమున సంస్కారరూపముతోనే విషయముగా (౨) భాసించును. ఈ యనుభవ మాత్మకు కలవచ్చినటు లగును. ఏలనగా నీరు కదలుచున్నచో చంద్రుడు కదలుచున్నటులు కనబడు చందమున బుద్ధి ఏ అనుభవమును పొందినను ఆత్మ ఆ యనుభవమును (3) పొందిన చందముగా కనిపించును. ౧

## వి శే ష ము

(౧) కలలో బాహ్యవస్తువులు లేవు. ४-३-౧౦ బృ. చూ. (౨) ఆ యవస్థలో బుద్ధికి బాహ్యవస్తువులతో సంబంధము లేకున్నను (౩) బుద్ధి ఆత్మయం దధ్యస్తముగాన కలతో గలిపికొని బుద్ధిధర్మములన్నియు తనవే యని అనుకొని ఆత్మ వ్యవహరించినటుల కనబడును. ౧ ఖండ ౧౨, ౧౫ వాక్యముల మీాది విశేషము. చూ. జాగ్రదవస్థలో మనము కొన్ని విషయముల నింద్రియములచే గ్రహింతుము. అవి సంస్కారరూపముగా కలలో కానిపించును. సంస్కారమునకు కారణమైన విషయములతో ఆ విషయములను గ్రహించిన జ్ఞానము, కల అన్న మాట. అపు డింద్రియములు పని చేయవు.

అథ పున స్సా ధీః స్ఫురణరహితా వాసనారూపేణ స్వరూపశూన్యేవ చైతన్యగ్రస్తా, సామాన్యరూపేణ వ్యవతిష్ఠతే తత్ సుషుప్తమ్. వట కణికాయా మివ వృక్షః. ౯

ఇతి తృతీయః ఖండః

## అ ర్థ ము

అథ = పిదప । పునః = మరల । వాసనారూపేణ = జాగ్రదవస్థా సంస్కారరూపముగా । స్ఫురణరహితా = స్ఫురణమే లేనిదో యన । చైతన్యగ్రస్తా = చైతన్యముచే మ్రింగఁబడి । స్వరూప శూన్యేవ = స్వరూపములేనిది వలె । సామాన్య

రూపేణ = సామాన్యముగా అనగా అజ్ఞానాకారముగా । వటకణికాయాం = మఱ్ఱి విత్తులో । వృక్ష ఇవ = చెట్టువలె । వ్యవతిష్ఠతే = ఉండును । తత్ = అది । సుషుప్తమ్ = నిద్ర. ౯

## తాత్పర్యము

నిద్రావస్థ చెందదగిన కర్మ సమకూరినపుడు జాగ్రత్ స్వప్నములలో అలసి బుద్ధి జాగ్రదవస్థగాని దాని సంస్కారములుగాని (౧) లేక చైతన్యగ్రస్తమై (౨) రూపఱిసట్లు (౩) అజ్ఞానముతో ఏకీభూతమగును. ఇది సుషుప్తి. (౪) అపుడు బుద్ధి మఱ్ఱి విత్తులో మఱ్ఱిచెట్టువలె (౫) స్ఫూర్తి చెందక ఉండును. ౯

## విశేషము

(౧) కల (౨) ఉపాధియగు అజ్ఞానముతో ౧ ఖండ— ౧౫-వాక్యమున విశేషము ౧ చూ. (౩) నిద్రనుండి లేచినపుడు మరల జాగ్రత్ స్వప్నముల బొందుటకు బుద్ధికి ఒక అస్తిత్వము ఉండును గావున (౪) ౧ ఖండ ౧౨-౧౫ వాక్యములు. విశేషము చూ. ఇది బుద్ధి అవస్థ అయినను అధ్యాస వలన ఆత్మకారోపింపబడుచున్నది. (౫) చెట్టుపుట్టక మునుపు.

ఇది తృతీయ ఖండము

# చతుర్థః ఖండః

తత్ర చిన్మాత్ర స్వరూప ఏవాత్మా కార్యకారణా విద్యా కామకర్మ వినిర్ముక్తః, సలిలవత్ స్వచ్ఛః, స్వాత్మస్థోభవతి ౧

## అర్థము

**తత్ర** = జాగ్రదవస్థా త్రయ మిట్టిది కావున । కార్య కారణా విద్యా కామ కర్మ వినిర్ముక్తః = జాగ్రత్, స్వప్న, సుషుప్తి, కామ కర్మలు లేనివాడును । సలిలవత్ = నీటివలె । స్వచ్ఛః = శుద్ధుడును । స్వాత్మస్థః = తనలో తానున్న వాడును అగు । ఆత్మా = ఆత్మ । చిన్మాత్రస్వరూప ఏవ = జ్ఞానైక స్వరూపుడు మాత్రమే । భవతి = అగుచున్నాడు. ౧

[ఈ నాల్గవ ఖండమున ఆత్మ అద్వితీయమనియు 3 వ ఖండమున ఆత్మయం దధ్యస్తమయినటులు చెప్పబడిన జాగ్రత్ స్వప్న సుషుప్తములు బుద్ధికిగాని ఆత్మకు లేవనియు తెలుపుటకు ఆరంభింపఁ బడినది.]

## తాత్పర్యము

ఇది యిటు లగుటజేసి (౧) ఆత్మ అవస్థాత్రయ వర్జితుడును, కామకర్మ వినిర్ముక్తుడును, నీటివలె స్వచ్ఛుడును (౨) తన లోనే తానున్నవాడును (౩) జ్ఞానైకస్వరూపుడును అనియే చెప్ప నొప్పుచున్నది.

## విశేషము

(౧) అవస్థాత్రయ మాత్మయం దధ్యస్తము. కావున అది అనిత్యము. (౨) ఆత్మలో ఇతర మేమియు లేదని తాత్పర్యము. (3) 'సలిల ఏకో ద్రష్టాద్వైతో భవతి' — ౪-3-3౨-బృ. 'యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా' ... సభగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతిస్వే మహిమ్ని యది వా న మహిమ్నీతి' - ఛాం. ౭-౨౪-౧.

ఏతాని బుద్ధే రవస్థా విశేషణాని నాత్మనోఽవిక్రియత్వాత్। (౨) ఏతాని పరిత్యజ్య తురీయ ఆత్మేతి ప్రతిపత్తవ్యః (౩) తత్ర తురీయత్వం నామ సువర్ణఘనవ ద్విజ్ఞాన ఘనత్వమ్ (౪) తథాపి చైతన్య స్వరూప సన్నిధి మాత్రేణ సాక్షి మాత్రత్వం న త్వవస్థాంతరమ్ (౫) తత్రావస్థాన్తర ఆత్మ తత్త్వ ప్రతిపత్త్యభావా చ్ఛూన్యత్వప్రాప్తేః; కల్పితానాం చ నిరాస్పద త్వానుపపత్తేశ్చ. ౬

## అర్థము

ఏతాని = ఇవి । బుద్ధేః = బుద్ధియొక్క । అవస్థా విశేషణాని = అవస్థా విశేషములు । న, ఆత్మనః = ఆత్మవి కావు (ఏలనగా) । అవిక్రియత్వాత్ = (ఆత్మ) వికారము చెందువాడు కాకపోవుటవలన । ౨

అ ర్థ ము

ఏతాని=ఈ మూటిని । పరిత్యజ్య=వదలి । ఆత్మా=ఆత్మ । తురీయ ఇతి = నాలవవాడని । ప్రతిపత్తవ్యః= తెలియదగినది. 3

అ ర్థ ము

తత్ర తురీయత్వం నామ = అట నాలవ దనగా । సువర్ణ ఘనవత్ = బంగారపు ముద్దవలె । విజ్ఞాన ఘనత్వమ్ = విజ్ఞానపు ముద్ద । (ర) తథాపి = నాలవవాడయినను । చైతన్య స్వరూప సన్నిధి మాత్రేణ = చైతన్య స్వరూపమునకు (అవస్థా త్రయము) దాపున ఉన్నంత మాత్రమున । సాక్షి మాత్రత్వం = సాక్షిత్వమే కాని । అవస్థాన్తరం న = వేరొక అవస్థ కాదు. ౫

అ ర్థ ము

తత్ర అవస్థాన్తరే (సతి) = అది వేరొక అవస్థయగునేని । ఆత్మ తత్త్వ ప్రతిపత్త్యభావాత్ = ఆత్మనైజము తెలియలేక పోవుట వలన । శూన్యత్వప్రాప్తేః = శూన్యత్వము పొసగుట వలన । చ = మరియు । కల్పితానాం = అధ్యస్తములకు లేక ఆరోపితములకు । నిరాస్పదత్వా నుపపత్తేశ్చ = అధిష్ఠానము లేకపోవుట అనుపపన్నము కాబట్టి. ౬

తా త్ప ర్య ము

ఆత్మకు వికారము లేదు గాన జాగ్రత్ స్వప్నసుషుప్తులు బుద్ధికి సంబంధించినవి. ౨. కావున సాధకుడు వీనిని వదలవలెను. (౧) ఆత్మ తురీయమని (౨) (నాలుగవదని) అరయవలెను. 3. ఆత్మ నాలుగవదనగా అది ముద్దబంగారమువలె (3) గట్టి

యొకటయే (౮) కాని దానిలో మరియొకటి లేదు. ౮. అది నాలుగవదయినను అవస్థాత్రయముకంటె వేరు కాదు. ఈ అవస్థలు తనకు దాపుగా నున్నపుడు (ఏయవస్థలోనైని ఆత్మ దాపుగనే యుండును. ఏలన అది సర్వగతము.) తన చైతన్య స్వరూపముతో సాక్షిగా నుండుటయే నాలుగవ యవస్థ. ౫ నాలుగవది వేరే యొక అవస్థ యగునేని ఆత్మ యిట్టిది యని తెలియబడుటకు వీలులేదు (౫) గాన ఆ యవస్థ శూన్యమని అనవలసివచ్చును. అటు లనుట సహేతుకము (౬) కాదు. అధిష్ఠానము లేనిచో అధ్యాస యేడ? దొంగ యనునదొకటి యున్నఁ గదా (౭) దొంగయో దొరయో యని ఆరోపించుటకు! ౬

విశేషము

(౧) రజ్జువునందు సర్ప మారోపిత మయినటులు బుద్ధిధర్మమగు అవస్థాత్రయ మాత్మయందారోపిత మని అనుభవపూర్వకముగా ఎరిగినచో వానియంతట నవియే వదలిపోవును. తాను సాక్షిగా జాగ్రత్ స్వప్న సుషుప్తులను జూచుటే వానిని వదలుట (౨) మూడవస్థ లాత్మ కారోపితము లయి యుండుటజేసి అవిలేని యవస్థ నాలవదని యనుట. (౩) తాడును జూచి పామనికాని, కట్టె యని కాని దండ యని కాని అనుకొని యీ భ్రాంతి పోయిన పిదప నిజ మెరిగి 'యిది తాడు' అని అనుకొనుట ఎట్టిదో అయథార్థమయిన యీ యవస్థాత్రయ సంబంధమునుబట్టి నాలవ యవస్థ యాత్మ కున్నదనుట

యట్టిది — "నాన్తః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞం । అదృశ్య మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచిన్త్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయసారం ప్రపఞ్చోపశమం శాన్తం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా సవిజ్ఞేయః" మాండూక్య. ౭ మా.

(౪) ముద్దబంగారులో బయటను బంగారమే, లోపటను బంగారమే, అంతటను బంగారమే. అటులే ఆత్మ లోపటను, బయటను, అంతటను ఎరుకయే. (౫) తన ఉనికికి ఆత్మమీాద ఆధారపడిన అనాత్మ పదార్థముకూడ తెలియబడకపోయి శూన్యములో ప్రవేశము గొనవచ్చును. (౬) శూన్యవాదు లటులు. (౭) నిరధిష్ఠానమగు ఆరోపము ఉండదు.

"సయథా సైన్ధవఖిల్య ఉదకే ప్రాస్త ఉదకమేవాను విలీయేత, న హాస్యోద్గ్రహణా యేవస్యాత్ । యతో యత స్త్వాదదీత లవణమేవ; ఏవం వా అర ఇదం మహ ద్భూత మనన్త మపారం విజ్ఞాన ఘనఏవ" బృ-౨-౪-౧౨మా.

కథ మేతా న్యాత్మ శుద్ధి ప్రతిపత్తి హేతూ న్యేతేషుహి సత్సు స్వాత్మవిశుద్ధి రవగమ్యతే (౭) కథ మవగమ్యత ఇత్యుచ్యత ఏతేష హి త్రిష్వపి. స్థానేషు ద్రష్టృత్వా వ్యభిచారాత్ (౮) సుషుప్తే వ్యభిచరతీతి చేత్తన్న; తత్రాపి దృశ్యమేవ నివారయతి సర్వలోకః, కథమ్? నాహమత్ర

సుషుప్తే కించి దుపలబ్ధవానితి; న దృష్టిమ్; తస్యాస్త్వహి సర్వత్రావ్యభిచారాత్ కూటస్థ నిత్యతాసిద్ధా, ౯

[ ఆత్మ పరిశుద్ధము అని తెలుపుటకు అవస్థాత్రయము ఉపన్యసింపబడునని మూడవ ఖండము ప్రథమ వాక్యమున చెప్పబడినది. ఈ దిగువ మూడు వాక్యములును ఆ వాక్యమును సమర్థించుచున్నవి. ]

అర్థము

ఏతాని = జాగ్రత్ స్వప్న సుషుప్తములు । ఆత్మశుద్ధి ప్రతిపత్తి హేతూని = ఆత్మయొక్క పరిశుద్ధతను తెలిసికొనుటకు కారణములు । కథమ్ = ఎటులు ? । ఏతేషు సత్సు = ఇవి యుండగా । స్వాత్మశుద్ధిః = అంతరాత్మ పరిశుద్ధత । అవగమ్యతేహి = తెలియబడుచున్నది గదా ! ౭

అర్థము

కథమ్=ఎటులు । అవగమ్యతే ఇతి (చేత్) = తెలియబడుచున్నది అని అనునెడల । ఉచ్యతే = చెప్పబడుచున్నది — ఏతేషు = ఈ । త్రిష్వపిస్థానేషు = మూడుచోట్లులందును । ద్రష్టృత్వా వ్యభిచారాత్ = ద్రష్టృత్వమునకు మార్పు లేకపోవుట వలన. ౮

అర్థము

సుషుప్తే = గాఢనిద్రలో । వ్యభిచరతీతి చేత్ తత్ న = మారును అనగా ద్రష్టృత్వము పోవునని అనజెల్లదు ।

తత్రాపి = ఆ యవస్థయందును । సర్వలోకః = లోకమంతయు । దృశ్యమేవ = దృశ్యమునే । నివారయతి = లేదని అనుచున్నది; కథమ్=ఎటులు? అత్ర సుషుప్తే = ఈ గాఢనిద్రలో । అహం= నేను । కిఞ్చిదపి = ఇసుమంతయును । న ఉపలబ్ధవాన్ = తెలియనయితిని । ఇతి = అని (అనును) । దృష్టిం=జ్ఞానమును । న నివారయతి = లేదని అనదు; తర్హి = అటు కావున । తస్యాః = (దృక్) ఆ యెరుకకు । సర్వత్ర = జాగ్రత్ స్వప్న సుషుప్తులందు । అవ్యభిచారాత్ = లేకపోవుట అనునది లేక పోవుటవలన । కూటస్థ నిత్యతా = మార్పు చెందక ఎల్లపు డుండుట । సిద్ధా = నిశ్చిత మయినది.

## తాత్పర్యము

ఆత్మ శుద్ధ మని అవస్థాత్రయ మెటులు తెలుపగలదు ? ఇవి ఉండబట్టి స్వాత్మ విశుద్ధి తెలియనగుచున్నది. ౭

ఇవి ఉండబట్టే యీ ఆత్మ విశుద్ధమని తెలియనగును. ఎటు లనగా జాగ్రదవస్థ యందును ఆత్మ కలదు. స్వప్నావస్థ యందును కలదు, నిద్రావస్థ యందును కలదు. దీనివల్ల (౧) ఆత్మ సత్తని తెలియనగుచున్నది. ౮

గాఢనిద్రలో ఆత్మ లేదే అని అన్నచో లేకెచటికి బోయి నది ? లోకులు 'సుఖముగా నిద్రించితిని గాని నాకేమియు తెలియ లేదు' అని తమ విషయముల (దృశ్య) అపరిజ్ఞానమునే తెలుపుదురు గాని జ్ఞానమే (౨) లేదని అనరు. దీనిబట్టి ఆత్మ నిద్రలోగూడ నున్నదని ఎటులు అనగలవు ? 'నిద్రలో అను

భూత మయినది ఏదియు నాకు తెలియదు' అని లోకు లందురు. తెలియకపోవుట తెలిసిగదా యిటులనుట! అపుడు తెలివి ఉన్నది. (3) కాబట్టి ఆత్మ అవస్థాత్రయము నందును అంటిపెట్టుకొనియే యున్నది. ౯

విశేషము

(౧) జాగ్రదవస్థ యున్నపుడు స్వప్నావస్థయు నిద్రావస్థయు లేవు. ఇటులే స్వప్నావస్థయున్నపుడు జాగ్రన్నిద్రలును, నిద్రా వస్థ యున్నపుడు జాగ్రత్ స్వప్నములును లేవు. కావున ఇవి యేమియు నిత్యములు కావు. కాని ఈ మూడవస్థలను 'నేను' (ఆత్మ) చూచుచుండును. కాన ఆత్మ యీ మూడు చోటు లను ఉన్నదని తేలుచున్నది. దీనివలన ఆత్మ నిర్వికారము నిత్యము అని నిశ్చయింప వీలగుచున్నది. (౨) న హి ద్రష్టుర్ దృష్టే ర్విపరిలోపో విద్యతే౽ వినాశిత్వాత్ — ౪ – 3 – ౨3 – 3౦ బృ. (3) అన్వయ వ్యతిరేకములచే ఆత్మ స్థానత్రయమునందును ఉన్నదని కనబడుచున్నది.

అత ఏవ న ప్రమాణాపేక్షా, అసిద్ధస్యహి వస్తునః పరి చ్ఛిత్తిః ప్రమాణాపేక్షా చ, నత్వాత్మనః, ఆత్మన శ్చేత్ ప్రమాణాపేక్షా సిద్ధిః, కస్య ప్రమాతృత్వం స్యా ద్యస్య ప్రమాతృత్వం స ఏవాత్మేతి నిశ్చీయతే (౧౦) నన్వాగమేనాత్మా పరిచ్ఛిద్యతే, నాగమే నాప్యాత్మన్యధ్యారో పితా తద్ధర్మ నివర్తనద్వారేణ బ్రహ్మాత్మనో రేకప్రతిపత్తిం

ప్రతి ప్రమాణత్వం ప్రతిపద్యతే నిర్ జ్ఞాత పదార్థ ద్వయస్యా నిర్జ్ఞా తార్థాభి వ్యఞ్జకత్వేన, న తు ఫలరూపేణ, స్వతస్సిద్ధత్వా దాత్మనః. ౧౧

## అర్థము

అత ఏవ = కావుననే (ఆత్మ కలదని చెప్పుటకు) న ప్రమాణాపేక్షా = ప్రత్యక్ష - అనుమానాది ప్రమాణాపేక్ష లేదు । అసిద్ధస్య = ఉండని అనగా అవస్థాత్రయాదులవలె నిత్యముకాని । వస్తునః హి = వస్తువునకుగదా । పరిచ్ఛిత్తిః = మరియొకదానిచే (ప్రమాణ ప్రమాతలచే) ప్రమిత మగుటయు । ప్రమాణాపేక్షా చ = ప్రమాణము నపేక్షించుటయును । ఆత్మనః తు = ఆత్మకో । న = కాదు । ఆత్మనః = ఆత్మయొక్క । సిద్ధిః = సిద్ధించుట లేక ఉనికి । ప్రమాణాపేక్షా చేత్ = ప్రమాణముయొక్క అపేక్ష కలదేని లేక ప్రమాణము నపేక్షించు నేని । కస్య = ఎవనికి । ప్రమాతృత్వం = ప్రమాతృత్వము । స్యాత్ = అగును ? (అనగా ప్రమాత యెవడు ? ప్రమాత యనగా ప్రమాణముచే వస్తువును నిర్ణయించువాడు.) యస్య = ఎవనికి । ప్రమాతృత్వం = ప్రమాతృత్వమో । స ఏవ = అతడే । ఆత్మేతి = ఆత్మ యని । నిశ్చీయతే = నిశ్చయింపబడుచున్నది. ౧౦

## అర్థము

ఆత్మా = ఆత్మ । ఆగమేన = వేదముచేత । నను పరిచ్ఛిద్యతే = నిశ్చయింపబడుచున్నది గదా ! (అని అడు

గుచో చెప్పుచున్నాము అని అధ్యాహారము ) ఆగమేన అపి = వేదముచే కూడ । ఆత్మా = ఆత్మ । న (పరిచ్ఛిద్యతే) = సాధింపఁబడదు । ఆత్మని = ఆత్మయందు । అధ్యారోపితా ఽ తద్ధర్మ నివర్తన ద్వారేణ = ఆరోపింపబడిన అనాత్మ ధర్మములను నిషేధించి, దానికతన । బ్రహ్మాత్మనోః = బ్రహ్మాత్మల । ఏకత్వ ప్రతిపత్తిం ప్రతి = ఐక్యజ్ఞానమునుగూర్చి । నతు ఫలరూపేణ = ఫలరూపమునగాక (అంతఃకరణ వృత్తి ఆవరణభంగము చేయును. ఆభాసుడు ఘటమును ప్రకాశింపజేయును. ఇది ఫలము. ఐక్యమునూ ఆభాసుడు ప్రకాశింప చేయ నక్కర లేదు. బ్రహ్మాత్మైక్య జ్ఞానము స్వయం ప్రకాశము.) నిర్జ్ఞాత పదార్థ ద్వయస్య = తెలియబడిన రెండు పదార్థములకు ( బ్రహ్మ - ఆత్మ - అను రెండు పదములు తెలిపిన అర్థములకు ) అనిర్జ్ఞాతార్థాభి వ్యఞ్జకత్వేన = బ్రహ్మాత్మపదములకు తెలియని యే యర్థము కలదో దానిని తెలుపుననిగా । ప్రమాణత్వం = ప్రమాణత్వమును । ప్రతి పద్యతే = పొందుచున్నది । [ఆత్మను తెలుప గల ప్రమాణము శ్రుతి. హిమాలయమును మన మెరుగము. చూచినవారు హిమాలయమును గురించి చెప్పగా విని హిమాలయ మున్నదని నమ్ముదుము. అటులే ఆత్మను ఎరిగినవారు 'వేదాహ మేతం పురుషం మహాన్తమ్ = ఈ మహాపురుషుని నే నెరుగుదును' అని చెప్పగా నమ్మవలసియున్నది. మరియు ఎరిగినవారు భూమి కానిది, జలము కానిది,

పొడుగు కానిది, పొట్టికానిది, అని యీ రీతిగా ఆత్మేతర ధర్మ నిషేధరూపముగా కూడ (మాండూక్యము. చూ) ఆత్మను గూర్చి చెప్పిరి. ఈ శ్రుతులు చదివినందువలన ఆత్మ ఉన్నదని మాత్ర మెరుగ వచ్చును. కాని ఆ శ్రుతులు విని నందువలనగాని మననము చేసినందువలనగాని ఆత్మ ఘటము వలె కంటికి కనబడునది కాదు. అనగా ఏదో ఒక బాహ్యా-భిన్న-వస్తువుగా గ్రహింపబడదు. ఎందుచేత? ఆత్మను తెలియ గోరు వాడెల్ల తానే కావున తాను తన్నెరుగకుండ నుండడు గాన ఘటాది బాహ్యపదార్థముల వలె ఇంద్రియములచే గ్రహింపబడడు. ఈ సంగతియే యిట్లు చెప్పబడుచున్నది—]

ఆత్మనః = ఆత్మ । స్వతస్సిద్ధత్వాత్ = స్వయం సాక్షి యగుట వలన ।

## తాత్పర్యము

కావున (౧) ఆత్మ ఉన్నదా లేదా? ఉన్నయెడల ఏ ప్రమాణముచే సాధింపబడును అను చర్చయే లేదు. ఆత్మ ఉన్న దనుటకు ప్రమాణముతో పనిలేదు. ఏలనగా నిత్యముకాని వస్తువులను (౨), వస్త్వంతరముచే పరిచ్ఛిన్నములయిన వస్తువులను తెలిసికొనుటకు ఏదో ఒక ప్రమాణము ఉండవలయును. అట్టిది కాని ఆత్మకు ప్రమాణాపేక్ష యేల? ఆత్మ ప్రమాణాధీనుడై ప్రమాణముచే సాధింపబడవలసిన యెడల (3) ఆ ప్రమాణ ముపయోగించి పరీక్షించువా డెవడు?

ప్రమాణ మువయోగించి పరీక్షించువాడే ఆత్మ అని నిశ్చిత మగుచున్నది. ౧౦

## తాత్పర్యము

కాని ఆత్మ కలదని అనుటకు వేదము ప్రమాణముకదా అని అనవచ్చును. వేదముచే గూడ ఆత్మ సాధింపబడదని మేము చెప్పెదము. ఆత్మయం దారోపితములయిన అనాత్మ ధర్మములను నిషేధించి దాన (౪) బ్రహ్మ మన్నను ఆత్మ యన్నను ఒకటియే (౫) యని తెలుపుటలో వేదము ప్రమాణము కావచ్చును. ఆత్మ స్వతస్సిద్ధము, కావున అనగా స్వయం సాక్షి (౬) కావున వేదము ఫలరూపముగా (౭) గాక, తెలిసిన తత్ త్వం అను పదముల అర్థముతో (౮) తెలియని తత్ త్వం పదముల (౯) అర్థమొకటియే యని తెలుపుటలో (౧౦) ప్రమాణము. ౧౧

## విశేషము

(౧) ౯ వ వాక్యమునగల 3 వ విశేషము చూ. అవస్థా త్రయము నందును ఉండుటవలన ఆత్మ నిర్వికారము, కూటస్థము అని యీ సాధించుట 'ఆత్మ అప్రమేయము (ప్రమాణ సాధ్యము కాదు)' అను బృహదారణ్యకమునకు (౪-౪-౨౦) విరుద్ధ మయినటులు కానిపించును. కాని అది విరోధము కాదు. ఏల యన ఆత్మయెడల అనుమేయమగు అర్థము యథార్థ జ్ఞానమును కలిగింపదు గాని యథార్థమయి యుండ వచ్చునను జ్ఞానమును కలిగించును.

(౨) సర్వగతమగు బ్రహ్మము గాక మరొకటి నిత్యపదార్థము కాదు. (౩) అటు లగు నెడల ప్రమాణమే లేకపోవును. (౪) మాండూక్యము (౧-౬) చూ. (౫) ఒకటియే యని తెలుపుటచే 'అహం బ్రహ్మాస్మి' 'నేను బ్రహ్మమను' అను వృత్తి కలిగించి అజ్ఞానమును పోగొట్టును. (౬) బ్రహ్మభిన్నమును చిదాత్మకమునగు ఆత్మ • వేరొక జ్ఞానముచే నిరూపణీయము కాదు. ౪-౩-౯ బృ. చూ. (౭) మన మొక కడవను చూచితిమని అనుకొందము। అపుడు అంతఃకరణవృత్తి కంటిగుండ కుండమీాదపడును। వృత్తి కుండరూపము గొనును। అంత విషయమగు కడవ (ఆవరణము తొలగి) కానిపించును। అంతఃకరణవృత్తికి ఫలము ఆవరణ భంగము। (వృత్తిలో భాసించిన) చిదాభాసునకు ఫలము 'ఇది కడవ' అను తెలివి ఆభాసు డిటులు కడవనువలె బ్రహ్మమును కానలేడు। ఇక శ్రుతి మాట। శ్రుతి బ్రహ్మము ఉన్న దని పరోక్షజ్ఞానము కలిగించును। అపరోక్షజ్ఞానము కలిగింపలేదు। 'నేను కు' గోచరమగు ఆత్మ నొరులకు చూపగాదు। శ్రుతి ఆత్మని విశేషరూపమగు అసంగత్వాదికమును తెలిపి చరితార్థ మగును। (౧౦) తెలియని వానిని తెలియునటులుచేయుట ప్రమాణమునకు ప్రయోజనము.

సోఽహ మితి స్మృత్యా ప్రతిసంధానాత్ పుణ్యాపుణ్య సంబంధాభావాచ్చ స్థానత్రయ వ్యతిరిక్తత్వం, నిత్యత్వం,

శుద్ధత్వం, బుద్ధత్వం, ముక్తత్వ, మవిక్రియత్వ మపరిలుప్త దృక్స్వరూపత్వ మేకత్వం చాత్మనః. ౧౨

అర్థము

సః = (ముచ్చోటులను ఉన్న) అలవాడు। అహమితి = నేను అని। స్మృత్యా = స్మరణముచే। ప్రతిసంధానాత్ = గుర్తించుటచేతను। పుణ్యాపుణ్యసంబంధాభావాచ్చ = పుణ్యము, పాపము: వీనితో సంబంధము లేకపోవుటచేగూడ। ఆత్మనః = ఆత్మకు। స్థానవ్యతిరిక్తత్వం = జాగ్రత్ స్వప్న సుషుప్తులుఅను ముచ్చోటులు కంటె వేరిమియు। నిత్యత్వం = నిత్యత్వమును। శుద్ధత్వం = పవిత్రత్వమును। బుద్ధత్వం = జడత్వముకంటె వేరిమియు। ముక్తత్వమ్ = అజ్ఞాన కామ క్రియలు లేమియు। అవిక్రియత్వం = మార్పులేక ఎప్పుడును ఒకే తీరుగ నునికియు। అపరిలుప్త దృక్ స్వరూపత్వం = లోపింపని జ్ఞాన స్వాభావ్యమును। ఏకత్వం = ఒంటరి తన మును (అద్వితీయత్వము) కలదని తెలుచున్నది. ౧౨

తాత్పర్యము

జాగ్రత్ సుషుప్తులలో నున్నవాడు తానే యని (నేనే యని) ప్రతివాడును గుర్తించుట వలన (౧) (ఆత్మ యీ మూడు చోటులను తీయక యుండుటవలనను తురీయముగుట వలనను) ఆత్మ స్థానత్రయాతీత మనియు (౨) నిత్యము, శుద్ధము, ముక్తము, అవికారము, చిత్స్వభావము ఏకము (3) అని నిరూపిత మయినది.

విశేషము

(౧) అప్పుడటులు కలవరించినదియు నిదిరించినదియు, ఇప్పుడిటుల మేలుకనినదియు ఆ నేనే అనునది స్మృతి శరీరము.

(౨) అవస్థాత్రయము పుణ్యాపాపములతో సంబంధము కలిగియున్నది. ఆత్మ దీని కతీతముగాన పుణ్యాపాపములతో సంబంధము లేనిది.—

[ఆత్మ యేకారణములచే నిత్యమో అవిక్రియమో ఆ సంగతులు లెక్కింపబడి యీ వాక్యమున ఉపసంహరింపబడినవి కావున నిదియ గ్రంథాంతము। ఆత్మజ్ఞాన ముపన్యసింతుమను మొట్టమొదటి ప్రతిజ్ఞ గుర్తుకు తెచ్చుకొనునది]

స్వానుభవేనైవ మమ సిద్ధ మితి జానాతి విద్వాన్. ౧౩

అర్థము

స్వానుభవేనైవ = తన అనుభవముచేతనే । మమ = నాకు। సిద్ధమితి = (ఆత్మజ్ఞానము) కలిగినదని। విద్వాన్ = జ్ఞాని । జానాతి = తెలిసికొనుచున్నాడు. ౧౩

తాత్పర్యము

తెలిసినవాడు తన అనుభవము చేతనే తన్ను తాను తెలిసికొంటినని ఎరుగును (ఏమో ఒక ప్రమాణముచే గాదు).

[శ్రుతి ననుసరించియు తర్కము ననుసరించియు లోగడ వివరింపబడిన ఆత్మ స్వభావ జ్ఞానమున కీ వాక్యమున జ్ఞాని అనుభవము అనుబద్ధ మయినది.]

ఆచార్య ప్రసాదా దజ్ఞాన నిద్రాప్రబుద్ధః సకల సంసార విముక్తో విద్వాన్. ౧౪

అర్థము

ఆచార్యప్రసాదాత్ = గురువు అనుగ్రహము వలన (జిజ్ఞాసుః అని అధ్యాహారము - ఆత్మనెరుగగోరు వాడు). విద్వాన్=జ్ఞానముకలవాడై । అజ్ఞాన నిద్రాప్రబుద్ధః = అజ్ఞానమను నిద్రనుండి మేలుకనినవాడును । సకల సంసార విముక్తః = సమస్త సంసారము నుండియు విడువబడినవాడును (అగుచున్నాడు-అని అధ్యాహారము).

తాత్పర్యము

ఆత్మ నెరుగ గోరినవాడు గుర్వనుగ్రహమున (౧) జ్ఞానియై అజ్ఞానమను గాఢనిద్రనుండి (౨) లేచి చావను పుట్టను చావను పుట్టుచుగా చక్రమువలె తిరుగుచుండు సంసారము నుండి తొలగును. (3)

విశేషము

(౧) అజ్ఞాన మనాది. దాని వయసు చెప్పవలయునెడల కాలమున కెంత వయసో దాని కంత వయసని చెప్పవలసి యుండును. (౨) గురువు సాక్షాద్ బ్రహ్మమని శ్రుతి చెప్పును. (3) ఈ జన్మమున జీవన్ముక్తుడై శరీరపాతానంతరమున మరి జన్మము పొందడు.

ఎష ఆత్మజ్ఞానోపదేశవిధి రేవం జ్ఞాత్వా కృత కృత్యో భవతి నాన్యథేతి. ౧౫

## అర్థము

ఏషః = ఇది। ఆత్మజ్ఞానోపదేశవిధిః = ఆత్మజ్ఞాన ముప దేశము పొందవలసిన విధి (బ్రహ్మము నెరిగిన గురువు ఉప దేశించిన యెడల అది అవ్యర్థమగును. గనుక ఇటులుపదేశము పొందుట విధి అని చెప్పబడెను.) ఏవం = ఇందు చెప్పబడిన చందముగా। జ్ఞాత్వా = ఎఱిగి। కృతకృత్యో భవతి = కృత కృత్యుఁ డగును. (పుట్టినందులకు చేయవలసిన పని పుట్టి యుండుపని చేయవలసిన వాఁడగును.)

## తాత్పర్యము

గురువుకడ ఆత్మజ్ఞానోపదేశము పొందవలయు విధి యిది. ఇటులు పొందనిచో (౧) కృతకృత్యుఁడు కాఁడు. (౨)

## విశేషము

(౧) ప్రాచీనకాలమునం దెవరో పొందుటకాదు. ఈకాలము నందును ఏకాలము నందును ఇటులే గురువుకడ ఉపదేశము పొందవలసియుండును. కర్మలవలనగాని మరి దేనివలనగాని కృతకృత్యతలేదు. (౨) విశిష్ట జన్మ ప్రసూతేన బ్రాహ్మణేన యత్ కర్తవ్యం తత్ సర్వం భగవత్తత్త్వే విదితే కృతం భవే దిత్యర్థః, నచాన్యథా కర్తవ్యం పరిసమాప్యతే కస్యచి దిత్యభి ప్రాయః. 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' ఇతి చోక్తమ్. 'ఏతద్ధి జన్మ సామగ్ర్యం బ్రాహ్మణస్య విశేషతః। ప్రాప్యైతత్ కృతకృత్యోహి ద్విజో భవతి నాన్యథా' ఇతిచ మానవం వచనమ్. (గీతాభాష్య-౧౫-౨౦)

ఏవం వేదాన్త శాసనమ్ వేదాన్తశాసనమ్ । ౧౬

ఇతి చతుర్థః ఖండః

ఇతి శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య
భగవచ్ఛఙ్కర విరచితాత్మజ్ఞానో
పదేశవిధిః సమాప్తః.

## అర్థము

వేదాన్త శాసనమ్ ఏవమ్ = వేదాంత బోధ యిట్టిది.
(సమాప్తి చేయునపుడు రెండు మారులు చెప్పుటమామూలు)

## తాత్పర్యము

ఉపనిషద్బోధలు (౧) ఇట్టివి. (౨)

## విశేషము

(౧) ౧-౪-౧౦; ౪-౩-౭ బృ. ౩-౮-౬-౧౫ శ్వే ౬ నృ' పూర్వతాపిని.

(౨) ముక్తికి ఆత్మజ్ఞానము తక్క ఇంకొక్క మార్గము లేదు.

(౩) లోకమున కాత్మ జ్ఞానము ననుగ్రహించుటకు సన్న్యాసులు తిన్నార నుండక ఉన్నార పండక తిరుగుచుందురు.

ఇది చతుర్థఖండము

ఇది శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య
భగవచ్ఛఙ్కర విరచిత ఆత్మజ్ఞానోపదేశ విధి
సమాప్తము

# ఆత్మజ్ఞానోపదేశవిధిః

## ప్రథమ ఖండము

### తాత్పర్యము

తన్ను తాను తెలిసికొనుటకంటె అధికమగు లాభము వేరొకటి లేక పోవుటచే మోక్షమును గోరువారికిని శ్రుతియందును గురువునందును నమ్మకము కలవారికిని సన్న్యాసులకును విరాగులకును గురువుకడ ఆత్మజ్ఞానము పొందదగు విధిని వివరించుచున్నాము. ౧

చూడబడునది చూచువానికంటె (తనకంటె) వేరయినదని అందరకును తెలియును (తానుండగా చూడబడు వస్తువులుండగా ద్రష్టయు దృశ్యము అనునవి విడివిడివని అందరకును దెలియును) కాగా చూచునట్టి ఈ తాను (ఆత్మ) ఎవరు? ౨

ఆకారాదులుగల ఘటాదులు కన్ను మొదలగు ఇంద్రియములచే కనుగొనబడుచున్నవి । ఆకారాదులుగల శరీరము కూడ ఎదుటనున్న వస్తువువలె కనుగొనబడుచున్నది । ఇటులు రూపము రంగు మొదలగునవి కలదిగా చూడ బడుటచే దేహము ఆత్మకాదు. 3

వస్తువులను కాల్పను ప్రకాశింపజేయనుగల అగ్ని కాల్పబడునట్టియు ప్రకాశింప జేయబడునట్టియు వస్తువులకంటె వేరయినటుల చూచు తాను (ఆత్మ), చూడబడు దేహముకంటె వేరని సిద్ధమయినది. దేహమునకు నిద్ర మృతి మొద

లగునవి కలుగుచుండుననను నీ హేతువుచే గూడ ఆత్మ శరీరము కంటె వేరు. ౪-౫

అగ్ని కట్టెనంతయు వ్యాపించినటులు ఆత్మయు శరీరము నంతయు వ్యాపించినపుడు శరీరము పనులు చేయగలదియు కదలికకలదియు నగుచున్నది. ఆత్మ శరీరమును విడిచినపుడో ఆ శరీరము కట్టెయలు. మొదలగువానివలె అగుచున్నది; కావున శరీరముకంటె వేరని సిద్ధమయినది ఆత్మ లేక తాను. ౬

దీపము ఇది కుండ, ఇది బండ యని తెలుపు పనిముట్టు. కన్నుకూడ అట్టిదే కాన ఆత్మ కాదు. పనిముట్టగు దీపముచే రూపము తెలియబడినటులు పనిముట్టగు కంటిచేగూడ రూపము తెలియబడుచున్నది. మిగిలిన ఇంద్రియములచే గూడ శబ్దస్పర్శ రసగంధములు తెలియబడునుగాన ఏయింద్రియమును ఆత్మ కాదు. (పనిముట్టు పనిగొనువానికి ఉపయోగించును. ఇచట పనిగొనునది జీవ - ఆత్మ). ౭-౯

మనస్సుగూడ ఆత్మచే ఆలోచింపదగిన విషయము, మరియు ఆత్మకు దీపమువలె పనిముట్టు. కావున మనస్సుగూడ మిగిలిన ఇంద్రియములతోపాటు ఆత్మ కాదు. బుద్ధి ఎరుకకు విషయము. మరియు ఆత్మ దేనినేని నిశ్చయించుటకు ఇది ఉపకరణము. కావున బుద్ధియు మనస్సువలెనే ఆత్మ కాదు. నిదురలో తానున్నటులు ప్రాణమునకు తెలియదు కాన ప్రాణము గూడ ఆత్మ కాదు. ౧౦-౧౨

తుల్యవేషభాషలు కలిగి పరిజనులతో పరివేష్టితులయిన రాజభృత్యులలో రాజెవడో బంటెవడో తెలియనిదే కన బడు పరిషవమంతయు వారిలో నెవరిదో తెలియ నటులు

నిదురకంటె వేరయిన అవస్థలలో కనబడు చైతన్యము ప్రాణముదో లేక ఆత్మదో తెలియదు.                    ౧౩

నిద్రలో జ్ఞానరహితమై ప్రాణము పట్టుపడుచున్నది. ఇంద్రియములు పనిచేయక ఊరకుండబట్టి ప్రాణము చైతన్యము లేనటులు కానవచ్చుచున్నదని అనుమానింపదగదు। దొంగపనిచేయునెడల బంట్లు ఊరక కూర్చుందురా? కావుననే నిద్ర కతన ఉపరమించిన యింద్రియములు ప్రాణమునకు సంబంధించినవికావు, మరి నిద్రపోవుచున్నవానివి.        ౧౪-౧౫

కర్మ అనుభవింపవలసి వచ్చినపుడు జాగ్రదవస్థ కలుగును. అపుడు జీవాత్మకు నిద్ర తొలగును. ఆత్మ యిటులు వెలువడి యింద్రియముల నధిష్ఠించును. అపు డింద్రియములు తమ తమ విషయములలో వర్తించును.                    ౧౬

జాగ్రదవస్థకు నిమిత్తమయిన కర్మ తరగినపుడు జీవాత్మ బుద్ధి యను ఉపాధితో కలసినందున, కలిగిన విషయ విజ్ఞానముచే ఇంద్రియముల నన్నిటి నుపసంహారించుకొని కలను గాని నిద్రనుగాని పొందుచున్నది.                    ౧౭

జీవు డెపుడును ఇటులు జాగ్రత్ స్వప్న సుషుప్తులను పొందును. జీవుని యీ అనుభవములకు గతకర్మలును అజ్ఞానమును కోరికలును కారణము.                    ౧౮-౧౯

ఆత్మ స్వప్నావస్థను జాగ్రదవస్థను అనుభవించి ఈ రెండవస్థలకు కారణమగు కర్మవలన కలిగిన అలసటను పోగొట్టుకొనుటకు మరల సుషుప్తిని గూడ పొందుచున్నది.                    ౨౦

ప్రాణము స్వవిలక్షణ స్వభావముచే జాగ్రత్ స్వప్నము లందువలె నిద్రావస్థయందును 'శరీరము చచ్చిపోయిన' దను భ్రాంతిని పోగొట్టుటకు శరీరమును రక్షించుచుండును. ౨౧

రెండు నేను లున్నవి. వానిలో నొకటి అహంకారము లేక జీవాత్మ, మరియొకటి (దానికిని లోపలనున్న) సాక్షి లేక అంతరాత్మ లేక ప్రత్యగాత్మ. ఈ రెంటికిని భేదము తెలియనివారు అహంకారమే ఆత్మ యని అనుకొందురు. కాని అది ఆత్మకాదు. ఏల? కుండలు మొదలగునవి ఎటుల దృశ్యములో అహంకారముగూడ అటులే దృశ్యము. మరియు ఇది నిదురలో అంటిపట్టుకొని (అనుస్యూత మయి) యుండదు. శరీరమున కున్నటులు అహమునకును సుఖ దుఃఖాదులును సంసారధర్మములును కృశత్వము, స్థూలత్వము మొదలగు ధర్మములు ఉన్నవి. కావున ఈ అహంకారము గూడ ఆత్మ కాదు. ౨౨-౨౮

దేహము మొదలుకొని అహంకారమువరకు గల వానిలో ఆత్మ ధర్మము లేనిచో ఇది ఆత్మ అని ఎటుల తోచును? చూచువానికిని చూడఁబడుదానికిని వేరిమి కలదని తెలిసి కొనక పోవుటవలన. ౨౯

## ద్వితీయ ఖండము

తనకు సంబంధించిన వానిలో ఏదియు కానియెడల ఆత్మ యనువాడెవడు, ఎట్టివాడు అని అడుగుచో చెప్పుచున్నాము: లోగడ చెప్పినవాని కన్నిటికిని వేరయినవాడు మరియు వాని అన్నిటికంటె లోపలివాడు, ఆకాశమువలె అంతట నున్న వాడు, అణువున కణువగువాడు, నిత్యుడు, అవయవహీనుడు,

నిర్గుణుడు, (కలయు మాగును లేనివాడు) మాలిన్యము లేని వాడు రాకపోక మొదలగు పనులు లేనివాడు, 'నేను' 'నాది' యను భావముగాని, ఇచ్ఛాద్వేష ప్రయత్నములుగాని లేని వాడు, అగ్నికి వేడిమివలె సూర్యునకు ప్రకాశమువలె ఎరుకయే స్వభావముగా గలవాడు, పంచభూత సంపర్కము లేనివాడు, ఇంద్రియములు, గుణములు, ప్రాణాదులు, ఆకలి దప్పులు, శోకమోహములు, జరామరణములు, శరీరము లేనివాడు ఆత్మ. ఇంతియు కాక ఎవడు అందర హృదయము లందుండి అందరి బుద్ధులను జూచునో అత డాత్మ. ౧

ఆకాశమునకు ఏ వస్తువును ఆధారము కానటులు వ్యాపకుడును నిరవయవుడునుఅగు ఆత్మకు బుద్ధి ఆధారము కానోపదు. ఇటు లయినను బుద్ధు లన్నిటితో సంబంధ మున్నటులు కానిపించుటవలన ఆత్మ అందర హృదయములందు ఉండు నని చెప్పనగును. ౨

అహంకారముగాని మమకారముగాని ఇచ్ఛగాని ద్వేషము గాని ప్రయత్నముగాని లేని యాత్మ ద్రష్టయగు టెటులు? చచూట యను పని చేయు వాడుకదా చూచువాడు! చూచుట యను పని చేయుటచే ఆత్మ ద్రష్ట యగు నేని బుద్ధుల నన్నిటిని జూచు టెటులు పొసగును? కాగా ఇటు లనుట విరుద్ధము. వచ్చుట పోవుట మొదలగు క్రియలలో నెవని కేని కర్తృత్వ మేర్పడుటకు ఆ యా క్రియల అపేక్ష యుండును. మరియు నా యా క్రియలు నిష్పన్నము లగుటకు కర్తకంటె వేరయినవియు కానివియు నగు కరణముల అపేక్ష యుండును. ౩-౪

రెండు రీతులగు కరణములతో సంబంధముగాని మార్పుగాని లేనట్టి చిత్ స్వరూపునకు చూచుట యను క్రియలో కర్తృత్వము పొసగదు. ౫

కరణాదుల సాయముతో జూచువా డెవడేని యగు గాక, వాని ద్రష్టృత్వము దీపముతో బోల్చదగిన చిత్తము యొక్క ద్రష్టృత్వము వంటిదే యగును. చిత్తము ఏ కొలది వస్తువులను మాత్రమో చూడగలదు. మరియు ఒకవస్తువును చూచిన పిదపనే మరియొక వస్తువును చూడ గలదు. ఒకొకపుడు చూడను జాలక పోవును. ఇంకొకపు డొకదానికి బదు లింకొక దానిని జూచును. ౬

మార్పు చెందునదియు, కరణాదులు లేక చూడజాలనిదియు నగు చిత్తము వలె గాకపోవుటచే ఆత్మ అల్పద్రష్టకాని, క్రమద్రష్టగాని, అద్రష్టగాని, అన్యథాద్రష్టగాని కాదు. అట్టి యపుడు ఆత్మకు బుద్ధితో సంయోగ మెటులు? ౭-౮

బుద్ధియు ఆత్మయు సూక్ష్మములు నిర్మలములు నిరవయవములును గావున ఈరెండును కలియుట కవకాశముకలదు. ౯

బుద్ధి స్ఫటికమువంటి దయినను స్వప్రకాశము కాదు. అనగా తనంత దాను ప్రకాశింప నేరదు. ప్రకాశ స్వరూపమయిన ఆత్మ చాపుగా నున్నంత మాత్రమున అది ప్రకాశించును. ఇటు లీరెంటికిని పోలిక యున్నది. కావున ఈరెంటి కలయికకు వీలున్నది. ఈ కలయిక అధ్యాసవలన. ౧౦

మూర్త ద్రవ్యములు కొన్ని ఒండొండు అంటుకొనును. మూర్తములగు లక్కయు చెక్కయు చక్కగా అంటు

కొనును. బుద్ధ్యాత్మలు మూర్తములు కావు. కావున వీని
కలయిక అట్టిది కాదు. మరి అధ్యాసచే కలిగినది. ఆత్మ
ధర్మము బుద్ధియందును బుద్ధిధర్మ మాత్మయందును ఆరోపించి
యీ రెంటికిని కలయిక కలదని అనుకొనుట అధ్యాసవలన. ౧౧

ఇతర వస్తువుల సాన్నిధ్యమును బట్టియే ఆత్మ ద్రష్టయని
చెప్పబడుచున్నాడు. సూర్యుడును ఇతర వస్తువుల సాన్ని
ధ్యమును బట్టియే ప్రకాశకుడు (కర్మసాక్షి-జగచ్చక్షువు) అని
చెప్పబడుచున్నాడు. సూర్యునకు 'నేను' అని కాని 'నాది'
అని కాని ఒక కోరిక కాని ఒక పూనికగాని ఇంకను ఇటువంటి
వేవిగాని లేవు. ఇటులు లేకున్నను (ఈ ప్రపంచము నాది;
దీనిని నేను ప్రకాశింపఁ జేయవలయును అను నీ మొదలగు
కోరిక లతనికి లేవు) అతని సాన్నిధ్య మాత్రమున చీకటి
పోయి వెలుగువచ్చి సర్వము ప్రకాశించుట వలన అతడు
ప్రకాశకుడయినాడు గాని వేరు రీతిగా అతనికి కర్తృత్వరూప
మగు ప్రకాశకత్వము లేదు. ఇటులు లేకున్నను తెలియని
వారు అతనికి ఈ ధర్మము నారోపింతురు. ఇటులే దృశ్యము
లగు బుద్ధ్యాదులు చైతన్యముకంటె వేరుకాని ఆత్మ దాపున
నుండుటచే ఆత్మ ద్రష్టయని చెప్పబడుచున్నాడు. ౧౨

మార్పుగాని విశేషణములుగాని లేని ఆత్మ కర్త యెటు
లగు నని అడిగినచో చెప్పుచున్నాము — సూదంటురాతికి
కర్తృత్వ (౨) మెటులో అటులు. తాను దాపున ఉన్నంత
మాత్రమున సూదంటురాయి సూదిని కదల్చును. అటులే
నిర్వికారుడగు ఆత్మ వ్యాపారము (క్రియలను లేక పనులను)
చేయు వానికి అవభాసకుడు. ఈ విషయమున పనిచేయు

వారికి సాక్షిమాత్రముగా నుండుట జేసి ఆత్మ కీకర్తృత్వ మారోపింపబడు చున్నది. బుద్ధి మొదలగు కరణములుకారక ములు. చైతన్యముచే ప్రకాశింప జేయబడి అవి తమ తమ విషయములను వ్యాపించును. ఇది యిటులుండగా వికారము గాని విశేషముగాని లేని ఆత్మ యందు కర్తృత్వ మారోపింప బడుచున్నది. ౧౩-౧౭

ఇటు లగుటచే శుద్ధచైతన్యమును బుద్ధిచే చూడ నగునని చెప్పుటకు వీలు లేదు. ఏలన సూర్యకాంతి ఘటమును ప్రకాశింప జేసినట్లు చైతన్యము బుద్ధిని ప్రకాశింప జేయును. ఇట్టియెడ బుద్ధియే చైతన్యమును ప్రకాశింపజేయు నను టెటులు? ౧౯

ఏరూపమేని సూర్యుని ప్రకాశింప జేయలేదు. (సూర్యు డే రూపములను ప్రకాశింప జేయును) అటులే ఆత్మ బుద్ధిచే ప్రకాశింప జేయబడదు. ౨౦

దృశ్యమగు బుద్ధి ద్రష్ట యగుటకు వీలు లేదను నీ హేతు వుచే గూడ ఆత్మ బుద్ధిచే చూడబడదు. దృశ్యము గూడ ద్రష్ట యగునేని దృశ్యత్వమే లేకపోవును. ఎట్లనగా రెండు దీపములలో ఏ యొకటియు రెండవదానికి భాసకము కాదు. ౨౧

## తృతీయ ఖండము

మెలకువ, కల, నిద్ర, ఇవి బుద్ధి అవస్థలు. ఆత్మను వివిక్తముగా తెలియుటకు వీనిని విడనాడ వలెను గావున వీనిని వివరించుచున్నాము. ౧

ఈ మూడవస్థలలో జాగ్రదవస్థ యను నిది: సూర్యుడు, దీపము, ఇంద్రియాధి దేవతలు, వీరి సాయముతో కనులు మొదలగు ఇంద్రియములు కుండ మొదలగు విషయములను కనుగొనును. అపుడు బుద్ధియు కరణముగా పనిచేయును. ౨

చైతన్యము ప్రతిబింబించి బుద్ధి ద్రష్టవలె దృశ్యము వలె ఇరుదలగా పరిణమించును. దేహము మొదలుకొని అహము వరకు గల వస్తువు లొకదానికంటె మరొకటి లోపలివి. ఇవి తమ ఉనికిని ఎపుడో ఒకపుడు కోలుపోవునవి. ఇది యేదియు ఆత్మ కాదని చెప్పుటకు ఆత్మకు ప్రత్యక్ అను విశేషణము వేయఁబడినది. 3

నిత్యము కాని అనాత్మపదార్థములలో బుద్ధ్యాదులగు కరణము లొక ప్రోవు. ప్రత్యగాత్మ సంబంధముచే ఇవి ఆత్మ అనిపించుకొను చున్నవి. ఒకపుడు మనను బుద్ధి మొదలగువానిని ప్రధానముగా జేసికొని నేను నేను అని వ్యవహరింతుము. ఇట్టి వ్యవహారములలో శ్రోత్రాదులగు ఇంద్రియములకంటె మనస్సు, దానికంటె బుద్ధియు ఆంతరములు. ఇంతియకాక వీనిలో తరతమ భావ మున్నది. ఈ కారణములబట్టి అంతరతమమగు ఆత్మతో కలుగుసంబంధము నందలి తేడావలన ఈ యింద్రియాదులలో ఒకపుడు ఒకటియు, ఇంకొకపు డింకొకటియు ముఖ్యమును అముఖ్యము నగు ఆత్మగా వ్యవహరింపబడును. అగ్గి తగులగనే నీరు వేడెక్కినటులు ఇంద్రియాదులును అంతరాత్మ సంబంధము వలన ఆత్మలని అనిపించుకొనును. కాని అగ్నిమీద నీరు

పోసినచో అది చల్లబడి పోయినటులు ఇంద్రియ సంపర్కము వలన ప్రత్యగాత్మ మాత్రము మారదు. ౮

బుద్ధి మొదలగు వానిలోవలె ఆత్మలో వేరొక వస్తువు లేదు. కావున అది ప్రత్యగాత్మగా గాక యింకొక రీతిగా ఉండదు. కాన ఆత్మ ప్రత్యగ్విశేషణమునకు దగియున్నది. ఈ రీతిగా ఆత్మ నిత్యమనియు శుద్ధమనియు తేటగా తెలియుచున్నది. ౫౯

ప్రత్యగాత్మ సంయోగమున ప్రత్నగాత్మ ప్రకాశమునవలె కనిపించుచు బుద్ధి ద్రష్టృ దృశ్యాకారముగా పరిణమించునని వెనుక చెప్పబడెను. (3 వాక్యము. చూ.) బుద్ధి విషయాది సంపర్కముచే మూసలోపోసిన రాగి మొదలగు వానివలె విషయాకారము తాల్చును. ౬

ఇది యిటులు జరిగినపుడు ఆ ద్రష్టృ దృశ్య సాక్షియు కాలము ఆకాశము మొదలగువానివలె ఎల్లెడ వ్యాపకుడును నిరవయవుడును అవిక్రియుడును చిద్రూపుడునగు ఆత్మకు జాగ్రదవస్థ కలిగినటులుండునని అందురు. ౭

స్వప్నావస్థ పొందదగిన కర్మ సమకూరినపుడు బుద్ధిరూపాదులుకల బాహ్యవస్తువుల సంస్కారములను బొంది బాహ్య వస్తువుల సంపర్కము లేకయే చూచునదియు చూడబడునదియుగా మారును. పూలబుట్టను ఇందుల కుదాహరణముగా చెప్పవచ్చును. తనలో పూలు లేకున్నను చూడగనే పూలబుట్ట పూలసంస్కారమును కలిగించును. మరియు బుద్ధి ఆత్మ సాన్నిధ్యమున కాలకర్మావిద్యావశమున సంస్కారరూపముతోనే విషయముగా భాసించును. ఈ యను

భవ మాత్మకు కలవచ్చినటు లగును. ఏలనగా నీరు కదలు చున్నచో చంద్రుడు కదలుచున్నటులు కనబడు చందమున బుద్ధి ఏ అనుభవమును పొందినను ఆత్మ ఆ యనుభవమును పొందిన చందముగా కనిపించును. ౮

నిద్రావస్థ చెందదగిన కర్మ సమకూరినపుడు జాగ్రత్ స్వప్న ములలో అలసి బుద్ధి జాగ్రదవస్థగాని దాని సంస్కారములు గాని లేక చైతన్యగ్రస్తమై రూపటి నట్లు అజ్ఞానముతో ఏకీభూతమగును. ఇది సుషుప్తి. అపుడు బుద్ధి మఱ్ఱి విత్తులో మఱ్ఱిచెట్టువలె స్ఫూర్తి చెందక ఉండును. ౯

## చతుర్థ ఖండము

ఇది యిటు లగుటజేసి ఆత్మ అవస్థాత్రయ వర్జితుడును, కామకర్మ వినిర్ముక్తుడును, నీటివలె స్వచ్ఛుడును తనలోనే తానున్నవాడును జ్ఞానైకస్వరూపుడును అనియే చెప్ప నొప్పగు చున్నది. ౧

ఆత్మకు వికారము లేదుగాన జాగ్రత్ స్వప్నసుషుప్తులు బుద్ధికి సంబంధించినవి. కావున సాధకుడు వీనిని వదల వలెను. ఆత్మ తురీయమని (నాలుగవదని) అరయవలెను. ఆత్మ నాలుగవదనగా అది ముద్దబంగారమువలె గట్టి మెరుకమే కాని దానిలో మరియొకటి లేదు. అది నాలుగవ దయినను అవస్థాత్రయముకంటె వేరు కాదు. ఈ అవస్థలు తనకు దాపుగా నున్నపుడు (ఏ యవస్థలో నేని ఆత్మ దాపుగనేయుండును. ఏలన అది సర్వగతము.) తన చైతన్య స్వరూపముతో సాక్షిగా నుంకుటయే నాలుగవ యవస్థ.

నాలుగవది వేరే యొక అవస్థ యగునేని ఆత్మ యిట్టిది యని తెలియబడుటకు వీలు లేదు గాన ఆ యవస్థ శూన్యమని అనవలసివచ్చును. అటు లనుట సహేతుకము కాదు. అధిష్ఠానము లేనిచో అధ్యాస యేడ? దుంగ యనునదొకటి యున్నఁ గదా దొంగయో దొరయో యని ఆరోపించుటకు! ౨-౬

ఆత్మ శుద్ధ మని అవస్థాత్రయ మెటులు తెలుపగలదు? ఇవి ఉండబట్టి స్వాత్మవిశుద్ధి తెలియ నగుచున్నది. ఇవి ఉండబట్టి యీ ఆత్మ విశుద్ధమని తెలియనగును. ఎటు లనగా జాగ్రదవస్థ యందును ఆత్మ కలదు. స్వప్నావస్థ యందును కలదు, నిద్రావస్థయందును కలదు. దీనివల్ల ఆత్మ సత్తని తెలియనగుచున్నది. ౭-౮

గాఢ నిద్రలో ఆత్మ లేదే అని అన్నచో లేకెచటికి బోయినది? లోకులు 'సుఖముగా నిద్రించితిని గాని నాకేమియు తెలియలేదు' అని తమ విషయముల (దృశ్య) అపరిజ్ఞానమునే తెలుపుదురు గాని జ్ఞానమే లేదని అనరు. దీనిబట్టి ఆత్మ నిద్రలోగూడ నున్నదని ఎటులు అనగలవు? 'నిద్రలో అనుభూత మయినది ఏదియు నాకు తెలియదు' అని లోకులందురు. తెలియకపోవుట తెలిసిగదా యిటులనుట! అపుడు తెలివి ఉన్నది. కాబట్టి ఆత్మ అవస్థాత్రయము నందును అంటి పెట్టుకొనియే యున్నది. ౯

కావున ఆత్మ ఉన్నదా లేదా ఉన్నయెడల ఏ ప్రమాణముచే సాధింపబడును అను చర్చయే లేదు. ఆత్మ ఉన్నదనుటకు ప్రమాణముతో పనిలేదు. ఏలనగా నిత్యముకాని

వస్తువులను వస్త్వంతరముచే పరిచ్ఛిన్నములయిన వస్తువులను, తెలిసికొనుటకు ఏదో ఒక ప్రమాణము ఉండవలయును. అట్టిది కాని ఆత్మకు ప్రమాణాపేక్ష యేల? ఆత్మ ప్రమాణాధీనుడై ప్రమాణముచే సాధింపబడవలసిన యెడల ఆ ప్రమాణ ముపయోగించి పరీక్షించువాడెవడు? ప్రమాణ ముపయోగించి పరీక్షించువాడే ఆత్మ అని నిశ్చితమగుచున్నది. ౧౦

కాని ఆత్మ కలదని అనుటకు వేదము ప్రమాణముకదా అని అనవచ్చును. వేదముచే గూడ ఆత్మ సాధింపబడదని మేము చెప్పెదము. ఆత్మయం దారోపితములయిన అనాత్మ ధర్మములను నిషేధించి దాన బ్రహ్మ మన్నను ఆత్మ యన్నను ఒకటియే యని తెలుపుటలో వేదము ప్రమాణము కావచ్చును. ఆత్మ స్వతస్సిద్ధము కావున అనగా స్వయం సాక్షి కావున వేదము ఫలరూపముగా గాక, తెలిసిన తత్ త్వం అను పదముల అర్థముతో తెలియని తత్ త్వం పదముల అర్థమొకటియే యని తెలుపుటలో ప్రమాణము. ౧౧

జాగ్రత్ సుషుప్తులలో నున్నవాడు తానే యని (నేనే యని) ప్రతివాడును గుర్తించుట వలన (ఆత్మ యీ మూడు చోటులను లేయక యుండుటవలనను తురీయమగుట వలనను) ఆత్మ స్థానత్రయాతీత మనియు నిత్యము, శుద్ధము, ముక్తము, అవికారము, చిత్ స్వభావము ఏకము అని నిరూపిత మయినది.

తెలిసినవాడు తన అనుభవము చేతనే తన్ను తాను తెలిసికొనెనని ఎఱుగును (ఏమో ఒక ప్రమాణముచే గాదు).

[శ్రుతి ననుసరించియు తర్కము ననుసరించియు లోగడ వివరింపబడిన ఆత్మ స్వభావ జ్ఞానమున కీ వాక్యమున జ్ఞాని అనుభవము అనుబద్ధమయినది.] ౧౩

ఆత్మ నెఱుగ గోరినవాడు గుర్వనుగ్రహమున జ్ఞానియై అజ్ఞానమను గాఢనిద్ర నుండి లేచి చావను పుట్టను చావను పుట్టనుగా చక్రమువలె తిరుగుచుండు సంసారము నుండి తొలగును. ౧౪

గురువుకడ ఆత్మజ్ఞానోపదేశము పొందవలయు విధి యిది. ఇటులు పొందనిదే కృతకృత్యుడు కాడు. ౧౫

ఉపనిషద్బోధలు ఇట్టివి.

ఆత్మజ్ఞానోపదేశవిధి

తాత్పర్యము — సమాప్తము

శ్రీశంకర భగవత్పాద విరచితమ్

# మా యా వి వ ర ణ మ్

## ప్రథమ వర్ణకము

బాలానా ముపకారాయ మమాపి జ్ఞానసిద్ధయే
తత్ర శ్రీ బాలగోపాలకృష్ణః సన్నిహితో భవేత్ ॥

ఇహఖలు ధర్మార్థకామమోక్షాణాం చతుర్విధపురుషార్థానాం మధ్యే మోక్ష ఏవ పరమపురుషార్థః; నిత్యత్వాత్, న చ పునరావర్తత ' ' ఇతి శ్రుతేః ఇతరేషాం త్రయాణాం న తథాత్వమ్; అనిత్యత్వాత్, ' త ద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమే వాముత్ర పుణ్యచితో లోకఃక్షీయతే ' ఇతి శ్రుతేః.

స మోక్షశ్చ బ్రహ్మజ్ఞానా దేవ సిధ్యతి; ' తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ ' ( ఇతి ) ' బ్రహ్మవిదాప్నోతి పరమ్ ' ఇత్యాది శ్రుతిభ్యః. తద్బ్రహ్మ (అధ్యారోపాపవాదపూర్వ మేవ సువిజ్ఞేయమ్) ' అధ్యారోపాపవాదాభ్యాం జ్ఞాతవ్యః తత్త్వనిర్ణయ (ఇతి) న కర్మణా న ప్రజయా న త్యాగేన ధనేన వా ' ఇతి శ్రుతేః తస్మా న్ముముక్షుణా అధ్యారోపాపవాదా వవశ్యం జ్ఞాతవ్యౌ.

అత్రాధ్యారోపో నామ శుక్తికాయామ్ రజతవత్, రజ్జౌ సర్పవత్, మరుమరీచికాయాం జలవత్, స్థాణౌ పురుషవచ్చ నిష్ప్రపంచాత్మవస్తుని ప్రపంచారోపః. అయ మధ్యారోపో వస్త్వజ్ఞానా దారోపః. త దజ్ఞానమేవ అవిద్యా తమః మోహః మూలప్రకృతిః ప్రధానం గుణసామ్య మవ్యక్తం మాయేతి చోచ్యతే. మూలప్రకృతి ర్నామ శుక్ల కృష్ణ రక్తతంతు సముదాయరూప రజ్జువ త్సత్వరజస్తమోగుణసముదాయ రూపా. అస్యాః ప్రలయో మహాసుషుప్తి రితి చ నామ. అస్యాం మూలప్రకృతా వనంతకోటి జీవాః స్వ స్వ కర్మ వాసనాభి స్సహ జతుపిండే స్వర్ణరేణవ ఇవ సృష్టేః పూర్వం లీనా వర్తంతే. అయ మనుభవః సకల జనానాం సుషుప్తా వస్తి.

సా మూలప్రకృతిః సృష్టికాలే పరిపక్వ జీవకర్మవశా న్మాయా అవిద్యా తామసీతి త్రిధా జాతా. తత్ర మాయా శుద్ధ సత్వప్రధానా. తత్ర ప్రతిబింబితం స త్సృష్టేః పూర్వం విద్య మానం బ్రహ్మచైతన్య మీశ్వర ఇత్యుచ్యతే. అస్యావ్యాకృ తోఽంతర్యా మీతి చ నామ. స ఏవ జగత్స్రష్టా. స ఏవ పరి పూర్ణబ్రహ్మచైతన్యరూపేణ తామ స్యవచ్ఛిన్న ఏవ సన్ జగ దుపాదాన కారణ మపి భవతి, ఊర్ణనాభివత్. స ఉపాధి ప్రాధాన్యే నోపాదానకారణం స్వప్రాధాన్యేన నిమిత్తమ్.

అయ మీశ్వరః కేన ప్రకారేణ జగత్సృష్టవా నితి చేత్, ఉచ్యతే —పూర్వోక్తాఽవిద్యా రజఃప్రధానా బహుప్రకారా అనంతా. తదవిద్యాప్రతిబింబిత చైతన్యరూపా జీవా అప్యనంతాః అనయో ర్జీవేశ్వరయో ర్వ్యష్టిరూపాఽవిద్యా సమష్టిరూపా మూలప్రకృతిశ్చ క్రమేణ కారణశరీరే. తయోః కారణశరీరయో ర్జీవ స్యేశ్వరస్య చావస్థానం సుషుప్త్యవస్థా. తయోః స్వ స్వ కారణ శరీరమేవ ఆనందమయకోశఏవ కారణ ప్రపంచసృష్టిః.

అథ సూక్ష్మప్రపంచసృష్టి రుచ్యతే-ఈశ్వర స్యేక్షణవశాత్తమోగుణరూపా ప్రకృతిః ఆవరణశక్తి ర్విక్షేపశక్తి రితి చ ద్వీధా జాతా. తత్ర విక్షేపశక్తిరేవ సూక్ష్మ ఆకాశోఽభూత్. ఆకాశా ద్వాయుః. వాయో రగ్నిః. అగ్నే రాపః. అద్భ్యః పృథివీ. ఏషాం పంచభూతానాం సూక్ష్మభూతాన్యపంచీ కృతాని తన్మాత్రాణి చేతి నామ. ఏషామపి సత్వరజస్తమోగుణాః కారణా దజ్ఞానా దాగతాః సంతి.

ఏతేషా మాకాశాదీనాం పృథక్ పృథక్ సత్త్వగుణాంశాచ్ఛ్రోత్రం, త్వక్, చక్షు ర్జిహ్వా, ఘ్రాణ మితి పంచ జ్ఞానేంద్రియాణి క్రమేణ జాతాని. ఆకాశాది సత్వసమష్ట్యాంతఃకరణం జాతం. మనోబుద్ధిచిత్తాహంకారభేదేన త చ్చతుర్విధం. తత్ర బుద్ధా వహంకారస్య మనసి చిత్తస్య చాంతర్భావః. ఏవ

మాకాశాది రజోగుణాంశా ద్వాక్ పాణి పాద పాయూపస్థా ఇతి పంచ కర్మేంద్రియాణి జాతాని. ఆకాశాది రజోగుణ సమష్ట్యా ప్రాణో జాతః. ప్రాణాపాన వ్యానోదానసమాన భేదేన స పంచవిధః.

ఏతత్ జ్ఞానేంద్రియ పంచకం కర్మేంద్రియపంచకం మనోబుద్ధి శ్చైకీభూయ సూక్ష్మశరీరం లింగాఖ్య ముచ్యతే (ఉత్పద్యతే). ఇదమేవభోగసాధనం. అస్మిన్ సూక్ష్మశరీర జీవేశ్వరయో రవస్థితిః స్వప్నావస్థా. అస్మిన్ జ్ఞానమయ కోశ మనోమయకోశ ప్రాణమయకోశాః సంతి. ఏవం సూక్ష్మసృష్టిప్రకారః (సూక్ష్మశరీరం లింగాఖ్యముచ్యతే).

అథ స్థూలసృష్టి రుచ్యతే—తమోగుణప్రధానాని పంచ భూతాని అపంచీకృతాని ఆకాశాదీని పంచాపి భూతాని ప్రత్యేకం ద్విధా విభజ్యైకైకమర్థం చతుర్ధా విభజ్య స్వార్థభాగం విహా యేతరార్ధభాగేషు సంయోజనం పంచీ కరణం. ఏవంకృతే పంచాపి పంచీకృతాని భవంతి. ఏభ్యః పంచీకృతేభ్యో బ్రహ్మాండం, తదంత శ్చతుర్దశభువనాని, తేషు చోద్భిజ్జ స్వేదజాండజ జరాయుజ (భేదాత్) చతు ర్విధ స్థూలశరీరాణి అన్నాది భోగ్యవస్తూని చ జాతాని. ఏతస్మిన్ స్థూలశరీరే జీవేశ్వరయో రవస్థానం జాగ్రదవస్థా

ఇదం స్థూల మేవా న్నమయకోశః. ఏవం స్థూలసృష్టి ప్రకారః

ఇదం కారణ సూక్ష్మ స్థూల శరీరత్రితయంచ ప్రత్యేకం వ్యష్టిసమష్టిభేదేన ద్వివిధం. (యథా) వనం గ్రామ ఇత్యాదిః సమష్టిః. వృక్షో గృహ మిత్యాది ర్వ్యష్టిః. ఏవం సర్వ శరీరం సమష్టిః. ఏకశరీరం వ్యష్టిః. తత్ర సమష్ట్యుపాధిక ఈశ్వరః. వ్యష్ట్యుపాధికో జీవః.

తత్రాపి కారణసమ ష్ట్యేశ్వరః.
కారణవ్యష్ట్యా ప్రాజ్ఞః.
సూక్ష్మ సమష్ట్యా హిరణ్యాగర్భః.
సూక్ష్మవ్యష్ట్యా తైజసః.
స్థూలసమష్ట్యా వైశ్వానరః.
స్థూలవ్యష్ట్యా విశ్వః.

ఇతి జీవేశ్వరయో రవాంతరభేదః

అయ మేవేశ్వరః సత్వరజ స్తమోగుణై రుపాధిభి ర్బ్రహ్మ విష్ణు రుద్రరూపేణ సృష్టి స్థితి సంహారాన్ కరోతి. బ్రహ్మణో విరాడ్ రూపేఽన్తర్భావః. విష్ణో ర్హిరణ్యాగర్భే చాఽన్తర్భావః. రుద్ర స్యేశ్వరేఽన్తర్భావః. ఏవం ప్రపంచో త్పత్తిః. అయమే వాధ్యారోపః. ఇదం విక్షేపశక్తికార్యమ్.

అథావరణశక్తికార్య ముచ్యతే — ఈశ్వర మాత్మజ్ఞానినం చ విహా యాన్యేషాం సర్వేషాం జీవానాం పంచకోశానా మాత్మన శ్చాభేద మావరణశక్తి రంధకారరూపావృణోతి. ఆవరణం చ ద్వివిధమ్. అసత్త్వావరణ మభానావరణం చేతి. వస్తు నాస్తీతి వ్యవహారకారణ మసత్త్వావరణం. వస్తు నభాతీతి వ్యవహారకారణ మభానావరణం. ఆవరణశక్తికార్య మేవ సంసారవృక్షస్య మూలం, న విక్షేపశక్తికార్యం. ఏత న్మోక్షసిద్ధే రపిహేతుః.

ద్వివిధ మప్యావరణం తత్త్వజ్ఞానేన వినాశ్యమ్. తత్త్వజ్ఞానం చ పరోక్షజ్ఞాన మపరోక్షజ్ఞాన మితి ద్వివిధమ్. అత్ర గురుముఖా ద్వేదాన్త(జ్ఞాన) (శ్రవణ) జన్యం పరోక్షజ్ఞానమ్. ఇదమేవ శ్రవణమ్. అనేన వస్తు నాస్తీ త్యేవం రూపమసత్త్వావరణంనశ్యతి. తదా వస్త్వస్తీతి వ్యవహ్రియతే.

శ్రవణేన సంశయం మననేనాసంభవానాం నిదిధ్యాసనేన విపరీతభావానాం (చ) నివర్తయిత్వా దేహాత్మజ్ఞానాద్బ్రహ్మాత్మజ్ఞానం (చ) జాయమాన మపరోక్షజ్ఞానమ్. అనేన వస్తు న భాతీతి వ్యవహారహేతు రభానావరణం వినశ్యతి. ఏవం పరోక్షజ్ఞానేనాపరోక్ష జ్ఞానేన చ బ్రహ్మ నాస్తి, న భాతీతి వ్యవహారహేతు రావరణద్వయ మపి వినశ్యతి.

తదాఽనర్థనివృత్తి రానన్దావాప్తి శ్చ భవతః ఇతి సప్తావస్థాః సిద్ధ్యన్తి. ఏవ మాకాశవ న్నిర్మలచైతన్యవస్తుని మిథ్యాభూత ప్రపంచకల్పన మధ్యారోపః.

అథాపవాద ఉచ్యతే—కారణవ్యతిరేకేణ కార్యం నాస్తీతి బోధేన శుక్తికాయాం రజతవత్ రజ్జౌ సర్పవత్ బ్రహ్మణి ప్రపంచో నాస్తీతి నిషేధోఽపవాదః. యా మా సా మాయా, యా న విద్యతే సా విద్యా, ఇతి వ్యుత్పత్త్యా మాయాయాః కల్పితత్వం సిద్ధమ్. ఏవం యో బ్రహ్మవ్యతిరేకేణ కిమపి నాస్తి తద్బ్రహ్మాహ మేవేతి విచార్య జానాతి స ఏవ జీవన్ముక్త ఇతి వేదాన్తసిద్ధాన్తః.

స్థూల సూక్ష్మాది దేహానా మాత్మ న్యారోప ఏవ చ,
అపవాద స్తతోప్యేషాం సమ్యగత్ర ప్రదర్శితః.

ఇతి మాయావివరణే ప్రథమ వర్ణకం

సమాప్తమ్.

# అథ ద్వితీయ వర్ణకమ్

సర్వ వేదాంతశా_స్త్రేషు హ్యానుబంధ (ధి) చతుష్టయమ్,
యథా పూర్వో_క్త మత్రాపి తథైవ సముదీర్యతే.

అథ ద్వితీయవర్ణకేఽనుబంధిచతుష్టయ ముచ్యతే. విషయః ప్రయోజనం సంబంధః అధికారీచే త్యనుబంధి చతుష్టయమ్. అస్య వేదా_న్తశాస్త్రస్య బ్రహ్మైవ విషయః. మోక్ష ఏవ ప్రయోజనమ్. ప్రతిపాద్యప్రతిపాదకభావో బోధ్యబోధకభావో వా సంబంధః. సాధనచతుష్టయ సంపన్న ఏ వాధికారీ. యథా బృహస్పతిసవే బ్రాహ్మణఏవ, రాజసూయే క్షత్రియః, స్తోమే వైశ్యః తథా వేదా_న్తశా_స్త్రే సాధనచతుష్టయసంపన్న ఏవాధికారీ ।

సాధనచతుష్టయం నామ నిత్యానిత్యవస్తు వివేకః, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగః, శమాది షట్క_సంప_త్తిః, ముముక్షత్వం చేతి. బ్రహ్మైవ నిత్యం జగదనిత్య మితి శ్రుతి స్మృతి పురాణాదినా స్వయమేవ జాయమానం జ్ఞానం నిత్యానిత్యవస్తు వివేకః, ఇహ స్రక్చందన వనితాది విషయ (యో) భోగః పరత్ర స్వర్గాదిషు రంభాది స్త్రీవిషయే భోగ శ్చోభయమప్యనిత్యమితి శ్వవాంతాశనమలమూత్రపురీషాది వ_త్తత్ర వైరస్య మిహాముత్రార్థ ఫలభోగవిరాగః.

శమదమోపరతి తితిక్షాః శ్రద్ధాసమాధానా ఇతి శమాది షట్కమ్. శమో నామ—శ్రవణాది వ్యతిరిక్తేభ్యో నివృత్త్యాత్మ న్యేవ శ్రవణాదివిషయే మనసః స్థాపనమ్. దమో నామ—జ్ఞాన కర్మేంద్రియ నిగ్రహః. ఉపరతి ర్నామ—సర్వ ప్రపంచోపరమః సంన్యాసః, నిష్కామకర్మానుష్ఠానమ్, వ్యవహారలోపోవా. తితిక్షా నామ—ప్రారబ్ధాబ్దగత శీతోష్ణాది సహనమ్. శ్రద్ధా నామ—గురువేదాన్త వాక్యేషు విశ్వాసః. సమాధానం నామ—శ్రవణాద్యనుకూల విషయే మనః సమాధిః। ముముక్షత్వం నామ—తత్ర స్వగృహే దహ్యామానే తత్రస్థ దహ్యామాన పురుషో యథా కళత్ర పుత్రాదికం (త్యక్త్వా) స్వ తాపోపశమనార్థ మేవ బహిర్నిర్గత్య తాపోపశమనం కర్తు మిచ్ఛతి, ఏవం సాంసారిక తాపోపశమనం సంపాదయితుం త్యక్త సర్వేషణస్య బ్రహ్మ తాదాత్మ్యభావే తీవ్రేచ్ఛా (ముముక్షా) లోకే కేషాంచి న్నిత్యానిత్యవస్తువివేకే సత్యపి వైరాగ్య స్యాదర్శనా దిహా ముత్రార్థ ఫలభోగే విరాగేణాపి భవితవ్య మిత్యుక్తమ్. త దుభయే సత్యపి కేషాంచి దృషీశ్వరాణాం కోపతాపాది దర్శనా చ్ఛమాదినాపి భవితవ్య మిత్యుక్తమ్. ఏత త్త్రితయే సత్యపి కేషాం చి ద్భక్తేశ్వరోపాసకానాం జ్ఞానాధికారాదర్శనా న్ముముక్షయా పి భవితవ్యమ్ (ఇతి).

ఏవం రూపోఽధికారీ ఉపా(ప)హారసమిత్పాణిః సద్గురు ముపగమ్య నమస్కృత్య విశ్వాసవినయాభ్యాం సహ హే స్వామిన్, హే భగవ న్నితి సంబోధ్య జీవః కః ఈశ్వరః క ఇతి, జగ త్కీదృశమ్ ? ఏత త్త్రయం కస్మా దాగతం కస్మా ద్గమిష్య తీతి ప్రశ్నం కుర్యాత్; పరీక్ష్య లోకా న్కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన. త ద్విజ్ఞానార్థం స 'గురు మేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' ఇత్యాది శ్రుతేః, 'త ద్విద్ధి ప్రణి పాతేన పరిప్రశ్నేన సేవయే' తి గీతావచనాచ్చ.

ఏవం విశేషేణ ప్రార్థితో గురు ర్దయయా సత్త్వరజ స్తమో గుణై ర్జీవేశ్వరజగతా మాగమనప్రకారం బోధ యిత్వా ఆత్మస్వరూప మపి కరతలామలక వద్బోధయతి. అస్యాధికారిణః సాధనచతుష్టయంచ బహుజన్మార్జిత పుణ్య పుంజ పరిపాకవశా దీశ్వరానుగ్రహేణ లభ్య మితి వేదిత వ్యమ్. ఏత త్తత్త్వజ్ఞానప్రదాయకం గురు మీశ్వరమేవ విద్యాత్. ఏవం యో గురుముఖాత్ జీవాత్మపరమాత్మాభేదం విచార్య జానాతి స ఏవ ముక్తిం గమిష్య తీతి సిద్ధమ్.

ఇతి మాయా వివరణే ద్వితీయ వర్ణకం సమాప్తమ్.

# అథ తృతీయ వర్ణకమ్

చేతనాచేతనే యే వై శ్రుతౌ సమ్యక్ సమర్థ్య (ర్థి) తే,
ఉచ్యేతే శృణుతాం తే ద్వే తృతీయే వర్ణకేఽధునా.

అయం ప్రపంచః కతివిధ ఇతి చేత్, ఆత్మేత్యనాత్మేతి చ ద్విప్రకారః. ప్రపంచాతీత స్యాత్మనః కథం ప్రపంచాంత ర్భూతత్వ మితి న శంకనీయమ్. కథ మితి చేత్—అస్య ప్రపంచస్య చేతనాచేతనాత్మకత్వా దాత్మన శ్చేతనారూపత్వా దాత్మానం వినా ప్రపంచస్యాభావా దాత్మనః ప్రపంచాంత ర్భావో వక్తవ్య ఏవ. తర్హి చేతనం కి మచేతనం కి మితి చేత్ —జంగమం సర్వం చేతనమ్. స్థావరం సర్వ మచేత నమ్. తర్హి చేతనానా మచేతనానాం చ ప్రత్యేకం బహు ప్రకారత్వా త్కథం ద్విప్రకార ఏవ ప్రపంచ ఇతి చే చ్ఛృణు —ఆత్మైక (రూప) ఏవ సహ కార్యరూపే ణానేకరూపో ఽభూత్. ఆత్మా చైకరూప ఏవ. స చానాత్మ కార్యోపాధిభి రనేకజీవా ఇత్యనేకేశ్వరా ఇతి చ భాతి.

ఏక స్యేశ్వరస్య జీవవ త్కథ మనేకత్వ మితి చేత్— పుణ్యక్షేత్రేషు గ్రామేషు గృహేషు చ శివవిష్ణ్వాదిమూర్తి భేదేన స్థితత్వా దితి బ్రూమః. మృచ్ఛిలాది రూపాణాం తాసాం మూర్తీనాం కథ మీశ్వరత్వ మితి చేత్—ఉచ్యతే.

సర్వై రపి తాసు మూర్తిషు బహుద్రవ్యవ్యయం కృత్వాఽ భిషేక నైవేద్యాదేః క్రియమాణత్వాత్. యేషాం శాస్త్ర విశ్వాసో నాస్తి, తే మ్లేచ్ఛాదయో మూర్తీనాం పూజనే నోదాహరణీయాః. సర్వత్ర శ్రద్ధావతా మే వోదాహర ణీయత్వాత్.

కించ హేయే మలమూత్రాత్మకేఽస్మిన్ శరీరే ఆత్మ బుద్ధిం కుర్వతాం జీవానా మత్యంత శుద్ధాసు మూర్తిషు ఈశ్వరబుద్ధి కరణే కోదోషః? ఏవ మేకస్యా(నా)త్మనః కార్యరూపేణానేకత్వే ఏకస్యాత్మనో ఽ నాత్మకార్యోపాధిభి రనేకత్వే చ దృష్టాంతః క ఇతి చేత్ శృణు. యథా ఏకైవ పృథివీ కార్యరూపేణ పరిణతా సతి సర్వతో వృక్షగోపురం కుడ్యం కుసూలం గృహం మఠః పటః శరావ ఇతి భేదం గచ్ఛతి, యథా (చ) ఆకాశ ఏక ఏవ పృథివ్యాది కార్యో పాధిషు ప్రవిష్టఇవ ప్రతీయమానోఽయం ఘటాకాశోఽ యం మఠాకాశ ఇత్యాది రూపేణ అనేకధా భాతి, తథామూల ప్రకృతి రనాత్మా ఏకఏవ కార్యశరీ(రాది)రూపే ణానేకో జాతః. తథాత్మా స్వయమేకోఽపి తత్తచ్ఛరీరోపాధిభిస్తత్ర తత్ర పవిష్ట ఇవ స= దేవో మనుష్యో రామః కృష్ణో బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రః పశు పక్షి కృమికీటా ఇతి బహుధాభాతి. అయమవచ్ఛిన్నపక్షే దృష్టాంతః.

ప్రతిబింబ పక్షేతు—సముద్రో నదీ తటాకః కూపో ఘటజల మిత్యేక మేవ జలం యథా బహుధా జాతం తథాఽ(నా) త్మాపి బహుధా జాతః. తేషు సముద్రాదిషు (యథా) ఆదిత్య ఏక ఏవ ప్రతిబింబితః సన్ బహుధా జాతః తథా ఏక ఏవాత్మాంతఃకరణ సహితేషు సర్వేష్వపి ప్రతి బింబితః సన్ అనేకో జాత ఇత్యుభయత్రాపి దృష్టాంతో జ్ఞాతవ్యః. యథా (చ) జలధర్మాః శీతలచలనాదయః ఆదిత్యం బింబం నస్పృశంతి తథా అంతఃకరణధర్మాః కర్తృత్వ భోక్తృత్వాదయోఽపి తత్తదంతఃకరణవిశిష్ట చిదాభాసా (స) ఏవ భాంతి, బింబభూత మాత్మానం నస్పృశంతి. తస్మాత్ జీవాత్మైవ పరమాత్మా. పరమాత్మైవ చ జీవాత్మా. కథ మితి చేత్—యథా మహాకాశ ఏవ ఘటాకాశ ఏవ మితి జానీహి.

నను జీవాత్మనః కల్పితత్వాత్ కల్పితస్య చాసత్యత్వాత్ కథం తస్య సత్య పరమాత్మాభేద ఇతిచేత్—పారమార్థికో వ్యావహారికః ప్రాతిభాసిక శ్చేతి జీవస్త్రివిధః. ఏతే జీవాః సుషుప్తి జాగ్రత్స్వప్నాభిమానినః. యథా జలే తరంగః కల్పితః, తరంగే చ ఫేనః కల్పితః తథా పారమార్థికే వ్యావహారికః, వ్యావహారికే ప్రాతిభాసికశ్చ కల్పితః. యథా మాధుర్యద్రవశైత్యాని పరమార్థతః జలనిష్ఠాన్యేవ సంతి

తరంగే భాంతి, తద్వారా ఫేనేఽపి భాంతి, తద్వత్ సచ్చిదానందాః కూటస్థ పారమార్థికనిష్ఠాః సంతో వ్యావహారికే భాంతి (ద్వారాచప్రాతిభాసికే). యథా ఫేన స్తరంగం వినా నాస్తి, తరంగో ఽపి జలంవినానాస్తి, జలంతు పరమార్థభూత మేవ భాతి, ఏవం ప్రాతిభాసికో వ్యావహారికం వినా నాస్తి; వ్యావహారికోఽపి పారమార్థికం వినా నాస్తి. తస్మాద్యథా పరమార్థతో ఘటాకాశో మహాకాశ ఏవ ఏవం పారమార్థికః కూటస్థ పరమాత్మై వేతి సిద్ధాంతః.

స ఏవ "నేతి నేతి" ఇతి వాక్యేన దేహాది పంచకోశేభ్యః పారమార్థికకూటస్థం పృథక్కృత్య తం పారమార్థికం కూటస్థ మహ మితి జాన న్నహం బ్రహ్మాస్మీతి శ్రుతివిచారేణ యుక్తిభిః దృఢనిశ్చయేన చ సాక్షాత్కృత్య తిష్ఠతి. స ఏవ పరిపూర్ణః బ్రహ్మస్వరూపః. త మేవ పుణ్యపాప కర్మాణి నస్పృశంతీతి సర్వా అపి ఉపనిషదః ఏకతాత్పర్యేణ ఘుష్యంతి.

ఆత్మానాత్మ వివేకేన పుంసః సంసారనిష్కృతిః,
తద్వినా జన్మకోట్యాపి బంధచ్ఛేదో న సిధ్యతి.

ఇతి మాయావివరణే తృతీయవర్ణకం
సమాప్తమ్

# అథ చతుర్థ వర్ణకమ్

జనా యద్దుఃఖ మంత్యే(ంతే) తత్కింస్వరూప ముతాస్య తత్, సమ్య గాగంతుకం వేతి మయా బుద్ధ్యా విచార్యతే.

ఇదానీ మస్య జీవస్య య ద్దుఃఖం చ జన్మ చ కర్మ చ రాగద్వేషాది చాభిమాన శ్చావివేక శ్చాజ్ఞానం చేతి ఏతేషు పూర్వం పూర్వం ప్రత్యుత్తరోత్తరం హేతుః. తత్రదుఃఖాది చతుష్టయం చతుర్థే వర్ణకే విచార్యతే.

జీవాత్మనో దుఃఖం స్వాభావికం వా ఆగంతుకం వేతి చే దాగంతుక మితి జ్ఞేయమ్. స్వాభావికం చే దనేకదోషాః సంతి. తత్కథ మితిచేత్—అస్య జీవస్య దుఃఖం స్వాభావికం చే ద్దుఃఖనివృత్తిః కదాపి న స్యాత్. సుఖ మపి కస్యాపి న స్యాత్. దుఃఖనివృత్త్యై సుఖప్రాప్త్యై చ కర్మ మాస్తు. సత్కర్మ యోగ ధ్యానోపాసనేషు కస్యాపి ప్రయత్నో మాస్తు. వేద శాస్త్ర పురాణాని చ వ్యర్థా నీతి జానీహి. (తర్హి) దుఃఖం స్వాభావిక మస్తు, తన్నివృత్త్యై ప్రయత్నం కరో త్వితి చే త్కదాచి దపి ఏత న్న సంభవతి. స్వాభావికస్య స్వరూపత్వాత్. స్వస్వరూపనాశార్థం కో వా ప్రయత్నం కుర్యాత్ ? — స్వరూపనాశే సతి కః పురుషార్థ భాక్ స్యాత్ ? స్వాభావిక మేవ స్వరూపం కథ మితి

చేత్—గుడస్య మధురగుణః స్వభావః. తస్య మధుర గుణస్య నాశే భవితవ్యే గుడస్యైవ నాశో భవేత్. తథా జీవాత్మనో దుఃఖం స్వాభావికం చే ద్దుఃఖనాశే భవితవ్యే ఆత్మ స్వరూపనాశ ఏవ స్యాత్. (నశ్య త్వాత్మా పీతి చేద్) ఆత్మనో నాశో నాస్తి. అవినాశీతి నిత్య ఇతి చ 'అవినాశీ వాఽరే ఽయ మాత్మా', 'ఆకాశ వ త్సర్వగత శ్చ నిత్యః', 'న జాయతే మ్రియతే వా విపశ్చి న్నాయం కుతశ్చి న్న బభూవ కశ్చిత్. అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే' ఇత్యాది శ్రుతయో వదంతి. తస్మా దాత్మనో దుఃఖం స్వాభావికం న భవతి. ఆగంతుక మేవ.

స్వాభావికం నశ్యతు స్వరూపం తిష్ఠతు ఇతి చేత్— న సంభవతి. న హ్యగ్నేః స్వాభావిక ముష్ణత్వం మణి మంత్రాదిభి ర్గచ్ఛతి స్వరూపనాశస్తు నాస్తి, అన్య చ్చైత్య మప్యాగచ్ఛతి, తథాత్మనో ఽపి దుఃఖం స్వాభావికం భవతు. త దుత్కృష్ట కర్మోపాసనా యోగబలేన గచ్ఛతు. సుఖం చాగచ్ఛ త్వితి వదసి చేత్ సా నివృత్తిస్తాత్కా లిక్యేవ, నాత్యంతకీ. కథ మితి చేత్. కర్మజన్యం సకల మపి తన్నాశే నశ్యతి. త్వదుక్త దృష్టాంత దార్ష్టాంతికయో

రగ్న్యాత్మనో రుష్ణత్వం దుఃఖవత్వం చ మణిమంత్రాదిభి రుత్కృష్ట కర్మోపాసనయో ర్గైశ్చ గతమపి తత్కార్మక్షయే శైత్యం చ సుఖం చ గచ్ఛేత్. పునః స్వాభావిక ముష్ణత్వం దుఃఖవత్త్వం చాగచ్ఛేత్. ఏవంసతి సర్వజీవానాం తాత్కాలిక ముక్తిం వినా పునర్జన్మరహితా ముక్తి ర్నస్యాత్. కించ మోక్షస్య జన్యత్వేఽనిత్యత్వమపి స్యాత్.'న స పునరావర్తత' ఇతి ముక్తే ర్నిత్యత్వ ప్రతిపాదకశ్రుతేః, 'అఖండమానంద మరూప మద్భుతమ్' ఇతి శ్రుతేశ్చ విరోధఃస్యాత్. (కించ) ఆత్మనో దుఃఖస్వభావత్వే సుషుప్త్యవస్థాయామ్ తూష్ణీం భావే యోగినాం సమాధౌ చ దుఃఖమేవ ప్రతీయాత్. తథా న దృశ్యతే. కింతు త్రయాణా ముప్యుత్థానానంతరం "ఏతా వత్పర్యంత మహం సుఖమేవాసమ్" ఇతి సుఖ మేవ స్మర్యతే. తస్మా దాత్మనః సుఖమేవ స్వాభావికమ్. దుఃఖ మాగంతుక మితి జానీహి. సుఖస్వరూపస్యా ప్యాత్మనో దుఃఖం శరీరపరిగ్రహేణాగతమ్; యత్ర యత్ర శరీరపరి గ్రహ స్తత్ర తత్ర దుఃఖ మితి వ్యాప్తేః.

నను లోకే రాజాదీనామపి శరీర పరిగ్రహేణ దుఃఖమస్తి వేతిచేత్——అస్త్యేవ; తేషా మపి శత్రువర్ధనేన రాజ్యభారేణ ధనధాన్యక్షయేణ స్త్రీపుత్రాదిమరణేన జరాదినా స్వమరణేన చ దుఃఖదర్శనాత్. లోకే కేచిత్సుఖేన వర్తన్త ఇతి వ్యవ

హారో వృథా మోహఏవ. మోహేనాపి (యతో) దుఃఖస్య సుఖత్వ వ్యవహారః: కథమితిచేత్—భారవాహకో బహు యోజనదూరం కార్యార్థంత్వరయా ధావన్, సంతతమపి కృష్యాది కర్మకరణ శీలశ్చైవ మాదయః సర్వేపి స్వస్వ కర్మణో దుఃఖస్వరూపత్వేఽపి మోహేన తత్తత్కర్మసుఖం మత్వా సంతుష్టా గానం కుర్వంతః సంత ఉత్సాహవంతశ్చ వర్తంతే. తస్మాన్మోహేన దుఃఖమేవ సుఖంభాతీతి జ్ఞాతవ్యమ్.

తర్హి వివేకినా మపి శరీరపరిగ్రహాదుఃఖమస్తి వేతిచేత్—తేషామపి క్షుత్పిపాసాదినా, శీతోష్ణాదినా, వ్యాధినా, సర్ప వృశ్చిక వ్యాఘ్రాదినా (చ) దుఃఖమస్త్యేవ. తర్హి వివేక్యవివేకినోః కో విశేష ఇతిచేత్—తయో ర్బాహ్య వ్యాపారేణ విశేషాభావేపి అంతర్వ్యాపారేణ విశేషోఽస్తి. యో వివేకీ సమహాత్మా "సకలమపి దుఃఖ మంతఃకరణస్యైవ, నాత్మనః సచ్చిదానందస్వరూపస్య ఆత్మనః అనృతజడదుఃఖస్వరూపాంతః కరణధర్మై రణుమాత్ర మపిసంబంధో నాస్తి" ఇతి శ్రుతియుక్త్యనుభవై ర్విచార్య జ్ఞాత్వా తిష్ఠతి. తథాహి 'అసంగోహ్యయం పురుష' ఇతి శ్రుతేః(తిః). నిరవయవత్వ సత్యత్వాదికా యుక్తయః. సుషుప్తి మూర్ఛాసమాధిషు అనుభవో వేదితవ్యః.

యోఽవివేకీ స దురాత్మా తు ఆత్మస్వరూప మవిచార్య దేహాదికమేవ ఆత్మానం మత్వా అనాత్మధర్మానాత్మని, ఆ (త్మ ధర్మాంశ్చానాత్మన్యా) రోప్యైవ మన్యోన్యాధ్యాసంకుర్వ న్నహం దేవోఽహం మనుష్యోఽహ మాంధ్రోఽహం ద్రావి డోఽహంకర్ణాటకోఽహంమహారాష్ట్రోఽహంగూర్జరోఽహం బ్రాహ్మణోఽహం క్షత్రియోఽహం వైశ్యోఽహం శూద్రోఽ హం బ్రహ్మచార్యహం గృహస్థోఽహం వానప్రస్థోఽహం సంన్యాస్యహం శ్రీవత్సగోత్రోఽహం భారద్వాజగోత్రోఽహం వాసిష్ఠగోత్రోఽహ మిత్యాది ప్రకారేణ జాతి(దేశ)వర్ణాశ్రమా (ద్య)భిమానీ తిష్ఠతి. ఏవం వివేక్య వివేకినోర్బహుభేదోఽస్తి.

విచార్యమాణే తయో ర్బాహ్యవ్యవహారేణాపి న సామ్యమ్. కథమితిచేత్—వివేకీ ప్రపంచం సర్వం మిథ్యేతి నిశ్చిత్య ప్రారబ్ధభోగమపి స్వప్నభోగతుల్యమేవ పశ్యతి. అవివేకీ తు ప్రపంచః సత్యః, ఆత్మనః సుఖదుఃఖానుభవోఽపి సత్య ఏవేతి పశ్యతి. ఏవం వివేకినామపి శరీరపరిగ్రహాద్దుఃఖ మస్త్యేవ.

దేవానామపి 'వజ్రహస్తః పురందర' ఇత్యాదినా వేదేషు శరీరపరిగ్రహస్య దర్శనాద్దుఃఖ మస్త్యేవ. కథ మితిచేత్- అన్యోన్యం యుధ్య(ద్ధ)తః కోపశాపాభ్యా మసురరాక్షసోప

ద్రవాత్పుణ్యకర్మఫలనాశే సతి భావ్యధఃపతనభయాదపి దుఃఖ మస్త్యేవ.

(నన్వేవం) కథం దుఃఖినామపి తేషా మితరై రుపాస్యత్వమ్. కథం (చ) తత్సుఖదాతృత్వ మితిచేత్ - అస్మిన్ లోకే రాజప్రభృతీనాం దుఃఖినామపి (స్వాశ్రితోపాస్యత్వ) స్వాశ్రిత పరిపాలనాదికం యథా తథేతి జ్ఞేయమ్. 'దేవలోకే దేవా ఆనందరూపా స్తిష్ఠంతి' ఇతి శ్రుతేః దేవా దుఃఖం సర్వ మప్యంతఃకరణధర్మం మత్వా ఆత్మాన మానందరూపం సదానుభవంతఏవ తిష్ఠంతీతి తాత్పర్యమ్. తేషామపి దుఃఖ మస్తీతి వదంత్యాః 'తా ఏతాదేవతాః సృష్టా అస్మిన్మహత్యర్ణవే ప్రాపతన్' ఇతి శ్రుతేశ్చ దేవానామపి శరీరపరిగ్రహాద్దుఃఖమస్త్యేవేతి తాత్పర్యమ్. తస్మాదేవేహ ముక్త్యర్థమేవ ప్రయత్నః కర్తవ్యః.

నన్వశరీరముక్తేరేవ ముక్తిత్వం చే న్న. (స) శరీరా ఆకాశే నక్షత్రరూపేణ పరిదృశ్యమానాః కేచన దేవా ముక్తా ఇతి మనుష్యైః కథ్యంతే ఇతిచే చ్ఛృణు. సాలోక్యం సారూప్యం సామీప్యం సాయుజ్యం చేతి చతుర్విధా ముక్తిః. చర్యా క్రియా యోగో జ్ఞానమితి చత్వారి సాధనాని. భగవత్కైంకర్యరూప దాసభావశ్చర్యా. శివవిష్ణుపూజావిధిః

క్రియా. యమనియమాద్యష్టాంగో యోగః. జీవపరయో రైక్యసాక్షాత్కారో జ్ఞానమ్.

తత్రాద్యా స్తిస్రో ముక్తయో ముఖ్యా న భవంతి. పునరావృత్తి సద్భావాత్. సాయుజ్యమేవ ముఖ్యా ముక్తిః, పునరావృత్తి వర్జనాత్. యోగేన సాయుజ్యమితి శాస్త్రం నిర్గుణబ్రహ్మ జీవయో రైక్యయోగవిషయమ్. (స) శరీరముక్తానా మివాశరీరముక్తానాం కదాపి కుత్రచిదపి కేనాపి కథంచిదపి దర్శనాభావాచ్ఛూన్య మేవాశరీర 'ముక్తి రితి న మంతవ్యమ్.

అశరీరముక్తానాం శరీరస్యైవ శూన్యత్వం న స్వరూపసుఖస్య. స్వరూపసుఖంతు సుషుప్తి సుఖవ దశరీరత్వాత్స్వసంవేద్యమేవ నాన్య సంవేద్యమ్. సుషుప్తి ర్ముక్తిసధానాచేత్ సాపి ముక్తిః స్యాదితి న వాచ్యమ్. సుఖానుభవమాత్రేణ సామ్యేఽపి సుషుప్తావజ్ఞానం పునరుత్థానం చాస్తి. ముక్తౌ(తు) తదుభయమపి నాస్తి. తతః సుషుప్తే ర్ముక్తిత్వం న సంభవతి. అతఏవ ప్రలయస్యాపి న ముక్తిత్వమ్. ఏవం సుషుప్తి సుఖవ న్ముక్తిసుఖస్యాపి స్వానుభవగమ్యత్వాత్ ప్రత్యక్షత్వమేవ న శూన్యత్వమ్.

తర్హి సశరీరముక్తానామివాశరీరముక్తానామపి ప్రత్యక్షత్వే కోభేద ఇతిచేత్—అజ్ఞాననివృత్తిః పునరుత్థానాభావశ్చ భేద

ఇత్యుక్తమ్. ఏవం శ్రుతియుక్తిభ్యా మశరీరముక్తేః రపమ సుఖత్వం శరీరపరిగ్రహేణ దుఃఖంచోక్తమ్. ఇదానీ మను భవేనాపి తదుభయం వదామః. నిత్యం సుషుప్తౌ శరీరపరిగ్రహాభావాత్ దుఃఖాభావశ్చ జాగ్రత్స్వప్నయోః శరీరపరిగ్రహేణ దుఃఖంచ సర్వై రనుభూయతే. తస్మాద్యత్ర యత్ర శరీరపరిగ్రహ స్తత్ర తత్ర దుఃఖమితి వ్యాప్తే రానందరూపస్యాత్మనః శరీరపరిగ్రహాదేవ దుఃఖ మాగచ్ఛతి నతు స్వతః.

తస్య శరీరస్య కోవా హేతురితిచేత్—పూర్వకర్మసహిత పంచీకృతభూతాన్యేవ, న కేవలభూతాని. (అతః) తేషాం సర్వత్ర వర్తమానత్వా త్తేభ్యః శరీరం స్యాదితి న వక్తవ్యమ్. నను శుక్లశోణితరూపేణ పరిణతానామేవ భూతానాం శరీరకారణత్వేన వివక్షితత్వాత్ తాదృశాన్యేవ శరీరస్య కారణమితి న వక్తవ్యమ్; వ్యర్థశుక్లశోణితేషు శరీరోత్పత్త్యదర్శనాత్. తస్మాత్ కర్మసహితాన్యేవ శరీరస్య కారణాని. పంచభూతానాం దేశకాలాదీనాం చ సర్వసాధారణత్వా త్తత్తత్కర్మవైచిత్ర్యమేవ హేతుః శరీరవైచిత్ర్యే. యథామృదాదీనాం సాధారణత్వేఽపి కులాలవ్యాపార వైచిత్ర్యమేవ ఘటాది కార్యవైచిత్ర్యే హేతుః; యథా (చ) దృష్టాంతే మృదుపాదాన కారణం కులాలవ్యాపారో నిమిత్తకారణం, ఏవం దార్ష్టాంతికేఽపి శరీరస్య పంచీకృత భూతాన్యుపాదానమ్. తత్ర

త్కార్మనిమిత్తమ్. తస్మాత్ భోగప్రదకర్మణి సతి శరీర పరిగ్రహః యథా జాగ్రత్స్వప్నయోః. కర్మ(ణి) (ణ్య) సతి (న) శరీరమ్. యథా చ సుషుప్తౌ కర్మాభావే శరీరాభావః.

కించ (యథా) మృది సత్యామపి కులాలవ్యాపారాభావే ఘటోత్పత్త్యభావః; తథా ఈశ్వరసృష్టపంచభూతేషు సత్స్వపి ఆత్మజ్ఞానేన కర్మసు నష్టేషు తస్య జ్ఞానినః శరీరం నో(పప) (త్ప)ద్యతే.

నను కర్మశాస్త్రే 'అవశ్యమనుభోక్తవ్య మితి' 'నాభుక్తం క్షీయతే కర్మే'తిచ, జ్ఞానశాస్త్రే 'జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా' ఇతి వచనయోః పరస్పరం విరోధే కథం నిర్ణయః కర్తవ్య ఇతిచే చ్ఛృణు. శాస్త్రే(హి) ప్రబల వచనం దుర్బలవచనం చాస్తి. ప్రబలం సిద్ధాంతవచనం. దుర్బలం పూర్వపక్షవచనం. ప్రబలం దుర్బలం నిరస్యతి. తద్యథా 'అహింసాపరమోధర్మ' ఇతి వచనం దుర్బలం. తద్ 'యాగే పశుబంధః కర్తవ్య' ఇతి వచనం ప్రబలం నిరస్యతి. ఏవం 'అవశ్యమనుభోక్తవ్య' మితి వచనం 'తపసా కల్మషం హంతీతి' ప్రబలవచనేన దుర్బలం నిరస్యతే. తస్మాత్ సంచితేషు కర్మసు బహుషు సత్స్వపి జ్ఞానేన తాని నశ్యం

త్యేవ. కర్మాభావే జన్మాభావః. జన్మాభావే దుఃఖాభావః. దుఃఖాభావే ఆనందావిర్భావః ఇత్యయమేవ సిద్ధాన్తః.

సశరీరస్యదుఃఖిత్వ వ్యాప్తిరవ్యాహతాయతః,
అతః శరీరముక్త్యర్థం యత్నం కుర్యా దతంద్రితః.

న భూతపంచకా న్నపి కర్మణః కేవలా దపి,
ఉభాభ్యాం మిలితాభ్యాం తచ్ఛరీర ముపజాయతే.

తచ్ఛరీరా నవాప్తిశ్చ జ్ఞానాదేవ న చాన్యతః,
అతః సర్వప్రయత్నేన జ్ఞానాభ్యాసరతోఽభవేత్.

ఇతి మాయావివరణే చతుర్థ వర్ణకం
సమాప్తమ్.

# అథ పంచమ వర్ణకమ్

కస్మా దాత్మనో దుఃఖం. శరీరపరిగ్రహాత్. శరీరం (చ) కర్మణేత్యు క్తం. తత్కర్మ కిం కతివిధ మితిచేత్ శృణు. కర్మ త్రివిధం. పుణ్యం పాపం మిశ్రం చేతి. దేవాదిశరీరం పుణ్య కర్మఫలం. మనుష్యాదిశరీరం పుణ్యపాపమిశ్రకర్మఫలం. తిర్యగాదిశరీరం సర్వం పాపకర్మఫలం.

ఏవం ఉక్తత్రివిధమపి కర్మ ఉత్కృష్టం మధ్యమం సామాన్య మితి ప్రత్యేకం త్రివిధం. ఏవం ఉక్త కర్మభేదేన జన్మభేదశ్చ నానాప్రకారః.

తథాహి హిరణ్యగర్భాది శరీరం పుణ్యోత్కృష్టం. ఇంద్రాదిశరీరం పుణ్యమధ్యమం. యక్షరాక్షసపిశాచాదిశరీరం పుణ్యసామాన్యం. పరతాపకరం కంటకవృక్ష విషవృక్ష వ్యాఘ్రసర్పవృశ్చికోలూకమశకజలూకాది శరీరం సర్వం పాపోత్కృష్టం. పనస ఆమ్ర కదలీ నారికేలాది ఫలపత్ర పుష్పవినియోగవత్ వృక్షలతాది (చ) గ్రామసూకర మహిష గర్దభోష్ట్రాదికం సర్వం శరీరం పాపమధ్యమం. అశ్వత్థ తులసీబిల్వ గవాశ్వాదికం సర్వం పాపసామాన్యం.

ఇహ మనుష్యలోకే నిష్కామకర్మానుష్ఠాన సాధనచతుష్టయ సద్గురులాభ శ్రవణ మననాత్మజ్ఞానక్రమేణ జీవన్ముక్తేః

విదేహముక్తేశ్చ యోగ్యం మనుష్యశరీరం మిశ్రకర్మోత్కృష్టం. స్వాశ్రమోచిత కర్మణాం కామ్యకర్మణాం చ అనుష్ఠానయోగ్యం శరీరం మిశ్రకర్మమధ్యమం. చండాల పుల్కస కిరాతయవనాది శరీరం మిశ్రకర్మసామాన్యం. తస్మాత్ వివేకినా పురుషేణ ఏత త్కర్మఫలతారతమ్యం. విచార్య భూమౌ మనుష్యజన్మని మిశ్రకర్మోత్కృష్టజన్మ యథా సిద్ధయేత్ తథా (స్వ) స్వవర్ణాశ్రమకర్మాణి కృత్వా ఫలేచ్ఛాం విహాయ ఈశ్వరార్పణం కృత్వా ఆత్మవిచారణ ద్వారా మోక్షప్రాప్తావేవ ప్రయత్నః కర్తవ్య ఇతి సిద్ధాంతః.

ఏత త్త్రివిధమపి కర్మ కేనక్రియత ఇతిచేత్—త్రివిధకరణైరేవ క్రియత ఇతి జానీహి. నన్వస్మిన్ లోకే అహం కరోమ్యహం కరోమీతి వదతాం సర్వేషాం అనుభవేనాస్మిన్ దేహే దేహాభిమానీసన్ అహం శబ్దార్థతయా య ఆత్మా వర్తతే తస్యాత్మనః కర్తృత్వే వక్తవ్యే తం విహాయ త్రివిధ కరణానాం భవద్భిః కర్తృత్వం కథముచ్యత ఇతిచేత్ శృణు. ఆత్మా అవికారీ నిష్క్రియః స్వగతభేదశూన్యః. తస్మాదాత్మనః కర్తృత్వం వక్తుం న శక్యతే.

నను కర్తృత్వం స్వాత్మనిష్ఠతయా భాతి. కర్తా చాన్యో న దృశ్యతే. కథమితిచేత్ శృణు. ఆత్మని ప్రతీయమానం

కర్తృత్వ మధ్యాసా న్న స్వభావత ఇతి జానీహి. స్వాభావిక మితి చేత్, న కేనాపి వేదాంతవిచారం కృత్వా మమేదం కర్తృత్వం పరిహరణీయం.అస్యానపాయే సంసారబంధోపి నాపయాస్యతీతి వ్యర్థః ప్రయాసః కరణీయః

ఆత్మనః కర్తృత్వం స్వాభావికం భవతు. ప్రయత్న విశేషేణ నశ్యత్వితిచే న్న. స్వభావస్య స్వరూపత్వాత్. కించ స్వరూపనాశార్థం కోవా ప్రయత్నం కుర్యాత్. స్వరూపనాశే సతి కోవా పురుషార్థ మనుభవేత్. కించాకర్తా జీవన్ముక్తోనచేత్ తదా వేదాంతసంప్రదాయో గురుః శిష్యశ్చ నస్యుః. కించాత్మా కర్తా సాక్షీ నిష్క్రియ ఇతి ప్రతిపాదకస్య 'నిష్క్రియమ్ నిష్కలమ్ శాన్తమ్ నిరవద్యం నిరంజనమ్'. 'సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ'. ఇత్యాది శ్రుతివాక్యస్యాపి హానిః స్యాత్.

సుషుప్తావాత్మని విద్యమానేఽపి కర్తృత్వం న దృశ్యతే. యది కర్తృత్వం స్వాభావిక మగ్నే రుష్ణత్వ మివోపలభ్యేత. తథా నోపలభ్యతే. తస్మా దాత్మనః కర్తృత్వం న స్వాభావికం.

నను సుషుప్తౌ కర్తృత్వానుపలంభః కరణవియోగాత్. యథా తక్షాదేః కర్తృత్వే విద్యమానే అపి స్నానభోజనాది సమయే తదనుపలంభ స్తద్వద్భవత్వితి చే న్న. తూష్ణీం భూతావస్థాయాం అంతఃకరణసంయోగే విద్యమానేఽపి

కర్తృత్వానుపలంభా త్కర్తృత్వం న స్వాభావికం. కింతు ఆధ్యాసికమేవ.

అధ్యాసో నామ అన్యనిష్ఠధర్మాణాం అన్యత్రావభాసః. యథా నౌనిష్ఠగమనస్య తీరస్థవృక్షే వృక్షనిష్ఠాచలత్వస్య నావిచఅధ్యాసవశా ద్భానం. ఏవం త్రివిధకరణనిష్ఠ కర్తృత్వస్య ఆత్మని ఆత్మనిష్ఠాకర్తృత్వస్య త్రివిధకరణేచ భానం అజ్ఞానవశాదేవ. తస్మాదా త్మనః కర్తృత్వమారోపాదితి జానీహి.

నను జడస్య త్రివిధకరణస్యాచేతనత్వా దచేతనస్య కథం కర్తృత్వం. కరణత్రయస్యైవ కర్తృత్వే తస్యకరణాంతరే ణాపి భవితవ్య మితి చేత్ శృణు. యథా లోకే అచేతనస్య వాయోః వృక్షాదీనా మున్మూలనే తేషాం దూరనిరసనేచ యథా(వా) జలప్రవాహస్యాప్యచేతనస్య వృక్షాదీనా మున్మూలనే తేషాం దూరనిరసనేచ కరణం వినా కర్తృత్వం దృశ్యతే తథా త్రివిధకరణస్యాపి కరణాంతరం వినా కర్తృత్వ ముపపద్యతే.

ఏవం త్రివిధకరణకృతాని కర్మాణి కానీతిచేత్ ఉచ్యతే. సవిశేషచింతా నిర్విశేషచింతా పరలోక చింతా భక్తి జ్ఞాన వైరాగ్యచింతా ఇత్యాది వికారాః సర్వే మనసాక్రియమాణాని కర్మాణి మానస పుణ్యకర్మాణి. విషయచింతా పరేషా మప

కారచింతా వేదశాస్త్రయో రప్రామాణ్యచింతా ధర్మాధర్మాద్య భావచింతా ఇత్యాది బుద్ధివికారాః సర్వే మానసపాపకర్మాణి. సవిశేషచింతాయా నిర్విశేషచింతాయాః పుణ్యచింతాయా అపి విషయచింతాదిపాపచింతయా మిశ్రీకృత్యానుష్ఠానం మానస మిశ్రకర్మ.

వేదాధ్యయనం శాస్త్రగీతాసహస్రనామాదిపఠనం పంచా క్షరాదిమంత్రజపః భగవన్నామసంకీర్తనం పరోపకార వార్తా సత్యవాక్యం మృదుపూర్వభాషణం చ వాచా క్రియమాణం పుణ్యకర్మ. వేదశాస్త్రదేవతాదిదూషణమ్ అసత్యపిశున పారు ష్యాపహాస వార్తాచేత్యాది సర్వం వాచికం పాపకర్మ. వేదా ధ్యయన పూజాకాలాది పుణ్యవార్తాసు పరనిందాయా అస త్యస్య పరిహాసస్య లౌకికవార్తాయా శ్లైష్యమాది పాపా నాం. మిశ్రీకృత్యానుష్ఠానం వాచికం మిశ్రకర్మ.

పుణ్యతీర్థస్నానం గురుదేవతానమస్కారః దేవపూజా ప్రదక్షిణం సజ్జనదర్శనం త్యాగః లోకానుగ్రహసంచారః ఏవమాదీని కాయేన క్రియమాణాని కర్మాణి కాయికం పుణ్య కర్మ. పరహింసా పరస్త్రీసంగ చౌర్య దుష్టసంగాది కాయేన క్రియమాణం కాయికం పాపకర్మ. బ్రాహ్మణభోజనార్థం బ్రాహ్మణోపద్రవః, దేవాలయనిర్మాణార్థం పరద్రవ్యాప హారః, ప్రపాం స్థాపయిత్వా భృతకస్యాప్రదాన మేవ

మాదీని పుణ్యాని పాపానిచ మిశ్రీకృత్య కాయేనానుష్ఠీయమానాని కాయికం మిశ్రకర్మ. ఏతాని త్రివిధాన్యపి కర్మాణి సమగ్విచారణీయాని.

విచారస్య ఫలం కిమితిచేత్—ముఖ్యఫల మవాంతరఫలమితి ద్వయమస్తి. కథమితి చేత్. ఇమాని త్రివిధకర్మాణి త్రివిధైరేవ కరణైః క్రియంతే. ఆత్మాత్వయ మాకాశవదసంగః నిరంశః పరిపూర్ణః చైతన్యస్వరూపః. అతోన కస్యాపి కర్మణః కర్తా. అతఏవ—

యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ,
యచ్చాస్య సంతతోభావ స్తేన చాత్మేతి గీయతే.

ఇత్యుక్త ఆత్మశబ్దార్థః. తస్మాన్నైకమపి కర్మ చిదాకాశస్వరూపం మాం స్పృశతీతి జ్ఞాత్వా సంశయం విహాయ దృఢానుభవేనావస్థానం ముఖ్యఫలమ్. బ్రహ్మజ్ఞానే సత్యపి త్రివిధకరణమపి పుణ్యకర్మణ్యేవ స్థాపయితవ్యమ్. తదసంభవే మిశ్రకర్మణి వా స్థాపయితవ్యమ్. న కదాచిదపి పాపకర్మణీతి జ్ఞాత్వా తథైవావస్థానమవాంతరఫలమ్. యథా కదలీపోషకస్య కదలీఫలం ముఖ్యఫలమ్. తత్పత్రపుష్పాదిక మవాంతరఫలం. తథైవ త్రివిధకరణకృతకర్మ (జ్ఞాన) స్యాపి పూర్వోక్తఫలద్వయమితి జ్ఞేయమ్.

సన్వాంభసా పద్మపత్రమివ కర్మణా జ్ఞానీ నలిప్యతే. తస్య నకోఽపి విధిర్నిషేధోవా. స తుఅకర్తా కర్మసాక్షీ కృతకృత్య ఇతి సిద్ధాంతితత్వాత్ తస్య జ్ఞానినః ఆత్మజ్ఞానినఇవ పుణ్యాం కర్మైవ అనుష్ఠేయమితి నియమః కథమితిచేత్సత్యమ్. జ్ఞానీ కృతకృత్యఏవ. కర్తాపి న భవతి. న తత్రసందేహః. తథాపి బ్రహ్మవిద్, బ్రహ్మవిద్వరః, బ్రహ్మవిద్వరీయాన్, బ్రహ్మవిద్వరిష్ఠః ఇత్యేతేషాం మధ్యే బ్రహ్మవిద్వరిష్ఠఏవ విదేహముక్తః. అసౌ వరిష్ఠఏవ వృత్తిశూన్యః. తస్య న విధి ర్న నిషేధశ్చ.

అన్యేషామపి త్రయాణాం జ్ఞానమహిమ్నా విధినిషేధాఽభావేపి వృత్తిశూన్యత్వాభావాత్ వ్యవహారిత్వాచ్చ లోకానుగ్రహార్థం సదాచారఏవ స్థాతవ్యమిత్యుచ్యతే. నతు నియమ్యతే. తస్మాత్తత్వజ్ఞానినా కర్మిణాం మధ్యే కర్మివత్ కర్మానుష్ఠేయం. జిజ్ఞాసూనాం మధ్యే తత్కర్మ త్యక్త్వా బ్రహ్మైవ సత్యం అన్యత్సర్వ మసత్యమితి జ్ఞానమేవోపదేష్టవ్యం. అత్ర ప్రకృతం కిమితిచేత్. త్రివిధకరణస్యైవ కర్తృత్వం నాత్మన ఇతి నిశ్చితమ్.

అథ త్రివిదమపి కరణం కిం స్వయమేవ కర్తృ అన్యేన ప్రేరితం వేతి విచార్యమాణే రాగద్వేషాదినా ప్రేరితమేవ కర్తృన స్వయం. రాగద్వేషాదౌ సతి కరణత్రయం ప్రవర్తతే

అసతి న ప్రవర్తత ఇత్యన్వయవ్యతిరేకాభ్యాం రాగద్వేషాదేః కరణప్రవర్తకత్వస్య అనుభవసిద్ధత్వాత్. నన్వహం దేవాలయం కారయామి తటాకం ఖానయామి ఇత్యాది వ్యవహారాత్ ఆత్మా కారయితా భవత్వితిచేన్న. ఆత్మనః నిర్వికారత్వాత్ న కుత్రాపి కారయితృత్వ ముపపద్యతే. ఆత్మని కారయితృత్వం భాతిచేత్ జపాకుసుమనిష్ఠం లౌహిత్యం స్ఫటికఇవ రాగద్వేషాదినిష్ఠం కారయితృత్వమాత్మని భ్రాంత్యారోప్యత ఇతి జ్ఞేయం. స్వాభావికంచేత్ తన్నాశార్థం న కోపి ప్రయత్నం కుర్యాత్. స్వాభావికస్య స్వరూపత్వాత్. కథంచిత్ తస్యనాశే స్వరూపనాశ ఏవ స్యాత్.

ఆత్మ(జ్ఞాని)నోఽపి కారయితృత్వం యదిస్యాత్ ఆత్మా సంగోఽస్క్రియోఽకారయితేతి ప్రతిపాదికా 'అదృశ్యమవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్యమేకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం శాన్తమ్ శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా సవిజ్ఞేయ' ఇతి శ్రుతిర్భజ్యేత. (కారయితృత్వస్య జన్యత్వే తజ్జన్యముక్తేరపి జన్యత్వం స్యాత్)సుషుప్తావపి కారయితృత్వం దృశ్యేత. తన్నదృశ్యతే. తస్మా దాత్మనః కారయితృత్వం. నస్వాభావికం కింతు ఆగంతుకమేవ.

నను సుషుప్తౌ కారయితృత్వా దర్శనమాత్రేణాత్మనః కార యితృత్వం నాస్తీతి వక్తుం న శక్యతే. యథోపాధ్యాయ కస్యా ధ్యాపకత్వం విద్యమానమపి శిష్యవర్గాసన్నిధౌ నదృ శ్యతే తద్వత్సుషుప్తౌ కరణసంయోగాభావాత్ విద్యమాన మపి కారయితృత్వం నదృశ్యతే. జాగ్రత్స్వప్నయోః కరణ సంయోగేసతి దృశ్యతే ఇతి వక్తుం శక్యత్వాత్ ఇతిచేత్. తర్హి జాగ్రత్యుదాసీనతూష్ణీమవస్థాయాం కరణసంయోగస్య విద్యమానత్వాత్ కారయితృత్వం దృశ్యేత. తన్నదృశ్యతే. తస్మా దాగంతుకమేవేతి వక్తవ్యం. యథా అన్యోన్యాధ్యాసా దయో నిష్ఠదీర్ఘహ్రస్వత్వాదయో ఽ గ్నౌ, అగ్నినిష్ఠలౌహి త్యౌష్ణ్యప్రకాశాదయోఽయసి చ భాంతి తద్వదజ్ఞానాదేవ రాగ ద్వేషాది నిష్ఠకారయితృత్వ మాత్మని ఆత్మ నిష్ఠాకారయితృ త్వం రాగద్వేషాదౌ చ భాతి.

నను అచేతనస్య రాగద్వేషాదేః కథం కారయితృత్వం నఘటో ఘటాంతరం ప్రేరయతీతి చేత్ సత్యమ్. తథాపి కుత్రచిత్ యోగ్యతావశాత్(జడో)జడంప్రేరయతి. యోగ్యతా భావాత్ కుత్రచిత్ నప్రేరయతి యథా జడోప్యగ్నిః గంధ కాదిసంయుక్త ఇంగిలాది చూర్ణవిశేషైః సహితఃసన్ జడ మేవ బృహన్నాలికాంత (స్థ) స్థూలపాషాణం ప్రేషయిత్వా తేన చతురంగసేనాం హంతి.

కించ ప్రేతశరీరం జడమపి స్వజ్ఞాతిక్రియమాణాం అపరిక్రియాంప్రతి స్వయం కారయితృభవతి. ఏవ మచేత నమపి రాగద్వేషాది కారయితృభవతి. తర్హి ఆత్మా హ్యాషీకేశః సర్వాంతర్యామీతి వదంత్యాః శ్రుతేః కిం తాత్పర్యమితి చేత్, ఆదిత్యవత్ సన్నిధానమాత్రేణ సర్వకార్యానుకూలో భవతీతి తాత్పర్యమ్.

నను ఆత్మా సన్నిధానమాత్రేణాపి సర్వప్రాణికర్మ హేతుర్హి. అత ఆత్మనోఽపి తత్పుణ్యపాపతత్ఫలసంబద్ధోఽపి స్యాదితిచే న్న. యథా ఆదిత్యస్య సన్నిధిమాత్రేణ సకలజనపుణ్యపాపానుకూలస్యాపి తత్పుణ్యం చ పాపంచ తత్ఫలం చ నస్యాత్ తథాత్మనోఽపి మంతవ్యమ్. అయశ్చేష్టాపి సన్నిధానమాత్రేణ స్వానుకూలాం కాంతశిలాం యథా నస్పృశతి తథా ప్రాణికర్మాప్యాత్మాన మితిచ జ్ఞేయమ్. తస్మా దాత్మనో నిరంజనత్వం నిర్వికారత్వం.

ఏవ మాత్మస్వరూపే ప్రసిద్ధే గురుణోపదిశ్యమానేఽపి ప్రతిబంధత్రయేణ న నిశ్చయో భవతి. ప్రతిబంధత్రయంచ సంశయభావనా అసంభావనా విపరీతభావనా చేతి. ఋగాది శాఖాసూపదిశ్యమాన ముపనయనాదికర్మ యథానేకవిధం తథా ఋగాదిశాఖాసూపదిశ్యమానం ఆత్మతత్త్వమపి అనేక

ప్రకారం వా నవేతి సంశయః సంశయభావనా. సా సకల వేదాంతతాత్పర్యావధారణరూపశ్రవణేన నశ్యతి.

ఏవం సర్వేషాం వేదాన్తానామద్వైతే బ్రహ్మణ్యేవ తాత్పర్యమితి శ్రవణేన ప్రమాణవిషయే సంశయే నష్టేఽపి ఇద మద్వైతం కథం సంభావ్యతే సత్యత్వేన ప్రతీయమానేషు జీవేశ్వరజగత్సు పరస్పరభిన్నేషు సత్స్వితి బుద్ధిరసంభావనా. ఇయం స్వప్నదృష్టాంతాది రూపయుక్త్యాత్మక మననేన నశ్యతి.

ఏవం శ్రవణే మననేచ కృతేఽపి అనాద్యవిద్యావాసనయా సర్వస్యాపి యథాపూర్వం సత్యత్వప్రతీతిః విపరీతభావనా. సా బ్రహ్మైకాకారప్రత్యయప్రవాహరూపనిదిధ్యాసనేన నశ్యతి. ఏవం ప్రతిబంధకత్రయ నాశాకరణే యథా సర్వస్య దాహకోఽప్యగ్నిః మణిమంత్రాదిప్రతిబంధై రేకం తృణమపి దగ్ధుం న శక్నోతి ఏవం జ్ఞానాగ్నిరపి ప్రతిబంధైః ప్రతిబద్ధఃసన్ అజ్ఞాన తత్కార్యేషు కించిదపి దగ్ధుం న శక్నోతి. పూర్వోక్త ప్రకారేణ అస్మిన్ ప్రతిబంధత్రయేఽపనీతే సతి సద్యఏవాగ్ని స్తృణమివావిద్యాం తత్కార్యమపి సర్వం దగ్ధుం శక్నోతి. కించ—

ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతాఫలమ్,
అర్థవాదోపపత్తీచ లింగం తాత్పర్యనిర్ణయే.

ఇతి వచనేన షడ్విధలింగై స్తాత్పర్యనిర్ణయః కర్తవ్యః. అత్ర ఛాందోగ్యషష్ఠాధ్యాయే—'స దేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్' ఇత్యుపక్రమ్య 'ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం' ఇత్యఖండైకరస ఏవ ఉపసంహృతః, ఇత్యుపక్రమోపసంహారైకరూప (త్వ) మేకం లింగమ్.

తత్త్వమసీతి నవకృత్వ స్తస్యైవాభ్యాసో ద్వితీయమ్. అఖండైకరసస్య ప్రత్యక్షాది ప్రమాణాంతరా విషయత్వ మపూర్వతా తృతీయమ్. 'తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే' ఇత్యఖండైక రసజ్ఞానస్య ప్రారబ్ధ భోగానంతరం విదేహకైవల్యరూపఫలవచనం చతుర్థమ్. అర్థవాదస్తు పంచమమ్. యథా సోమ్యైకేన మృత్పిండేనే త్యాదినా దృష్టాంతకథనం ఉపపత్త్యాఖ్యం షష్ఠం. సృష్టిస్థితి ప్రలయప్రవేశ సంయమనతత్త్వం పదార్థ (శోధన)ఫలప్రతి పాదికా ఇతి సప్తార్థవాదాః.

తత్ర 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూత' ఇత్యాద్యాః సృష్ట్యాద్యర్థవాదరూపాః శ్రుతయః ఆకాశాదేః సర్వస్య బ్రహ్మణ్యేవోత్పత్తే స్తస్మి న్నేవావస్థానాత్ తస్మి న్నేవ లయాన్మృదుత్పత్తిస్థితిలయాత్మకస్య ఘటాదేః మృద భేదవ త్కారణబ్రహ్మమాత్రతా మవగమయంత్యో మహా వాక్యోక్తం బ్రహ్మణోఽద్వితీయత్వం సంభావయామాసుః.

'తద్ధైతమేవ సీమానం విదార్యైతయా ద్వారాప్రాపద్యత,' 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్', 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీ'త్యాద్యాః శ్రుతయో బ్రహ్మణఏవ జీవరూపేణ ప్రవేశం బ్రువంత్యోబహిః స్థిత్వాంతర్గృహే ప్రవిష్ట దేవదత్తవత్ జీవబ్రహ్మణోర భేదం మహావాక్యార్థం సంభావయామాసుః.

తథా 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యామంతరోయం పృథివీనవేద యస్య పృథివీ శరీరం యః పృథివీమంతరోయ మయత్యేషత ఆత్మాంతర్యామ్యమృత' ఇత్యాది నియమన శ్రుతిశ్చ అత్యంతాభేదేన నియమ్య నియామకా (క) భావానుప పత్తే స్తయోరభేదమేవ సంభావయతి.

తథా 'సవాఏష పురుషోఽన్నరసమయః'. 'యదగ్నే రోహితం రూప'మిత్యాద్యాః తత్త్వం పదార్థశోధనపరాః శ్రుతయో జీవేశ్వరోభయగత విరుద్ధధర్మనిరసనద్వారాతయో రైక్యమేవ సంభావయంతి.

తథా 'బ్రహ్మవిదాప్నోతి పరం' 'అమృతః సమభవది' త్యాద్యాశ్చాభేదజ్ఞానస్య నిరతిశయఫలప్రదర్శనేనాభేదస్య వివక్షితత్వం విజ్ఞాపయంత్య స్తమేవ సంభావయంతి.

ఇత్థం దృఢం సృష్టిస్థితిసంహారప్రవేశసంయమనతత్త్వం పదార్థపరిశోధనఫలప్రతిపాదకైః స ప్తవిధార్థవాదై రను

గృహీతం సజ్జీవ బ్రహ్మైక్యరూపమఖండైకరసమేవావాంతర వాక్యైః సహ సహితం సత్ప్రతిపాదయతి. తతోఽఖండైక రసత్వే నైవ మహావాక్యార్థో వక్తవ్య ఇతి షడ్విధలింగైః శ్రుతితాత్పర్యావధారణం శ్రవణ మిత్యుక్తమ్.

ఇదానీం కిం ప్రకృతమితిచేత్. మయోక్తప్రకారేణ విచార్యరాగాదినా ప్రేరితం తత్త్రివిధకరణం త్రివిధం కర్మ కరోతి. ప్రధానిప్రేరితసేనయా సంపాదితం జయం రాజా అహం జితవానితి ఆత్మన్యారోపయతి యథైవమాత్మారాగ ద్వేషాదినిష్ఠం ప్రేరకత్వమజ్ఞానా దాత్మన్యభిమన్యతే.

ఏవమాత్మనః కర్తృత్వం కారయితృత్వం చ నాస్తీతి యో దృఢం నిశ్చినోతి సఏవ ముక్తః సఏవ కృతకృత్యః.

త్రివిధైరేవకరణైః పుణ్యం పాపం చ మిశ్రకమ్,
క్రియతే న మయా కర్మేత్యేవం బుద్ధిర్విముచ్యతే.
రాగాదేరేవ నిర్వర్త్యం ప్రేరకత్వం నమే క్వచిత్,
ఇతి యస్య ధృఢా బుద్ధిః స ముక్తః సచ పండితః.

ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్యపాదవిరచితే
మాయావివరణే కర్తృత్వ కారయితృత్వ
విమర్శనమ్ నామ పంచమ వర్ణకమ్
సమాప్తమ్

# మాయావివరణము

## పీఠిక

1948 స్న, ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీతరఫున మాయావివరణము Vol I No. I గా దేవ నాగరాక్షరా లలో అచ్చు అయింది. దీనిని ప్రకటించిన సదరు లైబ్రరీ క్యూరేటర్ శ్రీ టి. చంద్రశేఖరన్ యమ్మే, ఎల్ టి గారు తమ పీఠికలో — 'శ్రీ శఙ్కరులు దీన్ని వాక్యశైలిలో ఉప దేశసహస్రం మొదలైన ప్రకరణ గ్రంథాలవలె రచించా రనిన్నీ మాయా కార్యాల నిది సమగ్రంగా తెలుపుతుం దనిన్నీ సులభమూ విశదమూ ఐన శైలినిబట్టి యీ గ్రంథం ప్రథమపాఠకులకు నమ్మ సరిపోతుందనిన్నీ దీనిని చదివినందు వల్ల పెద్ద విద్యార్థులుకూడా పొందగల ఉపకారాన్ని ఎవరూ కాదనలేరనిన్నీ ఇట్లా ఇది అద్వైతశాస్త్రంలో మొదటి వాచక మనిన్నీ వ్రాశారు. ఈ మాటలు యథార్థా లనటం వల్ల సంస్కృతభాషా పరిచయంలేని తెలుగువారు చదువు కోడానికి ఈ మాయావివరణాన్ని నేను గ్రాంథిక భాషలో తెలి గించాను. సంస్కృతభాష తెలియక అద్వైతంలో అధి నివేశంగల కొందరు దీనిని చదివి గ్రాంథిక భాషలో ఉండడం వల్ల దీనిలో వైశద్యం విరళమయిపోయిందని నాకు చెప్పారు. కావలసినది గ్రంథంలోని వస్తువుగాని దానికి తొడుగైనభాష కాదుగదా! కాబట్టి దానినే మళ్లా తిప్పి వాడుకమాటలలో వ్రాశాను. అసలు వస్తువునం దభినివేశం లేనివారికి ఈ పొడి

మాటలనల్ల ఒరిగేదేమీ ఉండదు. వస్తువాసన ఉండి గ్రాంథిక భాష కంఠం పట్టుకునే వారికి ఇది ఉపయోగించవచ్చు.

శాఙ్కర మాయావాదంలో ఆచార్యానుక్రమంగా కొన్ని మార్పులూ చేర్పులూ జరుగుతూ వచ్చినవి. శ్రీ అప్పయ్య దీక్షితులవారు వీని నన్నిటినీ సిద్ధాంత లేశ సంగ్రహంలో వివరించారు. టిప్పణిలో అట్టి వానిని కొన్నింటిని నే నుదాహరించాను. విశేష పక్షపాతంచేత కొన్ని కొన్ని టిప్పనులు పొడుగైనవి.

## గ్రంథకర్తృత్వం

దీనిని శఙ్కర భగవత్పాదులే రచించివుంటే చిన్నదయినా చక్కని యీ ప్రకరణ గ్రంథం ఇన్ని శతాబ్దులు అందర కన్నులనూ కప్పి ఉంచగలదా—ఎంత మాయా వివరణ మైనా? దీని శైలికిన్నీ దీనివలెనే వాక్య గ్రంథాలయిన ఉపదేశసహస్ర, ఆత్మజ్ఞానోపదేశ విధి, శైలికిన్నీ పోలిక ఉన్నదా? శఙ్కరులు-'మ మాపి జ్ఞానసిద్ధయే' = 'నాకున్నూ జ్ఞానం కలగడానికి' అనే దళాన్ని, గ్రంథరచన కొక కారణంగా పేర్కొంటారా?

(౧) అని నాకు సంశయం. గ్రంథకర్త ఎవరయితేనేం గ్రంథం దొడ్డది.

చిరివాడ కృష్ణా } వేలూరి శివరామశాస్త్రి
తేది 9-10-61

౧. 'బాలానాం' అనీ మొదటి శ్లోకం గ్రంథకర్తదా వ్రాసికొన్న వానిదా ఆలోచించి చూచుకొనేది.

# మాయా వివరణము

## తాత్పర్యము

## ప్రథమ వర్ణకము

క. బాలురకుం దేలికగా
నాలుకపై నాడుటకును నాకును జ్ఞాన
శ్రీలాభము కలుగుటకును
మాలికగా నల్లువాఁడ మాయాసుమముల్. ౧

ధర్మార్థకామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలలో[౨] నిత్యం అవడంవల్ల మోక్షమే పరమపురుషార్థం. ధర్మార్థకామాలు అనిత్యాలవడంవల్ల వానిలో ఏదీ మోక్షం వంటిది కాదు.[3] కర్మలుచేసి సంపాదించుకొన్న లోకాలు

---

౧. బాలానా ముపకారాయ మమాపి జ్ఞానసిద్ధయే
తత్రశ్రీ బాలగోపాలకృష్ణః సన్నిహితో భవేత్.

౨. పురుష + అర్థం = మనిషి పుట్టినందుకు ప్రయోజన మేమిటంటే ధర్మార్థకామమోక్షాలనుగాని తుదకు ధర్మమోక్షాలనుగాని సంపాదించాలి. ధర్మపురుషార్థంవల్ల అనగా ధర్మాచరణంవల్ల అర్థకామాలుకూడా లభిస్తవి. 'ధర్మాదర్థశ్చ కామశ్చ' అని భారతం. ధర్మం అనిత్యంకాబట్టి మోక్షంమీదనే చూపుఉండాలి. వేదాంత పరిభాషలో ప్రథమ వాక్యాది చూమనది.

౩. బ్రహ్మజ్ఞానం కలగడమన్నా మోక్షమన్నా ఒకటే. బ్రహ్మజ్ఞానం ఉదయిస్తే మరిపోదు. కాబట్టి మోక్షం నిత్యం.

గాని పుణ్యంచేసి సంపాదించుకొన్న లోకాలుగాని ఉన్నాని ఎగిరి పోతయ్౧ బ్రహ్మామునే తెలుసుకొంటే మరి చావు ఉండదు. ౨గమ్యం చేరడానికి ఇంతకు వేరుదారి లేదు.౩'బ్రహ్మా మెరిగినవాడు బ్రహ్మాం పొందుతాడు౪' అని శ్రుతి చెప్పడం వల్ల బ్రహ్మాజ్ఞానంవల్లనే మోక్షం చేకూరుతుంది. 'కర్మచేత గాని సంతు చేతగాని ధనంచేతగాని దానంచేతగాని ఎవరికిన్నీ చావకుండా ఉండడం చేత కాలేదు'౫ అని శ్రుతి చెప్పడంవల్ల మోక్షం కోరేవాడు అధ్యారోప-అపవాదలవల్ల౬ తత్త్వాం తెల్చుకోవాలి. అధ్యారోపాపవాదలవల్లనే బ్రహ్మాము చక్కగా తెలుస్తుంది.

## అధ్యారోపం

ఎండలో దగదగలాడిపోతున్న ఆలిచిప్పనుచూచి వెండి అని ఆశపడతాం. సూర్యకాంతి తక్కువై మసక మసకగా ఉన్నచోట తాడును చూచి పామని జంకుతాం. ఎడారులలో దవుదవ్వుల ఎండమావులు చూచి దప్పి కెగబడతాం. చీకటిలో మోడు చూచి దొంగ అని అనుకొని కేకలు వేస్తాం.

---

౧. తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే.

౨. తమేవ విదిత్వా తిమృత్యు మేతి,

౩. నాన్యః పంథా అయనాయ విద్యతే

౪. బ్రహ్మవిదాప్నోతిపరమ్.

౫. న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః.

౬. అద్యారోపాపవాదాభ్యాం కర్తవ్య స్తత్త్వ నిర్ణయః

ఈలాగే ప్రపంచగంధం లేని ఆత్మమీద ప్రపంచాన్ని ఆరో
పించి వ్యవహరిస్తున్నాం. ౧ ఇది అసలు వస్తువు నెరుగక
చేసే ఆరోపం. ౨ ఈ యెరుగకపోవడానికే అజ్ఞాన మని
అవిద్య అని తమస్సు అని మోహమని మూలప్రకృతి అని
ప్రధానం అని గుణసామ్యం అని అవ్యక్తమని మాయ అని
ఇంకా ఎన్నో పేర్లు. 3 ఈ అజ్ఞానమనే మూలప్రకృతి సత్త్వ
రజస్తమస్సులనే మూడు మూలగుణాల సముదాయం కాబట్టి
౪ దీన్ని తెల్లనివీ ఎఱ్ఱనివీ నల్లనివీ ఐన దారాలతో పిరిపెట్టిన
బొందుతో పోల్చవచ్చు. ఈ మూలప్రకృతిని ఇంకా ప్రలయ
మనీ మహాసుషుప్తి అనీ అంటారు. సృష్టికిముందు ఈ మూల
ప్రకృతిలో తమ తమ కర్మవాసనలతో నానిన జీవు లెన్నో
లక్కముద్దలో బంగారునలుసులల్లే లయమై ఉంటవి. నిద్రలో
ఈ మాదిరి అనుభవం అందరికీ ఉన్నది.

సృష్టిసమయంలో ఈ మూలప్రకృతి పంటకు వచ్చిన
జీవుల కర్మలనుబట్టి మాయ అనీ అవిద్య అనీ తామసి అనీ

---

౧. పాముకు అధిష్ఠానం తాడైనట్లు ప్రపంచాని కధిష్ఠానం బ్రహ్మము. తాడు కంటికి కనబడుతుంది, బ్రహ్మము కనబడదు.

౨. 'ఇది ఆలిచిప్ప' అని తెలిస్తే వెండి అని అనుకోము. 'ఇది తాడ'ని తెలిస్తే పామని అనుకోము. ఈలా అనుకొన్నప్పుడు ఆలిచిప్పకు వేరుగా వెండీ తాడుకు వేరుగా పామూ లేనట్లు బ్రహ్మమునకు వేరుగా ఈ ప్రపంచం లేదు.

౩. బీజశక్తి ఇత్యాదులు.

౪. శాంతి సుఖాదులు సత్త్వం, కామక్రోధాదులు రజస్సు, ఆలస్య నిద్రాదులు తమస్సు. భగవద్గీత - ౧౪ అధ్యాయం చూ.

మూడుగా అవుతుంది. ఈ మూటిలో మాయ అనేది శుద్ధ సత్త్వ ప్రధానం. సృష్టికి పూర్వం ఉన్న బ్రహ్మచైతన్యం ఆ మాయలో ప్రతిబింబించి ఈశ్వరుడని చెప్పబడుతుంది. ఈ యీశ్వరునకే అవ్యాకృతుడనిన్నీ అంతర్యామి అనిన్నీ ఎన్నో పేర్లు. ౧ జగత్తు సృజించేవా డితడే. ఇతడే పరిపూర్ణ బ్రహ్మ రూపంతో తామసి అనే మూలప్రకృతిచేత అవచ్ఛిన్నుడై సాలీడులాగా ప్రపంచానికి ఉపాదానకారణమూ ౨ అవుతు న్నాడు, మరి స్వప్రాధాన్యంచే నిమిత్తకారణమూ ౩ అవు తున్నాడు. ౪

## కారణ ప్రపంచసృష్టి

ఈశ్వరుడు ప్రపంచాన్ని ఎట్లా ఎట్లా సృజించాడు? వెనుకజెప్పిన అవిద్య రజఃప్రధానం బహువిధం, అనంతం. ఇట్టి అవిద్యలో ప్రతిబింబించిన జీవులు అనంతులు మరి చైతన్య రూపులు. ఈ జీవులకు వ్యష్టిరూపమయిన అవిద్య కారణ శరీరం. సమష్టిరూపమయిన మూలప్రకృతి యీశ్వరునకు కారణ శరీరం. ఆ యీ కారణశరీరాలలో జీవేశ్వరుల ఉనికి

---

౧. శబలబ్రహ్మ సగుణబ్రహ్మ మాయాశబలుడు ఇత్యాదులు.

౨. కుండకు మట్టి ఉపాదాన కారణం. బ్రహ్మము ప్రపంచాధ్యాసాధి ష్ఠానంగా, లేక ప్రపంచాకారంగా పరిణమించే మాయకు అధిష్ఠా నంగా ఉపాదానకారణం.

౩. కుండకు కుమ్మరి నిమిత్త కారణం.

౪. "దేవాది వదపిలోకే" అను బ్ర॥సూ॥ భాష్యం చూచేది (2-1-25)

సుషుప్త్యవస్థ. జీవేశ్వరుల కారణశరీరమే—ఆనంద మయ కోశమే—కారణ ప్రపంచసృష్టి.

## సూక్ష్మ ప్రపంచసృష్టి

ఈశ్వరుని ఈక్షణముచే ౧ తమోగుణ రూపమైన ప్రకృతి ఆవరణశక్తిగానూ విక్షేపశక్తిగానూ ౨ అయింది. ఆ యీ విక్షేపశక్తే సూక్ష్మభూతమయిన ఆకాశం. ఆ యాకాశము నుండి వాయువూ ఆ వాయువునుండి అగ్నీ అగ్ని నుండి నీరూ నీటినుండి భూమీ ఉద్భవించినవి. ౩ ఈ యయి దింటికి సూక్ష్మభూతములనీ అపంచీకృతములనీ తన్మాత్రలనీ పేర్లు. వీనికి (ఉపాదాన) కారణం అజ్ఞానం. అందువల్ల ఈ సూక్ష్మభూతాలకున్నూ త్రిగుణాలు అంటియే ఉన్నవి.

---

౧. ఇచట తలచుట అని అర్థం. ప్రకృతి అవరణశక్తిగానూ విక్షేపశక్తి కావాలి అని ఈశ్వరు డనుకొన్నాడు, అని తాత్పర్యం

౨. ఉన్నవస్తువును ఆవరించి లేనటులు చేసేది ఆవరణశక్తి. లేనివస్తువు నారోపించి ఉన్నట్లు చేసేది విక్షేపశక్తి. తాడును పామనుకొన్న ప్పుడు తాడును కనబడకుండా చేసి పాముగా చూపినవి ఈ రెండు శక్తులే.

౩. ఈశ్వరుడు తనకు వశమైన విక్షేపశక్తి అనే తమఃప్రధానం ఐన మాయతో అకాశాదిక్రమముగా ఒకదానినుండి ఇంకొకదాన్ని సృజిం చుకొంటూ వచ్చాడు. ఈ క్రమంలో అకాశం చిద్విశిష్టమై వాయువు నకున్నూ చిద్విశిష్టమైన ఆ వాయువు మళ్ళా అగ్నికీ నిన్నీ చిద్విశిష్ట మైన ఆ యగ్ని మళ్ళా నీటికి నిన్నీ చిద్విశిష్టమయిన ఆ నీరు మళ్ళా భూమికి నిన్నీ కారణ మయిందని గ్రహించాలి. ఇవి సూక్ష్మ భూతాలు.— 'తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్.'

ఆకాశము మొదలయిన యీ అయిదింటియు వేరు వేరు సత్త్వగుణాంశాలవల్ల క్రమంగా చెవులు శరీరము కన్నులు నాలుక ముక్కు అనే జ్ఞానేంద్రియాలు పుట్టినై. ఆకాశం మొదలయిన అయిదింటి సత్త్వసమష్టిచే అంతఃకరణం పుట్టింది. ఈ యంతఃకరణం మనస్సు అని బుద్ధి అని చిత్తమని అహంకార మనీ నాలుగు విధాలు. వీనిలో అహంకారానికి బుద్ధిలోనూ చిత్తానికి మనసులోనూ అంతర్భావం. ఈరీతిగా ఆకాశాదుల రజోగుణాంశాలవల్ల క్రమంగా వాక్ పాణి పాద పాయూపస్థము లనే అయిదు కర్మేంద్రియాలు పుట్టినై. ఆకాశాదుల రజోగుణ సమష్టిచే ప్రాణం పుట్టింది. అది ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానా లని ఐదువిధాలు అయింది.

ఈ ఐదు జ్ఞానేంద్రియాలూ ఐదు కర్మేంద్రియాలూ అయిదు ప్రాణాలూ మనోబుద్ధులూ కలిసి సూక్ష్మశరీర మయింది. దీనినే లింగశరీర మనీ అంటారు.

౧ ఇదే భోగసాధనం. ఈ సూక్ష్మశరీరంలో జీవేశ్వరుల ఉనికి స్వప్నావస్థ. దీనిలో విజ్ఞానమయ మనోమయ ప్రాణ మయకోశా లున్నవి.

---

౧. 'పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్
అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్.' ఆత్మబోధ ౧౩

'పరమని అపరమని లింగశరీరం రెండు విధాలు. పరం హిరణ్యగర్భలింగశరీరం. అపరం మనబోటివారి లింగశరీరం. హిరణ్యగర్భలింగ శరీరం మహత్తత్త్వం. మనబోటివారి లింగశరీరం అహంకారం' అని వేదాంత పరిభాష.

## స్థూలసృష్టి

తమోగుణప్రధానాలూ అపంచీకృతాలూ ఆకాశాదులైన భూతాలనైదింటిని రెండు చెక్కలుచేసేది. ఒక అయిదు చెక్కలను అల్లా అట్టేపెట్టి మిగిలిన అయిదు చెక్కలను ఒకొక్కదానినే నాలుగు నాలుగుగా కోసేది. ఇట్లా చేసిన ప్రతి సూక్ష్మభూతపు చెక్కలలో ఒకొక్కదానినే దానికంటె వేరయిన భూతసూక్ష్మముల సగము చెక్కలలో చేరుస్తూపోతే పంచమహాభూతాలవుతై. ౧ దీనికే పంచీకరణం అని పేరు. ౨ ఈ పంచీకృత పంచమహాభూతాలవల్ల బ్రహ్మాండమున్నూ దానిలోని పద్నాలుగు భువనాలున్నూ వానిలోని ఉద్భిజ్జాలు స్వేదజాలు అండజాలు జరాయుజాలు అనే నాలుగు రీతులైన స్థూలశరీరాలు అన్నము మొదలైన భోగ్యవస్తువులూ పుట్టినై. ఈ స్థూలశరీరంలో జీవేశ్వరుల ఉనికి జాగ్రదవస్థ. ఈ స్థూలమే అన్నమయకోశం.

---

౧. ఏ భూతాని కాభూతంలోని పాబాలు, మిగతా భూతాల అంశలకన్న ఎక్కువ కాబట్టి ఆ పాబాలు భూతం పేరే దానికి పేరు. ఒకొక్క మహాభూతంలో తన పాబాలూ మిగతా భూతాల ఎనిమిదో ఎనిమిదో పాళ్లూ నాలుగూ కలిసి ఉన్నై. 'వైశేష్యాత్తు తద్వాద స్తద్వాదః' ౨-౪-౨౨. బ్ర. సూ. భాష్య.

౨. 'తాసాం త్రివృతం త్రివృత మేకైకాం కరవాణి' అనే త్రివృత్కరణ శ్రుతి పంచీకరణానికి ఉపలక్షణం.

## జీవేశ్వరులలో అవాంతరభేదాలు

కారణశరీరము సూక్ష్మశరీరము స్థూలశరీరము అనే ఈ మూడు శరీరాలున్నూ ప్రత్యేకించి వ్యష్టి అనిన్నీ సమష్టి అనిన్నీ రెండు విధాలు. అడవి ఊరు ఇవి సమష్టి. చెట్టు ఇల్లు ఇవి వ్యష్టి. ఈలాగే శరీరాలన్నీ సమష్టి. ఒకశరీరం వ్యష్టి. సమష్టిశరీరం ఉపాధిగా గలవాడు ఈశ్వరుడు. వ్యష్టిశరీరం ఉపాధిగా గలవాడు జీవుడు. అందును—

కారణసమష్టిచే ఈశ్వరుడు

కారణవ్యష్టిచే ప్రాజ్ఞుడు

సూక్ష్మసమష్టిచే హిరణ్యగర్భుడు

సూక్ష్మవ్యష్టిచే తైజసుడు

స్థూలసమష్టిచే వైశ్వానరుడు లేక విరాట్

స్థూలవ్యష్టిచే విశ్వుడు.

అని జీవేశ్వరులల్లో అవాంతంభేదాలు. ఈ యీశ్వరుడే సత్త్వరజస్తమో గుణాలనే ఉపాధులతో బ్రహ్మవిష్ణు రుద్ర రూపుడై సృష్టి స్థితి సంహారాలు చేస్తాడు. బ్రహ్మకు విరాడ్రూపంలోనూ విష్ణువునకు హిరణ్యగర్భునిలోనూ రుద్రునకు

ఈశ్వరునిలోనూ అంతర్భావం. ౧ ఇట్లా ప్రపంచోత్పత్తి. ఇదియే అధ్యారోపం. ౨ విక్షేపశక్తి చేసే పని యిది.

## ఆవరణశక్తి

ఆవరణశక్తి యీశ్వరుని ౩ జ్ఞానినివిడిచి జీవుల కోశ పంచకోశాలకూ ఆత్మకూ కల భేదం తెలియకుండా ప్రపంచాన్నంతా అంధకారంలాగా ఆవరిస్తుంది. ఈ ఆవరణశక్తి, అస

---

౧. 'హిరణ్యగర్భుడు ముగ్గురు మూర్తులకంటె వేరు. ఇతడు ప్రథమ జీవుడు' అని విషయపరిచ్ఛేదంలోనూ పరమేశ్వరు డొక్కడయినా తన కుపాధియైన మాయలోని సత్త్వ రజ స్తమోగుణభేదంచేత బ్రహ్మ విష్ణు మహేశ్వరాది శబ్దాలచే చెప్పబడతాడని ప్రత్యక్ష పరిచ్ఛేదంలోనూ వేదాంతపరిభాష చెప్పింది.

౨. వేరేమీ లేని పూర్ణవస్తువునుండి చిత్రాతిచిత్రముగా ఒకదానికంటె ఇంకొకటి భిన్నాతిభిన్నముగా నున్న యీ ప్రపంచ మెట్లు పుట్టుకొచ్చిందని చెప్పబడిందో అదే అధ్యారోపం. ఈ అధ్యారోపజ్ఞానం వల్ల బ్రహ్మాండాలన్నీ ఒకే ఒక వస్తువులోనుంచి వచ్చిన వని నిశ్చిత మవుతుంది. ఒకే వస్తువులోనుంచి వచ్చిందని చెప్పడానికి వేదాంతు లెత్తిన యెత్తువలె ఉంది యిది అని ఆక్షేపిస్తారా? చూడండి—తాడు మసక మసకగా నున్న వెలుగులో పాములాగా పూలదండలాగా జలధారలాగా ఇనుపగొలుసులాగా ఎలా కనబడుతుందో? ఈ కల్పన లన్నింటికీ అధిష్ఠానం ఒకే ఒకతాడు.

౩. సత్త్వాధిక్యం ఉన్నచోట ఆవరణశక్తి ఆటలు సాగవు. ఈశ్వరోపాధిలో సత్త్వాధిక్యం ఉన్నది. కాబట్టి ఈశ్వరునికి స్వస్వరూపావరణం లేదు. దానివల్ల అతని కుపాధియైన మాయ అతనిచేతిలో ఉన్నది. కాన మాయ అతనిని లోబరచుకోలేదు. తన వశంలో ఉన్న మాయను పట్టుకొని ఈశ్వరు డీప్రపంచం సృజించాడు. ఈ రీతిగా వశమైయున్న మాయను లెక్కచేయకుండా చూస్తే ఈశ్వర చైతన్యం బ్రహ్మచైతన్యమే. బ్రహ్మముకంటె ఈశ్వరుడు వేరు కాడు.

త్త్వావరణమనీ అభానావరణమనీ రెండు విధాలు. 'వస్తువు లేదు' అని వ్యవహరించడానికి కారణమైనది అసత్త్వావరణం. ౧ వస్తువు తెలియడంలేదు అని వ్యవహరించడానికి కారణమైనది అభానావరణం. ౨ ఈ ఆవరణ శక్తికార్యమే సంసార వృక్షానికి మూలం కాని విక్షేపశక్తికార్యం కాదు. ఇదే మోక్షానికికూడా హేతువు.

ఈ రెండావరణాలూ తత్త్వజ్ఞానంతో తరలిపోతై. పరోక్షమనిన్నీ అపరోక్షమనిన్నీ తత్త్వజ్ఞానం రెండువిధాలు. ఈ రెంటిలో గురువుదగ్గర కూర్చుండి వేదాంతం వినడంవల్ల కలిగేజ్ఞానం పరోక్షం ౩. దీన్నే శ్రవణం అని ౪ అంటారు.

---

౧. అసత్త్వం = లేకపోవడం. 'దేముడు లేడు' అని అనిపించేది అసత్త్వావరణం.

౨. అభానం = తెలియకపోవడం. దేముడు ఉన్నాడో లేడో నాకు కనిపించడం లేదు, తెలియడం లేదు అని అనిపించేది అభానావరణం.

౩. గ్రంథపఠనం వల్లగాని ఆచార్యాదిబోధ వల్లగాని 'జీవుడున్నూ బ్రహ్మమున్నూ ఒకటే' అని నిర్ణయింపించే జ్ఞానం పరోక్షం. ఇది అనుభవానికి రాకున్నా జీవబ్రహ్మైక్యం నిశ్చయం అని తోస్తుంది. జ్ఞానులుకాని పండితులు పరోక్షజ్ఞానమాత్రం కలవారు. చీకటిలో దీపం దీపం అంటూ కూచుంటే దారి కానరానట్లు పరోక్షజ్ఞానంవల్ల ఆత్మోపలబ్ధి కాదు. ఈ జ్ఞానం ఉత్తర జన్మలో అపరోక్షజ్ఞానానికి దారి చేస్తుంది. రెండు వేదాంతపు ముక్కలు చెప్పి డబ్బు సంపాదించే పండితులను చూచి లోకులు వేదాంతాలనూ వేదాంతులను దుయ్యబటతారు. వీరు పండితమాత్రులేకాని జ్ఞానులు కారు. వారు ధనాశ చూపనూవచ్చు: వీరు ఇవ్వనూవచ్చు. ఉపాధ్యాయులు మాత్రం జీతం తీసుకోకుండా బతకట మెట్లా ?

౪. శ్రవణంవల్ల ప్రత్యగాత్మపరమాత్మలకు ఐక్యం చెప్పడమే ఉపనిషత్తాత్పర్యం అని బోధ కలుగుతుంది.

'వస్తువులేదు' అనే అసత్త్వావరణం ఈ శ్రవణంవల్ల కొట్టుకొనిపోవడమేకాక వస్తువు ఉన్నది' అని తెలుస్తుంది. ౧ ఇది పరోక్షం.

శ్రవణంవల్ల సంశయము, మననంవల్ల ౨ అసంభావన, నిదిధ్యాసనంవల్ల 3 విపరీతభావన ౪ నివర్తించి పోతవి.

అపుడు 'నేను బ్రహ్మమను' అని తోచుబడి అయే జ్ఞానం అపరోక్షం. ఈ అపరోక్షజ్ఞానంచేత 'వస్తువు తెలియడం లేదు' అని అనుకోడానికి కారణమైన అభానావరణం తొలగి పోతుంది. పరోక్షజ్ఞానంచేత 'బ్రహ్మములేదు' అని అనుకోవ డానికి కారణమైన అసత్త్వావరణం తొలగిపోతుంది. అపుడు అనర్థం నివృత్త మవడం యేమిటి ఆనందం ఉదయించడ

---

౧. వస్తువంటే బ్రహ్మము. బ్రహ్మము ఉన్నదని విన్నందువల్ల పరోక్ష జ్ఞానం కలుగుతుంది. సముద్రం అనేది ఉన్నది; నేను స్నానంచేసి వచ్చానని తండ్రి చెపితే కొడుకుకు 'సముద్రం అనేది ఉన్నది కాబోలు' అని అనుకుంటాడు. అదే పరోక్షజ్ఞానం.

౨. మననం అంటే విచారం. శ్రవణంవల్ల కలిగిన బోధను షడ్విధ లింగములతోనూ (౫వ వర్ణకం. చూ) యుక్తులతోనూ అప్పసమూ చింతన చేయడం.

౩. శ్రవణ మననాలవల్ల కలిగిన అపరోక్షజ్ఞానమే నిదిధ్యాసనం అని ఒకమతం. ఈ మతంలో ధ్యానంతో పనిలేదు. 'నిదిధ్యాసనం' అనగా ధ్యానం అని ఇంకొక మతం. శ్రవణ మననాలకు ధ్యానమును మకుటం చేయాలని ఈ మతోద్దేశం. ఇది పక్వమైతే అద్వైతులు చెప్పే సమాధిలో పర్యవసన్నం అవుతుంది.

౪. పంచమవర్ణకంలో ప్రతిబంధత్రయం చూచేది.

మేమిటి ? ఇట్లా ఇవి ఏడవస్థలు ౧ ఆకాశంలాగా నిర్మలమైన చైతన్యంలో ఇట్లా మిథ్యామైన ప్రపంచకల్పనం అధ్యారోపం.

---

౧. అజ్ఞానము, అసత్త్వ-అభానావరణ ద్వయం, విక్షేపం, పరోక్షజ్ఞానం, అపరోక్షజ్ఞానం, దుఃఖనివృత్తి, ఆనందావాప్తి, ఇవి ఏడవస్థలు. దృష్టాంతం దశమ న్యాయం. పదిమంది కలిసి పొరుగూరు పోతూ నడుమ ఏరు దాటారు. అందరూ వచ్చారా లేదా అని ఒకడు తన్ను గాక మిగతావాళ్ళను లెక్కించి ఏడ్వటం మొదలు పెట్టాడు. లెక్కించే తన్ను మరవడం అజ్ఞానం. పదోవాడు లేడు, కానరాడని అనుకోడం ఆవరణద్వయం. ఏటిలో కొట్టుకొని పోయినాడని ఏడ్వటం విక్షేపం. దారే పోయేవాడు కలయజూచి పదోవా డున్నాడని చెపితే ఎక్కడో ఉన్నాడు కాబోలు అని అనుకోడం పరోక్షజ్ఞానం. అతడు అందరినీ లెక్కించి నీవే పదోవాడవు అని వేలితో హృదయముమీద పొడిచి చూపగా తానే అని తెలిసికోడం అపరోక్షజ్ఞానం. పదవ నే నేటిలో చావక బ్రతికియే ఉన్నానని తలచి దుఃఖం మరవడం దుఃఖనివృత్తి. అందరమూ ఒడ్డుచేరి సుఖంగా ఉన్నామని ఉప్పొంగడం ఆనందావాప్తి. ఇక దార్ష్టాంతికంలో—ఆత్మ నెరుగను అనుకోడం అజ్ఞానం. తిన్నగా విచారము చేయక దేముడు (ఆత్మ లేక బ్రహ్మము) లేడు, ఉంటే కనబడదేం అని అనుకోడం ఆవరణద్వయం. సూక్ష్మస్థూల దేహాలతో ఉన్న చిదాభాసుడు విక్షేపమున్నూ కర్తృత్వ భోక్తృత్వాది రూపమైన సంసారమంతా చిదాభాసుని కార్యమున్నూ ఇదంతా విక్షేపం. గురుముఖమున శ్రవణం చేస్తే పరోక్షజ్ఞానం కలుగుతుంది, మనన నిదిధ్యాసలచే అపరోక్షజ్ఞానం కలుగుతుంది. ఈ రెంటివల్లా ఆవరణద్వయం పోవడాన జీవత్వారోపం నశించి సంసారం సమస్తుంది. దీనితో విక్షేపం చెల్లు. పిమ్మట దుఃఖం పోవడమేమిటి స్వరూపమైన ఆనందం ఉద్బుద్ధ మవడ మేమిటి ? ఈ రెండూ ఒకసారే కలుగుతవి.

## అపవాద

'కారణంకంటె కార్యం వేరుగా ఉండదు' అనే ఎరుకచే ఆలిచిప్పకంటె వేరుగా వెండీ, తాడుకంటె వేరుగా పామూ లేనట్లే 'బ్రహ్మముకంటె వేరుగా ప్రపంచం లేదు' అనే నిషేధం అపవాద. ౧ 'ఏది లేదో అది మాయ' అనే వ్యుత్పత్తిచేత ౨ మాయయున్నూ, 'ఏది ఉండదో అది అవిద్య' అనే వ్యుత్పత్తిచేత ౩ అవిద్యయున్నూ కల్పితాలని స్పష్టంగా తెలిసిపోతుంది. కాగా బ్రహ్మాభిన్నంగా ఏదీ లేదనిన్నీ ఆబ్రహ్మమే తాననిన్నీ విచారించి అనుభవానికి తెచ్చుకోగలవాడు జీవన్ముక్తుడనేది వేదాంత సిద్ధాంతం.

---

౧. కార్యం ఉపాదాన కారణస్వరూపం; నామరూపాలుమాత్రం వేరు. కుండకు మట్టి ఉపాదానం. కార్యమైన కుండ నామరూపాలకే వేరు కాని మట్టేకదా. వికారనాశమే కార్యనాశం. కుండ వికారం. అది నశించగా కారణమైన మట్టి మిగులుతుంది. కార్యం కారణంలో లయిస్తుంది. దీనిబట్టి నానానామరూపాలతో జీవరాశి శరీరాలూ బ్రహ్మాండాలూ తమకు కారణమైన పంచభూతాలకంటె వేరుకావు. ఆ పంచభూతాలూ తమకు కారణమైన పంచతన్మాత్రలకంటె వేరుకావు. ఆ పంచతన్మాత్రలూ తమకు కారణమైన పంచతత్త్వాలకన్న వేరు కావు. ఆ పంచతత్త్వాలలో ఆకాశతత్త్వం తనకు కారణమైన (త్రిగుణాత్మకం ఐన) మాయకన్నా ఆ మాయా మాయోపాధికమైన ఈశ్వర చైతన్యమూ (తదుభయాధిష్ఠానమైన) శుద్ధచైతన్యం కన్నా వేరు కావు. ఇపుడు వెనుదిరిగి చూస్తే 'ప్రపంచం దేముడికంటె బ్రహ్మముకంటె వేరుకాదు అని తేటతెల్లమవుతుంది.

౨. 'యా మా సా మా యా'.

౩. 'యా న విద్యతే సా అవిద్యా'.

గీ॥ ఆత్మమీఁదను స్థూలసూక్ష్మాదులైన
దేహముల మోపుదలయును దిరిగి తదప
వాదమును దోట్టతోలుతటి వర్ణకమున
వ్యాకరించితి నద్వైతవస్తు వెఱుఁగ.

ఇది ప్రథమ వర్ణకము.

# ద్వితీయవర్ణకము

క॥ మునుపటి శాస్త్రజ్ఞులు మును
మునుగా వేదాంతశాస్త్రములయందులఁ జె
ప్పిన చొప్పున నేనును నిట
ననుబంధ చతుష్టయంబు నభివర్ణింతున్.

## అనుబంధ చతుష్టయము

విషయము ప్రయోజనము సంబంధము అధికారి యీ నాలుగూ అనుబంధాలు. వేదాంతశాస్త్రానికి బ్రహ్మమే విషయం. మోక్షమే ప్రయోజనం. ప్రతిపాద్య ప్రతిపాదక భావంగాని బోధ్య బోధకభావంగాని [1] సంబంధం. బృహస్పతి సవనానికి బ్రాహ్మడే అధికారి ఐనట్లు రాజసూయానికి క్షత్రియుడే అధికారి ఐనట్లూ స్తోమానికి వైశ్యుడే అధికారి ఐనట్లూ బ్రహ్మజ్ఞానానికి సాధన చతుష్టయ సంపన్నుడే అధికారి.

## సాధన చతుష్టయం

నిత్యానిత్యవస్తువివేకం, ఇహాముత్రఫలభోగ విరాగం, శమదమాదిషట్క సంపత్తి ముముక్షుత్వం, ఈ నాలుగూ బ్రహ్మజ్ఞానానికి సాధనాలు.

---

౧. ప్రతిపాద్యము = చెప్పదగినది. ప్రతిపాదకము = చెప్పునది. బోధ్యము = బోధింపదగినది. బోధకము = బోధించునది. వేదాంత శాస్త్రం బ్రహ్మం అంటే ఏమిటో చెపుతుంది. లేక బోధిస్తుంది. చెప్ప దగినదీ లేక బోధింపదగినదీ బ్రహ్మము.

౧ నిత్యానిత్యవస్తు వివేకం = శ్రుతులవల్లా స్మృతుల వల్లా పురాణాదులవల్లా 'బ్రహ్మమే నిత్యం, ప్రపంచం అనిత్యం' అని స్పష్టంగా కలిగే జ్ఞానం.

౨ ఇహాముత్ర ఫలభోగవిరాగం = (ఇహ) ఈ లోకం లోనూ (అముత్ర) స్వర్గలోకంలోనూ అనుభవించే కామాది సుఖం అనిత్యంకాబట్టి వానికి ఆశపడటం, కక్కిన కూటికి కుక్క ఆశపడటం వంటిదని తెలిసికొని ఆ యా సుఖాలయెడ విరక్తి చెందడం.

3 శమ దమాది షట్క సంపత్తి = శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము అనేవి ఆరు. ఈ ఆరింటి మొత్తమూ కావాలి. వీనిలో శమం అంటే విషయాలను విడిచి ఆత్మమీదనే చూపు పెట్టుకొని ఉండడం, ౧ దమం అంటే జ్ఞానేంద్రియాలనూ కర్మేంద్రియాలనూ అదుపులో ఉంచుకోవడం, ౨ ఉపరతి అంటే ప్రపంచంనుంచి వైతొలగటంగాని సన్యాసంగాని నిష్కామ కర్మానుష్ఠానంగాని వ్యవహార మేమీ లేకుండా ఉండటంగాని 3 తితిక్ష అంటే ప్రారబ్ధాన్ని ఆగతాన్ని శీతోష్ణాదులతో పాటు ఓర్చుకోడం శ్రద్ధ అంటే గురువుమీదా వేదాంతాలమీదా విశ్వాసం, సమా

---

౧. అంతరింద్రియ నిగ్రహం అని కొందరు

౨. బాహ్యేంద్రియ నిగ్రహం అని కొందరు

౩. వేదాంతపరిభాష – అపరోక్షానుభూతి. చూ.

ధానం అంటే శ్రవణం మొదలయిన అనుకూల విషయాల మీద మనసు ఉంచడం.

౪ ముముక్షుత్వం అంటే తన యిల్లు తగులబడి పోతూ వుంటే తానే కాలిపోతున్న చందంగావున్న యింటివాడు, ఆలుబిడ్డలను విడిచి తన బ్రతుకు తెరువే చూచుకొని బయటికి పరుగెత్త గోరినట్లు సంసారి సంసారతాపాన్ని పోగొట్టు కోడానికి ఏషణ లన్నీ విడిచి బ్రహ్మాతాదాత్మ్యం పొంద గోరు తాడు. అట్టి తీవ్రేచ్ఛ (ముముక్షు).

లోకంలో కొందరికి నిత్యానిత్య వస్తువివేకం ఉంటే ఉంటుందిగాని వైరాగ్యం కలగదు. అట్టివారికి ఈ లోకంలో నయినాసరే స్వర్గం మొదలయిన లోకాల లోనయినా సరే సుఖం అనుభవిద్దాం అనే కోరిక ఊచముట్టుగా పోయి వైరాగ్యం కలగాలి అని చెప్పబడ్డది. నిత్యానిత్యవస్తువివేకం వైరాగ్యం ఈ రెండూ ఉన్నా కొంతమంది ఋషీశ్వరులకు కోపతాపాదులు ఉన్నట్లు కనబడుతుంది. ఆ కోపతాపాదుల ఉపశమానికి శమం కూడా ఉండాలి అని చెప్పబడింది. ఈ మూడూ ఉన్నా భక్తిచే ఈశ్వరుని ఉపాసించేవారికి జ్ఞానాధి కారం కనబడుతూ వుండడంవల్ల ముముక్షు కూడా ఉండాలి అని చెప్పబడినది.

ఇట్లా సాధన చతుష్టయ సంపన్నుడైన అధికారి సమిధలు చేత్తో పుచ్చుకొని గురువును సమీపించి

౧ మ్రొక్కి వినయమూ విశ్వాసమూ తొణికిసలాడుతూ వుండగా — 'భగవానుడా!' 'జీవుడెవరు? దేవు డెవరు? ప్రపంచమేమిటి?' ఈ మూడూ ఎక్కడినుంచి వచ్చెయ్? ఎక్కడికి పోతయ్? అని ౨ అడుగుతాడని అనుకొంటాం. గురువు అప్పు డతని జిజ్ఞాస యెరిగి సత్త్వరజస్తమో గుణాలచే జీవ దేవ జగత్తులు పుట్టెయ్ అని చెప్పి ఆత్మస్వరూపంకూడా కరతలామలకంగా బోధిస్తాడు. కాబట్టి ఇలా అడిగేవానికి చాలా జన్మలలో సంపాయించుకొన్న పుణ్యంచేతా ఈశ్వరాను గ్రహంచేతా సాధనచతుష్టయం లభ్యమవుతుందని తెలుసు కొనేది. గురుముఖాన జీవాత్మ పరమాత్మల అభేదాన్ని విని విచారించి తెలిసికొన్నవానికి ముక్తిదొరుకుతుంది.

ఇది ద్వితీయ వర్ణకము

---

౧. పరీక్ష్య లోకాన్ కర్మ చితాన్ బ్రాహ్మణో
నిర్వేద మాయా న్నా స్త్యకృతః కృతేన
త ద్విజ్ఞానార్థం గురు మేవాభిగచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్. [ముండక]

౨. త ద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా. [గీతా]

# తృతీయ వర్ణకము

గీ॥ దేనిఁ జేతన మనియును దేని మఱియు
చేతనమ్మని ప్రాఁబల్కు చెప్పె, నట్టి
చేతనాచేతనంబుల లోఁతుపాతు
లరసి మూఁడవ వర్ణక మందుఁ జెపుదు.

## ఆత్మ - అనాత్మ

ప్రపంచం అంతా ఆత్మ అనీ అనాత్మ అనీ రెండు విధాలు. ప్రపంచం చేతనాచేతనాత్మకం. చేతనం లేక ప్రపంచం లేదు. కాబట్టి ఆత్మ ప్రపంచాతీతు డయినప్పటికీ ప్రపంచాంతర్యామే. స్పందమూ చేష్టా నడకా మొదలయినవి కలదంతా చేతనం. స్పందాదులు లేని స్థావరమంతా అచేతనం. చేతనాలూ అచేతనాలూ ప్రత్యేకించి పెక్కు విధాలుగా ఉన్నవి కదా! అటువంటప్పుడు ప్రపంచం ద్వివిధమే అని ఎట్లా అంటావయ్యా అని అంటావా విను - ఆత్మ కార్య రూపంగా అనేక విధాలుగా కనబడుతుంది కాని అది ఒకటంటే ఒకటే, ఏకరూపమే. అది అచేతనాలయిన అనేక కార్యోపాధులచే అనేక జీవులవలె అనేకేశ్వరులవలె కనబడుతుంది.

ఒక్కడంటే ఒక్కడే ఐన ఈశ్వరుడికి జీవులవలె అనేకత్వమెట్లా? పుణ్యక్షేత్రాలలోనూ గ్రామాలలోనూ

గృహాలలోనూ శివుడు విష్ణువు ఈ మొదలగు మూర్తి భేదం చేత ఈశ్వరునకున్నూ అనేకత్వం ఉన్నది.

మట్టితోనూ రాళ్ళతోనూ చేసిన ఆ బొమ్మలు దేవుళ్లా ?

పెద్దలు ఆ మూర్తులకు చాలా ద్రవ్యం వ్యయంచేసి ప్రాణప్రతిష్ఠా అభిషేకం నైవేద్యం మొదలైన పూజలు చేస్తుండ లేదా ?

మ్లేచ్ఛాదులు బొమ్మలకూ విగ్రహాలకూ పూజలు చేయకుండా ఉండటం లేదా ?

పెద్దలమీదా శాస్త్రాలమీదా శ్రద్ధగలవారిమాటలు మనకు ఉపాదేయాలుగాని ఆ రెంటిమీదా విశ్వాసం లేని వారి మాటలు వినదగినవి కావు. మలమూత్రాదులచే అపవిత్రమూ హేయమూ ఐన శరీరమే ఆత్మ అని తలపోసే జీవులు మిక్కిలి పరిశుద్ధమైన మూర్తులయందు ఈశ్వరబుద్ధి ఉంచితే తప్పా? అది అల్లా ఉంచుదాం. ఈరీతిగా ఒక్కటే ఐన అనాత్మకు కార్యరూపంగా అనేకత్వమూ ఒక్కటేయగు ఆత్మకు అనాత్మ కార్యోపాధులవల్ల అనేకత్వమూ వచ్చింది.

## అవచ్ఛిన్నవాదం

భూమి అంతా ఒకటే. అది కార్యంగా పరిణమించి కొండగా కుండగా చెట్టుగా పుట్టగా గోడగా గోపురంగా కటముగా పటముగా భేదం పొందుతూంది. ఇట్లా ఆకాశంఒక్కటే

భూమి మొదలైన కార్యోపాధులలో ప్రవేశించినట్లు కన బడుతూ ఇది ఘటాకాశం అనీ ఇది మఠాకాశం అనీ ఈ చందాన పలురీతులుగా ప్రకాశిస్తూంది. ఇట్లే అచేతనమైన మూలప్రకృతి ఒకటే కార్యశరీరాది రూపాలచే అనేకత్వం చెందింది. ఈరీతిగానే ఆత్మ ఒక్కటయినా ఆ యా యీ శరీరో పాధులలో ప్రవేశించినట్లై జీవుడు మనుష్యుడు రాముడు కృష్ణుడు బ్రాహ్మణుడు క్షత్రియుడు వైశ్యుడు శూద్రుడు పశువు పక్షి క్రిమికీటం మొదలయిన భేదాలతో చిత్ర విచి త్రంగా కనబడుతుంది. ఇవి అవచ్ఛిన్నపక్షంలో ఉదా హరణాలు. ౧

## ప్రతిబింబవాదం

నీరంతా ఒకటే అయినా 'ఇది సముద్రపు నీళ్లు' 'ఇవి ఏటి నీళ్లు' 'ఇవి కోటి నీళ్ళు' 'ఇవి చెరువు నీళ్ళు' 'ఇవి నూతి నీళ్ళు' 'ఇవి కుండనీళ్ళు' అని అనేకవిధాలు అయినట్లు అనాత్మ

---

౧ అవచ్ఛేదము = అంతఃప్రవేశము. తద్యుక్త మవచ్ఛిన్నము. నీటిలో కనిపించిన (అంతః ప్రవిష్టమయిన) ఆకాశాన్ని జలావచ్ఛిన్న అకాశ మని అంటారు. నీరూ అచట కనిపించే ఆకాశమూ కలిసి జలావచ్ఛి న్నాకాశం. వాచస్పతిమిశ్రులు ఈ పక్షాన్ని నెలకొలిపారు. ఈ పక్షంలో అజ్ఞానానికి విషయీకృతమయిన చైతన్యం ఈశ్వరుడు. అజ్ఞానానికి ఆశ్రయీభూతమయిన చైతన్యం జీవుడు. సర్వజ్ఞాత్ములు తమ సంక్షేప శారీరకంలో—

'ఆశ్రయత్వ విషయత్వ భాగినీ, నిర్విభాగ చితిరేవ కేవలా
పూర్వసిద్ధ తమసో హి పశ్చిమో, నాశ్రయో భవతి నాపిగోచరః.'
అని మిశ్రమతంలో లోపం చూపించారు.

వస్తువు ప్రతిదీ అనేకవిధాలు అయింది. ఆ సముద్రం మొద లయిన వాటిలో ఒకే ఒక సూర్యుడు ప్రతిబింబించి అనేక సూర్యులుగా కనిపించినట్లు ఒకే ఒక ఆత్మ అందరి అంతః కరణాలలోనూ ప్రతిబింబించి అనేకమయింది. ఇది ఉభయత్ర సమానమయిన దృష్టాంతమని గ్రహించేది. నీటి గుణమయిన చల్లదనమూ కదలికా మొదలయినవి సూర్యబింబానికి అంటనిచందంగా కర్తృత్వమూ భోక్తృత్వమూ మొదలయిన అంతఃకరణ ధర్మాలు ఆయా యీ అంతఃకరణాలతో కూడు కొన్న చిదాభాసునివిగా తోచునే కాని బింబభూతమగు ఆత్మను అంటవు. కాబట్టి జీవాత్మయే పరమాత్మ, పరమాత్మయే జీవాత్మ. మహాకాశమే ఘటాకాశం, ఘటాకాశమే మహాకాశం. ఇవి ప్రతిబింబపక్షంలో ఉదాహరణాలు. ౧

అయ్యా జీవాత్మ కల్పితుడు కదా! కల్పితమయిన వస్తు వెప్పుడూ అసత్యమేకదా! అట్టివాడు సత్యమగు పరమాత్మ అవడం ఎట్లా ?

---

౧. సర్వజ్ఞాత్ముల ప్రతిబింబపక్షంలో అజ్ఞానమందు ప్రతిబింబించిన చైతన్య మీశ్వరుడు. బుద్ధియందు ప్రతిబింబిచిన చైతన్యం జీవుడు. సురేశ్వరాచార్యులవారిది ఆభాసవాదం. వేరు సంబంధంతో వేరేచోట భాసించేది ఆభాసం. ఉదా :— మంకెనపూలు దాపున ఉండుటవల్ల స్ఫటికంలో కనిపించే ఎరుపు. దీన్ని ఉపహిత మని అంటారు. వివరణకారులు ఈశ్వరునియెడ ఆభాసవాదాన్ని జీవునియెడ ప్రతిబింబ వాదాన్ని అవలంబించి అజ్ఞానోపహితమయిన బింబచైతన్య మీశ్వరు డనిన్నీ అంతఃకరణంలోనూ దాని సంస్కారాలలోనూ చొచ్చి ఉన్న అజ్ఞానంలో ప్రతిబింబితమైన చైతన్యం జీవు డనిన్నీ చెప్పారు.

# జీవ త్రైవిధ్యం కల్పితం

పారమార్థికుడనీ వ్యావహారికుడనీ ప్రాతిభాసికుడనీ జీవుడు మూడు తెరగులు. ఈ ముగ్గురూ సుషుప్తి జాగ్రత్ స్వప్నాభిమానులు. ౧ నీటిలో తరంగ మెట్లా కల్పితమో తరంగంలో నురుగెట్లా కల్పితమో ౨ అట్లే పారమార్థిక జీవునిలో వ్యావహారిక జీవుడున్నూ వ్యావహారిక జీవునిలో ప్రాతిభాసిక జీవుడున్నూ కల్పితులు. తియ్యదనమూ చల్లదనమూ పలుచదనమూ పరమార్థానికి నీటియందే ఉండి తరంగంలో కనిపించి దానిగుండా నురుగులో సంక్రమించినట్లు సచ్చిదానందాలు కూటస్థునియందే ఉండి వ్యావహారిక జీవునిలోనూ వానిగుండా ప్రాతిభాసిక జీవునిలోనూ భాసిస్తున్నవి. నురుగు తరంగం విడిచి ఎట్లా ఉండదో, తరంగం నీళ్ళను విడిచి ఎట్లా ఉండదో నీరు మాత్రమే పరమార్థభూతమై ఎట్లా ఉంటుందో అట్లాగే ప్రాతిభాసిక జీవుడు వ్యావహారిక జీవుని విడిచి ఉండడు. వ్యావహారిక జీవుడున్నూ పారమార్థిక జీవుని విడిచి ఉండడు. కాబట్టి పరమార్థంలో ఘటాకాశం మహాకాశమే ఐనట్లు పారమార్థికజీవుడు కూటస్థుడైన పర

---

౧. సుషుప్త్యవస్థ చెందిన జీవుణ్ణి పారమార్థిక జీవు డనిన్నీ ప్రాజ్ఞు డనిన్నీ అంటారు. తక్కిన రెండవస్థలలోనూ జీవుడున్నా ఏ యవస్థలో ఉన్న జీవుడికి ఆపేరు. జీవుడు సుషుప్తిని. అభిమానించడ మనగా ఆ అవస్థలోపడి ఉండడం.

౨. నీటికంటె తరంగమూ తరంగముకంటె నురుగూ వేరు కావు వేరే వేరు.

మాత్ర్ముడే. కూటస్థుడంటే ఏ అవస్థలోనూ మారనివాడు. కావున జిజ్ఞాసువు 'నేతి నేతి' వాక్యము నెరిగి ౧ అన్నమయాదికమైన పంచకోశాలనుండి కూటస్థుని వేరుపరచి పారమార్థికుడైన ఆ కూటస్థుడు నా నుండి వేరుకాడని తెలిసికొంటూ 'అహం బ్రహ్మాస్మి' అనే శ్రుతిచేతా గట్టి యుక్తులచేతా దృఢమైన నిశ్చయంచేతా బ్రహ్మసాక్షాత్కారం పొందగలడు. అలా పొందినవాడు పరిపూర్ణ బ్రహ్మస్వరూపుడు. పుణ్యాపాపాలు అతనిని అంటవని ఉపనిషత్తు లన్నీ ఒత్తి చెపుతున్నవి.

గీ॥ ఆత్మ యిద్దియు మఱియు ననాత్మ యిద్ది
నా నెఱింగిన సంసార నాట్య మడఁగు
ఇది యెఱుంగని వానికి నెన్ని యెన్ని
జన్మములకేని సంసార శాంతి సున్న.

ఇది తృతీయ వర్ణకము

---

౧. 'అదృశ్య మవ్యవహార్యం' ఇత్యాది మాండూక్యశ్రుతి. ఐదవ వర్ణకమున చూచునది.

# చతుర్ధ వర్ణకము

క. వంతయన వింతగా నా
గంతుకమా జీవులకును ? గాదే నెపుడుఁ
సొంతంబా ? యను సంగతి
చింతించెద నాదు ధీ విశేషముకొలఁదిఁ.

జీవులకు దుఃఖం జన్మ కర్మ రాగం ద్వేషం మొద లయినవిన్నీ అభిమానం అవివేకం అజ్ఞానం అనేవిన్నీ ఉన్నవి. వీనిలో పూర్వాపూర్వాన్నిగూర్చి ఉత్తరోత్తరం హేతువు. (అది ఇట్లా అజ్ఞానం అవివేకానికీ అవివేకం అభిమానానికీ అభిమానం రాగద్వేషాదులకూ రాగద్వేషాదులు కర్మకూ కర్మ జన్మకూ ఆ జన్మ దుఃఖానికీ హేతువు.) వీనిలో దుఃఖం మొదలుగా నాలుగింటిని విచారించి చూద్దాం.

జీవాత్మకు దుఃఖం స్వాభావికమా లేక ఆగంతుకమా? అనగా నడుమ వచ్చిందా ? స్వాభావికమే అయితే జీవునకు ఎన్నడూ దుఃఖనివృత్తీ సుఖప్రాప్తీ లేకపోవలసివస్తుంది. దుఃఖనివృత్తికోసమూ సుఖప్రాప్తికోసమూ కర్మ లేకపోవలసి వస్తుంది. సత్కర్మలు చేయడానికిగాని ఉపాసనలు చేయ డానికిగాని ఎవరికిన్నీ ఏ ప్రయత్నమున్నూ చేయవలసినపని లేకపోవలసివస్తుంది. వేదం శాస్త్రం పురాణం ఇదంతా వట్టి చెత్త అయిపోవలసి వస్తుంది.

'దుఃఖం స్వాభావికమే, దానిని పోగొట్టుకోడానికి ప్రయత్నం ఎందుకు చేయరాదు ?' అని అంటావా ?

అంటే విను. స్వాభావికమయినది స్వరూపమే అవుతుంది. ఏది దేనికి స్వభావమో అది దానికి స్వరూపమే. ఈలాటి స్వరూపాన్ని నాశనం చేసుకోడానికి ఎవరు తలపడతారు ? స్వరూపమే నశిస్తే ఎవరికి పురుషార్థం ?

'అలాక్కాదు, స్వభావమే స్వరూపం ఎట్లా అవుతుంది' అని అంటావా ?

బెల్లానికి తియ్యదనం అనే గుణం స్వభావం. ఆ తియ్యదనమే నాశనం పొందదగినదయితే బెల్లమే నాశనం అయిపోతుంది. అట్లే జీవాత్మకు దుఃఖమే స్వాభావికమయి దుఃఖనాశనమే పొసగితే జీవస్వరూపమే నశిస్తుంది.

'పోనీ ! జీవుడు చావనీ !' అని అంటావా ?

ఆత్మకు నాశనం లేదు. ఆత్మ చావదనిన్నీ నిత్యమనిన్నీ శ్రుతి చెప్పుతుంది ౧ కాబట్టి ఆత్మకు దుఃఖం స్వాభావికంకాదు.

'స్వాభావికం నశింపనీ ! స్వరూపం ఉండనీ !' అని అంటావా ?

అలా సంభవం కాదు. అగ్నికి వేడిమి స్వాభావికం, అది మణిమంత్రాదులవల్ల కొంతకాలం లేకుండా ఉండవచ్చునే కాని ఎప్పటికీ పోయి స్వరూపనాశనంమాత్రం కాదు.

---

౧. 'అవినాశీ వారేయ మాత్మా' 'ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః' 'న జాయతే న మ్రియతే వా ......'

'అగ్నికి వేడిమికంటె వేరయిన చల్లదనంకూడా కలుగవచ్చు. ఇట్లే ఆత్మకు దుఃఖం స్వాభావికం కావచ్చు. అల్లాఅయినా ఆ దుఃఖం సత్కర్మాచరణంచేతగాని ఉపాసనచేగాని యోగబలంచేగాని పోవచ్చు; సుఖంకూడా కలుగవచ్చు' అని అంటావా ?

ఆ వేడిమిగాని ఆ దుఃఖంగాని తాత్కాలికంగానే పోతుంది కాని అప్పసమూ పోదు. ఎల్లాగంటే కర్మవలన కలిగిన పాపమంతా ఆ కర్మనాశంతో నశిస్తుంది. పైన చెప్పిన దృష్టాంత దార్ష్టాంతికాలలో అగ్ని వేడిమిన్నీ జీవుని దుఃఖమున్నూ మణిమంత్రాదులచేతా సత్కర్మయోగోపాసనలచేతా పోయినప్పటికిన్నీ ఆ కర్మ నశింపంగానే దాంతోపాటు నడుమవచ్చిన చల్లదనమూ సుఖమూ నశించిపోతవి. మళ్ళా స్వాభావికమైన వేడిమి దుఃఖమూ సిద్ధం. దుఃఖం సిద్ధమయితే జీవులకు తాత్కాలికముక్తియే కాని జన్మరహితమైన ముక్తి అంటూ లేకపోవలసివస్తుంది. ఇంకా, మోక్షంగనుక, జన్యం అయితే (నడుమ కొత్తగా పుట్టేదయితే) దానికి అనిత్యత్వం పొసగుతుంది. ముక్తి నిత్యమనిన్నీ [౧] అఖండం ఆనందం అరూపం అద్భుతం [౨] అనిన్నీ చెప్పే శ్రుతులతో విరోధం కలుగుతుంది. మరి ఆత్మకు దుఃఖమే స్వాభావమయితే నిద్రలోనూ ఊరికే కూచున్నప్పుడూ సమాధిలోనూ దుఃఖమే

---

౧. న చ పున రావర్తతే

౨. అఖండ మానందమరూప మద్భుతమ్.

గోచరం కావాలి. కాని అట్లా గోచరం కావడంలేదు. అట్లా కాకపోగా ఈ మూడవస్థలనూ విడిచినతరువాత 'ఇంతవరకూ నేను సుఖంగానే ఉన్నాను'అని సుఖస్మృతియే కలుగుతూంది. కాబట్టి ఆత్మకు సుఖమే స్వభావం. దుఃఖం ఆగంతుకం. ఆత్మ సుఖస్వరూపుడేకాని శరీరం తాల్చినందువల్ల దుఃఖం ఆగంతుకంగా తటస్థించింది. శరీరపరిగ్రహం ఎక్కడ ఉంటుందో అక్కడ దుఃఖం ఉంటుంది అనే వ్యాప్తి ౧ తప్పు కాదు.

## రాజులకున్నూ వివేకులకున్నూ దుఃఖం ఉన్నది

లోకంలో రాజులు మొదలైన పెద్దపెద్ద ధనికులకు శరీర పరిగ్రహంవల్ల దుఃఖం కలుగుతూందా ?

కలగకేమి ? రాజులకు ఎందరు శత్రువులు ? ఎంత రాజ్యభారం ? వారికి ధనధాన్యక్షయంచేతా దారపుత్రాదుల మరణంచేతా ముదిమి మొదలైన వానిచేతా మృత్యుబాధ చేతా కావలసినంత దుఃఖం. 'వారికేం, వారెంతో సుఖవంతులు' అని లోకంలో వాడుక. కాని అది యెల్లా కల్ల. వృథామోహం. మోహం దుఃఖాన్ని కూడా సుఖంగా చూపించేస్తుంది. కావడి మోసేవారు కర్షకులు ఎంత పాటు పడరు ! పాపం వారు మోహంచే తమ తమ కర్మే సుఖావహం అని అనుకుంటారు. సంతోషంతో పాటలు పాడతారు,

---

౧. ఎక్కడ పొగ ఉంటుందో అక్కడ నిప్పు ఉంటుంది అనేది వ్యాప్తి ఆలాగే ఇదీ నిన్ని దుష్టంకాదు.

ఉత్సాహంతో ఒళ్ళు విరుచుకుంటారు, ఇది మోహంచూపే గారడీ కాదా ?

ఇట్లా అయితే వివేకం కలవారికికూడా శరీర పరిగ్రహం వల్ల దుఃఖం ఉందా అని అంటే వారికిమాత్రం ఎందుకులేదు? వారికిన్నీ ఆకలీ దప్పీ ఉన్నది, ద్వంద్వాలు ఉన్నవి, రోగము రోష్టూ ఉన్నది, పాములు తేళ్ళు పులులు మొదలైన క్రూర జంతువుల బాధ ఉన్నది. ఇన్ని ఉండగా దుఃఖం ఎట్లా లేదు ?

ఇట్లా అయితే వివేకులకూ అవివేకులకూ తేడా యేమిటి ? అని అంటే

పయికిమాత్రం తేడా లేనట్లు కనబడినా మనో వ్యాపారాలలో తేడా ఉన్నది. వివేకం కల మహాత్ముడు – 'దుఃఖమంతా అంతఃకరణానిదే కాని సచ్చిదానంద రూపుడైన ఆత్మది కాదు, అనృత జడ దుఃఖస్వరూపమైన అంతఃకరణ–ధర్మాలతో ఆత్మకు అణుమాత్రమున్నూ సంబంధం లేదు' అని అతడు శ్రుతి యుక్త్యనుభవాలచే విచారించి తెలిసికొంటాడు. పురుషుడసంగుడు అని శ్రుతి. ౧ ఆత్మ నిరవయవం అనిన్నీ సత్యం అనిన్నీ ఈ మొదలుగాగలవి యుక్తులు. సుషుప్తి మూర్ఛా సమాధులలో అనుభవం.

ఇక అవివేకమైన దురాత్ముడు ఆత్మరూపాన్ని విచారణ చేయక శరీరాదులే ఆత్మ అని అనుకొని అనాత్మ ధర్మా

---

౧. 'అసంగో హ్యయం పురుషః.'

లను ఆత్మయందున్నూ ఆత్మధర్మాలను అనాత్మయందున్నూ ఆరోపించి అన్యోన్యాధ్యాసచే నేను రాజను నేను బంటను నే నాంధ్రుడను నేను ద్రావిడుడను నేను కర్ణాటుడను నేను మహారాష్ట్రుడను నేను గుజ్జరిని నేను బ్రాహ్మణుడను నేను క్షత్రియుడను నేను వైశ్యుడను నేను శూద్రుడను నేను బ్రహ్మచారిని నేను గృహస్థును నేను వానప్రస్థుడను నేను సన్న్యాసిని నేను శ్రీవత్సగోత్రుడను నేను భరద్వాజగోత్రుడను అని యిట్లా జాతి దేశ వర్ణాభిమాని అవుతున్నాడు. ఈలాగే వివేకికీ అవివేకికీ ఎన్నో భేదాలు. తిన్నగా చూస్తే వివేకికీ అవివేకికీ బాహ్యవ్యాపారాలలోకూడా సామ్యం కానరాదు. ప్రపంచం మిథ్య అని నిశ్చయించి ప్రారబ్ధభోగాన్ని కూడా స్వప్నభోగంలాగానే చూచుకుంటాడు వివేకి. ప్రపంచం సత్యమనిన్ని ఆత్మకు సుఖదుఃఖానుభవంగూడా సత్యమే అనిన్ని చూస్తాడు అవివేకి. అవుగాక. ఈరీతిగా వివేకవంతులకున్నూ శరీర పరిగ్రహంవల్ల దుఃఖం ఉండనే ఉంది.

## దేవతలకున్నూ దుఃఖం

ఇంద్రుడు వజ్రహస్తుడని ౧ వేదం చెబుతుంది. దేవతలకుగూడా శరీరం ఉన్నదని అనడంవల్ల శరీరం ఉంటే దుఃఖం తప్పనిసరి కాబట్టి దుఃఖం ఉండనే ఉన్నది. అసురులు రాక్షసులూ చేసే ఉపద్రవాలవల్ల దేవతలు యుద్ధాలు చేసినటు

౧. 'వజ్రహస్తః పురందరః'

లున్నూ కోపంతాల్చినట్టులున్నూ శాపాలిచ్చినట్టులున్నూ విన బడుతుంది. పుణ్యకర్మలవల్ల కలిగిన ఫలానుభవం సరిపోగానే కాబోయే అధఃపతన భయంవల్లనున్నూ వారికి దుఃఖం కద్దు.

ఓయీ వారికికూడా దుఃఖం అంటివుంటే ఇతరులకు వా రెలా ఉపాసింపదగిన వా రవుతారు? అట్టివారు తమ్ము కొలిచేవారికి సుఖమే మిస్తారు? అని అంటావేమో?

ఈ లోకంలో మహారాజులు మొదలగు కొంతమంది తాము దుఃఖం కలవారయినప్పటికీ ఆశ్రితులకు ఉపాస్యులు. వారు ఆశ్రయించినవారికి ధనాదులద్వారా సుఖదాతలు. 'దేవలోకంలో' దేవత లానందరూపులై ఉంటారు ౧ అని శ్రుతి ఉన్నది. దేవతలు దుఃఖమంతా అంతఃకరణధర్మం అని యెరిగి ఎప్పుడూ ఆత్మానందం అనుభవిస్తూనే వుంటారని ఆ శ్రుతికి తాత్పర్యం. 'సృజింపబడ్డ ఆ యీ దేవతలు ఈ మహా సముద్రంలో పడ్డారు ౨ అని ఒక శ్రుతి ఉంది. శరీరపరిగ్రహం వల్ల దేవతలకు కూడా దుఃఖం ఉన్నది అని ఈశ్రుతికి అర్థం. కాబట్టి ముక్తికే ప్రయత్నం చేయాలి.'

## ముక్తి - దానికి సాధనము

సశరీరముక్తులు అనిన్నీ అశరీరముక్తులు అనిన్నీ రెండు విధాలవారు ముక్తులు. ఆకాశంలో కొన్ని చుక్కలు మనకు

---

౧. దేవలోకే దేవా ఆనందరూపా స్తిష్ఠన్తి.

౨. తా ఏతా దేవతా సృష్టా అస్మి న్మహ త్యర్ణవే ప్రావతన్.

కనబడతై. ఆ చుక్కలనుచూచి సశరీరముక్తులు ఆరూపంతో అలా ఉన్నారని లోకులు చెప్పుకొంటారు. కాబట్టి సశరీర ముక్తులుకూడా ఉంటారు. ఈ ముక్తి సాలోక్యమనీ సారూప్యమనీ సామీప్యమనీ సాయుజ్యమనీ నాలుగు విధాలు. చర్య, క్రియ, యోగము జ్ఞానము అని సాధనాలు నాలుగు విధాలు. భగవత్కైంకర్యరూపమైన దాసభావం చర్య. శివ విష్ణు పూజావిధి క్రియ. యమ నియమాద్యష్టాంగం యోగం. జీవ బ్రహ్మైక్య సాక్షాత్కారం జ్ఞానం.

నాలుగు రీతులైన యీ ముక్తులలో మొదటి మూడు ముక్తులకూ పునరావృత్తి అనగా మరల పుట్టుక ఉండడాన ఇవి ముఖ్యం కావు. పునరావృత్తి లేకపోవడాన సాయుజ్యమే ముఖ్యముక్తి. 'యోగంవల్ల సాయుజ్యం కలుగుతుంది' అని చెప్పే శాస్త్రానికి 'జీవునికీ నిర్గుణ బ్రహ్మమునకూ ఐక్యం కలుగుతుంది' అని చెప్పడమే తాత్పర్యం. ౧ సశరీరముక్తుల లాగా అశరీరముక్తులను ఎప్పుడూ ఎక్కడా ఎవ్వడూ చూడక పోవడాన అశరీరముక్తి అనేది శూన్యం (లేదు) అని తల పోయరాదు. అశరీరముక్తులకు శరీరమే శూన్యం కాని స్వరూప సుఖం శూన్యం కాదు. స్వరూపమగు సుఖమో సుషుప్తిసుఖం లాగా శరీరం లేకపోవడంవల్ల తనకు మాత్రమే తెలుస్తుంది

---

౧. యోగశాస్త్రానికి ఇది విరుద్ధం. యోగశాస్త్రంలో జీవుడు వేరు. జీవ బ్రహ్మైక్యం లేదు. కాబట్టి ఇది అద్వైతులు తమ కనుకూలంగా చెప్పుకొన్న యోగం అని గ్రహించేది.

గాని ఇతరులకు తెలియదు. సుషుప్తి ముక్తితో సమాన మయినదని అన్నంతమాత్రాన ముక్తికాదు. సుఖానుభవ మాత్రంలో పోలిక ఉన్నా సుషుప్తిలో అజ్ఞానము పున రుత్థానము (జాగ్రదవస్థ) ఉన్నవి. ముక్తిలో ఈ రెండూ లేవు. కాబట్టి సుషుప్తి ముక్తి కాదు. ఈలాగే ప్రలయ మున్నూ ముక్తి కాదు. ఈ రీతిగా సుషుప్తి సుఖంలాగా ముక్తి సుఖమున్నూ స్వానుభవంచేత తెలిసికోదగ్గది కాబట్టి దానికి ప్రత్యక్షత్వమేకాని శూన్యత్వం లేదు.

ఇట్లా అయితే సశరీర ముక్తులకువలె అశరీర ముక్తులకు ప్రత్యక్షతలో భేదం ఏమిటి ?

అజ్ఞాన నివృత్తీ పునరుత్థానం లేకపోవడమూ భేదం.

ఈ రీతిగా శ్రుతులచేతా యుక్తులచేతా అశరీరముక్తి వల్ల పరమసుఖమున్నూ శరీరపరిగ్రహంవల్ల దుఃఖమున్నూ చెప్పబడ్డది. ఇక అనుభవాన్నిబట్టికూడా ఆ రెంటినీ తెలుపు తాము. నిత్యమూ నిద్రలో శరీరపరిగ్రహం లేకపోవడాన దుఃఖం లేకపోవడమున్నూ జాగ్రత్ స్వప్నాలలో శరీర పరి గ్రహం ఉండడంచేత దుఃఖమున్నూ అందరకూ అనుభవంలో ఉన్నది. కాబట్టి—'ఎచట శరీర పరిగ్రహమో అచట దుఃఖము' అనే వ్యాప్తివల్ల ఆనందరూపుడైన ఆత్మకు శరీర పరిగ్రహం వల్లనే దుఃఖం కాని దుఃఖం మాత్రం స్వతస్సిద్ధంకాదు అని తేలింది.

# దేహధారణకు కారణం

ఈ శరీరం రావడానికి కారణం ఏమిటి? పూర్వకర్మతో కూడిన పంచీకృత భూతాలే. భూతా లెక్కడబడితే అక్కడ ఉన్నవి కాబట్టి కేవల భూతాలే కారణం అని చెప్పడానికి వీలు లేదు. శుక్ల శోణితాలుగా మారిన భూతాలే శరీరానికి కారణం అనిన్నీ చెప్పడానికి వీలులేదు. వ్యర్థమైన శుక్లశోణి తాలవల్ల శరీరోత్పత్తి కానరాదు. కాబట్టి కర్మసహితాలైన పంచీకృత భూతాలే శరీరాలకు కారణం. పంచభూతాలూ దేశ కాలాలూ అన్ని కార్యాలకూ సాధారణ కారణాలనడంవల్ల ఆయా యీ జీవుల కర్మవైచిత్ర్యమే శరీరకార్యవైచిత్ర్యానికి కారణం. ఇందుకు దృష్టాంతం కుండ. కుండకు మన్ను ఉపాదానకారణం. కుమ్మరి నిమిత్త కారణం. పంచ భూతాలూ దేశ కాలాలూ సాధారణ కారణాలు. కుమ్మరియొక్క పనివాని తనం రకరకాలైన కుండల సొగసుకు కారణం. దార్ష్టాంతికంలో శరీరానికి పంచీకృతభూతాలు ఉపాదానకారణం. వారివారి కర్మ నిమిత్తకారణం. కర్మ వైచిత్ర్యమే శరీర వైచిత్ర్యానికి కారణం. కాబట్టి భోగప్రదమైన కర్మ ఉంటే శరీరం కలుగుతుంది. ఈ విషయంలో జాగ్రత్ స్వప్నాలు ఉదాహరణం. సుషుప్తిలో కర్మలేదు. శరీరమూ లేదు. మన్నుఉన్నా కుమ్మరి పని చేయకపోతే కుండాలేదు. ఈలాగే ఈశ్వరుడు సృజించిన పంచభూతాలున్నా ఆత్మజ్ఞానంచేత కర్మలు నశిస్తే జ్ఞానికి శరీరం లేదు.

## జ్ఞానం కలిగితే శరీరం కలుగదు

కర్మశాస్త్రంలో తప్పక అనుభవింపదగినది ౧ అనిన్నీ అనుభవింపనిదే కర్మ క్షయం కాదు ౨ అనిన్నీ ఉన్నది. జ్ఞానశాస్త్రంలో – 'జ్ఞానం అనే అగ్ని కర్మలను భస్మం చేసేస్తుంది' 3 అని ఉన్నది. పయిన చూపిన కర్మశాస్త్రానికీ జ్ఞానశాస్త్రానికీ విసంవాదం కనబడుతూంది. ఈ రెండు శాస్త్రాల మాటలలో ఏ మాటలు నమ్మాలి ?

శాస్త్రాలలో ప్రబలవచనాలు అనిన్నీ దుర్బలవచనాలు అనిన్నీ ఉంటవి. ఎట్లా అంటే–'అహింస ఉత్తమమైన ధర్మం' అనే అర్థం కల 'అహింసా పరమో ధర్మః' అనే వచనం దుర్బలం. 'యాగంలో పశుబంధం చేయాలి' అనే అర్థం కల– 'యజ్ఞాయ పశు మాలభేత' అనే వాక్యం ప్రబలం. ప్రబల వచనం దుర్బలవచనాన్ని ఖండిస్తుంది. ఈ రీతిగా 'కర్మ తప్పక అనుభవించాలి' అనే అర్థం కల 'అవశ్య మను భోక్తవ్యం' అనే వాక్యం 'తపస్సుచే పాపం నశింపజేస్తాడు' అనే అర్థం కల 'తపసా కల్మషం హన్తి' అనే ప్రబలవచనంచే ఖండింప బడుతుంది. కాబట్టి సంచితకర్మలెన్ని ఉన్నా జ్ఞానంచేత అవి అన్నీ నశించి పోయేవే. కర్మ లేకపోతే జన్మలేదు; జన్మ లేక పోతే దుఃఖంలేదు. దుఃఖం లేకపోతే ఆనందం ఆవిర్భవిస్తుంది.

---

౧. అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్.

౨. నాఽభుక్తం క్షీయతే కర్మ.

౩. జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున.

చ. తనువును దాల్చుచో వగపు తప్పదు, మేనికిఁ గర్మమాత్రమే
జనకము కాదు భూతములు పైతము కారణ మిట్లు దీనినిం
గనుఁగొని దీనిఁ బాయుటకు జ్ఞానము తక్క మరొక్క సూటి తె
న్నునది లేమి బ్రహ్మము సదాభ్యసనం బొనరింపఁగావలెన్.

ఇది చతుర్థ వర్ణకము

# పంచమ వర్ణకము

## కర్మవైవిధ్యం

ఆత్మకు దుఃఖ మెందువల్ల ? శరీరధారణవల్ల. శరీరం దేనివల్ల? కర్మవల్ల. ఆ కర్మ ఎట్టిది ?

పుణ్యకర్మ అనీ పాపకర్మ అనీ మిశ్రకర్మ అనిన్నీ కర్మ మూడు విధాలు. దేవాదుల శరీరం పుణ్యకర్మవల్లా మనుష్యాదుల శరీరం పుణ్య పాప మిశ్ర కర్మవల్లా పశ్వాదులశరీరం పాపకర్మవల్లా కలిగింది.

పై జెప్పిన పుణ్య పాప మిశ్ర కర్మలు మూడూ ఒక్కొక్కటి మళ్ళా మూడేసి మూడేసి రీతులు. ఈ చెప్పిన కర్మభేదంచే జన్మభేదంగూడా నానావిధాలు. ఎలాగంటే—హిరణ్యగర్భాదుల శరీరం పుణ్యోత్కృష్టం. ఇంద్రాదుల శరీరం పుణ్యమధ్యమం. యక్షరాక్షస పిశాచాది శరీరం పుణ్య సామాన్యం.

పరులకు సంతాపం కలిగించే ముండ్లచెట్లూ విషపుచెట్లూ పులులూ పాములూ తేళ్ళూ గూబలూ దోమలూ మొదలైనవాని శరీరం పాపోత్కృష్టం. పండ్లూ ఆకులూ పూవులూ మొదలైనవానిని ఇచ్చే పనస మామిడి కొబ్బరి అరటి చెట్లవంటి చెట్ల శరీరమున్నూ ఊరబంది దున్నపోతు ఒంటె గాడిదలవంటి జంతువుల శరీరమున్నూ పాపమధ్యమం. రావి తులసి మారేడు ఆవు గుఱ్ఱము మొదలగువాని శరీరం పాపసామాన్యం.

మానవలోకంలో నిష్కామకర్మానుష్ఠానమూ సాధన చతుష్టయమూ సద్గురులాభమూ శ్రవణమూ మననమూ ఆత్మజ్ఞానము అనే క్రమాన జీవన్ముక్తికీ విదేహముక్తికీ తగ్గ మనుష్యశరీరం మిశ్రకర్మోత్కృష్టం. స్వాశ్రమానికి తగ్గ కర్మలనూ కామ్యకర్మలనూ చేయడానికి తగ్గశరీరం మిశ్రకర్మ మధ్యమం. పుల్కస కిరాతాదుల శరీరం మిశ్రకర్మ సామాన్యం.

వివేకవంతుడు ఇన్ని విధాలుగా ఉన్న కర్మఫల తారతమ్యం తెలిసికొని యీ మనుజజన్మలో మిశ్ర కర్మోత్కృష్ట జన్మ కలిగే చందంగా స్వవర్ణాశ్రమ కర్మలుచేసి ఫలేచ్ఛవిడిచి యీశ్వరార్పణంచేసి ఆత్మవిచారణద్వారా మోక్షప్రాప్తికే ప్రయత్నం చేసుకోవాలి.

## కరణాలదే కర్తృత్వం

వెనుక జెప్పిన త్రివిధకర్మ ఎవరు చేసేది? ఈ త్రివిధ కర్మనూ త్రివిధాలైన *కరణాలే (మనో, వాక్కాయాలు) చేస్తున్నవి. ఓయీ! అందరూ 'నేను చేస్తున్నానంటే నేను చేస్తున్నానని గుండెలు చరచుకుంటారు. కాబట్టి దేహాన్ని అభిమానిస్తూ 'నేను' అనే మాటకు అర్థంగా ఏ ఆత్మ ఉన్నదో ఆ ఆత్మకు కర్తృత్వం చెప్పాలి. ఇట్లా చెప్పక ఆ ఆత్మనువిడిచి త్రికరణాలమీద కర్తృత్వం ఎట్లా పారవేస్తావు? అని అంటావా? అయితే విను–ఆ అసలు ఆత్మ అవికారి. నిష్క్రియం స్వగత భేదశూన్యం. కాబట్టి ఆత్మకు కర్తృత్వం చెప్పడానికి ఆస్కారం లేదు.

'కర్తృత్వం ఏలాగో ఆత్మలో ఉన్నట్టే కనబడుతుం దయ్యా! పోనీ! ఇంకో కర్త ఉన్నాడా అని వెతికితే ఎక్కడా కనబడడు?' ఇది ఎల్లా?

## ఆత్మకు కర్తృత్వం స్వాభావికం కాదు

అధ్యాసవల్ల ఆత్మకు కర్తృత్వం కనిపిస్తున్నదే కాని స్వభావంవల్ల కాదు. స్వాభావికమే అయితే వేదాంతవిచారం చేసినా ఉన్న కర్తృత్వం పోదు. అది పోకపోతే సంసార బంధం ఊడిపోదు. కాబట్టి ఇదంతా వృథాప్రయాసే అయి పోతుంది.

'ఆత్మకు కర్తృత్వం స్వాభావికమే. ప్రయత్నవిశేషంచే పోవచ్చునేమో!'

'పోదు. స్వభావ మెప్పుడూ స్వరూపమే కాబట్టి అది పోవడానికి వీలులేదు. ఇది ఇట్లా ఉండనీండి, స్వరూపనాశ నానికి ఎవడయినా ప్రయత్నం చేస్తాడా? స్వరూపనాశమే సంభవిస్తే ఏ పురుషార్థం అనుభవించినట్టు? ఇంకా వినండి — అకర్తా జీవన్ముక్తుడూ లేకపోతే వేదాంత సంప్రదాయమూ ఉండదు, గురువనేవాడూ శిష్యుడనేవాడూ ఉండడు. ఇంకా 'ఆత్మ అకర్త సాక్షి నిష్క్రియుడూ ౧ అని చెప్పే శ్రుతులకు మతిలేదని అనాలి.'

---

౧. 'నిష్క్రియం నిర్మలం శాంతం నిరవద్యం నిరఞ్జనమ్.' 'సాక్షీ చేతా కేవలో నిర్గుణ శ్చ.'

సుషుప్తిలో ఆత్మ ఉన్నది. కాని అతనికి కర్తృత్వం లేదు. అతనికేగనుక కర్తృత్వం స్వాభావిక మయితే అగ్నికి వేడిమివలె కనిపించాలి. అలా కనిపించడం లేదు. కాబట్టి ఆత్మకు కర్తృత్వం స్వాభావికం కాదు.

'ఇంద్రియాలు పని చేయక ఊరకోవడంవల్ల నిద్రలో కర్తృత్వం కనబడదు. వడ్రంగి కర్త ఐనా స్నాన భోజనాది సమయాలలో వడ్రపు కర్తృత్వం కనబడుతూందా ? అలాగే నిద్రలో ఏ కర్తృత్వమూ లేకపోవచ్చు. ఇంత మాత్రంచేత అకర్తృత్వం ఎట్లా ?

ఉదాసీనంగా ఉన్నప్పుడు అంతఃకరణంతో సంయోగం ఉన్నా కర్తృత్వం కనబడటం లేదు, కాబట్టి ఆత్మకు కర్తృత్వం అస్వాభావికం. ఇక నేమంటే యీ కర్తృత్వం ఆధ్యాసికం.

## అధ్యాస

ఒక వస్తువు ధర్మాలు ఇంకో వస్తువులో ఉన్నట్లు ఆభాసించడం (కనబడడం) అధ్యాస. కాలువలో పడవ పోతూంది. మనము పడవలో కూర్చుండి చూస్తూ ఉంటాం. ఒడ్డున ఉన్న చెట్లు నడచిపోతున్నటులున్నూ పడవ కదలక కూచున్నటులున్నూ మనకు తోస్తుంది. ఈ ఉదాహరణంలో పడవ నడక చెట్లలోనూ చెట్ల నిలకడ పడవలోనూ తోస్తుంది. ఇట్లా పడవ నడక చెట్ల మొదలా చెట్లనిలకడ పడవ మొదలా (తోచడం) అధ్యాస. ఈలాగే త్రివిధాలయిన కరణాలలోగల

కర్తృత్వం ఆత్మలోనూ ఆత్మలోగల అకర్తృత్వం త్రివిధాలైన కరణాలలోనూ తోచడం అధ్యాస వల్లనే అని గమనించి అనుభవంలోకి తెచ్చుకోవాలి. కాబట్టి ఆత్మయందు కర్తృత్వం ఆరోపితం అని తెలిసికొనేది.

'జడాలయిన ఇంద్రియాలు అచేతనాలు కదా! వాట్లకు కర్తృత్వ మెట్లా? కరణాలకే గనుక కర్తృత్వం ఉంటే వాట్లకూ కరణాంతరా లుండవలెనే, అట్లా వుంటే అనవస్థ ఏర్పడుతుందికదా!' అంటే విను :- గాలి అచేతనం. అది చెట్లను పెకలించి దూరానికి విసిరిపారేస్తుంది. ఇట్లే అచేతనమయిన జలప్రవాహం బండలనూ కొండలనూ సముద్రంలోకి తోర్లిం చేస్తుంది. వీనికి కరణ మేమీ లేదు. కర్తృత్వం మాత్రం ఉంది. ఈలాగే కరణత్రయానికీ కరణాంతరం లేకుండానే కర్తృత్వం ఉపపన్నం అవుతుంది.

## మనోవాక్కాయ కర్మలు

ఈ మూడు విధాల కరణాలూ చేసే పని ఏమి? సగుణచింత లేక సగుణధ్యానం, నిర్విశేషచింత లేక నిర్గుణధ్యానం, పరలోకచింత, భక్తి జ్ఞాన వైరాగ్యచింతనం ఈ మొదలయిన వికారాలు మనస్సు చేసే కర్మలు (పనులు) ఈ కర్మ లన్నీ మానస పుణ్య కర్మలు.

విషయచింత పరాపకారచింత వేదశాస్త్రాలు ప్రమాణం కావని తలపోయడమూ ధర్మమేమిటి అధర్మమేమిటి ఈ

రెండూ లేవని అనుకోడం, యీ మొదలయిన బుద్ధివికారా లన్నీ మానస పాపకర్మలు.

సవిశేషచింతతోనూ నిర్విశేషచింతతోనూ పుణ్యచింత తోనూ విషయచింత మొదలయిన పాపచింతలనుగూడా కలిపి చింతించడం మానస మిశ్రకర్మ.

వేదాధ్యయనం శాస్త్రగీతాభ్యాసం సహస్రనామాది పఠనం పంచాక్షర్యాది మంత్రజపం భగవన్నామసంకీర్తనం పరోపకార వార్త సత్యవాక్యం మృదుభాషణం ఈ మొద లయినది వాచికమయిన పుణ్యకర్మ.

వేదశాస్త్రదేవతాది దూషణం అసత్య పారుష్య పైశున్య ఉపహాసవార్తాదికం వాచిక పాపకర్మ

వేదాధ్యయనం చేసేటప్పుడూ పూజాది పుణ్య ప్రమే యాలలోనూ పరనింద చేయడం కల్లలు పలకడం పరిహా సించడం లౌకిక ప్రసంగాలు చేయడం వాచిక మిశ్రకర్మ.

పుణ్యతీర్థస్నానం గురుదేవతా నమస్కారం దేవపూజ ప్రదక్షిణం సజ్జనసందర్శనం త్యాగం లోకానుగ్రహ సంచారం ఈ మొదలయినది కాయిక పుణ్యకర్మ. పరహింస పరస్త్రీ సంగం చౌర్యం దుర్జనసహవాసం మొదలయినది కాయిక పాపకర్మ. బ్రాహ్మణభోజనానికి గాను బ్రాహ్మణోపద్రవం చేయడం, దేవాలయ నిర్మాణానికి ఇళ్లు దోచడం, చలివేంద రలు పెట్టి నీళ్లు మోయించి నీళ్లు మోసి తెచ్చినవారికి కూలి

ఈయకుండా ఎగబెట్టడం ఈ మొదలైనవి కాయిక మిశ్ర కర్మలు. ముత్తెరగులైన యీ కర్మలను లెస్సగా విచారించి చూచుకోనేది.

## విచారానికి ఫలం ఏమిటి

విచారించి చూచుకుంటే కలిగే ప్రయోజనం ఏమిటి? ముఖ్యఫల మనిన్నీ అవాంతరఫల మనిన్నీ ఫలం రెండు విధాలు. మూడు రకాలైన కర్మలనూ మూడు రకాల కరణాలే చేస్తున్నవి. ఆత్మ ఆకాశం లాగా అసంగం నిరంశం పరిపూర్ణం చైతన్యస్వరూపం. కాబట్టి అతడు ఏకర్మకున్నూ కర్తకాడు. చిదాకాశస్వరూపుడైన తన్ను ఏ కర్మా అంటదని తెలిసి సందేహం విడిచి దృఢమైన అనుభవం పొందటం ముఖ్యఫలం. బ్రహ్మజ్ఞానం కలిగినప్పటికిన్నీ మూడు రకాలయిన యీ యింద్రియాలను పుణ్యకర్మల యందే బిగించి ఉంచాలి. అది అసంభవమయితే మిశ్రకర్మయందయినా ఉంచాలిగాని పాప కర్మలలో మాత్రం ఎన్నటికిన్నీ ఉంచరాదు. ఇట్లా మిశ్రకర్మ యందుగాని పుణ్యకర్మయందుగాని ఉంచడం అవాంతరఫలం. అరటితోట పెంచేవానికి అరటిపండ్లు ముఖ్యఫలం. ఆకులూ పూవులూ మొదలయినవి అవాంతరఫలం. ఈ మాదిరిగానే మూడురకాల కరణాలచే చేయబడే కర్మకూ జ్ఞానానికీ పూర్వం చెప్పిన రెండు ఫలాలలో మొదటిది ముఖ్యఫలం, రెండోది అవాంతర ఫలం.

## జ్ఞాని కర్త కాడు

తామరాకును నీటిబొట్టున్నూ జ్ఞానిని కర్మయున్నూ అంటదు. అతనికి విధీలేదు నిషేధమూలేదు. అతడు అకర్త కర్మసాక్షి కృతకృత్యుడు అని తెలిపోయింది. కాబట్టి 'జ్ఞాని అజ్ఞానిలాగా పుణ్యకర్మలే చేయవలయుననే నియమం ఎందుకు ?' అంటే నీ వన్నమాట నిజమే, జ్ఞాని కృతకృత్యుడే. అతడు కర్త కాడు. ఈ యెడల సందేహం ఏమీలేదు. ఇట్లా ఐనప్పటికీ బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులలో బ్రహ్మవిద్వరిష్ఠుడే వృత్తిశూన్యుడు. అతనికి మరి విధినిషేధాలు లేవు. మిగిలిన మూవురూ జ్ఞానమహిమ చేత విధినిషేధాలను పాటింపకున్నా వృత్తిశూన్యులు కానందు వల్లా లోకబోధకోసం వ్యవహారం పెట్టుకోవడంవల్లా లోకానుగ్రహం కోసం సదాచారం చేస్తూనే ఉండడం మంచిపని. కాని ఇది నియమంకాదు. కాబట్టి తత్త్వమేమిటో తెలిసికొన్న జ్ఞానికర్మ చేసే వారలలో కర్మ చేసే వాని వలెనే ఉండాలి. జిజ్ఞాస కలవారలకు 'కర్మ వదిలేసి బ్రహ్మమే సత్యమనిన్నీ జగత్తుమిథ్య అనిన్నీ తెలియజెప్పాలి.' మొత్తంమ్మీద ఇచట చెప్పే దేమంటే 'కరణత్రయానికే కర్తృత్వంకాని ఆత్మకు కాదు'—అని.

## ఆత్మచేయించేవాడున్నూ* కాడు

ముత్తెరగులైన యీ కరణాలు తామే కర్తలా ఇంకొకరిచేత ౧ ప్రేరింపబడి తాము చేస్తయ్యా ?

---

*. కారయిత ౧. ప్రయోజక కర్త.

కరణాలు రాగద్వేషాదులచేత ప్రేరణ చేయబడి కర్తృత్వాంవహిస్తూ ఉన్నవని గ్రహించేది. 'రాగద్వేషాదులు ఉబికితే కరణత్రయం ప్రవర్తిస్తుంది. రాగాదులు లేకపోతే ప్రవర్తించవు, అనే అన్వయ వ్యతిరేకాలచే రాగద్వేషాదులు కరణాలచేత పని చేయిస్తవని అనుభవసిద్ధం. నేను గుళ్ళు కట్టిస్తాను, గోపురాలు కట్టిస్తాను, చెరువులు తవ్విస్తాను నూరు వులు తీయిస్తాను అని అంటూ ఉండడంవల్ల ఆత్మ చేయించ వచ్చుగదా! కాబట్టి ఆత్మకారయిత లేక ప్రయోజకకర్త ఎందుకు కాదు? అని అంటే—కాదు, ఆత్మ నిర్వికారం ౧.

నిర్వికారమైన వస్తువుకు కారయితృత్వాం పొసగదు. ఆత్మలో కారయితృత్వాం ఉన్నట్లు కనబడుతుంది. అదిమెట్లాంటి దనగా మంకెనపూల ఎఱ్ఱదనం స్ఫటికంలో ఉన్నట్లు కనబడటం లాంటిది. రాగద్వేషాదులలో ఉన్న కారయితృత్వాం భ్రాంతి చేత ఆత్మయందు ఆరోపితం. ఇంతేకాక ఆత్మకు అది స్వాభా వికమూ కాదు. అట్లా అయితే దానిని నశింపజేయడాని కెవడూ ప్రయత్నింపడు. స్వభావ మనగా స్వరూపమని ఇది వరకే తెలిసికొన్నాము కదా! ఏలాగో ఓలాగు దాన్ని నాశనం చేయదలచుకొంటే స్వ-రూప నాశనం చేయదలచు కొన్నట్లే అవుతుంది. జ్ఞానికి కారయితృత్వాం ఉన్నదంటే— ఆత్మ అసంగము నిర్వికారము, ఇత్యాద్యర్థంకల—'అదృశ్య

---

౧. అనగా వృత్తిలేనిది. మనస్సుంటే వృత్తి ఉంటుంది, వృత్తే వికారం. ఆత్మకు మనస్సు లేదు, కాబట్టి నిర్వికారం.

మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం ౧ ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః' అను శ్రుతి నిరర్థకం అయిపోయింది. కారయితృత్వం జన్యం అని అంటారా—అనగా చేయించడం లోగడ లేక ఇప్పుడు పుట్టు కొస్తుంది అని అంటారా—ముక్తికూడా (లేనిది) పుట్టు కొస్తుంది అని అనవలసివస్తుంది. ఇంతేకాక సుషుప్తిలోనూ కారయితృత్వం కనబడాలి. అట్లా కనబడడంలేదు. కాబట్టి ఆత్మకు కారయితృత్వం స్వాభావికం కాదు. మరి ఆగంతుకం.

'ఓయీ! సుషుప్తిలో కారయితృత్వం కనబడనంత మాత్రాన ఆత్మ కసలే కారయితృత్వం లేదని అనడం ఎట్లా? గురువుకు బోధకత్వం ఉన్నా శిష్యులు లేనప్పుడు అదెక్కడుంది? ఈల్లాగే సుషుప్తిలో కరణసంయోగం లేదు. అందు వల్ల ఉన్న కారయితృత్వమే కనబడదు. కాని జాగ్రత్ స్వప్నాలలో కరణసంయోగం ఉన్నది. అప్పుడు కారయి

---

౧. ఎవనిని జ్ఞానేంద్రియాలకు అగోచరు డనిన్నీ వ్యవహరించడానికి వీలు లేనివాడనిన్నీ కర్మేంద్రియాలచే గ్రహింపరానివా డనిన్నీ ప్రత్యక్షాది ప్రమాణాలకు విషయం కాడనిన్నీ మనస్సుకు అందనివా డనిన్నీ శబ్దముచే తెలుపుటకు వీలు లేనివాడనిన్నీ ముచ్చటులా ఒక్కడంటే ఒక్క తానే అను ఎరుకయే చేవగాగల వాడనిన్నీ ఉపశాంతప్రపంచు డనిన్నీ శాంతుడనిన్నీ శివు డనిన్నీ అద్వితీయు డనిన్నీ తురీయు డనిన్నీ తలుస్తారో అతడు ఆత్మ, అతడు తెలిసికోదగ్గవాడు. (అతనిని తెలిసికో!)

తృత్వం కనబడుతూనే వుంటుందిగదా !'. అని అంటే విను !— జాగ్రదవస్థలోనే ఉదాసీనత యందున్నూ తూష్ణీం భావము నందున్నూ కరణసంయోగం ఉన్నది. అపుడు కారయితృత్వ మేదీ ? అది స్వాభావికమే అయితే కానరావాలి. అట్లా కాన రాదు. కాబట్టి కారయితృత్వం ఆగంతుకం అని అనాలి. అన్యోన్యాధ్యాసవల్ల ఇనుపకమ్మి లోని నిడుదతనమూ కురుచ తనమూ అగ్నియందున్నూ అగ్నియందలి ఎఱ్ఱదనమూ వెచ్చ దనమూ దీప్తి ఇనుపకమ్మి యందున్నూ భాసించినటులు అజ్ఞానంవల్లనే రాగద్వేషాదులందలి కారయితృత్వం ఆత్మ యందూ ఆత్మయందలి అకారయితృత్వం రాగద్వేషాదుల యందూ భాసిస్తూన్నది.

'ఓయీ ! అచేతనాలు కదా రాగద్వేషాదులు. వానికి కారయితృత్వం చెపుతా వేమిటి ? ఒక కుండను ఇంకో కుండను ఎత్తుకోపోయి నీరు తెమ్మను! అల్లా తేగలిగితే రాగాదులకు కారయితృత్వం ఉన్నట్లే ఒప్పుకుంటాను' అని అంటే విను! ఒకానొకపుడు యోగ్యత వుంటే జడం జడాన్ని ప్రేరింప వచ్చును. ఆ సంగతి వెనుక చెప్పినా మళ్ళా చెపుతాం. అగ్ని జడమేకదా! అది జడమయినా గంధకం హింగుళం మొదలయిన ప్రేలుడు సామానుతో కలిసి జడమే ఐన తుపాకి ఫిరంగి మొదలయిన వానిని పేలేటటులు చేసి ఇనుపగుండ్లూ రాతిగుండ్లూ విసరి చతురంగసైన్యాన్ని ధ్వంసం చేసి పారేస్తు

స్నది. ప్రేతశరీరం ఏమిటి ? అది జడమే కదా ! అయినా అయినా జ్ఞాతులచేత అపరకర్మ చేయించుకొంటూంది. ఈ మాదిరి గానే అచేతనాలయినా రాగద్వేషాదులు మనోవాక్కాయ రూపమయిన కరణత్రయంచేత పని చేయిస్తూ ఉంటవి.

అట్లాగయితే—ఆత్మ ఇంద్రియాలకు ఏలిక అనిన్నీ అంతర్యామి అనిన్నీ చెప్పే శ్రుతికి తాత్పర్యం ఏమిటి ?

సూర్యుడు తనదారిని తాను ప్రకాశిస్తున్నాడు. అతని వెలుగు చూచుకొని లోకులు మంచిపనులూ చేస్తున్నారు, పాడుపనులూ చేస్తున్నారు. సన్నిధిమాత్రం చేత ఈ తప్పొప్పు లను అతడు చేయిస్తున్నాడని అంటారా ? అనరు కదా ! ఆలాగే ఆత్మకూడా సన్నిధిమాత్రంచేతనే అనుకూలుడుగాని మరోటి కాదు.

అయ్యా ! సన్నిధానమాత్రంచేత నయినా ప్రాణుల అందరయూ కర్మకు బాధ్యుడయితే అతనికిన్నీ ఆ యా పుణ్య పాపకర్మల సంబంధంమాత్రం ఎందు కుండదు ?

ఇందాక చెప్పిం దేమిటి? సూర్యుడు తన ఉనికిమాత్రం చేతనే అందరి పుణ్యాలకూ పాపాలకూ అనుకూలుడైనా ఆ సూర్యునికి వారి పుణ్యాలతోగాని పాపాలతోగాని ఫలముతో గాని సంబంధం ఉన్నదా ? అట్లే ఆత్మకున్నూ తత్సంబంధం

లేదు. ౧ దాపున ఉన్నంతమాత్రాన సూదినిలాగడం సూదంటు రాతిపని. అంతేకాని, సన్నిధానమాత్రంచే తనకు అనుకూలమయినా సూదంటు రాతిని తాకడం సూదికి చేత కాదు. అలాగే ప్రాణుల కర్మగూడా ఆత్మను తాకలేదు. కాబట్టి ఆత్మ నిరంజనుడు నిర్వికారుడూ.

## ప్రతిబంధత్రయం

ఇట్లా ప్రసిద్ధమయిన ఆత్మరూపాన్ని గురువు ఉపదేశించినా మూడు ప్రతిబంధాలనేవి ఉండడంచేత అది మనసుకెక్కదు. సంశయభావన, అసంభావన, విపరీతభావన అనేవి ఆ మూడు ప్రతిబంధాలు. ఋగాదిశాఖలలో చెప్పబడ్డ ఉపనయనాదికర్మ లనేకవిధాలయినట్లు ఆ ఋగాదిశాఖలలో ఉపదేశింపబడిన ఆత్మతత్త్వంకూడా అనేకవిధమా లేక ఏకవిధమా అనే సంశయానికి సంశయభావన అని పేరు. అది సకల వేదాంతాల తాత్పర్యావధారణ రూపమైన శ్రవణంచే పోతుంది. ఇట్లా వేదాంతాలు అన్నింటికి అద్వైత బ్రహ్మమునందే తాత్పర్యం అనే శ్రవణంచే ప్రమాణవిషయమై సంశయం సమసిపోయినా పరస్పర విరుద్ధాలయిన జీవేశ్వర జగత్తులు

---

౧. అయస్కాంతవద్రూపాదివచ్చ ప్రవృత్తిరహితస్యాపి ప్రవర్తకత్వోపపత్తేః, యథాఽయస్కాంతో మణిః స్వయం ప్రవృత్తిరహితో ప్యయసః ప్రవర్తకో భవతి, యథా చ రూపాదయో విషయాఃస్వయం ప్రవృత్తిరహితా అపి చక్షురాదీనాం ప్రవర్తకా భవన్త్యేవం ప్రవృత్తిరహితోఽపీశ్వర స్సర్వగత స్సర్వాత్మా సర్వజ్ఞ స్సర్వశక్తిశ్చ సన్ సర్వం ప్రవర్తయే దిత్యుపపన్నమ్. ౨-౨-౩-బ్ర.సూ.భాష్య

సత్యంగా కనిపిస్తుండంగా 'ఇదంతా అద్వైతం, అంటే — జీవే
శ్వరజగత్తు లోకటంటే ఒకటి అనే బుద్ధి యెట్లా కలుగు
తుంది అనే సంశయం అసంభావన. ఇది స్వప్నదృష్టాంతాది
యుక్త్యాత్మకమైన మననంచేత నశిస్తుంది. ఇట్లా శ్రవణ మన
నాలు చేసినా అనాదియైన అవిద్యావాసనచే వెనుకటివలెనే
'సర్వమూ సత్యమే' అనే ప్రతీతి విపరీతభావన. అది బ్రహ్మా
కాకార ప్రత్యయ ప్రవాహరూపమయిన నిదిధ్యాసనము చేత
నశిస్తుంది. ఇట్లా యీ మూడు ప్రతిబంధాలనూ సమయింపక
పోతే అగ్ని అన్నిటినీ తగులబెట్టగలిగినా మణి మంత్రాదుల
ప్రభావంచేత ఒక గడ్డిపోచనయినా తగులబెట్టజాలని చందంగా
జ్ఞానాగ్నిన్నీ ప్రతిబంధాలచే ప్రతిబద్ధమై అజ్ఞానాన్నిగాని దాని
పనులలో ఏ యొక పనినిగాని తగులబెట్ట జాలదు. వెనుక
చెప్పినటులు ప్రతిబంధత్రయాన్ని పోగొట్టుకొన్నట్టు లయితే
వెంటనే అగ్ని గడ్డిపోచనువలె జ్ఞానము అవిద్యనూ అవిద్యా
కార్యాలనూ భస్మసాత్కరింప జాలుతుంది. ౧

---

౧. మననధ్యానాలవల్ల బ్రహ్మజ్ఞానరూపమైన చరమవృత్తి ఉదయి
స్తుంది. బ్రహ్మజ్ఞానం కలిగితే మరి ద్వైతభానం లేదు. ఈ బ్రహ్మ
జ్ఞానంకూడా బ్రహ్మమునకు కీప తక్కువే. ఎంచేతనంటే అది
మనోవృత్తి; బ్రహ్మమును గూర్చిన జ్ఞానం. ఇది బ్రహ్మరూపజ్ఞానం
కాదు. బ్రహ్మాకార వృత్తి ఉన్నదే అది వృత్తిప్రతిఫలితజ్ఞానం.
బ్రహ్మజ్ఞానం బ్రహ్మముగా శేషించిన జ్ఞానం. అయితే బ్రహ్మాకార
వృత్తి ఎట్లా పోతుంది? కార్చిచ్చు అడవితోపాటు తన్ను వ్యక్తం
చేసిన వెదుళ్ళనుగూడా భస్మం చేసేస్తుంది ఈలాగే చరమవృత్తి
మిగిలిన వృత్తులను తుడిచిపెట్టి తానూ పోగా ఉన్న జ్ఞానం లేక
బ్రహ్మము వ్యక్తమౌతుంది.

## శ్రుతి తాత్పర్య నిర్ణయం

(౧) ఉపక్రమోప సంహారములు. (౨) అభ్యాస. (3) అపూర్వత (౪) ఫలము (౫) అర్థవాద (౬) ఉపపత్తి. అనే ఈ ఆరున్నూ శ్రుతి తాత్పర్యాన్ని నిర్ణయించే లింగాలు. * ఈ ఆరు లింగాలనుబట్టి శ్రుతి తాత్పర్యాన్ని నిర్ణయించాలి. ఛాందోగ్యం ఆరో అధ్యాయంలో– 'స దేవసోమ్యేద మగ్ర ఆసీదేక మేవా ద్వితీయమ్' అని ఆరంభించి – ఐతదాత్మ్య మిదం సర్వమ్ తత్సత్యమ్' అని అఖండైక రసమే ముగింపు చేయబడినది. శ్రుతి తాత్పర్య నిర్ణయంలో ఇది ఉపక్రమోప సంహారైక రూప్యమైన ఒక లింగం.

ఇందు– 'ఓ సౌమ్యుడా! ఈ ప్రపంచానికి ముందు ఒకటంటే ఒకటేగాని రెండోదనే దేదీ లేని సత్తే ఉన్నది' అని ఉపక్రమం (ఆరంభం) అయింది. – 'ఈ ప్రపంచ మంతా ఆ సత్యాత్మకమే' అని ఉపసంహారం (ముగింపు) అయింది. ఎవరయినా ఏవిషయాన్నయినా చెప్పటం మొదలేసి ఆ చెప్పబడిన విషయమే చివరకూడా అనుగతంగా ఉండేటటులు ముగిస్తారు. తాత్పర్యనిర్ణయానికి ఇదొక గురుతు.

[సోమ్య = ఓ సౌమ్యుడా!, అగ్రే = మొదట, ఇదం = ఈ, సదేవ= సత్తామాత్రమే,అద్వితీయం, ఏకమేవ =రెండోదేదీ లేని ఒకటంటే ఒక్కటే అయిన, బ్రహ్మ = బ్రహ్మము, ఆసీత్ = ఉండెను. = "సృష్టి ముందు బ్రహ్మ మొక్కటే ఉందీ అని అంటే నామరూపాలతో మనకు కనబడే ఈ సృష్టిఅంతా మొదట బ్రహ్మరూపంగానే ఉన్నదన్న మాట." ఈసంగతితో ఈ ప్రకరణం ఆరంభమయింది.'ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా',

---

* ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతా ఫలమ్
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' = ఇదం సర్వం=ఈ యెల్లయు, ఐతదాత్మ్యం = ఈ బ్రహ్మాత్మకము, తత్ = అది, సత్యం=సత్తారూపము, సః = అది, ఆత్మా = ఆత్మ [అని(యు) చెప్పబడును] ఇదం, సర్వం = ఇది యెల్ల బ్రహ్మ, ఖలు= బ్రహ్మమే = 'కనబడుతూ వున్న యీ సృష్టి అంతా సత్తామాత్ర బ్రహ్మ రూపమే, అదే సత్యం, అదే ఆత్మ, ఈసృష్టి సమస్తమూ బ్రహ్మమే' అనే ఈ సంగతితో ఈ ప్రసంగం అంతమయింది. మొదట మొదలుపెట్టిన సత్తా మాత్రమే చిట్టచివరకూడా ప్రోదిచేయబడినది. అద్వైతమగు బ్రహ్మమే ఉపనిషదుద్దేశ్యం అని తేటతెల్లం. ఇది ఉపక్రమోపసంహారైకరూపత.]

౨. అభ్యాసం – ఉపక్రమించినదానినే పిదప ఆ ఛాందోగ్యం 'తత్త్వమసి' అని తొమ్మిదిమారులు చెప్పింది. ఇలా చెప్పినదానినే మళ్ళామళ్ళా చెప్పడం అభ్యాసం. తత్ = ఆ బ్రహ్మము. త్వమ్ = నీవు. అసి = అగుదువు. అని అర్థం. తాత్పర్య నిర్ణయానికి ఇదొక గురుతు. *

[ఒకేమాట రెండుమారులుగాని పలుమారులుగాని చెపుతాం. ఎందుకు? ఆ అర్థాన్ని గట్టిగా చేయడానికి. శాస్త్రంలో కూడా 'ద్విర్బద్ధం సుబద్ధం భవతి' = 'ఇనుమార్లు నిబంధనం చేయబడి నది సునిబద్ధం అవుతుంది' అని ఉన్నది. భగవదుపాసన చేసేవారు ప్రణవముగాని నామముగాని పలుమారులు చేస్తారు. ఎందుకు? ఉపాస్యమైన వస్తువేదికలదో అది చక్కగా నెలకొనుటకు. అలాగే ఛాందోగ్యం పలుతెరగులుగా ఈశ్వరుని గురించి చెప్పి 'తత్ త్వమసి = తత్ = ఆ బ్రహ్మము, త్వం, అసి = నీవు' అని తొమ్మిది మారులు ప్రస్తావించెను. ఇది అభ్యాసం. ఈయభ్యాసయందును అద్వైత బ్రహ్మమే ఉపనిషదుద్దేశ్యము. ఇటులు అభ్యాసగూడ శ్రుత్యర్థనిర్ణయానికి ఒక గుర్తు.]

---

* 'నీవు బ్రహ్మమవు' అని పలుతెరగుల పలుమార్లు చెప్పడం నిక్కమని స్ఫురింపజేయడానికి.

3. అఖండైక రసవస్తువు ప్రత్యక్షాది ప్రమాణాలకు విషయం కాదు అని చెప్పడం అపూర్వత. *

[ లోకంలో ఎరుగని సరికొత్తగా ఉన్న వస్తువునుగాని ఏదో విశేషం ఉన్న వస్తువునుగాని అద్భుతం లేక ఆశ్చర్యం పుట్టించే దానిని గాని అలౌకికమైనదానినిగాని అపూర్వం అని అంటాం. మనకు ప్రత్యక్ష - అనుమానాదులైన ప్రమాణాలలో రెండుప్రమాణాలచే గాని అంతకెక్కువ ప్రమాణాలచే గాని ఆయాయా వస్తువుల జ్ఞానము కలుగుతూంది. బ్రహ్మజ్ఞానం మనస్సహాకృతమైన శబ్దప్రమాణంచేతగాని, శబ్ద సహాకృతమైన మనస్సుచేతగాని కలుగుతుంది. ఇట్లా ప్రపంచంలో ఉన్న పదార్థాలన్నిటికన్న విశేషత బ్రహ్మ పదార్థమందున్నది. ఇంకో విశేషం — పరప్రకాశములు పరప్రకాశకములు అయిన అవిద్య, అంతఃకరణం మొదలయిన వస్తువులు ఏవీ బ్రహ్మమువలె స్వయంప్రకాశములు కావు. బ్రహ్మమువల్లనే ఇవి ప్రకాశించి పరప్రకాశకాలవుతవి. ఇట్లా అలౌకికతా రూపమయిన అపూర్వత బ్రహ్మమునందు ఉన్నట్లు — 'అత్ర వావ కిల సత్ సోమ్య న నిభాలయసే' ఛాం-౬-౨ = అత్ర వావ=ఈచోటునందే (సూక్ష్మముగా అంతటానిండిన ఉప్పువలె) అత్ర ఏవ=ఇందే (తేజస్సు నీరు అన్నము; వీని వికారమయిన దేహేంద్రియముల చట్టములోనే సూక్ష్మముగా నిండియున్న) సత్ = సత్తును అనగా బ్రహ్మమును, న నిభాలయసే= కనిపెట్టలేవు. ఇచట ఈకథ ఉంది:— ఉద్దాలకుడు తనకొడుకుకు బ్రహ్మము తెలపడానికి గాను ఒకనాటిరాత్రి 'నాయనా! ఒకపళ్లెంలో నీళ్ళు పోసుకొని పట్రా'మన్నాడు. ఆయనకొడుకు శ్వేతకేతువు పళ్లెం తెచ్చాడు. నాయనా! అందులో కాసంత ఉప్పు వెయ్యమన్నాడు. అతడు వేశాడు. మర్నాటి పొద్దున పళ్లెరంచూపి, ఉద్దాలకుడు, 'నాయనా! ఆ ఉప్పు ఎక్కడుందో కంటితో చూచి చెప్పు' అని అన్నాడు. శ్వేతకేతువు 'కానరావడం లేదు' అని అన్నాడు. ఉద్దాలకుడు 'చేత్తో పట్టుకో చూడు' అని అన్నాడు. శ్వేతకేతువు పట్టుకొని చూచి—'చేతికి తగలడంలేదు' అని అన్నాడు. ఉద్దాలకుడు — 'ఇదుగో ఈ పక్క ఒకబొట్టు నాలుకమీద వేసికో చూడు'

---

* వేదప్రామాణ్యంచే గాక వేరురీతిగా తెలియనిదీ, ఇతర ప్రమాణాలచే ఖండింపబడనిదీ అపూర్వం.

అన్నాడు. శ్వేతకేతువు వేసికొని 'ఉప్పగా ఉన్నది' అని అన్నాడు. ఉద్దాలకుడు—'అపక్క చూడు, మధ్యచూడు, పైనిచూడు, అట్టడుగున చూడు' అని అనగా శ్వేతకేతువు అల్లావేసికొని చూచి — 'అంతటా ఉప్పగానే ఉన్నది' అని అన్నాడు. ఉద్దాలకుడు 'సరే, చేతులు కడుక్కొని ఆచమించి ఇల్లా వచ్చి కూచో'మని అనగా శ్వేతకేతువు అట్లా కూచున్నాక ఉద్దాలకుడు — 'ఇప్పుడు నీ అనుభవ మేమిటో చెప్పు' మని అనగా అతడు — 'రాత్రి ఇందులో నేను వేసిన ఉప్పుగల్లు ఈ నీరంతా వ్యాపించినటులు తెలిసినది' అని అన్నాడు. అప్పుడుద్దాలకుడు— 'నాయనా! ఈ నీరంతా వ్యాపించి ఉన్న ఉప్పదనాన్ని కన్నుగాని చేయిగాని తెలిసికోలేక నాలుకయే తెలిసికొన్న చందముగా, అధిష్ఠానసత్తామాత్రమువల్ల పుట్టిన మహాభూతముల వికారమైన యీ దేహేంద్రియసముదాయంలో సూక్ష్మరూపంగా వ్యాపించియున్న సత్తామాత్రాన్ని ఆప్తవాక్యాదులవల్లనే గ్రహించాలి' అని చెప్పాడు. ఇది అలౌకికతా రూపమైన అపూర్వత. దీనిచేత గూడా సత్తామాత్రాద్వితీయ బ్రహ్మమే ఉపనిషదుద్దిష్ట మని తెలుస్తుంది. ఇది అపూర్వత అనే లింగం.]

౪. 'తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే' అనగా అఖండైక రసజ్ఞానం ప్రారబ్ధం భుజించిన వెంటనే విదేహకైవల్యం కలిగిస్తుందనేది ఫలం.*

[బ్రహ్మజ్ఞానానికి మోక్షం ఫలం. ఉద్దాలకుడు శ్వేతకేతువుకు తత్త్వజ్ఞానసాధనం ఉపదేశిస్తూ— 'తస్యతావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్య ఇతి' = తస్య = (ఆచార్యోపదేశం పొందిన) అతనికి, యావత్ = ఎంతవరకు, న విమోక్ష్యే = ('న విమోక్ష్యతే' అనుటకు బదులు విమోక్ష్యే అనునది ఛాందసం) దేహవిమోచనము కలుగకుండునో, తావదేవ, చిరం అంతవరకే విలంబము. అథ = ప్రారబ్ధము నశింపగా దేహపాతము తోడనే — ('భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే' బ్రహ్మసూత్ర. ౪-౧-౧౯). 'త దధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్' (బ్రహ్మ,

* 'మట్టి తెలిస్తే కుండ కడవ చట్టి బాన మూకుడూ ఇవన్నీ మట్టే అని తెలిసినట్లు ఏకవిజ్ఞానంచే సర్వవిజ్ఞానం ఫలం. అనిన్నీ కొందఱు.

౪-౧-౧౩) 'అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః' (బ్రహ్మ.౪-౧-౧౫) చూచేది.] సంపత్స్యే = (సంపత్స్యతే అనటకు బదులు) సంపన్నుడగును, అనగా శరీరం విడనాడడమేమిటి బ్రహ్మమయిపోవడమేమిటి ? ఈ రెండూ జరగడం ఒక్కమారే. అని చెప్పాడు. ఇందులో మోక్షమంటే సత్సంపత్తి. (బ్రహ్మమనటం), 'మూడు కాలాలలోనూ కర్తృత్వ భోక్తృత్వాలు లేని బ్రహ్మమును నేను, లోగడగూడా నేను కర్తనూ కాను భోక్తనూ కాను' అని బ్రహ్మవేత్త తెలిసికొంటాడు. దీనిపేరే మోక్షం. ఈవిధంగా ఫలప్రతిపాదనంలోనూ అద్వితీయ బ్రహ్మమే ఉపనిషత్తాత్పర్యం కాబట్టి ఫలంకూడా ఒక లింగం.]

౫. అర్థవాదలు ఏడు విధాలు : ౧. సృష్టి ౨. స్థితి ౩. లయ ౪. ప్రవేశ ౫. నియమన ౬. తత్త్వం పదార్థశోధన ౭. ఫలప్రతిపాదకాలు: 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ సంభూతః' * అనే యీలాటి సృష్ట్యాద్యర్థవాదరూప శ్రుతులు 'ఆకాశాదులన్నీ ఆత్మలోనే ఉండడమువల్లనూ ఆత్మలోనే లయం పొందడంవల్లనూ ఉత్పత్తి స్థితి లయాలు మట్టిలోనే వున్న కుండ మొదలైనవి మట్టికంటె వేరుకానట్లు బ్రహ్మమునే తెలియజేస్తూ మహావాక్యంలో చెప్పబడ్డ బ్రహ్మము సృష్టికి పూర్వం ఒక్కటంటే ఒక్కటే, రెండోది మరి లేదు' అని చెప్పుతున్నయ్!

— 'తత్తేజ ఏవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత' = 'ఇదిగో ఈ చోటునే చీల్చి ఆ చీలికగుండా ఇందులో ప్రవేశించింది', 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్' = 'దానిని సృజించి దానిలోనే దూరెను', 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' = 'జీవాత్మ

---

* ఆయీ ఆత్మనుండి ఆకాశం పుట్టింది.

రూపముగా ఇందు చొచ్చి నామరూపాలు విరివిచేస్తాను' ఈ మాదిరిగా ఉన్న శ్రుతులు బ్రహ్మమే జీవరూపంగా ప్రవేశిస్తున్నదని చెపుతూ వెలుపలనున్న వెంకయ్య ఇంట్లో ప్రవేశించినట్లు జీవబ్రహ్మములకు భేదం లేదనే మహావాక్యార్థాన్ని సంభావించినవి.

ఇంకా,— 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యామంతరో యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరమ్, యః పృథివీ మంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః' = 'ఎవడు పుడమిలో ఉంటూ పుడమికి లోపలివాడో, ఎవణ్ణి పుడమి ఎరుగదో, ఎవనికి పుడమి దేహమో, ఎవడు పుడమిలోనుండి పుడమిని నియమిస్తాడో అల్లితడే నీ అంతర్యామి —' అని యీ మొదలుగా గల నియమ్యనియామకశ్రుతి కూడా.‡ జీవాత్మ పరమాత్మలకు భేదం ఉన్నదని అంటే 'ఆ అంతర్యామి నీవు'* అనడం పొసగదు. కాబట్టి జీవబ్రహ్మముల కభేదాన్నే సంభావిస్తున్నది. ఈ మాదిరిగానే — 'స వా ఏష పురుషోఽన్నరసమయః' = 'ఈ పురుషు డన్నరసమయుడు', 'య దగ్నే రోహితం రూపమ్'= అగ్ని ఆదిత్య, చంద్రవిద్యుత్తులరూపాలు నామమాత్రాలె. అంతర్యామిరూపంగా పరమాత్మ వ్యాపించి ఉండడాన సద్రూపంగా ప్రకాశిస్తున్నవి. ఇవి పరమాత్మ విభూతులు. కాబట్టి ఆదిత్యాదులందు ఆత్మబుద్ధి చేయవలెను. ఈ మొదలుగా **తత్త్వం** పదార్థ శోధనరూపాలైన♦ శ్రుతులు

---

‡ దీనిని అంతర్యామి బ్రాహ్మణ మని అంటారు బృహదారణ్యకంచూచేది

* ఏషత ఆత్మాంతర్యామ్యమృతః.

♦ వాక్యవృత్తి - చూ.

జీవేశ్వరు లిరువురియందూ ఉన్న భిన్నధర్మాలను నిరసించి వారికి ఐక్యాన్నే సంభావిస్తున్నవి.

ఇట్లాగే— 'బ్రహ్మవి దాప్నోతి పరమ్' = 'బ్రహ్మము ఎరిగినవాడు బ్రహ్మమునే పొందుతాడు' (అనగా బ్రహ్మమే అవుతాడు) — 'అమృత స్సమభవత్' = 'అమరు డాయెను' ఇత్యాది శ్రుతులు అభేదజ్ఞానమే నిరతిశయమైన ఫలం ఇస్తుంద ని తెల్పి ఇక్కడ చెప్పదలచుకొన్నది అభేదజ్ఞానమే అని వక్కాణిస్తూ అభేదమునే సంభావిస్తున్నవి. ఈ రీతిగా సృష్టి స్థితి లయ ప్రవేశ నియమన తత్త్వం పదార్థశోధన ఫలాలను చెప్పే ఏడువిధాల అర్థవాదలు అవాంతరవాక్యాలతో కలిసి జీవ బ్రహ్మైక్య రూపమైన అఖండైకరసాన్నే చెబుతున్నవి. కాబట్టి అఖండైకరసంగానే మహావాక్యం చెప్పబడాలి.

[ఉపపత్తి అనే ఆరో లింగం మూలంలో చెప్పబడకున్నా ఇచట వివరిస్తున్నాను. — 'యథా సోమ్యైకేన మృత్ పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యా ద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికే త్యేవ సత్యం' = మట్టిముద్దంటే తెలిస్తే దానితో చేసిన కుండ చట్టి మూకుడు మొదలైన వన్నీ మట్టే అని తెలుస్తవి. ఇక కుండ చట్టి మూకుడు అనే వన్నీ పేర్లకే కాని మట్టే సత్యం అని తెలిసిపోతుంది. అని ఉపనిషత్తు చెపుతూంది. ఈలాగే నామ రూప క్రియాలచే భిన్న భిన్నంగా కనబడే కార్యరూప ప్రపంచమంతా పేరుకేకాని కారణంకంటె వేరుకాదు. కారణమే సత్యము, కార్యం అనృతం అనే యథార్థాన్ని పై దృష్టాంతం ఉపపన్నం చేస్తూంది. ఈరీతిగా ఉపపత్తి అనే లింగం కూడా ప్రత్యక్షనిర్ణాయకం.]

ఆరు విధాలయిన హేతువులచే శ్రుతి తాత్పర్యాన్ని నిర్ణయించడం శ్రవణం అని చెప్పబడుతుంది. ఇక ప్రకృతం, రాగాదులచే ప్రేరితమయిన త్రివిధ కరణాలూ త్రివిధ కర్మ

లనూ చేస్తున్నవి. మంత్రి సేనలను పంపుతాడు. సేన శత్రువు
లను ఓర్చి జయం సంపాదించుకొని వస్తుంది. 'ఆ విజయం
నేనే సంపాదించాను' అని రాజు తనకు ఆరోపించుకుంటాడు.
ఆ మాదిరిగానే ఆత్మకూడా రాగద్వేషాదులకు గల ప్రేర
కత్వాన్ని అజ్ఞానంవల్ల తనకే ఆరోపించుకొని ఆ ప్రేరకత
తనకే కలదని అభిమానిస్తున్నాడు. పైన చెప్పిన చందంగా
ఆత్మకు కర్తృత్వంగాని కారయితృత్వంగాని లేదని, అనగా
ఆత్మ తా నేదీ చేయదు, చేయకపోగా చేయించదు అని
దృఢంగా నిశ్చయించి ఎరిగినవాడే ముక్తుడు.

గీ. వాఙ్మనః కాయములై పుణ్య పాప మిశ్ర
కర్మలకుఁ గర్తలగుఁగాని కాను నేను,
కామ కోపాది గుణములే కారయితలు
కాను నే ననువాఁడె ముక్తత యెరుంగు.

ఇది పంచమవర్ణకము

మాయా వివరణము

సంపూర్ణము.

# ఉపదేశసహస్రి

## గద్యప్రబంధః

### శిష్యప్రతిబోధవిధిప్రకరణమ్.

మూ॥ అథ మోక్షసాధనోపదేశవిధిం వ్యాఖ్యాస్యామో ముముక్షూణాం శ్రద్దధానానా మర్థినా మర్థాయ. ౧

తా॥ తత్త్వశాస్త్రమునందు మిగుల శ్రద్ధ కలిగి, దానివలన జ్ఞానము వేడు, ముముక్షువుల కుపకారము కలుగుట[1] కిపుడు[2] మోక్షసాధనోపదేశవిధిని[3] వక్కాణించుచున్నాము. ౧

మూ॥ తదిదం మోక్షసాధనం జ్ఞానం సాధనసాధ్యాదనిత్యాత్సర్వస్మా ద్విరక్తాయ త్యక్త పుత్ర విత్త లోకైషణాయ ప్రతిపన్న పరమహంస పారివ్రాజ్యాయ శమ దమాది యుక్తాయ శాస్త్ర ప్రసిద్ధ శిష్యగుణసంపన్నాయ శుచయే బ్రాహ్మణాయ విధివ దుపసన్నాయ శిష్యాయ జాతికర్మ వృత్త విద్యాభిజనైః పరీక్షితాయ బ్రూయాత్ పునఃపున ర్యావద్ గ్రహణం దృఢీ భవతి. ౨

---

(1) పెక్కు గ్రంథములను రచించిన పిదప.

(2) ఆత్మజ్ఞానము — 'త దిదం మోక్షసాధనమ్ జ్ఞానమ్' అను ఉపదేశ సాహస్రిలోని రెండవ వాక్యము చూ.

(3) ఈ జ్ఞానశాస్త్రమునకు మోక్షము విషయము, బ్రహ్మము బోధ్యము, శాస్త్రము బోధకము కావున బ్రహ్మమునకును శాస్త్రమునకును బోధ్యబోధకభావము సంబంధము. శ్రద్ధతో తత్త్వార్థము తెలిసికొను ముముక్షు వధికారి. అజ్ఞాననివృత్తి ఫలము. ఇచటి సాధన పదము సాధనసాధ్యపరము.

తా॥ ఉపాయములచే[4] పొందదగి, నిత్యముకాని అన్నిటి యెడను విరక్తిచెంది కొడుకుల[5] మీద, సొమ్ము[6] మీద, లోకముల[7] మీద కోరిక విడిచి, సంన్యాసము స్వీకరించి, శమదమాదులను[8], శాస్త్రవిహితములగు మేలి[9] గుణములను కలిగి యథాశాస్త్రముగ వచ్చిన (శరణు చొచ్చి) బ్రాహ్మణశిష్యుని జూచి వాని జాతిని కర్మను[10] చరిత్రను విద్యను[11] స్వభావమును[12] పరీక్షించి అతనికి మోక్షసాధనమగు ఆయీజ్ఞానము గట్టిపడువరకు మరలమరల తెలుపవలయును. ౨

మూ॥ శ్రుతి శ్చ—‘పరీక్ష్య లోకాన్—త త్త్వతో బ్రహ్మవిద్యామ్’ ఇతి। దృఢగృహీతా హి విద్యా ఆత్మనః శ్రేయసే సన్తత్యై చ భవతి। విద్యాసంతతి శ్చ ప్రాణ్యనుగ్రహాయ। యభవతి నౌరివ నదీం తితీర్షోః। శాస్త్రం చ – ‘యద్యప్యస్మై

(4) సస్యాదులు కృష్యాదిసాధ్యములు, స్వర్గాదులు యాగాదిసాధ్యములు. ఇవి అన్నియు అనిత్యములు. బ్రహ్మము సిద్ధవస్తువు. అది సాధ్యము కాదు.

(5) పుత్రుని కొరకు వివాహవాంఛ చూ. బృహ - ౧-౫-౧౬, ౬-౪-౧ శాంకరభాష్య.

(6) గో - ధన - అపరవిద్యాది వాంఛ.

(7) ఇహపర వాంఛ. వేదవిహిత కర్మాచరణము వలన సత్యలోకము, ఉపాసనవలన దేవలోకము ఫలము. చూ - బృ ౧ - ౫ - ౧౬.

(8) ఆదిపదము ఉపరతి తితిక్షాసమాధాన శ్రద్ధలను చెప్పును.

(9) శౌచ సామర్థ్య స్నేహ జిజ్ఞాసా నిర్మమతాదులు.

(10) పతితుని శప్తుని విడనాడునది.

(11) ఉపదేశమును వితప్పచ్చకుండుటకు విద్యను మంత్రమును తెలిసికొనవలెను.

(12) విద్యారక్షణమున కాచారస్వభావములను పరికించవలెను.

ఇమా మద్భిః పరిగృహీతాం ధనస్య పూర్ణాం దద్యా దేతదేవ తతో భూయః' ఇతి । అన్యథా చ జ్ఞానప్రాప్త్యభావాత్ — — 'ఆచార్యవాన్ పురుషో వేద', 'ఆచార్యాద్ధైవ విద్యా విదితా', 'ఆచార్యః ప్లావయితా', 'సమ్యగ్ జ్ఞానం ప్లవ ఇహోచ్యతే' ఇత్యాది శ్రుతిభ్యః, 'ఉపదేక్ష్యన్తి తే జ్ఞానమ్' ఇత్యాది స్మృతేశ్చ. 3

తా॥ శ్రుతియు[13] — 'వేదములు చెప్పు కర్మములకు ఫలమగు ఆయాలోకములను పరీక్షించి ఆ కర్మములవలన గలుగున దేదియు నిత్యము కాదని తెలిసికొని నిర్వేదము పొంది సమిత్పాణియై బ్రహ్మము నెఱుగుటకు శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠుడు నగు గురువు నుపసర్పించునది. తత్త్వము నెరిగిన గురువు ఈ రీతిగా తనను నమ్మికొని వచ్చినవాడును శమ దమాది యుక్తుడు నగు ఆ శిష్యునకు నశ్వరము కాని నిత్యవస్తువును దెలిపి బ్రహ్మజ్ఞానమును తెన్నుగా తెలుపునది.' ఏలయన తిన్నగా తెలిసికొనిన విద్యయే తన శ్రేయమునకును శిష్యపరంపరా శ్రేయమునకును సమర్థమగును. శిష్యపరంపర కుపయోగించు ఈ విద్య 'నదిని దాటగోరువానికి నావవలె తనకును ఒరులకును ఉపయుక్తమగును.' అని చెప్పుచున్నది. శాస్త్రము గూడ 'ధనపూర్ణమై సముద్రములతో గూడిన భూమిని గురువున కిచ్చినను, దానికంటెను గురువొసగు ఈ జ్ఞానము దొడ్డది.' అని చెప్పును. గురు వొసగనినాడు[14] ఈ యెరుక చొప్పడదు. ఏలనగా శ్రుతులు — 'ఆచార్యవంతుడు[15] బ్రహ్మము నెరుగును',

(13) ము - ౧-౨-౧౨, ౧3. ఇదియే విద్యాసంతతి.

(14) ఛాం - ౬-౧౪-౨. (15) ఛాం - ౪-౯-3.

'ఆచార్యునివలన పొందిన యెరుకయే తిన్ననియెరుక', 'గురువు మరికాడు' 'తిన్నని యెరుక యిచట నావ' అని చెప్పను. స్మృతియు – 'తత్త్వవేత్తలు[16] నీకు జ్ఞానము నుపదేశింపగలరు' అని చెప్పుచున్నది. 3

**మూ॥** శిష్యస్య జ్ఞానాగ్రహణం చ లింగైర్ బుద్ధ్వా తదగ్రహణ హేతూన్ అధర్మ లౌకిక ప్రమాద నిత్యానిత్య వస్తువివేక విషయాసంజాత దృఢపూర్వశ్రుతత్వ లోకచింతావేక్షణ జాత్యాద్యభిమానాదీన్ తత్ప్రతిపక్షైః శ్రుతిస్మృతి విహితై రపనయే దక్రోధాదిభి రహింసాదిభి శ్చ యమైర్ జ్ఞానావిరుద్ధై శ్చ నియమైః. ౪

**తా॥** శిష్యుడు జ్ఞానమును తిన్నగా తెలిసికొనలేదనిగాని లేక వేఱుగా తెలిసికొనెననిగాని అతని ముఖవికార చేష్టా కార్యముల జూచి గురువు గ్రహించి అతడట్లు తెలిసికొనలేనందుకు తొల్లిటి పాపములు నేడు చేసికొన్న పాపములు, స్వేచ్ఛాభాషణ భక్షణాచారములు, మరియు నిత్యానిత్యములగు విషయమును మున్ను తిన్నగా నరయకపోవుటయు, లోకులు నుతించిన సంతసించుటయు, నిందించిన దుఃఖించుటయును, జాత్యభిమానము మొదలగు[17] నవియు కారణమని తెలిసి, వానికి శత్రువులుగా శ్రుతిస్మృతులచే చెప్పబడిన అక్రోధము అహింస మొదలగు యమముచేతను జ్ఞానమునకు విరుద్ధముకాని నియమముల చేతను పోగొట్టవలయును. ౪

(16) గీ. ౪-౩౪. (17) ఇతర ధిక్కారము.

మూ॥ అమానిత్వాది గుణం చ జ్ఞానోపాయం సమ్యక్ గ్రాహయేత్॥ ౫

తా॥ మరియు గురువు జ్ఞానమున కుపాయములగు అహంకారాద్యభావమును లెస్సగా నాటుకొనునటులు చేయవలయును. ౫

మూ॥ ఆచార్యస్తూహాపోహ గ్రహణ ధారణ శమ దమ దయానుగ్రహాదిసంపన్నో లబ్ధాగమో దృష్టా దృష్టభోగేష్వనాసక్త స్త్యక్త సర్వకర్మసాధనో బ్రహ్మ విద్ బ్రహ్మణి స్థితో௨భిన్న వృత్తో దంభ దర్ప కుహక శాఠ్య మాయా మాత్సర్యాద్యావృతాహంకార మమత్వాది దోష వివర్జితః కేవల పరానుగ్రహ ప్రయోజనో విద్యోపయోగార్థీ పూర్వ్వముపదిశేత్ — 'స దేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏక మేవా ద్వితీయమ్', 'యత్ర నాన్యత్ పశ్యతి', 'ఆత్మైవేదం సర్వమ్' 'ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్', 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇత్యాద్యా ఆత్మైక్య ప్రతిపాదనపరాః శ్రుతీః. ౬

తా॥ శిష్యుడు చెప్పజాలనివానిగూడ తా నూహింపగలిగి, లేక బోధించుట కనుకూలములగు యుక్తుల గల్పింపగలిగి, పొరపాటును తొలగింపగలిగి లేక సరికానివానిని నిరాకరింపగలిగి, ప్రశ్నార్థమును మరవక యుండగలిగి, దయానుగ్రహాదుల నొప్పి, సంప్రదాయముగా విద్యనేర్చి, ఇహపరసుఖములందనాసక్తుడై, కర్మసాధనముల గోరక బ్రహ్మవేత్తయై, బ్రహ్మనిష్ఠుడై, సదాచారసంపన్నుడై డంబము గర్వము మోసము వంచన మాయ మచ్చరములతో గూడిన అహంతా మమతాదులు లేక శిష్యులకు జ్ఞాన మనుగ్రహించుట కంటె వేరు

పనిలేక విద్యోపయోగము కోరువాడగు గురువు – 'నాయనా! ఇది[18] (కార్యప్రపంచము) మొదట సత్తామాత్రముగనే – అద్వితీయమగు ఏకముగనే – ఉండెను', 'ఎందు[19] ఇతరమును చూచుట పొసగదో', 'ఇది[20] యెల్ల ఆత్మయే', 'తొలుత[21] ఆత్మ ఒకటనగా నొకటియే ఉండెను', 'ఇది[22] యెల్లయు బ్రహ్మము'. ఈ మొదలుగా ఆత్మయు బ్రహ్మమును ఒకటియే యని చెప్పు శ్రుతులను మొదట నుపదేశించవలయును. ౬

మూ॥ ఉపదిశ్య చ గ్రాహయేద్ బ్రహ్మణో లక్షణమ్– 'య ఆత్మాఽపహతపాప్మా', 'యత్ సాక్షా దపరోక్షాద్ బ్రహ్మ', 'యోఽశనాయా పిపాసే', 'నేతి నేతి', 'అస్థూల మనణు', 'స ఏష నేతి', 'అదృష్టం ద్రష్టృ', 'విజ్ఞాన మానందమ్', 'సత్యం జ్ఞాన మనంతమ్', 'అదృశ్యేఽనాత్మ్యే', 'స వా ఏష మహా నజ ఆత్మా', 'అప్రాణో హ్యమనాః', 'స బాహ్యాభ్యంతరో హ్యజః', 'విజ్ఞాన ఘన ఏవ', 'అనంతర మబాహ్యమ్', 'అన్యదేవ తద్విదితా దథో అవిదితాత్', 'ఆకాశో వై నామ', ఇత్యాది శ్రుతిభిః. ౭

తా॥ ఇటులుపదేశించి – 'ఆత్మ[23] పాపము లేనివాడు', 'బ్రహ్మము[24] మిగుల దాపైనదియు పరోక్షము కానిదియు', (అనగా ప్రత్యక్షమైనది) 'ఆకలియు[25] దప్పియు లేనిది', 'ఇది[26] కా దిది కాదని తెలియదగినది', 'స్థూలము[27] కానిది మరియు

---

(18) ఛాం. ౬-౨-౧. (19) ఛాం. ౭-౨౪-౧.

(20) ఛాం. ౭-౨౫-౧ (21) ఐ. ఉ. ౧-౧-౧.

(22) ఛాం. ౩-౧౪-౧. (23) ఛాం. ౮-౭-౧. (24) బృ-౩-౪-౧.

(25) బృ. ౩-౫-౧. (26) బృ. ౨-౩-౬. (27) బృ. ౩-౮-౮.

అణువును కానిది', 'ఈ[28] యాత్మ యిది కాదు', 'ఇది[29] ద్రష్టయు కాని దృశ్యము కాదు', 'ఇది[30] జ్ఞానము ఆనందము', 'ఇది[31] సత్యము జ్ఞానము అనంతము', 'కానరానిది[32] మేను లేనిది', 'గొప్ప[33] దగు ఆ యాత్మ పుట్టుక లేనిది', 'ప్రాణము[34] మనస్సు లేనిది', 'లోపల[35] వెలుపల నిండి పుట్టువు లేనిది', 'ఎరుక[36] ముద్దయే', 'లో[37] వెలుపలు లేనిది', 'తెలియ[38] బడినవానికంటెను తెలియబడని వానికంటెను వేరయినది', 'ఆకాశము[39] నాబడునది' ఈ మొదలగు శ్రుతులచేతను. ౭

మూ॥ స్మృతిభిశ్చ— 'న జాయతే మ్రియతే వా', 'నాదత్తే కస్యచిత్పాపమ్', 'యథాకాశస్థితో నిత్యమ్', 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి', 'న సత్తన్నాసదుచ్యతే', 'అనాదిత్వాన్నిర్గుణత్వాత్', 'సమం సర్వేషు భూతేషు', 'ఉత్తమః పురుషస్త్వన్యః' ఇత్యాదిభిః శ్రుత్యుక్తలక్షణావిరుద్ధాభిః పరమాత్మాసంసారిత్వ ప్రతిపాదన పరాభిస్తస్య సర్వేణానన్యత్వ ప్రతిపాదనపరాభిశ్చ. ౮

తా॥ 'పుట్టదు[40] గిట్టదు', 'ఎవని[41] పాపములకును అంటదు', 'ఆకాశమునం[42]దున్న గాలివలె', 'నన్ను[43] క్షేత్రజ్ఞ

(28) బృ. 3-౯-౨౬. (29) బృ. 3-౮-౧౧.
(30) బృ. 3-౯-౨౭ లోని శ్లోకము చూ.
(31) తై. ౨-౧. (32) తై. ఉ. ౨-౭. (33) బృ. ౪-౪-౨౨.
(34) ము. ఉ. ౨-౧-౨. (35) ము. ఉ. ౨-౧-౨.
(36) బృ. ౨-౪-౨౧. (37) బృ. ౨-౪-౧౯. (38) కేన. ఉ. ౧-3.
(39) ఛాం. ౮-౧౪-౧. (40) గీ. ౨-౨౦. (41) గీ. ౫-౧౫.
(42) గీ. ౯-౬. (43) గీ. ౧3-౨.

నిగా నెరుగుము', (వ్యష్టిగతాత్మ సమష్ట్యాత్మతో వేరుకాదు) 'అది[44] సత్తునుకాదు అసత్తునుకాదు', 'అది[45] అనాదినిర్గుణము', 'భూతముల[46] అన్నిటను సమమైనది', 'ఉత్తమ[47] పురుషుడన్యుడు' అను నీ మొదలుగా వేదోక్తలక్షణములకు వేరు[48] కానివియు, పరమాత్మ అసంసారి యని చెప్పునవియు, అన్నిటికంటెను పరమాత్మ అనన్యుడనియు చెప్పు స్మృతులచేతను బ్రహ్మలక్షణమును[49] గ్రహించునటులు చేయవలయును. ౮

---

(44) గీ. ౧౩-౧౨. (45) గీ. ౧౩-౩౧. (46) గీ. ౧౩-౨౭. (47) గీ. ౧౫-౧౭.
(48) అద్వైతుల అభిప్రాయములో యోగసాంఖ్యాదులు వేదవిరుద్ధములు.

(49) 'బ్రహ్మవేత్త' 'పరమును' బొందు ననియు ఆ 'పరము' సత్యజ్ఞానానంత రూపమగు బ్రహ్మమనియు తైత్తిరీయమును, చెట్టును నరకుచో మరల అనవెట్టు ననియు మూలమును నరికివేసిన యెడల మరల బ్రదకదనియు అటులే మృత్యువు మర్త్యుని చంపినను మరల పుట్టుననియు ఈ మర్త్యమునకు మూలమేమి? యని ప్రశ్నించి విజ్ఞానానంద రూపమగు బ్రహ్మము అనియు బృహదారణ్యమున చెప్పుచున్నది. కాగా సచ్చిదానంద రూపమగు బ్రహ్మము ఈ ప్రపంచమునకు మూలము. ఆ బ్రహ్మమునకును సృష్టికిని సంబంధము — 'ఆ యీ ఆత్మనుండి ఆకాశ మాదిగా భూతములు పొడమె ననియు వానివలన ఈ ప్రపంచము కలిగె ననియు దానిలో బ్రహ్మము లేక ఆత్మ ప్రవేశించె ననియు తైత్తిరీయము మొదలగు శ్రుతులు చెప్పెను. ఇటులు ఆత్మ ప్రవేశించిన భూతాదికమగు ఈ ప్రపంచమను తొడుగు ఏదియు ఆత్మ కాదని అధ్యారోపాపవాదముల జెప్పెను. మరియు కొన్ని శ్రుతులు ఆత్మకు జాగ్రదాదులు లేవు. వానికి ఆత్మ సాక్షి. అది దృక్కే కాని దృశ్యము కాదు. బ్రహ్మాంశములే జీవులు. ఉపాధుల వలన కలిగిన భేదము మాయాకల్పితము. ప్రపంచము బ్రహ్మముకంటె వేరుకాదు. ఇట్టి యాత్మ కార్యకారణములకంటె భిన్నము' అని చెప్పెను. మన్వాది శ్రుతులు ఈ శ్రుత్యర్థమును అనువదించెను.

మూ॥ ఏవం శ్రుతిస్మృతిభిః గృహీత పరమాత్మలక్షణం శిష్యం సంసారసాగరా దుత్తితీర్షుం పృచ్ఛేత్ – 'క స్త్వమసి సోమ్యేతి'.

తా॥ శ్రుతి స్మృతులచే నిటులు పరమాత్మలక్షణ మరసిన శిష్యుని సంసారసాగరమును దాటించుటకు – 'నాయనా! నీవెవరవు?' (నాయనా! నీ స్వరూపమేమి?) అని అడుగవలెను.

మూ॥ స యది బ్రూయాత్ –'బ్రాహ్మణ పుత్రః అదో న్వయః బ్రహ్మచార్యాసమ్, గృహస్థో వా, ఇదానీ మస్మి పరమహంస పరివ్రాట్ సంసారసాగరా జ్జన్మమృత్యు మహా గ్రాహా దు త్తితీర్షు' రితి. ౧౦

తా॥ 'నేను బ్రాహ్మణపుత్రుడను, నాది యీగోత్రము, బ్రహ్మచారిని లేక గేస్తును, ఇపుడు సన్న్యసించితిని, చావు పుట్టుకలను మొసళ్లుగల సంసారసాగరము తరింపగోరితి'నని శిష్యుడు చెప్పునేని. ౧౦

మూ॥ ఆచార్యో బ్రూయాత్ – ఇహైవ తవ సోమ్య మృతస్య శరీరం వయోభి రద్యతే మృద్భావం వాపద్యతే, తత్ర కథం సంసారసాగరా దుద్ధర్తు మిచ్ఛసీతి । నహి నద్యా అవరే కూలే భస్మీభూతే నద్యాః పారం తరిష్యసీతి. ౧౧

తా॥ గురు విటు లడుగునది – నాయనా! నీవు మరణింతు వేని నీ శరీరము నిచటనే కాకులు గ్రద్దలు లోనగునవి పీకుకొని తినును, లేదా అది మట్టిలో మట్టియై కలిసిపోవును. అట్టియెడ సంసారసాగరమును దాట నెటులు కోరుదువు? ఏటి కీవల శరీరము బూడిదపాలగుచో ఆవలియొడ్డు చేరరాదుకదా! ౧౧

మూ॥ స యది బ్రూయాత్ – అన్యోఽహం శరీరాత్। శరీరం తు జాయతే మ్రియతే, వయోభి రద్యతే, శస్త్రాగ్న్యాదిభి శ్చ వినాశ్యతే, వ్యాధ్యాదిభిశ్చ ప్రయుజ్యతే । తస్మిన్ అహం స్వకృతధర్మాధర్మ వశాత్ పక్షీ నీడమివ ప్రవిష్టః పునః పునః శరీరవినాశే ధర్మాధర్మవశాత్ శరీరాంతరం యాస్యామి, పూర్వనీడ వినాశే పక్షీవ నీడాంతరమ్। ఏవ మేవాహ మనాదౌ సంసారే దేవ మనుష్య తిర్య జ్నిరయ స్థానేషు స్వకర్మవశా దుపాత్త ముపాత్తం శరీరం త్యజన్ నవం నవం చాన్య దుపాదదానో, జన్మ మరణ ప్రబంధచక్రే ఘటీయంత్రవత్ స్వకర్మణా భ్రామ్యమాణః క్రమేణేదం శరీర మాసాద్య సంసార చక్రభ్రమణా దస్మా న్నిర్విణ్ణో భగవంత ముపసన్నోఽస్మి సంసార చక్ర భ్రమణ ప్రశమనాయ। తస్మా న్నిత్య ఏవాహం శరీరాదన్యః, శరీరాణి ఆగచ్ఛన్త్యపగచ్ఛన్తి చ వాసాంసీవ పురుషస్యేతి. ౧౨

తా॥ శిష్యుడు – 'నేను శరీరముకంటె వేరు. శరీరమో పుట్టును గిట్టును, పక్షుల కెరయగును. శస్త్రము అగ్ని మొదలగు వానిచే నాశ మొందింపబడును. రోగాదుల కాస్పదమగును. నే నట్టిమేనిలో నా చేసికొనిన ధర్మాధర్మములకతన గూటిలో పిట్ట వలె ప్రవేశించి మరల మరల మేను నశింపగా ధర్మాధర్మముల కతన ప్రాతగూడు చివికిపోవుడు క్రొత్తగూడు చేరు పిట్టవలె మరియొక మేని గొందును. ఇటులే నే ననాదియగు సంసారమున దేవ మనుష్య పశు స్థానములందును నరకములందును నే జేసికొన్న కర్మవశమున మరల మరల చేసికొనిన మేనుల వదలుచు క్రొత్త క్రొత్తవానిని చేకొనువాడనై ఏతమువలె పుట్టు చావుల చక్రమునబడి నాకర్మచే తిరిగి తిరిగి క్రమముగా

ఈమేని నొంది యీ సంసారచక్ర భ్రమణమునుండి నిర్వేదము చెంది యీ సంసారచక్రమున మరి తిరుగకుండుటకు మిమ్ము ఉపసర్పించితిని. కాన శరీరముకంటె అన్యుడనగు నేను నిత్యుడనే. మానవులకు బట్టలవలె శరీరములు వచ్చుచుండును, మరి పోవుచుండును' అని బదులుపలుకునేని, ౧౨

మూ॥ ఆచార్యో బ్రూయాత్ — సాధ్వవాదీః సమ్యక్పశ్యసి। కథం మృషాఽవాదీః, బ్రాహ్మణపుత్రోఽదోఽన్వయో బ్రహ్మచార్యాసమ్, గృహస్థో వా, ఇదానీ మస్మి పరమహంస పరివ్రాడితి. ౧౩

తా॥ ఆచార్యుడు — లెస్స పలికితివి, అది ఒప్పే. కాని 'నేను బ్రాహ్మణ పుత్త్రుడననియు ఈ వంశమువాడ ననియు నేను బ్రహ్మచారిని లేక గేస్తుననియు మరి యిపుడు సన్న్యాసి ననియు ఏల కల్లలాడితివి?' అని అనునది. ౧౩

మూ॥ తం ప్రతి బ్రూయా దాచార్యః — స యది బ్రూయాద్ భగవన్! కథ మహం మృషాఽవాదిష మితి. ౧౪

తా॥ 'నే నేమి కల్లలాడితి'నని శిష్యు డనేనేని ఆచార్యు డిటులనును. ౧౪

మూ॥ యత స్త్వం భిన్న జాత్యన్వయ సంస్కారం శరీరం జాత్యన్వయవర్జిత స్యాత్మనః ప్రత్యభ్యజ్ఞాసీః బ్రాహ్మణపుత్రోఽదోఽన్వయ ఇత్యాదినా వాక్యే నేతి. ౧౫

తా॥ 'బ్రాహ్మణపుత్రుడను, ఈ వంశమువాడను' అనునీ మొదలగు వాక్యముచే నీవు జాతి, వంశము, (ఉపనయనాది)

సంస్కారము కల దేహమును ఇవి లేని ఆత్మగా గుర్తించితివి గనుక — ౧౫

మూ॥ స యది పృచ్ఛేత్ — కథం భిన్న జాత్యన్వయ సంస్కారం శరీరం కథం వా అహం జాత్యన్వయ సంస్కార వర్జిత ఇతి. ౧౬

తా॥ 'శరీరము భిన్న జాత్యన్వయసంస్కారము కలదా? నేను కానా? ఇది యెటు'లని అతడు ప్రశ్న వేయునేని. ౧౬

మూ॥ ఆచార్యో బ్రూయాత్ — శృణు సోమ్య తదేవ యథేదం శరీరం త్వత్తో భిన్నం భిన్న జాత్యన్వయ సంస్కారం, త్వం చ జాత్యన్వయ సంస్కారవర్జిత ఇత్యుక్త్వా తం స్మారయేత్ - స్మర్తు మర్హసి సోమ్య! పరమాత్మానం సర్వాత్మానం యథోక్తలక్షణం శ్రావితోఽసి - 'స దేవ సోమ్యేదమ్' ఇత్యాదిభిః శ్రుతిభిః స్మృతిభి శ్చ లక్షణం చ తస్య శ్రుతిభిః స్మృతిభిశ్చ. ౧౭

తా॥ ఆచార్యుడు — నాయనా! ఈ శరీర మెటులు భిన్న జాతియు వంశమును సంస్కారమును కలదో మరియు నీకంటె భిన్నమో మరి నీవు ఎటుల జాతియు వంశమును సంస్కారమును లేనివాడవో అది వినుమని — 'ఓ సౌమ్యుడా![50] 'ఈ కార్యప్రపంచము మొదట సత్తామాత్రముగనే యుండెను' అను అర్థము కల శ్రుతులను స్మృతులను, మరియు ఆ శ్రుతి స్మృతులు చెప్పు 'పరమాత్మ, సర్వాత్మ' యను లక్షణమును వింటివికదా గుర్తు తెచ్చికొమ్ము అని చెప్పునది. ౧౭

---

(50) ఛాం. ౬-౨-౧.

మూ॥ లబ్ధపరమాత్మ లక్షణ స్మృతయే బ్రూయాత్ —
యోఽసా వాకాశనామా నామరూపాభ్యా మర్థాంతరభూతః,
అశరీరః, అస్థూలాదిలక్షణః అపహత పాప్మత్వాది లక్షణ శ్చ,
సర్వై స్సంసార ధర్మై రనాగంధితః, య త్సాక్షాదపరోక్షాద్
బ్రహ్మ, య ఆత్మా సర్వాంతరః, అదృష్టో ద్రష్టా, అశ్రుతః శ్రోతా,
అమతో మంతా, అవిజ్ఞాతో విజ్ఞాతా, నిత్యవిజ్ఞానస్వరూపః,
అనంతరః అబాహ్యః; విజ్ఞానఘన ఏవ, పరిపూర్ణః ఆకాశవత్,
అనంతశక్తిః, ఆత్మా సర్వస్య, అశనాయాది వర్జితః ఆవిర్భావ
తిరోభావవర్జితశ్చ స్వాత్మ విలక్షణయో ర్నామరూపయోః
జగద్ బీజభూతయోః స్వాత్మస్థయో స్తత్త్వాన్యత్వాభ్యా
మనిర్వచనీయయోః స్వసంవేద్యయోః సద్భావమాత్రేణ
అచింత్యశక్తిత్వా ద్వ్యాకర్తా అవ్యాకృతయోః. ౧౮

తా॥ పరమాత్మలక్షణమును గుర్తుతెచ్చికొన్న శిష్యునకు-
ఆకాశమను[51] పేర బరగు నితడు నామరూపములకంటె వేరయిన
వాడు, శరీరము లేనివాడు, అస్థూలము మొదలగునదియు అప
హతపాపత్వము మొదలగునదియు నగు లక్షణము కలవాఁడు,
సంసారగంధము లేనివాడు, అతిసమీపమున[52] నుండి ప్రత్యక్ష
మయినవాడు, అన్నిటికంటె[53] లోపలివాడు, చూడబడక[54]
చూచువాడు, వినబడక వినువాడు, ఆలోచింపబడక ఆలో

---

(51) లక్షణచే ఆకాశ మని గ్రహించురది. ఆకాశ సామ్యము లక్షణకు బీజము. ఆకాశమునకు ఏమలమును అంటదు. ఇట్లే ఆత్మకును ఏమలమును అంటదు. ఆకాశము శరీరము లేనిది. ఆత్మయు శరీరము లేనిదని యీ సామ్యము. భూతాకాశమునకు నామరూపము లున్నవి. భూతకారణమగు చిదాకాశమునకు లేవు.

(52, 53) బృ. 3-౮-౧. (54) బృ. 3-౭-౨3.

చించువాడు, తెలియబడక తెలిసికొనువాడు, నిత్యజ్ఞానస్వరూపుడు, లోపల వెలుపల లేని ఎరుకముద్దయే యైనవాడు, ఆకాశమువలె అంతట నిండినవాడు, అనంతశక్తి కలవాడు, సర్వాత్మ, ఆకలిదప్పులును ఆవిర్భావ తిరోభావములును లేనివాడు, తనకు వేరైనవియు[55] తనలో నున్నవియు జగతికి బీజభూతములును సదసద్విలక్షణములును తనచే నెరుగదగినవియు ఆవిర్భావము పొందనివియు నగు నామరూపములను అచింత్యశక్తి కలవాడగుటవలన తన యునికిమాత్రముననే ఆవిర్భవింపజేయువాడై యున్నాడు.[56] ౧౭

మూ॥ తే నామరూపే అవ్యాకృతే సతీ వ్యాక్రియమాణే తస్మా దేతస్మా దాత్మన ఆకాశ నామాకృతీ సంవృత్తే తచ్చాకాశాఖ్యం భూత మనేన ప్రకారేణ పరమాత్మనః సంభూతం ప్రసన్నా దివ సలిలా న్మల మివ ఫేనమ్ । న సలిలం న చ సలిలాదత్యంతం భిన్నం ఫేనమ్, సలిల వ్యతిరేకే ణాదర్శనాత్; సలిలం తు స్వచ్ఛ మన్యత్ ఫేనా న్మలరూపాత్ । ఏవం పరమాత్మా నామరూపాభ్యా మన్యః ఫేనస్థానీయాభ్యాం శుద్ధః ప్రసన్న స్తద్విలక్షణః । తే నామరూపే అవ్యాకృతే సతీ వ్యాక్రియమాణే ఫేనస్థానీయే ఆకాశ నామాకృతీ సంవృత్తే.

తా॥ ఆ నామరూపములు ఆవిర్భూతి లేనివేయగుచు ఆయీ ఆత్మనుండి ఆవిర్భవించినచందమై (వ్యవహారానుగుణముగా) ఆకాశమను పేరును (దాని కర్థమగు) రూపమును పొందెను.

---

(55) ఆత్మకంటె వేరుగా వీనికి ఉనికిలేదని తాత్పర్యము.

(56) దృశ్యములం దంతర్యామియై తన శక్తివలన ఆత్మ తనయం దవ్యక్తముగ నున్న నామరూపమగు జడమును వ్యక్తము చేయును.

తేటనీటినుండి మలమగు నురుగువలె పరమాత్మనుండి ఆకాశ మను పేరి భూత మీవిధముగా సంభవించెను. నురుగు నీరును కాదు, మరి నీటికంటె పూర్తిగా వేరునుకాదు. ఇటులు నీటికి వేరుగా కానరానందునను; నీ మలరూపమగు నురుగుకంటె వేరయినదియు మఱియు నిర్మలమైనదియు అయినందునను పర మాత్మ నురుగువలె నున్న నామరూపములకంటె వేరయిన వాడు, నామరూపములకంటె విలక్షణుడు మరియు శుద్ధుడు. ఆ నామరూపములు ఆవిర్భవము చెందనివై యుండుచు (ఆత్మ సన్నిధి మాత్రమున) ఆవిర్భావమొందుచు నురుగువంటివై ఆకాశ నామరూపములుగా (వ్యవహారయోగ్యములు) ఆయెను.

మూ॥ తతోఽపి స్థూలభావ మాపద్యమానే నామ రూపే వ్యాక్రియమాణే వాయుభావ మాపద్యేతే,తతోఽప్యగ్ని భావం, అగ్నే రబ్భావం, తతః పృథివీభావ మిత్యేవం క్రమేణ పూర్వపూర్వభావస్యోత్తరోత్తరాను ప్రవేశేన పఞ్చమహా భూతాని పృథివ్యన్తాన్యుత్పన్నాని । తతః పఞ్చగుణవిశిష్టా పృథివీ । పృథివ్యాశ్చ పఞ్చాత్మికా వ్రీహియవాద్యా ఓష ధయః జాయన్తే । తాభ్యో భక్షితాభ్యో లోహితం శుక్లం చ స్త్రీపుంసశరీరసంబంధి జాయతే । త దుభయం ఋతుకాలే అవిద్యాప్రయుక్తకామఖజనిర్మథనోద్భూతం మంత్రసంస్కృ తం గర్భాశయే నిషిచ్యతే । తత్ స్వయోని రసాను ప్రవేశేన వివర్ధమానం గర్భభూతం నవమే దశమే వా మాసి జాయతే. ౨౦

తా॥ ఆవిర్భావక్రమమున నామరూపములు తొల్లిటికంటె స్థూలరూప మొంది గాలిరూపు తాల్చెను. దానినుండి మరల

నిప్పురూపును, దాన నీటిరూపును దాన పుడమిరూపును ఇద్దెస పదపటి వానిలో వెనువెనుకవి ప్రవేశించి పృథివ్యంతముగా పంచమహాభూతములు పొడమెను.[57] కాన పుడమికి అయిదు గుణము లున్నవి. పుడమినుండి అయిదు గుణములు కల వ్రీహియవాదులగు ఓషధులు పుట్టుకొనివచ్చెను. తినబడిన అల వానినుండి మగవారికిని ఆడువారికిని శుక్లమును శోణితమును పుట్టును. ఆరెండును ఋతుకాలమున అవిద్యచే గలిగిన కామమను కవ్వము చిలుకగా పొడమి మంత్రసంస్కృతమై గర్భమున నిషిక్త మగుచున్నది. అది తల్లిమేనగల రసములతో గలిసి పెరిగి గర్భమై తొమ్మిదవ నెలలోగాని పదవ నెలలోగాని పుట్టుచున్నది. ౨౦

**మూ॥** తజ్జాతం లబ్ధనామాకృతికం జాతకర్మాదిభిః మంత్ర సంస్కృతం పునరుపనయన సంస్కారేణ బ్రహ్మచారి సంజ్ఞం భవతి । తదేవ శరీరం పత్నీయోగ సంస్కారయోగేన గృహస్థ సంజ్ఞం భవతి । తదేవ వనస్థ సంస్కారేణ తాపస సంజ్ఞం భవతి । తదేవ క్రియా నివృత్తినిమిత్తేన సంస్కారేణ పరివ్రాట్సంజ్ఞం భవతి । ఇత్యేవం త్వత్తో భిన్నం భిన్నజాత్యన్వయ సంస్కారం శరీరమ్. ౨౧

**తా॥** అది పుట్టి నామరూపముల బడసి జాతకర్మాదులకు సంబంధించిన మంత్రములచే సంస్కరింపబడుచున్నది. మరల

---

(57) ఆకాశమునందున్న ఆత్మని సన్నిధానవశమున వాయువును, వాయువునందున్న ఆత్మని సన్నిధానవశమున అగ్నియు ఇటులే భూతములు ఆత్మనివలననే కలిగెను. పంచదశి - మహాభూత వివేకప్రకరణము, ౬౦ నుండి ప్రకరణాంతమువరకు చూచునది.

నుపనయనసంస్కారము వడసి బ్రహ్మచారి యను సంజ్ఞ నొందుచున్నది. ఆ శరీరమే పెండ్లియాడి గృహస్థ సంజ్ఞ నొందుచున్నది. అదియే వానప్రస్థ సంస్కారముచే తాపస సంజ్ఞ గొనుచున్నది. అదియ కర్మనివృత్తికి హేతువగు సంస్కారముచే సన్న్యాసిసంజ్ఞ నొందుచున్నది. ఇటులు వేరువేరుజాతి అన్వయము సంస్కారములు కల యీ శరీరము నీకంటె (ఆత్మకంటె) వేరు. ౨౧

మూ॥ మనశ్చేంద్రియాణి చ నామ రూపాత్మకా న్యేవ 'అన్నమయంహి సోమ్య మనః' ఇత్యాది శ్రుతిభ్యః. ౨౨

తా॥ 'ఓ వత్సా![58] 'అన్నవికారము కదా మనస్సు' అను నీ మొదలగు శ్రుతులవలన మనస్సు ఇంద్రియములుగూడ నామరూపాత్మకములే.' ౨౨

మూ॥ కథం చాహాం భిన్న జాత్యన్వయ సంస్కారవర్జిత ఇత్యే తత్ శ్రుణు! – యోఽసౌ నామరూపయో ర్వ్యాకర్తా నామ రూప ధర్మ విలక్షణః స ఏవ నామ రూపే వ్యాకుర్వన్ సృష్ట్వేదం శరీరం స్వయం సంస్కార ధర్మ వర్జితో నామ రూపే ఇహ ప్రవిష్టః అన్యై రదృష్టః స్వయం పశ్యన్ తథా అశ్రుతః శ్రుణ్వాన్ అమతో మన్వానః అవిజ్ఞాతో విజానన్– 'సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాఽభివదన్ యదాస్తే' ఇత్యస్మిన్నర్థే శ్రుతయః సహస్రశః – 'తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్', 'అన్తః ప్రవిష్టః శాస్తా జనా

---

(58) ఛాం. ౬-౫-౪, ౬-౫-౬. మనస్సు అన్నపరిణామము, అన్నముచే పెంపు వడయునది.

నామ్', 'స ఏష ఇహ ప్రవిష్టః', 'ఏష త ఆత్మా', 'స ఏత మేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత', 'ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా', 'సేఽయం దేవ తైక్షత హంతాహ మిమా 'స్తిస్రో దేవతాః' ఇత్యాద్యాః శ్రుతయః.

తా॥ 'నేను వేరువేరు పుట్టుక, వంశము, సంస్కారము - ఇవి లేనివాడ నెటులయితి' నని నీ వడిగితి విది విను! – 'నామ రూపములు కలుగుటకు కారణమైన ఆ యితడు నామరూప ధర్మములకంటె భిన్నుడు. అతడే నామరూపముల బోడమిం చుచు తాను సంస్కారధర్మము లేనివాడయ్యు ఈ శరీరమును సృజించి నామరూపములే అగు ఈశరీరమున ప్రవేశించి ఒరు లచే చూడబడక తాను చూచుచు మరి వినబడక వినుచు ఆలోచింపబడక ఆలోచించుచు తెలియబడక తెలిసికొనుచు నుండువాడు.' ఈవిషయము ఈదిగువ శ్రుతిచెప్పెడిని– 'రూప ముల[59] నన్నిటిని సృజించి వానికి పేర్లు పెట్టెను.' ఈ యర్థ మునే నూరులకొలది శ్రుతులు చెప్పును – 'దానిని[60] సృజించి దానిలోనే ప్రవేశించెను', 'లోపల[61] ప్రవేశించినవాడై (అంత ర్యామియై) జీవులను శాసించును', 'ఆ యిత[62] డిందు ప్రవేశించెను', 'ఇల్లితడే[63] నీ యాత్మ', 'అత[64]డిచ్చో (తలను) చీల్చి యీ గుమ్మముగుండ ప్రవేశించెను', 'ఈ యాత్మ[65] అన్ని భూతములందును గూఢమయి యున్నది',

---

(59) తై. ఆ. 3-౧౨-౭. (60) తై. ౨-౬.
(61) తై. ఆ. 3-౧౧. ౧-౨. (62) బృ. ౧-౪-౭.
(63) బృ. 3-౪-౧. (64) ఐ. ఉ. ౧-3-౧౨.
(65) కఠ. 3-౧౨.

'ఈ మూడు[66] దేవతలలోను ప్రవేశింతునుగాక యని ఆ దేవత చూచెను.' ౨౩

మూ॥ స్మృతయోఽపి – 'ఆత్మైవ దేవతా స్సర్వాః', 'నవద్వారే పురే దేహీ', 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి', 'సమం సర్వేషు భూతేషు', 'ఉపద్రష్టానుమన్తా చ', 'ఉత్తమః పురుష స్త్వన్యః', 'అశరీరం శరీరేషు' ఇత్యాద్యాః। తస్మాత్ జాత్యన్వయ సంస్కారవర్జిత స్త్వమితి సిద్ధమ్. ౨౪

తా॥ 'దేవత[67] లన్నియు ఆత్మయే', 'తొమ్మిది[68] వాకిండ్ల వీటిలో', 'జీవాత్మను[69] నన్నుగనే తెలిసికో !', 'భూతము[70] లన్నిటను ఒకడే', 'సాక్షియు[71], అనుమతించువాడును', 'పురుషోత్తముడు[72] వేరు', 'శరీరములం[73] దశరీరి' యీ మొదలగు శ్రుతు లీ యర్థమునే చెప్పు గాన నీవు జాత్యన్వయ సంస్కారదూరుడవు అని నిర్ణీత మగుచున్నది. ౨౪

మూ॥ స యది బ్రూయాత్ – అన్య ఏవాహ మజ్ఞః సుఖీ దుఃఖీ బద్ధః సంసారీ, అన్యోఽసౌ మద్విలక్షణః అసంసారీ దేవః, తమహం బల్యుపహారనమస్కారాదిభిః వర్ణాశ్రమ కర్మభిశ్చ ఆరాధ్య సంసారసాగరా దుత్తితీర్షు రస్మి. కథ మహం స ఏవేతి ? ౨౫

తా॥ 'నేనజ్ఞుడను(ఒకపుడు) సుఖిని(ఇంకొకపుడు) దుఃఖిని బద్ధుడను సంసారిని (కావున) నే నాత్మకంటె వేరయినవాడను.

(66) ఛాం. ౬-౩-౨. (67) మను. ౧౩-౧౧౯. (68) గీ. ౫-౧౩.
(69) గీ. ౧౩-౨. (70) గీ. ౧౩-౨౭, (71) గీ. ౧౩-౨౨.
(72) గీ. ౧౫-౧౭. (73) ఈ స్మృతి యేదియో తెలియలేదు. ఈ స్మృతికి మూలము కఠము ఉ. ౨-౨౨.

ప్రకాశించునట్టియు అసంసారియు నాకంటె విలక్షణుడగు నీతడు నాకంటె భిన్నుడు. నేనతని బలులచేతను కానుకలచేతను నమస్కారాదులచేతను వర్ణాశ్రమోచితములగు కర్మలచేతను పూజించి సంసారసాగరమును తరింపగోరుచున్నాను. అట్టియెడ నేనతడనే యగు టెటులు?' అని పలుకునేని — ౭౫

మూ॥ ఆచార్యో బ్రూయాత్ — నైవంసోమ్య ప్రతిపత్తుమర్హసి, ప్రతిషిద్ధత్వా ద్భేదప్రతిపత్తేః। కథం ప్రతిషిద్ధా భేదప్రతిపత్తి రిత్యత ఆహ — 'అన్యోఽసా వన్యోఽహ మస్మీతి న స వేద', 'బ్రహ్మ తం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మ వేద', మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' ఇత్యేవ మాద్యాః. ౭౬

తా॥ 'నాయనా! నీ విటు లనుకొనజెల్లదు. విను — 'ఇతడు[74] వేరు నేనువేరు అని అనుకొనువాడు ఎరుక లేనివాడు', ('నేను[75] బ్రాహ్మణుడను ఈ మొదలగు దేహాభిమానము కలవాడై) యెవడు తనకంటె బ్రహ్మము వేరని అనుకొనునో వానిని బ్రహ్మము నిరాకరించెను', 'ఏకమగు[76] బ్రహ్మమును అనేకమువలె జూచువాడు చావునుండి చావునే పొందును' అను నీమొదలగు శ్రుతులు భేదజ్ఞానమును నిషేధించునని ఆచార్యుడు బోధించునది. ౭౬

మూ॥ ఏతా ఏవ శ్రుతయో భేదప్రతిపత్తే స్సంసారగమనం దర్శయన్తి. ౭౭

తా॥ ఈ శ్రుతులే భేదజ్ఞానమునకు సంసరించుటయే ఫలమనియు చెప్పుచున్నవి. ౭౭

(74) బృ. ౧-౪-౧౦. (75) బృ. ౨-౪-౬. (76) బృ. ౪-౪-౧౯.

మూ॥ అభేద ప్రతిపత్తేశ్చ మోక్షం దర్శయన్తి సహస్రశః- 'స ఆత్మా తత్త్వమసి' ఇతి పరమాత్మభావం విధాయ 'ఆచార్యవాన్ పురుషో వేద' ఇత్యుక్త్వా 'తస్య తావదేవ చిరమ్', ఇతి మోక్షం దర్శయన్త్యభేద విజ్ఞానాదేవ। సత్యాభిసంధస్య అతస్కరస్యేవ దాహాద్యభావదృష్టాన్తేన, సంసారాభావం దర్శయన్తి' భేదదర్శనా దసత్యాభి సంధస్య సంసారగమనం దర్శయన్తి తస్కరస్యేవ దాహాది దృష్టాన్తేన. ౨౮

తా॥ నూరులకొలది శ్రుతులు - 'జీవాత్మ[77] పరమాత్మకంటె వేరుకాదని (ఆయాత్మ నీవు) పరమాత్మ భావమును చెప్పి' - 'గురువు[78] కల పురుషు డెరుగు ననియు,[79] బ్రహ్మజ్ఞుడు బ్రహ్మమున కలియునంతతడవే కనిపట్టుకొనియుండవలయుననియు తొల్లిటి వాసనలవలన కలిగిన దేహము రాలి వాసనాక్షయమై విదేహముక్తి ఒదవి బ్రహ్మస్వరూపప్రాప్తికి విలంబము కలుగు నని చెప్పుటచే అభేదజ్ఞానమువలననే మోక్షము కలుగునని తెలుపుచున్నవి. సత్యసంధుడగు అతస్కరునకు చేయికాలదనియు సత్యసంధుడుకాని దొంగకు చేయి కాలు ననియు ఈ ఉదాహరణముచే, అతస్కరుడు తన స్వరూపమును సత్యముతో సంబంధించినదానినిగానే చేసికొనుగాన అభేదజ్ఞానమువలననే మోక్షము కలుగు ననియును దొంగ తన స్వరూపమును అనృతముతో సంబంధించినదానినిగాని చేసి

(77) ఛాం. ౬-౧౩-3. (78) ఛాం. ౬-౧౪-౨.
(79) ఛాం. ౬-౧౪-౨.

కొనగాన భేదజ్ఞానమువలన దేహాంతరము పొందుననియు చెప్పుచున్నవి.[80] ౨౭

మూ॥ 'త ఇహ వ్యాఘ్రో వా' ఇత్యాదినా చ అభేద దర్శనాత్ – 'స స్వరాడ్భవతి' ఇత్యుక్త్వా తద్విపరీతేన భేద దర్శనేన సంసారగమనం దర్శయన్తి – 'అథ యేఽన్యథాఽతో విదు రన్య రాజాన స్తే క్షయ్యలోకా భవన్తి' ఇతి ప్రతి శాఖమ్ । తస్మాన్మృషైవ మవాదీః – బ్రాహ్మణపుత్రః అదోన్వయః సంసారీ పరమాత్మ విలక్షణ ఇతి. ౨౮

తా॥ 'పులియేని[81] మరి యిట నున్న యేజీవమేని' అని యీమొదలగు శ్రుతులు అభేదజ్ఞానముచే – 'అతడు[82] దొర యగు చున్నాడని'యు భేదజ్ఞానముచే – 'తమ్ము[83] ఆత్మకు వేరుగా తలచువారు వేరుదొరలు కలవారును నాశముచెందు లోకములందు వసింతుర'నియు (వేదమునందలి) ప్రతిశాఖయు చెప్పుచున్నది. కాన నేను బ్రాహ్మణపుత్రుడ ననియు నాదీ వంశమనియు నేను సంసారిని పరమాత్మ భిన్నుడ ననియు ఇట్లు నీ వినుట పొరపాటే. ౨౮

మూ॥ తస్మాత్ ప్రతిషిద్ధత్వా ద్భేదదర్శనస్య భేదవిషయత్వా చ్చ కర్మోపాదానస్య, కర్మసాధనత్వా చ్చ యజ్ఞోపవీతా దేః

(80) ఛాం. ౬-౧౬, ౧-3. దొంగ యని అనుమానించినపుడు చేతిలో అగ్ని ఉంచుదురు. కల్ల చెప్పినవాని చేయి కాలుననియు, నిక్కము చెప్పిన వాని చేయి కాలదనియు అందురు. ఇది అగ్నిని చేతబట్టుకొని చేసిన బాస.

(81) ఛాం. ౬-౯-3. (82) ఛాం. ౭-౨౫-౨.

(83) ఛాం. ౭-౨౫-౨.

కర్మసాధనోపాదానస్య పరమాత్మాఽభేదప్రతిపత్త్యా ప్రతి షేధః కృతో వేదితవ్యః । కర్మణాం తత్సాధనానాం చ యజ్ఞోపవీతాదీనాం పరమాత్మా భేదప్రతిపత్తి విరుద్ధత్వాత్ । సంసారిణో హి కర్మాణి విధీయన్తే సాధనాని చ యజ్ఞోపవీతాదీని, న పరమాత్మనోఽభేదదర్శినః । భేదదర్శనమాత్రేణ చ తతోఽన్యత్వమ్. 30

తా॥ కాన భేదజ్ఞానము కూడదనుటవలన, పరమాత్మయు తానును ఒకటియగా తెలియుటజేసి కర్మములు చేయుటకు విషయము వేరగుటవలనను జందెము లోనగునవి కర్మములు చేయుటకు ఉపకరణము లగుటవలనను కర్మలును వాని సాధనములును పరమాత్మాభేదజ్ఞానమునకు విరుద్ధములగుట వలనను నిషేధింపబడెనని తెలియునది. కర్మలును వానికి సాధనములును సంసారికి విధింపబడెనుగాని అభేదజ్ఞానము కలవానికి గాదు. భేదదర్శనమాత్రమే[84] పరమాత్మాన్యత్వము. 30

మూ॥ యది కర్మాణి కర్తవ్యాని, న నివర్తయిషితాని, కర్మసాధనాసంబంధినః కర్మనిమిత్త జాత్యాశ్రమాద్యసంబంధినశ్చ పరమాత్మనశ్చ ఆత్మనైవాభేదప్రతిపత్తిం నావక్ష్యత్ 'స

(84) "సంసారియు బ్రహ్మభిన్నుడుకదా! అతనికిమాత్రమే కర్మ లేల విధింపబడవలయును? అను ప్రశ్న కలుగగా దాని కిది సమాధానము. "బ్రహ్మము ఉపాస్యము, జీవు డుపాసకుడు." అనునది భేదదర్శనము. దీన సంసారి ఆత్మభిన్నుడు అని చెప్పవలసివచ్చెను. కాని వాస్తవభేదము లేదు. భేదకారణము ఉపాధి. "నేను నిష్క్రియుడను" "నేను కర్తను" అను జ్ఞానములు విరుద్ధములు. జీవన్ముక్తునకేని వ్యాపారము తప్పదుగాని అతనికి అహంకారము ఉండదు. కాన దానికి ఫలము ఉండదు.

ఆత్మా తత్త్వమసి' ఇత్యేవ మాదిభి ర్నిశ్చితరూపై ర్వాక్యైః, భేదప్రతిపత్తి నిందాం చ నాభ్యధాస్యత్ 'ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య', 'అనన్వాగతం పుణ్యే నానన్వాగతం పాపేన', 'అత్ర స్తేనోఽ స్తేనః' ఇత్యాదినా. ౩౧

తా॥ కర్మలు చేయవలయు ననియు, నిషేధించు తలపు లేదనియు అనుచో ఆశ్రుతులు కర్మములు, తత్సాధనములు. కర్మనిమిత్తములగు జాత్యాశ్రమాది సంబంధములు లేని పరమాత్మయు ఆత్మయు ఒకటియే యని - 'ఆ యాత్మ[85] నీవే' అను నీ మొదలగు నిశ్చితరూపములగు వాక్యములచే చెప్పకపోవును. మరియు 'బ్రహ్మజ్ఞాని[86] యీ మహిమ నిత్యము (ఇది కర్మచే పెరుగదు మరియు తరుగదు)', 'పుణ్యపాపముల[87] అంటులేనివాడు', ఈ సుషుప్తిలో[88] తస్కరు డతస్కరు డగుచున్నాడు' అని భేదజ్ఞాన నిందను చేయకపోవును. ౩౧

మూ॥ కర్తా సంబంధి స్వరూపత్వం, కర్మ నిమిత్త వర్ణాద్య సంబంధ రూపతాం చ నాభ్యధాస్యత్, కర్మాణి చ కర్మ సాధనాని చ యజ్ఞోపవీతాదీని యద్యపరితిత్యాజయిషితాని। తస్మాత్ససాధనం కర్మ పరిత్యక్తవ్యం ముముక్షుణా, పరమాత్మాఽభేదదర్శనవిరోధాత్, ఆత్మా చ పర ఏవేతి ప్రతిపత్తవ్యో యథా శ్రుత్యుక్తలక్షణః. ౩౨

తా॥ కర్మలును కర్మసాధనములగు జందెము మొదలగునవియు విడనాడదగినవి కావని శ్రుతి కభిప్రేతమేని ఆత్మకు

---

(85) ఛాం. ౬-౮-౭. (86) బృ. ౪-౪-౨౩.

(87, 88) బృ. ౪-౩-౨౨.

కర్మదోసగు లేదనియు కర్మనిమిత్తమగు వర్ణాశ్రమాదుల దోసగు లేదనియు చెప్పకపోవును. కావున మోక్షము కోరువాడు ససాధనమగు కర్మను విడనాడునది. ఏలన 'తాను వేరు పరమాత్మ వేరు' అని విరుద్ధముగా అనుకొనుటవలన తాను శ్రుతులలో చెప్పబడిన లక్షణము కల పరమాత్మయే యని ఎరుగునది. 32

మూ॥ స యది బ్రూయాత్ – 'భగవన్! దహ్యమానే ఛిద్యమానే వా దేహే ప్రత్యక్షా వేదనా, అశనాయాది నిమిత్తం చ ప్రత్యక్షం దుఃఖం మమ । పరశ్చాయమాత్మా, 'అయమాత్మాఽపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసః సర్వగంధరసవర్జితః' ఇతి శ్రూయతే సర్వ శ్రుతిషుస్మృతిషు చ । కథం తద్విలక్షణః అనేకసంసార ధర్మ సంయుక్తః పరమాత్మాన మాత్మత్వేన చ మాం సంసారిణం పరమాత్మత్వే నాగ్ని మివ శీతత్వేన ప్రతిపద్యేయమ్ । సంసారీ చ సన్ సర్వాభ్యుదయ నిఃశ్రేయస సాధనే అధికృతః అభ్యుదయ నిఃశ్రేయస సాధనాని కర్మాణి తత్సాధనాని చ యజ్ఞోపవీతాదీని కథం పరిత్యజేయ మితి? 33

తా॥ 'అయ్యా! దేహమును కాల్చినను కోసినను నాకు మంట పెట్టుట ప్రత్యక్షముగా తెలియుచున్నది. మరియు నాకు ఆకలి దప్పి మొదలగు వానివలన దుఃఖము ప్రత్యక్షమగుచున్నది. అల యాత్మయే నాకంటె భిన్నుడు' – 'ఈ యాత్మ[89] పాపము ముదిమి చావు దుఃఖము ఆకలి దప్పి గంధము రసము

(89) ఛాం. ౮-౭-౧.

మొదలగున వేవియు లేనివాడు' అని శ్రుతి స్మృతు లన్నిటి యందు చెప్పబడుచున్నాడు. అతనికంటె విలక్షణుడను పెక్కు సంసార ధర్మములతో గూడిన నేను పరమాత్మనెట్లు అగుదును? మరియు సంసారినగు నన్ను పరమాత్మునిగా నెటులు తలపోయుదును? అగ్ని చల్లగా నున్నదని తలపోయుటకదా యిది! సంసారినై యిహ పరలోక సుఖములను సాధింప నధికారినై అట్టి ఇహ పరలోక సుఖ సాధనములగు కర్మలను, వానికి సాధనములగు జందెము మొదలగువానిని ఎటులు విడనాడను?' అని అత డనెనేని. 33

మూ॥ తం ప్రతి బ్రూయాత్ – యదవోచో దహ్యమానే ఛిద్యమానే వా దేహే ప్రత్యక్షా వేదనా ఉపలభ్యతే మమేతి తదసత్ । కస్మాత్? దహ్యమానే ఛిద్యమాన ఇవ వృక్షే ఉపలబ్ధు రుపలభ్యమానే కర్మణి శరీరే దాహచ్ఛేద వేదనాయా ఉపలభ్యమానత్వా ద్దాహాది సమానాశ్రయైవ వేదనా, యత్ర హి దాహ శ్ఛేదో వా క్రియతే తత్రైవ వ్యపదిశతి దాహాదివేదనాం లోకః, న వేదనాం దాహా దుపలబ్ధ రీతి । కథమ్? 'క్వ తే వేదనే'తి పృష్టః శిరసి మే వేదనా, ఉరసి ఉదరే ఇతి వా యత్ర దాహాది స్తత్రైవ వ్యపదిశతి, న తూపలబ్ధరీతి । యద్యుపలబ్ధరి వేదనా స్యా ద్వేదనానిమిత్తం వా దాహ చ్ఛేదాది వేదనాశ్రయత్వే నోపదిశే ద్దాహాద్యాశ్రయవత్ .3౪

తా॥ 'దేహమును కాల్చినను కోసినను నాకు మంటపెట్టుట ప్రత్యక్షముగా తెలియుచున్న' దని నీ వనుట సరికాదు. ఏలనగా కోతవలనగాని కాల్పువలనగాని దేహమునందు తెలిసికొనబడిన మంట, కాల్పబడిన లేక కోయబడిన చెట్టువలె

తెలిసికొనుటలో (తెలిసికొను అను క్రియలో) కర్మమై ఆ కాల్పు కోత యెచటనుండునో అచటనే యుండవలయును. ఎచట కాలెనో ఎచట తెగెనో అచటనే మంట యని లోకు లందురుగాని ఆ తెలిసికొనువానిలో ఆ మంట కలదని యనరు. 'నీకు మంట యెచట?' అని అడుగునెడల నాకు 'కడుపులో మంట, తలలో నొప్పి యనికాని లేక ఎచట కాలెనో లేక తెగెనో అచటనే మంట' యనికాని యందురుగాని ఆ మంట తెలిసికొనువానిలో కలదని చెప్పరు. ఇటులుకాక ఆ మంటయేని దానికి కారణమయిన కాల్పు కోత లేని తెలిసికొనువానిలో నున్నయెడల ఆ తెలిసికొనువాడు కాల్పుకోతలకు తావ్వులైన శరీరావయవములనువలె తెలిసికొనువానినే మంటకు ఇక్కడగా చెప్పియుండును. 38

మూ॥ స్వయం చ నోపలభ్యేత చక్షుర్గత రూపవత్ । తస్మాద్దాహచ్ఛేదాది సమానాశ్రయత్వేన ఉపలభ్యమానత్వాద్దాహాదివత్ కర్మభూతైవ వేదనా । భావరూపత్వాచ్చ సాశ్రయా తండుల పాకవత్ । వేదనా సమానాశ్రయ ఏవ తత్సంస్కారః । స్మృతిసమాన కాల ఏవ ఉపలభ్యమానత్వాద్వేదనావిషయః । తన్నిమిత్త విషయశ్చ ద్వేషోఽపి సంస్కార సమానాశ్రయ ఏవ । తథా చోక్తమ్ – 'రూప సంస్కార తుల్యాఽఽధీ రాగద్వేషౌ భయం చ యత్ । గృహ్యతే ధీశ్రయం తస్మాత్ జ్ఞాతా శుద్ధోఽభయస్సదా' 39

తా॥ (ఈ బాధ తెలిసికొను ఆత్మలోనే యున్నెడల) కంటి రూపమును కన్ను కానలేని చందమున తన బాధను ఆత్మ తెలిసికొనలేకపోవలయును. కావున కాల్పులు కోతలు మొద

లగున నెచట జరిగెనో అచటనే మంట ఉన్నటులు కానిపించుట వలన మంటయు కాల్పులు కోతలు మొదలగువానివలె తెలిసికొనుట అను క్రియకు కర్మయే అయి యుండవలయును. మరియు[90] మంట మంటవలె ధాత్వర్థరూపమగు ఒక క్రియ. వంట కాశ్రయ మొకటి ఉండవలెను. అటులే బాధకును ఆశ్రయ మొకటి యుండవలెను. వంటకు బియ్యమువలె మంటకు దేహము[91] ఆశ్రయము. తలపు కలిగినయపుడే మంట పెట్టెడు చోటు తెలియబడుటవలన మంట ఎక్కడ నుండునో దాని[92] తలపుగూడ అచటనే యుండును అని తేలెను.

---

(90) దేహ మచేతనమే; సుఖదుఃఖాదులు చేతనధర్మములే. దేహమునకు దుఃఖమెటులు? కలదనుచో దానిని చేతన మని యనవలెను. కాని అది జడము. కాగా సుఖదుఃఖాదులకు ఆశ్రయ మేదియు లేకపోవును. అను నీప్రశ్నకు మరియు అను వాక్యము సమాధానమునకు ఆరంభము.

(91, 92) మంట = బాధ. బాధ కాశ్రయము లేనిచో కాలాంతరమునందు దానితలపే రాగూడదు. కావున బాధకు దేహ మాశ్రయము. "నా వ్రేలు తెగెను, నా కాలు కాలెను" అని కాలాంతరమందు తలపు కలుగుచున్నదికదా. "అది ఆత్మయందే కలుగుచున్నదా? కాదు." ఏలనగా బాధ యెచట నుండునో దాని సంస్కారస్మృతు లచటనే తప్పక యుండునుగాన కాలు వ్రేలులందలి బాధతోపాటు స్మృతిసంస్కారములును కాలువ్రేళ్ళయందే యుండును. కావున బాధ జ్ఞానములో కర్మయగు శరీరావయవములది కాని ఆత్మది కాదు. కాన ఈ బాధ దేహమునది. అనగా దేహము ఆశ్రయముగాగల బుద్ధిది. ఈవిషయము ౩౯వ వాక్యాంతమున చెప్పబడెను. మనకు జాగ్రత్ స్వప్నావస్థలలో దేహాభిమానము ఉండునుగాని నిద్రావస్థలో ఉండదు. అపుడు బుద్ధి లీనమగును. కాన దేహము ఉన్నటులు తెలియదు. జాగ్రత్ స్వప్నావస్థలలో మాత్రము తెలియబడు దేహము తెలియు క్రియకు కర్మ. మరి కర్త కాదు. కర్త బుద్ధి. కాన సంస్కారము, స్మృతి వీనితో గూడిన సముదాయమునకే బాధ, ఆత్మకు కాదు.

కాల్పులు కోతలవంటి మంటలయెడల లేక బాధలయెడల
గలుగు ద్వేషముగూడ తలపు ఉండెడిచోటనే యుండును.
కాన - 'రూపముయొక్క తలపు అనగా సంస్కార మెచట
నుండునో అచటనే రాగముగాని ద్వేషముగాని భయముగాని
ఉండును. వానికి బుద్ధి ఆశ్రయము. కావున తెలియువాడు
అనగా ఆత్మ ఎల్లప్పుడును శుద్ధుడు, నిర్భయుడు.' అని చెప్ప
బడెను. ౩౫

మూ॥ కిమాశ్రయాః పునా రూపాది సంస్కారాదయ
ఇతి? ఉచ్యతే। యత్ర కామాదయః। క్వ పునస్తే కామా
దయః? 'కామః సంకల్పో విచికిత్సా' ఇత్యాది శ్రుతేః బుద్ధా
వేవ। తత్రైవ రూపాని సంస్కారాదయోఽపి, 'కస్మిన్ను
రూపాణి ప్రతిష్ఠితానీతి? హృదయే' ఇతి శ్రుతేః। 'కామా
యేఽస్య హృది స్థితాః', 'తీర్ణో హి తదా సర్వాన్ శోకాన్
హృదయస్య', 'అసఙ్గో హ్యయమ్', 'తద్వా అస్యైత దతి
చ్ఛందాః' ఇత్యాది శ్రుతిభ్యః, 'అవికార్యోఽయ ముచ్యతే'
'అనాదిత్వా న్నిర్గుణత్వాత్' ఇత్యాదీచ్ఛాద్వేషాది చ క్షేత్ర
స్యైవ విషయస్య ధర్మో నాత్మన ఇతి స్మృతిభ్యశ్చ కర్మస్థై
వా శుద్ధిః నాత్మస్థా ఇతి. ౩౬

తా॥ ఇటులగుచో 'రూపాదుల సంస్కారాదులకు తావేది?'
అని యందువో వినుము. కామాదు లెచట నుండునో అవి
యచట నుండును. ఆ కామాదు లెచటనుండునని యందువో-
'కామము[93] సంకల్పము, సందేహము' బుద్ధిలోనే ఉన్నవిగాని

(93) బృ. ౧-౫-3, 3-౯-౨౦.

మరియొకచోట లేవు. 'రూపములకు[94] తా వేది? హృదయము' అను శ్రుతివలన బుద్ధియే రూపాది సంస్కారములకు తావు. 'తన హృదయము[95]నందలికోరిక లెపుడువిడివడిపోవునో అపుడే మృతిలేనివాడై ముక్తుడై ఇచటనే బ్రహ్మమును పొందును', 'ఆ[96] నిద్రాసమయమునందు హృదయమునకు సంబంధించిన కోరికల నన్నిటిని అతిక్రమించినవాడగును', 'ఈ[97] పురుషు డసంగుడు' '(ఎపుడు నిదురగూరి కామము గోరక కల గాంచకుండునో) అదియె[98] ఆత్మకు రూపము. ఇది కోరికల కావలిది (కామము లేనిదియు)' అని శ్రుతులును, 'ఇతడు[99] వికారములు లేనివాడు (కామాదులు వికారములు)', 'ఇతడు ఆది[100] లేనివాడును గుణములు లేనివాడును కాబట్టి' అని స్మృతులును చెప్పుటవలన కోరిక ద్వేషము మొదలగునవి విషయమగు (కర్మ) క్షేత్రము[101] యొక్కయే ధర్మముగాని విషయి[102] యగు ఆత్మని ధర్మము కాదు. దానజేసి అశుద్ధి కర్మయగు క్షేత్రమునందే కలదుగాని ఆత్మయందు లేదని విశదముగా తెలియనగుచున్నది. ౩౬

**మూ॥** అతో రూపాది సంస్కారా ద్యశుద్ధిసంబంధా భావాత్ న పరస్మాదాత్మనో విలక్షణ స్త్వమితి ప్రత్యక్షాది

---

(94) బృ. ౪-౪-౭. (95) బృ. ౪-౩-౨౨.
(96) బృ. ౪-౩-౧౬. (97) బృ. ౪-౩-౧౫.
(98) బృ. ౪-౩-౨౧. (99) గీ. ౨-౨౫. (100) గీ. ౧౩-౩౧.

(101) మహాభూతములు ఇంద్రియములు విషయములు అహంకారము బుద్ధి అవ్యక్తము ఇచ్ఛాద్వేషములు సుఖదుఃఖములు సంఘాతము. చేతన, ధృతి యిడి 4 వికారములతో గూడిన క్షేత్రము. గీ. ౧౩-౫, ౬.

(102) విషయము కర్త, విషయి కర్త.

విరోధాభావాత్ యుక్తం పర ఏవాత్మాహ మితిప్రతిపత్తుమ్ - 'త దాత్మాన మేవా వే దహం బ్రహ్మాస్మి', 'ఏకధైవాను ద్రష్టవ్యమ్', 'అహమేవాధస్తాత్', ఆత్మైవాధస్తాత్' 'సర్వ మాత్మానం పశ్యతి', 'యత్ర త్వస్య సర్వ మాత్మైవ', 'ఇదం సర్వం యదయ మాత్మా', స ఏషోఽకలః', 'అనంతర మబాహ్యమ్', 'స బాహ్యాభ్యన్తరో హ్యజః', 'బ్రహ్మైవేదమ్', 'ఏతయా ద్వారా ప్రాపద్యత', 'ప్రజ్ఞానస్య నామధేయాని', 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ', 'తస్మాద్వా', 'తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్', 'ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ', 'అశరీరం శరీరేషు', 'న జాయతే మ్రియతే', 'స్వప్నాంతం జాగరితాంతమ్'. 'స మ ఆత్మేతి విద్యాత్', 'యస్తు సర్వాణి భూతాని', 'త దేజతి త న్నైజతి', 'వేన స్తత్పశ్యన్', 'త దేవాగ్నిః', 'అహం మను రభవం సూర్యశ్చ', 'అన్తః ప్రవిష్టః శాస్తా జనానామ్', 'స దేవ సోమ్య', 'తత్ సత్యం స ఆత్మా తత్త్వమసి' ఇత్యాది శ్రుతిభ్యః. 32

తా॥ కాన రూపము మొదలగువాని సంస్కారాదు దోషముల సంబంధము లేనివాడవగుటవలన నీవు పరమాత్మ కంటె వేరువాడవుకావు. కావునను ప్రత్యక్షాది ప్రమాణ విరోధము లేమి ఈ దిగువ నుదహరింపబడిన శ్రుతులనుబట్టి 'నేను పరమాత్మనే' అని గ్రహింపదగును. 'అది[103] తన్నే - 'నేను బ్రహ్మమను' అని తెలసికొనెను.', అది[104] (ఎడ తెరపిలేని ఆకాశమువలె) ఒకే ఒకటి యని (విజ్ఞానఘనము, ఏకరసము)

(103) బృ. ౧-౪-౧౦. (104) బృ. ౪-౪-౨౦.

ఎరుగదగినది', 'క్రింద[105] నేనే', 'క్రింద[106]నున్నది ఆత్మయే', 'సమస్తమును[107] తన్నుగానే చూచుచున్నాడు', 'ఇతనికి[108] (బ్రహ్మజ్ఞునకు) ఎల్లయు ఆత్మయే అగునపుడు', (భూతములని) 'ఇది[109]ఎల్లయు ఆయీఆత్మయే', 'ఆ[110]యితడు అకలుడు[111]' 'లోపల[112] వెలుపల అను విభాగములు లేనివాడు', 'పుట్టుక[113] లేనివాడు లోపల[114] వెలుపల నిండియుండువాడు', 'ఇది[115] యెల్లయు బ్రహ్మమే', 'అది[116] యీ గుమ్మముగుండ ప్రవేశించెను', 'ఇవి[117]యెల్ల ప్రజ్ఞానముయొక్కయే పేరులు.', 'బ్రహ్మము[118], సత్యము, జ్ఞానము, అనంతము', 'ఆ యీ[119] బ్రహ్మమగు ఆత్మనుండి ఆకాశము పొడమెను', 'దాని[120] సృజించి దానిలోనే ప్రవేశించెను', 'ఎల్ల[121] భూతములలో

---

(105) ఛాం. ౭-౨౫-౧. (106) ఛాం. ౭-౨౫-౨.

(107) బృ. ౪-౪-౨౩. (108) బృ ౨-౪-౧౪.

(109) బృ. ౨-౪-౬. (110) ప్ర. ౬-౫.

(111) ప్రాణాదికములగు పదునారు కలలు లేనివాడు.

(112) బృ. ౨-౫-౧౦. (113) ము. ౨-౧-౨.

(114) క. లోపల వెలుపల వెలుపల । లోపలగానుండు నజులలోకంబులకున్ ... ... ఉ. హరి. చూ.

(115) ము. ౨-౨-౧౧. (116) ఐ. ౧-౩-౧౨.

(117) ఐ. ౩-౫-౨. శుద్ధప్రజ్ఞానరూపమగు బ్రహ్మమునకు ఉపాధిభూతములును ఉపాధివలన కలిగిన గుణనామధేయములు నగు సంజ్ఞానము మొదలుగాగల ఇవి యెల్లయు ప్రజ్ఞప్తి మాత్రమగు ప్రజ్ఞానమునకు పేరులగుగాని సాక్షాత్తుగా కావు. — "ప్రాణస్యైవ ప్రాణో భవతి" ఇత్యాదిగా ఈసంగతి చెప్పబడెను.

(118, 119) తై. ౨-౧-౧. (120) తై. ౨-౧-౬.

(121) శ్వే. ఉ. ౬-౧౧.

అడగి ఎల్లచో వ్యాపించి ప్రకాశించు ఒకే ఒకడు', శరీరము లందుండి[122] శరీరములేనివాడు', 'అది[123] పుట్టదు గిట్టదు[124]', 'జాగ్రత్ స్వప్నములను (గాంచుచు)', 'అతడు[125] నాయాత్మ యని తలచునది', 'ఎవ[126] డన్నిభూతముల (నెరుగునో)', 'అది[127] కదలును మరియు కదలదు', 'దానిని[128] తెలిసికొనిన వాడై పూజార్హుడగును', 'అదియు[129] అగ్ని', 'నేను[130] మనువు నయితిని. సూర్యుడను అయితిని', 'వారిలో[131] ప్రవేశించి వారికి శాసకుడగుచున్నాను', 'నాయనా![132] సత్తే', 'అది[133] సత్యము, అది యాత్మ, అది నీవు.' 3౭

మూ॥ స్మృతిభ్యశ్చ – 'భూః ప్రాణినః సర్వగుహాశయస్య', 'ఆత్మైవ దేవతాః', 'నవద్వారే పురే', 'సమం సర్వేషు భూతేషు', 'విద్యా వినయ సంపన్నే', 'అవిభక్తం విభక్తేషు', 'వాసుదేవ స్సర్వ మి'త్యాదిభ్య ఏకఏవాత్మా పరం బ్రహ్మ సర్వసంసారధర్మ వినిర్ముక్త స్త్వమితి సిద్ధమ్. 3౮

తా॥ 'సర్వ[134] హృదయములందును నివసించుచుండు వానికి ప్రాణు లన్నియు శరీరము', 'సర్వ[135] దేవతలును ఆత్మయే', 'తొమ్మిది[136] గుమ్మముల పురమునందు', 'భూతము[137] లన్నిటియందును ఎవడు సమముగా ఉండు పర

---

(122) కఠ. ఉ. ౨-౨౨. (123) కఠ. ఉ. ౨-౧౮.

(124) కఠ. ఉ. ౨-౧-౪. (125) కౌషీ. ఉ. 3-౮ (126) ఈశ. ౬.

(127) ఈశ. ౫ (128) మహా. నా. ఉ. ౨-3.

(129) తై. ఆ. ౧౦-౧. (130) బృ. ౧-౪-౧౦.

(131) తై. ఆ. 3-౧౧-౧-౨ (132) ఛాం. ౬-౨-౧.

(133) ఛాం. ౬-౮-౭. (134) ఆపస్తంభ ధర్మసూత్రము ౧-౮-౨౨.

(135) మను. ౧౨-౧౧౯. (136) గీ. 3-౧3. (137) గీ. ౧3-౨౭.

మేశ్వరుని', 'విద్యా[138] వినయములతో గూడిన బ్రాహ్మణుని యందును ఆవునందును ఏనుగునందును కుక్కయందును శ్వపచునందును పండితులుసమదర్శనులు', 'విభక్తములుగా[139] ఉన్నవానిలో అవిభక్తుడు', 'ఇది[140] యెల్లయు వాసుదేవుడే', ఈ మొదలగు స్మృతులచే సర్వసంసార ధర్మవిముక్తుడగు బ్రహ్మముతో నీవు ఏకాత్మవని సిద్ధమయినది. ౩౮

మూ॥ స యది బ్రూయాత్ - యది భగవన్ 'అనన్తరోఽబాహ్యః', 'స బాహ్యాభ్యంతరో హ్యజః', 'కృత్స్నః', 'ప్రజ్ఞాన ఘన ఏవ' సైంధవఘనవదాత్మా సర్వమూర్తి భేద వర్జితః ఆకాశవ దేకరసః, తర్హి కిమిదం దృశ్యతే శ్రూయతే వా సాధ్యం సాధనం వా సాధక శ్చేతి శ్రుతి స్మృతి లోక ప్రసిద్ధం వాది శత విప్రతిపత్తి విషయ ఇతి. ౩౯

తా॥ 'అయ్యా! - 'బాహ్యా[141]భ్యంతరములు లేక', 'బాహ్యా[142]భ్యంతరములుక్రమ్మి, పుట్టక', 'పూర్ణుడై'[143] 'ఆత్మ ఉప్పుగల్లువలె ఎరుక[144] ముద్దయే అయి మూర్తి భేదమును మాటలేక ఆకాశమువలె ఏకాకారమగునేని సాధ్య[145]మనియు

---

(138) గీ. ౫-౧౮. (139) గీ. ౧౩-౧౬. (140) గీ. ౭-౧౯.

(141) గీ. ౧౩-౧౬. (142) గీ. ౭-౧౯.

(143) బృ. ౨-౫-౧౯. (144) ము. ఉ. ౨-౧-౨.

(145) ఇల్లు పొలము డబ్బు ఈ మొదలగునవి సాధ్యములు. వీనికి తగిన కలప మొదలగునవి సాధనములు. అందరును సాధకులు. ఈ సాధ్యము లిహలోకోపయోగములు. ఇటులే స్వర్గాదులు సాధ్యములు. యజ్ఞాదులు సాధనములు. స్వర్గాది కాముకులగు త్రైవర్ణికులు సాధకులు — "స్వర్గ కామో యజేత" = స్వర్గమును కోరువాడు యజించునది. అని శ్రుతి. ఇటులు సాధన సాధ్య సాధక వ్యవహారము శ్రుతి స్మృతి లోక ప్రసిద్ధములు.

సాధన మనియు సాధకు డనియు శ్రుతులలో వినబడుచున్నది. స్మృతులును స్మరించుచున్నవి. లోకమునందును పలువురు పలు తెరగులుగా వాదించుచున్నారు. ఇట్టి వ్యవహారమునకు ఇది విరుద్ధముకాదా? ౩౯

మూ॥ ఆచార్యో బ్రూయాత్ – అవిద్యాకృత మేత ద్యదిదం దృశ్యతే శ్రూయతే వా సాధ్యం సాధనం సాధక శ్చేతి, పరమార్థత స్త్వేక ఏవాత్మా అవిద్యాదృష్టే రనేకవ దాభాసతే, తిమిరదృష్ట్యా అనేక చంద్రవత్, 'యత్ర వా అన్య దివ స్యాత్' 'యత్ర హి ద్వైత మివ భవతి తదితర ఇతరం పశ్యతి', 'మృత్యోః స మృత్యు మాప్నోతి', 'అథ యత్రాన్యత్ పశ్యతి అన్యచ్ఛృణోతి అన్య ద్విజానాతి తదల్పమ్', 'అథ యదల్పం తన్మర్త్య మితి', 'వాచారంభణం వికారో నామ ధేయమ్ మృత్తికేత్యేవ సత్యమ్', 'అన్యోఽసావన్యోఽహమ్', ఇతి భేద దర్శన నిందోపపత్తే రవిద్యాకృతం ద్వైతమ్ – 'ఏక మేవా ద్వితీయమ్' 'యత్ర త్వస్య', 'తత్ర కో మోహః కః శోకః' ఇత్యా ద్యేకత్వవిధి శ్రుతిభ్య శ్చేతి. ౪౦

తా॥ (ఇహలోకమున) కనిపించునట్టియు (పరలోకమును గురించి) శ్రుతులలో వినిపించునట్టియు సాధ్య సాధన సాధకా ద్యమగు నీ తొల్లియు అవిద్యాకల్పితము. తిమిరరోగము కల వాని చూపులకు ఒకే చంద్రు డనేక చంద్రులవలె కనిపించి నటులు నిక్కముగా ఒకే ఒక ఆత్మ అవిద్యాదృష్టికి అనేక ముగా కనిపించును. ఈ దిగువ శ్రుతులు భేదగ్రహణము అవి ద్యాకృత మని బోధించును.[146] ఏ జాగ్రత్ స్వప్నములయందు

(146) బృ. ౪-3-3౧.

వేరొకదానివలె నగునో[147] ఎందు సమస్తము వేరయినదివలె అగునో అపుడు (అజ్ఞానదశలో) ఒకఁడింకొకరి జూచును. (ఒక్కటియన నొక్కటియగు ఆత్మలో తాను, పరుడు అను భావము కలుగుచున్నది.)[148] 'మృత్యువునుండి మృత్యువునకు చేరుచున్నాడు',[149] 'మఱియు ఎందు వేరగుదాని చూచునో వినునో తెలియునో అది అల్పము, మరి[150] యేది అల్పమో అది మర్త్యము',[151] 'వికారము (కుండ చట్టి మూకుడు మొదలయిన కార్యజాతము) నామమాత్రమే, పేరులే వికారమునకాధారము. మట్టి యొకటే నిక్కము', 'అతఁడు[152] వేరు, నేను వేరు.' ఇటు లీ శ్రుతులు వేరిమిని దూషించెను. ఇది ఉపపన్నమగుటకు ద్వైతము అజ్ఞానమువలన కలుగుచున్నదని ఈ శ్రుతుల యభిప్రాయ మనుట నిశ్చయము,[153] 'అద్వితీయమగు ఏకమే',[154] 'ఇది యెల్లయు బ్రహ్మము నెరిగినవాని ఆత్మయే యయినపుడు', 'ఏకత్వ[155] మరసిన వానికి మోహమేడ, శోకమేడ?' ఈ మొదలగు శ్రుతులు ఏకత్వమును విధించుచున్నవి. కావున మనకు కనబడు ద్వైతము అవిద్యాకార్యము. అని ఆచార్యుడు చెప్పుగాక. ౪౦

మూ॥ యద్యేవం భగవన్! కిమర్థం శ్రుత్యా సాధ్యసాధనాదిభేద ఉచ్యతే ఉత్పత్తిః ప్రలయశ్చేతి. ౪౧

---

(147) బృ. ౨-౪-౧౪. (148) బృ. ౪-౪-౧౯.

(149) ఛాం. ౭-౨౪-౧. (150) ఛాం. ౬-౧-౪. (151) బృ. ౧-౪-౧౦.

(152) ఛాం. ౬-౨-౧. (153) బృ. ౪-౫-౧౫. (154) ఈశ. ౭.

(155) సాధకుడు సాధ్యము సాధనము అను త్రిపుటి అవిద్యాకార్యమగునెడల కర్మకాండము నేల చెప్పవలెను?

తా॥ ఇది యిటు లగునేని శ్రుతి సాధ్య సాధనాది[156] భేదమును ప్రపంచోత్పత్తి[157] ప్రలయములను ఏల చెప్పెను? ౪౧

మూ॥ అత్రోచ్యతే - అవిద్యావతః ఉపాత్త శరీరాది భేదస్య ఇష్టానిష్టయోగిన మాత్మానం మన్యమానస్య సాధనై రేవేష్టానిష్టప్రాప్తి పరిహారోపాయవివేక మజానతః ఇష్టప్రాప్తిం చానిష్ట పరిహారం చేచ్ఛతః శనైః తద్విషయ మజ్ఞానం నివర్తయితుం శాస్త్రమ్, న సాధ్య సాధనాదిభేదం విధత్తే। అనిష్టరూప స్సంసారో హి స ఇతి, తద్భేదదృష్టి మేవావిద్యాం సంసార మున్మూలయతి ఉత్పత్తిప్రలయాద్యేకత్వోపపత్తి ప్రదర్శనేన.

తా॥ దీనికి సమాధాన మిది: శరీరేంద్రియ మనో బుద్ధులు తానని అనుకొని, తనకు ఇష్టానిష్టములతో సంబంధము కలదని తలచి, సరియగు సాధనములచే ఇష్టమును బడసి అనిష్టమును బడయకుండ దలచినను అజ్ఞాని తనకు (సరియగు) ఇష్టమెటులు కలుగునో అనిష్ట మెటులు తొలగునో అట్టి ఉపాయమును వివేచింపజాలడు. ఆ యజ్ఞానమును మెలమెలగా[158]

---

(156) ఆత్మ ఒకటియే యనిన నొకటియే యగు ప్రపంచ మనెడు ద్వితీయము లేనియెడల జ్ఞానకాండమునందు సృష్ట్యాదివాక్యముల నేల చెప్పవలెను? 'కావున సాధ్యసాధనాదికముతో పాటు ప్రపంచముగూడ సత్యమే యని శ్రుతికి అభిప్రాయము' అని చెప్పవలయుఁగదా యని శిష్యుని ప్రశ్న.

(157) ఆత్మజ్ఞానము.

(158) అజ్ఞులు తమ్ము దేహాదికముగ తలతురు. ఇహపరసుఖమే పురుషార్థ మనుకొని అందుల కుపాయము వెదకుదురు. అట్టివారికి స్వర్గాదులను జెప్పు శ్రుతులు అనింద్యములగు కర్మల విధించి మనశ్శుద్ధి చేసి క్రమముగా అజ్ఞానమును తొలగించి పరమ పురుషార్థము బడయుటకు అర్హుల జేయును. ఈరీతిగా కర్మకాండ చరితార్థము.

తొలగద్రోయుటయే శాస్త్రముల యుద్దేశము. శాస్త్రము సాధ్యసాధనాదిభేదము[159] విధింపదు. ఏలనగా భేదమనునదే అనిష్టరూపమగు సంసారము. కావున శాస్త్రము ప్రపంచోత్పత్తి ప్రలయములకును ఆత్మైకత్వమునకును ఉపపత్తి[160] చూపి సంసారమునకు మూలమగు భేదమునే, లేక అవిద్యనే ఉన్మూలించును. ౪౨

మూ॥ అవిద్యాయా మున్మూలితాయాం శ్రుతి స్మృతి న్యాయేభ్యః, అనంతర మబాహ్యామ్; స బాహ్యాభ్యంతరో హ్యజః, సైంధవఘనవత్ ప్రజ్ఞానఘన ఏవైక ఆత్మా, ఆకాశ వత్పరిపూర్ణ ఇత్యాత్మైవ ఏకా ప్రజ్ఞా ప్రతిష్ఠా పరమార్థదర్శనో భవతి, న సాధ్య సాధనోత్పత్తి ప్రలయాది భేదేన అశుద్ధి గంధోఽప్యుపపద్యతే. ౪౩

తా॥ శ్రుతి స్మృతిన్యాయము (అనుకూలతర్కము)లచే అవిద్య మొదలంట నశింపగా పరమార్థదర్శియొక్క నిశితమగు ప్రజ్ఞ, ఉప్పుగల్లువలె ఎరుక ముద్దయు, బాహ్యాభ్యంతరములు లేక బాహ్యాభ్యంతరములు నిండి ఆకాశము[161]వలె వ్యాపకమును అజమును అగు ఏకాత్మయందు సుప్రతిష్ఠితమగును. కావున సాధ్యసాధన ప్రలయోత్పత్త్యాది భేదముచేనైన అశుద్ధి ఆత్మయందు లేశమును ఉపపన్నము కాదు. ౪౩

(159) 'నేను కర్తను' అను జ్ఞానము మన కున్నదిగదా! యని శాస్త్రము సాధ్యసాధనాదిభేదము చెప్పదు. ఇది లోకప్రసిద్ధము.

(160) చూ - ౪౪ వాక్యమున - 164 వ టీక.

(161) బ్రబుసినపుడు తాడు - పాముగా తోచును గాని లోపల వెలుపల పరిపూర్ణమై తాడే ఉండును.

మూ॥ తచ్చై తత్పరమార్థ దర్శనం ప్రతిపత్తు మిచ్ఛతా వర్ణాశ్రమాద్యభిమాన కృత పాఙ్క్తరూప పుత్ర విత్త లోకైషణా దిభ్యో వ్యుత్థానం కర్తవ్యమ్ । సమ్యక్ ప్రత్యయ విరోధా త్తదభిమానస్య భేద దర్శన ప్రతిషేధార్థోపపత్తి శ్చోపపద్యతే । న హ్యేకస్మి న్నాత్మన్య సంసారిత్వ బుద్ధౌ శాస్త్ర న్యాయోత్పాదితాయాం త ద్విపరీతా బుద్ధిర్భవతి।న హ్యగ్నౌ శీతత్వబుద్ధిః, శరీరే వా అజరామరణబుద్ధిః । తస్మా దవిద్యా కార్యత్వాత్ సర్వకర్మణాం తత్సాధనానాంచ యజ్ఞోపవీతాదీనాం పరమార్థదర్శననిష్ఠేన త్యాగః కర్తవ్యః. ४४

తా॥ ఈ పరమార్థ జ్ఞానము బడయగోరువాడు వర్ణాశ్రమాద్యభిమానముచే తెచ్చుకొన్నవియు అయిదయిదుగా[162] చెప్పబడినవియు నగు పుత్ర విత్త లోకైషణాదులకు దూరముగా లేచిపోవలయును. వీనియెడల అభిమానము సరియగు ఎరుకకు విరుద్ధము. శ్రుతులు భేదమును[163] నిషేధించుచున్నవి. అవి యటులు నిషేధించుటకు ఉపపత్తియు[164] పొసగును. ఎటు లనగా

---

(162) బృ. ౧ - ౪ - ౧౭.

(163) మృత్యోః స మృత్యు మాప్నోతి, య ఉదరమంతరం కురుతే, అథ తస్య భయం భవతి" ఈ మొదలగు శ్రుతులు ఈషద్భేదమేని కనువాడు భయము పొంది చచ్చి పుట్టిపుట్టి చచ్చుచునుండునని భేదమును నిషేధించుచున్నవి.

(164) నలుబదిరెండవ వాక్యాంతము నలుబదిమూడవ వాక్యాంతము గురుతు చేసికొనునది. శ్రుతి భేదదర్శనముకూడదని చెప్పుటచే అది ప్రమాణముకాదు అదియే ప్రమాణమందురేని 'అశబ్ద మస్పర్శమ్", 'అదృశ్య మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయ

శాస్త్రమును న్యాయమును — 'ఆత్మలో భేదములేదు. అది ఒక్కటన్న నొక్కటే. మరియు దానిలో సంసారిత్వము లేదు' అను బుద్ధి కలిగింపగా దానిప్రక్కనే దానికి విపరీతబుద్ధి కలుగదు. నిప్పు వేడిగానుండు నను బుద్ధిలో నిప్పు చల్లగా నుండు నను బుద్ధియు శరీరము చావు పుట్టుకలతో గూడిన దను బుద్ధిలో శరీర మజరామరమను బుద్ధియు ఉండవు. కాన సర్వకర్మలును వానికి సాధనములగు జందెము లోనగునవియు అవిద్యా కార్యము లగుటవలన పరమార్థజ్ఞాన నిష్ఠుడు వీనిని విడనాడ వలయును. ౪౪

## శిష్యప్రతిబోధ విధిప్రకరణమ్

## సమాప్తమ్.

---

సారం ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతమ్" ఇత్యాదిగానున్న నిషేధ శ్రుతులకు అభేదదర్శనమునందే తాత్పర్యము చెప్పనియెడల "నేతి నేతి" శ్రుతులు వ్యర్థములయిపోవును. సముచ్చయమును స్వీకరించి అవ్యర్థతను సాధింపవచ్చునే అని అనుట తగదు. కర్మజ్ఞానములు ఒండొండ విరుద్ధములు. కర్మజన్య మనిత్యము. మోక్ష మజన్యము మరియు నిత్యము. దానికి కర్మాపేక్షలేదు. మరియు "అప్రాప్తే శాస్త్ర మర్థవత్" అను న్యాయముచే ఆవరకమగు అజ్ఞానమును శాస్త్రము తొలగించునదిగాన అది సాధనము.

# కూటస్థాద్వయాత్మబోధ ప్రకరణమ్

మూ॥ సుఖ మాసీనం బ్రాహ్మణం బ్రహ్మనిష్ఠం కశ్చిత్ బ్రహ్మచారీ జన్మ మరణ లక్షణాత్ సంసారాత్ నిర్విణ్ణో ముముక్షుః విధివదుపసన్నః పప్రచ్ఛ - భగవన్, కథ మహం సంసారాన్మోక్షిష్యే శరీరేన్ద్రియ విషయ వేదనావాన్। జాగరితే దుఃఖ మనుభవామి, తథాస్వప్నేఽనుభవామి చ పునః పునః సుషుప్తి ప్రతిపత్యా విశ్రమ్య విశ్రమ్య, కిమయమేవ మమస్వభావః? కిమ్ వా అన్యస్వభావస్య సతో నైమిత్తిక ఇతి। యది స్వభావః, నమే మోక్షాశా, స్వభావస్య అవర్జనీయత్వాత్। అథ నైమిత్తికః నిమిత్త పరిహారే స్యాన్మోక్షోపపత్తిః. ౧౫

తా॥ ఒకానొక బ్రహ్మచారి పుట్టు చావు లేతీరుగా గల సంసారము వలన నిర్వేదము చెంది మోక్షము కోరి సుఖాసీనుడును బ్రహ్మనిష్ఠుడు నగు (ఒకానొక) బ్రాహ్మణుని విధిపూర్వకముగా ఉపసర్పించి - స్వామీ! నే నెటులు సంసారమునుండి మోక్షము చెందగలను? శరీరేంద్రియ విషయముల తెలివి గల నేను జాగ్రదవస్థయందు దుఃఖ మనుభవించుచున్నాను. నిదురగూరి విశ్రాంతి పొంది నడుమ నడుమ కలలందిటులే దుఃఖ మనుభవించుచున్నాను. ఇదియే నాకు స్వభావమా? లేక వేరు తీరయియుండగా ఇది నడుమ ఏదేని కారణమున గలిగినదా? ఇది స్వభావ మాయనేని నాకు మోక్షాశ లేదు. ఏల యనగా స్వభావము పోగొట్టుకొనరాదుగదా! నైమిత్తిక మాయనేని (నడుమ ఏకారణముచేనైనను వచ్చిన

దేని) నిమిత్తమును పోద్రోచినెడల మోక్షము కలుగవచ్చును గదా’ అని ప్రశ్నించెను. ౪౫

మూ॥ తం గురురువాచ – శృణు వత్స, న తవాయం స్వభావః । (కింతు) నైమిత్తికః. ౪౬

తా॥ ‘నాయనా! వినుము! నీ కిది స్వభావముకాదు. మరి నైమిత్తికము’ అని గురువు బదులు పలికెను. ౪౬

మూ॥ ఇత్యుక్తః శిష్య ఉవాచ – కిమ్ నిమిత్తమ్, కిం వా తస్యనివర్తకమ్, కోవా మమస్వభావః, యస్మిన్నిమిత్తే నివర్తితే నైమిత్తికాభావః, రోగనిమిత్త నివృత్తావివ రోగీ స్వభావం ప్రపద్యేయేతి ౪౭

తా॥ గురువు ఇటులుచెప్పగా – నిమిత్తమేది? దీనిని పోగొట్టునదేది? నా స్వభావ మేది? రోగమునకు నిమిత్తమును నివర్తింపజేయునెడల రోగి స్వభావమును (ఆరోగ్యమును) పొందుచందముగా ఏ నిమిత్తమును నివృత్తి చేయుచో మరల నేను నా స్వభావమును పొందగలనో ఆ నిమిత్త (కారణ) మేది? అని శిష్యు డడిగెను. ౪౭

మూ॥ గురురువాచ-అవిద్యా నిమిత్తమ్, విద్యా తస్యా నివర్తికా, అవిద్యాయాం నివృత్తాయాం తన్నిమిత్తాభావాత్ మోక్ష్యసే జన్మ మరణ లక్షణాత్, స్వప్న జాగ్రద్దుఃఖం చ నాను భవిష్యసీతి. ౪౮

తా॥ ‘దానికి కారణము అవిద్య, విద్య దానిని తొలగ జేయును. అవిద్య తొలగిపోగా కారణము తొలగుటవలన చావు పుట్టువులే తీరుగాగల సంసారమునుండి మోక్షము

పొందగలవు. మరియు కలయందును మెలకువయందును పొడను దుఃఖము[1] ననుభవింపబోవు.' అని గురువు చెప్పెను.

మూ॥ శిష్య ఉవాచ - కా సా అవిద్యా? కిమ్ విషయా వా? విద్యా చ కా యయా స్వభావం ప్రతిపద్యేయేతి.౪౯

తా॥ 'ఆ యవిద్య యెద్ది? దాని కేది విషయము?[2] దేనిచే స్వ-భావమును పొందుదునో అట్టి విద్య ఎద్ది?' అని శిష్యు డడిగెను. ౪౯

మూ॥ గురుకువాచ - త్వంపరమాత్మానం సన్తమ్ అసంసారిణమ్ సంసార్యహమస్మీతి విపరీతం ప్రతిపద్యసే, అకర్తారం సన్తం కర్తేతి, అభోక్తారం సన్తం భోక్తేతి, విద్యమానం చ అవిద్యమానమితి, ఇయమవిద్యా. ౫౦

తా॥ 'నీవు అసంసారివై పరమాత్మవై యుండగా 'నేను సంసారి' నని పొరపాటు పడుచున్నావు. మరియు అకర్తవయి యుండగా కర్త ననియు అభోక్తవయి యుండగా భోక్త ననియు నిత్యుడవయి యుండగా అనిత్యుడ ననియు తలపోయుచున్నావు. ఇది అవిద్య'[3] అని గురువు పలికెను. ౫౦

---

(1) నిక్కమయినటులును ఆత్మకు సంబంధము కలయటులును తలపబోవు.

(2) జ్ఞాన స్వరూపమగు ఆత్మ అవిద్యకు ఆశ్రయము. మరియు విషయము. మాయావివరణము ౧౫౫ వ పుటక్రింద నున్న టీక చూచునది.

(3) నీ స్వరూపము నావరించి 'నేను కర్తను, నేను భోక్తను, నే ననిత్యుడను' అను నీ మొదలుగా విక్షేపము కలిగించునది లేక తోపజేయునది అవిద్య యని తాత్పర్యము.

మూ॥ శిష్య ఉవాచ – యద్యప్యహం విద్యమానః తథాపి న పరమాత్మా, కర్తృత్వభోక్తృత్వలక్షణః సంసారో మమ స్వభావః, ప్రత్యక్షాదిభిః ప్రమాణైః అనుభూయమానత్వాత్। న అవిద్యా నిమిత్తః అవిద్యాయాః స్వాత్మ విషయత్వానుపపత్తేః। అవిద్యానామ అన్యస్మిన్ అన్య ధర్మాధ్యారోపణా – యథా ప్రసిద్ధం రజతం ప్రసిద్ధాయాం శుక్తికాయామ్, యథా ప్రసిద్ధం పురుషం స్థాణావధ్యారోపయతి ప్రసిద్ధం వా స్థాణుం పురుషే। నాఽప్రసిద్ధం ప్రసిద్ధే ప్రసిద్ధం చాప్రసిద్ధే। న చ ఆత్మన్యనాత్మానమధ్యారోపయతి, ఆత్మనః అప్రసిద్ధత్వాత్। తథా ఆత్మానమ్ అనాత్మని, ఆత్మనోఽప్రసిద్ధత్వాదేవ. ౫౧

తా॥ 'నేను నిత్యుడనయినను పరమాత్మను కాను. ఏలనగా నే నాయాయీ పనులు చేయుచున్నాను. వానివలన గలుగు సుఖ దుఃఖముల ననుభవించుచున్నాను. ఇటులు కర్తృత్వ భోక్తృత్వ లక్షణమగు సంసారము నా స్వభావము. ఇది ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియబడుచున్నది. దీనికి అవిద్య కారణముకాదు. అవిద్య ఆత్మను విషయముగా (కర్మ) జేసికొనుట పొసగదు. అవిద్య యన ఒక వస్తువునందు మరొక వస్తుధర్మము నారోపించుటకదా! ఎటులన విడిగా తెలియబడు వెండిని విడిగా తెలియబడు ముత్తెపుచిప్పయం దారోపింతురు. ఇటులే విడిగా తెలియబడు దొంగను విడిగా తెలియబడు దుంగయం దారోపింతురు. (ఎండలో దగదగలాడు ఆలిచిప్పను జూచి వెండి అని అనుకొందురు. చీకటిలో దుంగను జూచి దొంగ అని అనుకొందురు. ఇటు లనుకొనుటకు మన

మినివరకు విడివిడిగా ఆలిచిప్పను వెండిని ఎరిగియుండవలయును. ఇటులే దుంగను విడిగాను దొంగను విడిగాను ఎరిగియుండవలెను. కావున ఇట్టి భ్రమలో లోగడ రెండు వస్తువుల యెరుక ఉండవలెను.) అంతియకాని విడిగా తెలియబడని దానిని విడిగా తెలియబడుదానియందు ఆరోపింపరు. ఆత్మ విడిగా తెలియబడకపోవుటవలన ఎవరును ఆత్మయం దనాత్మ నారోపింపరు. ఆత్మ విడిగా తెలియబడకపోవుటవలననే అత్మను గూడ అనాత్మయం[4] దెవరును ఆరోపింపరు. అని శిష్యుడనెను. ౫౧

మూ॥ తం గురు రువాచ — న వ్యభిచారాత్ । న హి వత్స, ప్రసిద్ధం ప్రసిద్ధ ఏవాధ్యారోపయతీతి నియన్తుం శక్యమ్ । ఆత్మన్యధ్యారోపణదర్శనాత్ । గౌరోఽహం కృష్ణోఽహ మితి దేహ ధర్మస్య అహం ప్రత్యయ విషయే ఆత్మని, అహం ప్రత్యయ విషయస్య చ ఆత్మనః దేహే అయమస్మీతి. ౫౨

తా॥ 'కాదు, ఈమాట నీవన్నటు లంతటను చెల్లదు. విడిగా తెలియబడిన వస్తువులే విడిగా తెలియబడిన వస్తువులం దారోపింతురను నియమము చేయుటకు వీలులేదు. ఏల

(4) "అవిద్య యనగా మిథ్యాజ్ఞానము" అని అనుకొని శిష్యు డిటులు ప్రశ్నించెను. ఎరిగియున్న ఒకవస్తువును జూచి ఎరిగియున్న ఇంకొక వస్తువని యనుకొనుట మిథ్యాజ్ఞానము. ఆత్మ ఎరిగినది కాదు. దానియెడల మిథ్యాజ్ఞానము (భ్రాంతి) గాని అధ్యాసగాని కలుగుటకు వీలు లేదు. ఎరిగియే యున్నదగునేని దానియందు అనాత్మధర్మము లెటు లారోపింపబడును? ఆత్మ స్వయంప్రకాశ మాయె. అచట అవిద్య కాస్కారము లేదు. ఇక ఎరిగియేయుండనియెడల అధిష్ఠానమే లేదాయె. ఇటు లిరుదెసల ఆత్మయందు కర్తృత్వాది ధర్మారోపణమునకు తావు లేదు.

నగా ఆత్మయందు దారోపము కానవచ్చుచున్నది. 'నేను పచ్చగా నున్నాను, నేను నల్లగా నున్నాను' అను దేహధర్మమును నేనను ఎరుకకు విషయమైన (కర్మ) ఆత్మయందును, నేనను ఎరుకకు విషయమైన ఆత్మను 'నేను వచ్చుచున్నాను', 'నేను మనుష్యుడను', 'ఇదిగో నేను' ఈ మొదలుగా దేహము నందును ఆరోపింతురు' అని గురువు అనెను. ౫౨

మూ॥ శిష్య ఆహ – ప్రసిద్ధ ఏవ తర్హ్యాత్మా అహం ప్రత్యయ విషయతయా దేహశ్చ అయమితి । తత్రైవం సతి ప్రసిద్ధయో రేవ దేహాత్మనో రితరేతరాధ్యారోపణాత్ స్థాణు పురుషయోః శుక్తికా రజతయోరివ। తత్ర కం విశేషమాశ్రిత్య భగవతోక్తం ప్రసిద్ధయోరితరేతరాధ్యారోపేణేతి నియన్తుం న శక్యతే ఇతి ? ౫౩

తా॥ 'నేనను ఎరుకకు విషయముగా ఆత్మయు, నేను మనుష్యుడనని దేహమును విడివిడిగా తెలియబడినవే యన్నమాట. ఇటులగుచో దుంగయు దొంగయు, ఆలిచిప్పయు వెండియు విడివిడిగా తెలిసిన చందముగనే విడివిడిగా తెలిసినట్టి యే దేహమునకును ఆత్మకును ఒండొండ ఆరోపణ మన్నమాట. అట్టియెడ తాము ఏ విశేషము చూచి విడివిడిగా తెలిసినవస్తువులకే ఆరోపమని నియమింప వీలులేదని చెప్పితిరి?' అని శిష్యు డడిగెను. ౫౩

మూ॥ గురురాహ – శృణు । సత్యం ప్రసిద్ధౌ దేహాత్మానౌ న తు స్థాణు పురుషావివ వివిక్తప్రత్యయవిషయతయా సర్వలోకప్రసిద్ధౌ । కథం తర్హి నిత్యమేవ నిరన్తరా వివిక్త

ప్రత్యయవిషయతయా । న హి అయం దేహః, అయమాత్మా, ఇతి వివిక్తాభ్యాం ప్రత్యయాభ్యాం దేహాత్మానౌ గృహ్ణాతి యతః కశ్చిత్। అత ఏవ హి మోముహ్యతే లోకః ఆత్మానాత్మ విషయే ఏవమాత్మా నైవమాత్మా ఇతి । ఇమం విశేషమాశ్రిత్యావోచం నైవం నియన్తుం శక్యమితి. ౫౪

తా॥ దేహము ఆత్మయు ఈ రెండును తెలియబడునవను మాట సత్యమేకాని దుంగ దొంగలవలె వేరు వేరుగా అందరకును తెలియగలయవి కావు. మరి యెటులు తెలియగలయవి అని యందువా యీ రెండును ఒకదానికంటె మరియొకటి వేరు కానటులు తెలియగలయవి. 'ఇది దేహము' 'ఇది యాత్మ' అని యెవడును వేరు వేరుగా దేహాత్మలను గ్రహింపడు. కావుననే ఆత్మానాత్మల దెలుపుటలో 'ఆత్మ యిట్టిది' అని ఒక రనగా 'అట్టిది కాదు' అని మరి యొకరుగా ఎందరో[5] పొరపడుచున్నారు. ఈ విశేషము[6] ఉండబట్టియే నీవు

(5) కొందరు దేహ మాత్మ యని యందురు. మరికొందరు ఇంద్రియము లాత్మ యని యందురు. ఇంకొందరు ప్రాణ మాత్మయని యందురు. వేరొక కొందరు మన స్సాత్మయని యందురు. కొంద రాత్మ కర్తయని మరికొందరు కాదు భోక్తయని యిటులు తలాయొకరీతిగా మోహపడుచున్నారు.

(6) "నేను మనుష్యుడను నే నజ్ఞానిని" అని లోకు లనుకొందురు. నేను+మనుష్యుడను, నేను+అజ్ఞానిని అను ఈ రెండు జంటలును విడివిడిగా తెలియబడు వస్తువులు కావు. కాని ఇవి ఆత్మానాత్మ ధర్మములు. ఈరెండు ధర్మములును ఏకజ్ఞానమునకు విషయము కావచ్చును. ఇటులు "నేను కర్తను" ఈ మొదలుగా ఆరోప్యమగు కర్తృత్వమునకును అధిష్ఠానమగు ఆత్మకును ఐక్యభ్రాంతి కలుగవచ్చును.

చెప్పినటులు విడివిడిగా తెలియబడు వస్తువులనే విడివిడిగా తెలియబడు వస్తువులందారోపింతురను నియమము చేయుటకు వీలులేదని అంటిని. అని గురువనగా ౫౨

మూ॥ నను, అవిద్యాఽధ్యారోపితం యత్ర యత్ తదసత్ తత్ర దృష్టమ్, యథా రజతం శుక్తికాయాం, స్థాణౌ పురుషం, రజ్జ్వాం సర్పః, ఆకాశే తలమలినత్వమిత్యాది, తథా-దేహాత్మనోఽపి నిత్యమేవ నిరన్తరావివిక్తప్రత్యయతయా ఇతరేతరాధ్యారోపణా కృతా స్యాత్ । తత్ ఇతరేతరయోః నిత్యమేవ అసత్త్వే స్యాత్ । యథా శుక్తికాదిషు అవిద్యాధ్యారోపితానాం రజతాదీనాం నిత్యమేవ అత్యన్తాసత్త్వమ్, తద్విపరీతానాం చ విపరీతేషు, తద్వత్ దేహాత్మనోరవిద్యయైవ ఇతరేతరాధ్యారోపణా కృతా స్యాత్ తత్రైవం సతి, దేహాత్మనోంసత్వం ప్రసజ్యేత । తచ్చానిష్టమ్, వైనాశిక పక్షత్వాత్ । అథ తద్విపర్యయేన దేహః ఆత్మన్యవిద్యయా' అధ్యారోపితః, దేహస్యాత్మని సతి అసత్త్వం ప్రసజ్యేత । తచ్చానిష్టమ్, ప్రత్యక్షాది విరోధాత్ । తస్మాద్దేహాత్మనౌ నావిద్యయా ఇతరేతరస్మిన్ అధ్యారోపితౌ కథం తర్హి? వంశస్తమ్భవన్నిత్యసంయుక్తౌ. ౫౫

తా॥ 'అయ్యా! ఏవస్తువునం దవిద్యచే ఏ వస్తువారోపింపబడెనో ఆ వస్తువునం దది లేనిదిగా తెలియును (భ్రమపోయినపిదప). ఆలిచిప్పను జూచి వెండియనియు దుంగనుజూచి దొంగయనియు త్రాటిని జూచి పామనియు మింటిని జూచి కటాహ మనియు అనుకొందుము. ఇటులే ఐక్యజ్ఞానములో విషయము లగుటవలన దేహమును ఆత్మ యనియు ఆత్మను

దేహ మనియు అనుకొందుమేని ఈ రెండును లేనివే యగును. ఆలిచిప్ప మొదలగువానిలో అవిద్యచే ఆరోపింపబడిన (ఉన్న వని అనుకొనబడిన) వెండి మొదలగునవియు తదితర వస్తువు లలో ఇతర వస్తువులును ఎటులు లేవో అటులే అవిద్యచే దేహము నాత్మయని యనుకొనినను ఆత్మను దేహమని యను కొనినను ఆత్మయును లేక దేహమును[7] యీ రెండును ఎప్పు డును లేకపోవుటయే తటస్థించును. వైనాశికు లిటు లనుకొం దురు. ఇది ఇష్టము కాదు. (ఇయ్యకొనదగినది కాదు) ఇక దీనికి మారుగా ఆత్మయం దవిద్యచే దేహ మారోపిత మాయె నేని ఆత్మ[8] సత్యముయియుండగా దేహ మసత్య మగును. ఇదియు అనిష్టము. ఏలన, కంటికి కనబడుచున్న దేహమును లేదని యనుటెటులు ? ఇది ప్రత్యక్షాది ప్రమాణ విరుద్ధము. కాన దేహ మాత్మయందును ఆత్మ దేహమునందును అవిద్యచే ఆరోపింపబడవు. ఆరోపింపబడనియెడల 'నేను మనుష్యుడ'నను వ్యవహార మెటులు జరుగుచున్నది ? వెదుళ్లు మొకరములు[9]

---

(7) ఆలిచిప్పను జూచి వెండి యని యనుకొనుట భ్రాంతి. ఇటులే ఆత్మను దేహమని కాని దేహము నాత్మయని కాని అనుకొనుట భ్రాంతి. ఆలిచిప్పలో భ్రాంతిచే జూడబడిన వెండి నిక్కము కానియటులు అవిద్యచే ఆత్మయందు జూడబడిన దేహము దేహముకాదు. దేహమందు జూడబడిన ఆత్మ ఆత్మ కాదు. ఇటులు ఈ రెండును అసత్య మగును. కావున వెదురులు మొకరములు కలిసి యిల్లగుననటులు ఆత్మయు దేహము కలిసి - "నేను మనుష్యుడను" అని వ్యవహారము పొసగును.

(8) ఆత్మ = జ్ఞానరూపమగు నేను.

(9) మొకరములు వెదురులు మొదలగువాని మొత్తమున కిల్లని పేరు. ఆత్మ దేహము మొదలగువాని మొత్తమునకు మనుష్యుడని పేరు. ఇంతేకాని, అవిద్యాబలముచే అన్యోన్యాధ్యాస కాదని ప్రశ్నాభిప్రాయము.

వీని చందముగా దేహము ఆత్మ యీ రెండును నిత్యసంయుక్త
ములు' అని శిష్యుడనెను. ౫౭

మూ॥ న, అనిత్యత్వ పరార్థత్వ ప్రసఙ్గాత్ - సంహ
తత్వాత్ పరార్థత్వమ్ అనిత్యత్వం చ వంశస్తమ్భాదివదేవ ।
కిం చ యస్తు పరైర్దేహేన **సంహతః** కల్పిత ఆత్మా స
**సంహతత్వాత్** పరార్థః । తేన **అసంహతః** పరోఽన్యో నిత్యః
సిద్ధస్తావత్ । ౫౮

తా॥ 'ఇది ఇటులుకాదు. ఇటు లగునెడల ఆత్మ అనిత్య
మనియును పరోపకారముకొఱకే దాని యునికి యనియును
చెప్పవలసివచ్చును. సంయోగసంబంధముతో ఆత్మ శరీరమునం
దుండునేని మొకరములయు వెదురులయు కలయికవలెనే
ఆత్మయు అనిత్యమయినదనియు పరోపకారమునకే[10] దాని
యునికియనియు (కావున ఈ రెండు దోషములు పొసగును)
అనవలసివచ్చును. ఇంతియకాక కొందరు[11] 'దేహముతో
పెనగొన్న దాత్మ' యని కల్పన చేసిరి. అట్టిది సంయుక్తమగు
వస్తువుకాన పరార్థము. కాన ఆత్మ అసంయుక్తను నిత్యము
దేహభిన్నము అని తేలె'నని గురువు చెప్పెను. ౫౮

మూ॥ తస్యా సంహతస్య దేహే దేహమాత్రతయా
అధ్యారోపితత్వేన అసత్త్వానిత్యత్వాది దోషప్రసఙ్గో భవతి ।

---

(10) తనకంటె వేరయినవానికి ఉపయుక్తమయినది.

(11) మీమాంసకులు దేహమునకును ఆత్మకును సంయోగ సంబంధము చెప్పుదురు. సంయోగసంబంధ మనేకవిధములు. అద్వైతులు సంయోగ భేదము నంగీకరింపక తాదాత్మ్యసంబంధము చెప్పుదురు.

తత్ర నిరాత్మకో దేహ ఇతి వైనాశికపక్షప్రాప్తి దోషః స్యాత్. ౫౭

తా॥ 'అసంయుక్తుడగు[12] ఆత్మ దేహమునందు దేహమాత్రుడుగనే ఆరోపితుడగుటచే[13] అసత్త్వానిత్యత్వాది దోషములు కలుగును. అపుడు[14] దేహము నిరాత్మక[15] మగును. వైనాశికపక్షప్రాప్తి తటస్థమగుగును' అని శిష్యుడనెను. ౫౭

మూ॥ న, స్వత ఏవాత్మనః ఆకాశస్యేవ అసంహతత్వాభ్యుపగమాత్ । సర్వేణ అసంహతః స చ ఆత్మేతి న నిరాత్మకో దేహాదిః సర్వః స్యాత్ । యథా చాకాశం సర్వేణాసంహతమితి సర్వం న నిరాకాశం భవతి ఏవమ్ । తస్మాన్న వైనాశికపక్షప్రాప్తిదోషః స్యాత్. ౫౮

తా॥ 'తటస్థింపదు. స్వభావముచేతనే ఆత్మ ఆకాశమువలె అసంయుక్తుడని మే మందుము. ఆకాశము దేనితోడను కూడినది కాకపోవుటవలన ఏ వస్తువేనియు నిరాకాశము కాని

(12) సంయోగసంబంధము నంగీకరింపనియెడల "నేను మనుష్యుడను" అను వ్యవహారము పదురుటకు "ఈ ద్వైక్యము" మిథ్య అని అనవలయును.

(13) అథ్యస్తుడు కావున ఆత్మ నిత్యుడు కాకపోవును.

(14) 'ఆత్మయందు మరల దేహమధ్యస్తనుగును" అని గుర్వభిప్రాయము

(15) ఆత్మయు నిశ్శరీరమగును. "నేను మనుష్యుడను" అను వ్యవహారము దేహేంద్రియాదుల కూర్పువలననే అయి సంయోగ సంబంధము నంగీకరింపనియెడల తాదాత్మ్యాధ్యాసముచే సిద్ధించునని చెప్పవలెను. భ్రమచే ఆత్మయే దేహము, దేహమే ఆత్మయని యిటులు "అదియే యిది, ఇదియే అది" అని ఆరోపించుట (అనుకొనుట) తాదాత్మ్యాధ్యాస. ఇటులగు నెడల దేహమే ఆత్మ అని అనుకొనుటవలన "ఆత్మ శూన్య"మని అనుటయే. కాన ఇది మరల శూన్యవాదములో చేరును. ౫౫ – చూ.

యటులే, ఆత్మ దేనితోడను సంయోగము చెందనివాడని అనిసందువలన దేహము మొదలగునదేదియు నిరాత్మక మయి పోదు. కావున వైనాశికపక్షప్రాప్తి[16]యను దోషము లేదు.'

మరియు — ౫౦

మూ॥ యత్పునరుక్తమ్ - దేహస్యాత్మన్యాసత్త్వే ప్రత్యక్షాది విరోధః స్యాదితి । తన్న । ప్రత్యక్షాదిభిః ఆత్మని దేహస్య సత్త్వానుపలబ్ధేః । న హ్యాత్మని - కుణ్డే వదరమ్, క్షీరే సర్పిః, తిలే తైలమ్, భిత్తౌ చిత్రమివ చ ప్రత్యక్షాదిభిః దేహ ఉపలభ్యతే। తస్మాన్న ప్రత్యక్షాది విరోధః. ౫౧

తా॥ దేహము లేనే లేదనుచో ప్రత్యక్షాది ప్రమాణ విరుద్ధమని (చూ ౫౫) నీ వింకొక మాట అంటివి. అది తగదు. ప్రత్యక్షాదు లాత్మలో దేహ మున్నదని సాధింపజాలవు. పళ్ళెరమున రేగుబండువలె పాలలో నేతివలె నూవులలో నూనెవలె గోడమీద చిత్తరువువలె[17] ప్రత్యక్షాది ప్రమాణములు

---

(16) ఆత్మ నిత్యమైనదియు పరిపూర్ణ మయినదియు గాన దేహేంద్రియాదికము నిరాత్మకము కాదు.

(17) పళ్ళెరము రేగుబండ్లు ఈరెండును కనిపించినపుడు ప్రత్యక్షప్రమాణము పొసగును. రుచినిబట్టి పాలలో నేయి యుండునని అనుమాన ప్రమాణము పని చేయును. లోపల నెల్లెడ నూనె లేనియెడల నూవులనుండి నూనె పొడచు దని అర్థాపత్తి చెప్పును. ఈ మూడు ప్రమాణములును ఆత్మలో దేహము ఉన్నదని సమర్థింప నేరవు. పోనీ ఆధారాధేయభావ సంబంధముచే గోడమీద చిత్తరువువలె ఆత్మమీద దేహ మున్నదని చెప్పరాదు. అది నిక్కమగుచో "నేను మనుష్యుడ" ననుటకు బదులు "నామీద దేహము" అనియే యందరును అనవలసియుండుట స్వాభావికము. "నేను మనుష్యుడను, నేను చిక్కితిని" అని యీ మాదిరిగనే అందరును అందురు. కావున ఆధారాధేయభావ సంబంధముచే తాదాత్మ్యాధ్యాస కలుగదు.

ఆత్మలో దేహమును సాధించునా ? 'కావున ప్రత్యక్షాది విరోధము లేదు' అని గురు వనెను. ౫౯

మూ॥ కథం తర్హి ప్రత్యక్షాద్యప్రసిద్ధాత్మని దేహాధ్యారోపణా, దేహే చాత్మారోపణా. ౬౦

తా॥ 'అయ్యా ! ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియబడని ఆత్మయందు దేహారోప మెట్టులు ? మరియు దేహమునం దాత్మారోప మెటులు?' అని శిష్యుడు ప్రశ్నించెను. ౬౦

మూ॥ నాయం దోషః, స్వభావప్రసిద్ధత్వాదాత్మనః । న హి కాదాచిత్కత్వసిద్ధావేవ అధ్యారోపణా న నిత్యసిద్ధా ఇతి నియన్తుం శక్యమ్, ఆకాశే తలమలాద్యధ్యారోపణదర్శనాత్.

తా॥ ఇదొక దోషము కాదు. ఆత్మ స్వభావముచేతనే స్ఫురించెడి వస్తువు 'ఎపుడో ఒకానొకపుడు తెలియబడువస్తువునందేకాని నిత్యమును తెలియు వస్తువునందు అధ్యారోపము కాదు' అని నియమింప వీలులేదు. ఆకాశము[18] నందు తలమలినాదుల యారోపము కనిపించుటలేదా ? ౬౧

మూ॥ కిం భగవన్, దేహాత్మనోః ఇతరేతరాధ్యారోపణా దేహాదిసఙ్ఘాతకృతా, అథవా ఆత్మకృతా ? ఇతి. ౬౨

---

(18) ఆకాశము కానరాని వస్తువే. కాని భ్రమచే నల్లగ నున్నటులును తెల్లగ నున్నటులును దిగంతముల వాలినటులును తోచును. ఆత్మ కానరానిదేకాని స్వతః స్ఫూర్తి కలది. అట్టి యాత్మయందు భ్రమచే అధ్యారోపము సంభవించును.

తా॥ భగవానుడా! 'దేహాత్మల యితరేతరాధ్యారోపము దేహము మొదలగు సంఘాతము (ప్రోగు)[19] చేయునా? లేక ఆత్మ చేయునా?' అని శిష్యు డడుగగా, ౬౨

మూ॥ గురు రువాచ — యది దేహాది సఙ్ఘాతకృతా, యది వా, ఆత్మకృతా కిం తత్ర స్యాత్. ౬౩

తా॥ 'ఈ రెంటిలో ఏది చేసె నేమి?' అని గురు వనెను. ౬౩

మూ॥ ఇత్యుక్తః శిష్య ఆహ — యద్యహం దేహాది సఙ్ఘాతమాత్రః, తతో మమాచేతనత్వాత్ పరార్థత్వమితి స మత్కృతా దేహాత్మనోః ఇతరేతరాధ్యారోపణా। అథాహ మాత్మా పరోఽన్యః సఙ్ఘాతాత్, చితిమత్త్వాత్ స్వార్థ ఇతి మయ్యేవ చితిమతా ఆత్మని అధ్యారోపణాక్రియతే సర్వానర్థ బీజభూతా. ౬౪

తా॥ 'నేను దేహేంద్రియాదుల ప్రోగు మాత్రమే యగుదునేని అచేతనము నగుదును. అగుచో నా ఉనికి పరుల కొరకే. కాన దేహ - ఆత్మల పరస్పరాధ్యారోపము జడమగు నాచే జేయబడదు. ఇక నేను పరుడను, ప్రోగుకంటె వేరైన

(19) సీ. 'ప్రకృతియు గుణములు ప్రకృతిజన్యంబగు వికృతిసప్తకమును వెను వికారములు పదియాఱునై కలిగిన యీ ప్రోవు' (హరి. ఉ. ౬-౭౫.) ఈ ప్రోగే దేహాదిసంఘాతము. ఇది జడము. ఎరుకలేనిది. ఈ గుంపులో ఏ యొకటియేని అంతయు నేని అధ్యారోపము చేయలేదు. ఆత్మ యీ గుంపు కంటె లోపలిది (ప్రత్యక్) వేరయినదియు గాన అది అధ్యారోపము చేయును దగుచో కర్తయై వికారము చెందునదియు దాన నిత్యము కానిదియు అయి పోవును.

వాడను అగుదునేని చైతన్యము కలవాడ నగుట స్వార్థుడను (పరులకొరకు గాక తనకు తానైన వాడను) గాన[20] చైతన్యము కల నేను సర్వానర్థములకును బీజమగు అధ్యారోపము చేసికొందునా?' అని శిష్యు డనెను. ౬౪

మూ॥ ఇత్యుక్తో గురురువాచ — అనర్థ బీజభూతాం చేన్మిథ్యారోపణాం జానీషే, మా కార్షీస్తర్హి. ౬౫

తా॥ 'మిథ్యయగు అధ్యారోపణము సర్వానర్థములకు కారణమని కనుగొంటివేని అధ్యారోపణము చేయకు మని'[21] గురు వనెను. ౬౫

మూ॥ నైవ భగవన్, శక్నోమి న కర్తుమ్ । అన్యేన కేన చిత్ప్రియుక్తోఽహం న స్వతన్త్రి ఇతి. ౬౬

---

(20) స్వార్థము = తనకొరకే తా నుపయోగపడునది, తన యునికికి పరాపేక్ష లేనిది. మరియు ప్రయోజకతకుగాని విషయమగుటకుగాని వీలు లేనిది. ఎవడేపనిచేసినను తనకొరకే, తన సుఖముకొరకేకాన ఆత్మ స్వార్థము. అనాత్మ పరార్థము. అనగా ఆత్మ కుపయోగించునది. దీనిని సంహత్యకారి అని అందురు. సంహత్య = (దేహేంద్రియాదు లన్నియు) కలిసి, కారి = పని చేయునది. సంఘాతములో ఏ యొకటియు ఏ యొక దానికిని ఉపయుక్తము కాదు. ఉపయుక్తమయినను ఆ యుపయోగము తమకుగాదు, మరి ఆత్మకు.

(21) తెలివికలవాడే కుండనుజూచి సమ్మసరిగా కుండయనియనును. లేక తాడునుజూచి వ్యత్యస్తముగా పామనిఅనుకొనును. అభ్రమకాని భ్రమకాని తెలివికలవానికే కలుగునుగాని రాతికిని రప్పకును కలుగదు. కావున అవిద్య చిత్తు నాశ్రయించుకొనియుండును. చిదాత్మ మిథ్యాభ్రమ గొని సంఘాతమును తన్నుగాదలచినపుడు జీవుడనియు అధ్యాసకర్తయనియు చెప్పబడును. పరమార్థమున నితడు కూటస్థు డనబడు ఆత్మ. జీవున కవిద్య నశింపగా మెలకు వగొన్న పిదప కల మిథ్య యయినటులు సంసారము మిథ్యయగును.

తా॥ 'అయ్యా! నాచేతగాదు. ఎవరిచేతనో ప్రేరింపబడి చేయుదును. నేను స్వతంత్రుడ గా'నని శిష్యు డనెను. ౬౬

మూ॥ న తర్హి అచితిమత్త్వాత్ స్వార్థః త్వమ్। యేన ప్రయుక్తః అస్వతన్త్రః ప్రవర్తసే స చితిమాన్ స్వార్థః। సంఘాత ఏవ త్వమ్॥ ౬౭

తా॥ 'అటులగుచో నీ వచేతనమవు కావున స్వార్థుడవు (స్వతంత్రుడవు)' కావు. పరతంత్రుడవగు నీ వెవరిచే ప్రేరింపబడుచుంటివో అల్లతడు చిద్రూపుడు. అతడు స్వతంత్రుడు. నీవు దేహాది జడసముదాయమవే' అని గురు వనెను. ౬౭

మూ॥ యద్యచేతనోఽహమ్, కథం సుఖదుఃఖవేదనాం భవదుక్తం చ జానామి. ౬౮

తా॥ 'నే నచేతనమనేని సుఖదుఃఖాదుల నెటు లెరుగుదును? మీ మాటల నెటులెరుగుదును?' అని శిష్యు డనెను.

మూ॥ గురురువాచ—కిం సుఖదుఃఖవేదనాయా మదుక్తాచ్చా న్యస్త్వమ్, కిం వా అనన్య ఏవ, ఇతి. ౬౯

తా॥ 'సుఖదుఃఖ వేదనకంటెను నా పలుకులకంటెను నీవు వేరయినవాడవా కావా?' అని గురువనెను. ౬౯

మూ॥ శిష్య ఉవాచ — నాహం తావ దనన్యః। కస్మాత్। యస్మా త్తదుభయం కర్మభూతం ఘటాదికమివ జానామి, యద్యనన్యోఽహమ్, తేన తదుభయం న జానీయామ్, కింతు జానామి, తస్మాదన్యః। సుఖదుఃఖవేదనావిక్రియా చ స్వార్థైవ ప్రాప్నోతి, త్వదుక్తం చ స్యాత్। అనన్యత్వే న చ తయోః

స్వార్థతా యుక్తా । న హి చన్దనకణ్టకకృతే సుఖదుఃఖే చన్దన కణ్టకార్థే, ఘటోపయోగో వా ఘటార్థః । తస్మాత్ తద్విజ్ఞాతు ర్మమ చన్దనాదికృతః అర్థః । అహం హి తతోఽన్యః సమస్త మర్థం జానామి బుద్ధ్యారూఢమ్. ౭౦

తా॥ 'వేరయినవాడనే. ఏలందురా, కర్మభూతమైన సుఖ దుఃఖవేదనను, మీాపలుకులను కుండ మొదలగువాని నెరిగినటు లెరుగుచున్నాను. నేను వీనికంటె వేరయినవాడను కానేని సుఖ దుఃఖాది వేదనావికారము ఆ సుఖదుఃఖవేదనకొరకే, మీా పలు కులు మీా పలుకులకొరకే ప్రవర్తించునని చెప్పవలసివచ్చును. కాని వానికి స్వాతంత్ర్యము తగదు. గంధపుపూతచే గలుగు సుఖము గంధమునకును, ముల్లు గ్రుచ్చుటచే గలుగు నొప్పి ముంటికిని కలుగదుగదా! అటులే కుండవలన కుండకేమి యుప యోగము? కావున మంచిగంధము మొదలగువాని ప్రయోజ నము వాని నెరుగు నాకు. బుద్ధిలోనికెక్కిన ప్రతివిషయమును ఎరుగు నేను వీనికి (విషయములకు) వేరయినవాడను (విషయిని). ౭౦

మూ॥ తం గురు రువాచ - ఏవం తర్హి స్వార్థస్త్వం చితిమత్త్వాన్న పరేణ ప్రయుజ్యసే । న హి చితిమాన్పరతన్త్రః పరేణ ప్రయుజ్యతే - చితిమతశ్చితిమదర్థత్వానుపపత్తేః సమత్వా త్ప్రదీపప్రకాశయోరివ । నాపి అచితి మదర్థత్వం చితిమతో భవతి, అచితిమతోఽచితిమత్త్వాదేవ స్వార్థసంబన్ధానుపపత్తేః। నాపి అచితిమతోః అన్యోన్యార్థత్వం దృష్టమ్ । న హి కాష్ఠ కుడ్యే అన్యోన్యార్థం కుర్వాతే. ౭౧

తా॥ 'అటులేని నీవు స్వార్థుడవు, మరియు తెలివితోడి వాడవు గాన స్వతంత్రుడవుగాని ఎవరిచేతనో ప్రేరింపబడవు. ఏలయనగా స్వతంత్రుడగు జ్ఞాతయెవడును మరియొక స్వతంత్రుడగు జ్ఞాతకుగాను[22] ఉనికి గొనడు. రెండు దివ్వెల వెలుగులలో ఒకదాని వెలుగు ఇంకొకదాని వెలుగునకు ఉపకరింపవలసిన పనియేమి? ఇంతియుకాదు, చిద్రూపుడు జడముకొరకు ఉనికి గొనడు. ఏలనగా జడము జ్ఞానము లేనిదే యగుటచే దానికి స్వప్రయోజన మేమియు నుండదు. పోనీ జడములు రెండు ఒండొండ ఉపకరించుకొనుట కునికి గొనగూడదా[23] యని యందువా గోడయు మొకరమును ఒకదాని కింకొకటి యేమి యుపకారము చేయును?' అని గురు వనెను. ౭౧

మూ॥ నను చితిమత్త్వే సమేఽపి భృత్యస్వామినోః అన్యోన్యార్థత్వం దృష్టమ్. ౭౨

తా॥ 'అయ్యా! తెలివికి సములే యయ్యును బంటు దొర లిరువురు నొండొండ ఉపకరించుకొనుట చూచుచున్నాముగదా' అని శిష్యు డనెను. ౭౨

మూ॥ నైవం, అగ్నేరుష్ణప్రకాశవత్తవ చిరమత్త్వస్య వివక్షితత్వాత్ । ప్రదర్శితశ్చ దృష్టాన్తః ప్రదీపప్రకాశయోరితి । తత్రైవం సతి స్వబుద్ధ్యారూఢమేవ సర్వముపలభసే అగ్న్యుష్ణ

(22) జ్ఞాత తనచేతనే తాను ప్రేమింపబడరాదా? ఊహూం. ఒకనికే ప్రేర్య ప్రేరక భావము కర్మ కర్తృభావము తటస్థించును. మంచిగందము తనలోని చల్లదనమునకు తాను కర్త కాదు.

(23) సంఘాతమున కథ్యక్షుడగు క్షేత్రజ్ఞుని ఏల కల్పింపవలయును అను ప్రశ్న కిది సమాధానము.

ప్రకాశతుల్యేన కూటస్థ నిత్యచైతన్య స్వరూపేణ యదిచైవ మాత్మనః సర్వదా నిర్విశేషత్వ ముపగచ్ఛసి। కిమిత్యాచివాన్ 'సుషుప్తే విశ్రమ్య విశ్రమ్య జాగ్రత్స్వప్నయోః దుఃఖమనుభవామి ఇతి। కిమయమేవ మమ స్వభావః కిం వా నైమిత్తికః' ఇతి చ। కిమసౌ వ్యామోహోఽపగతః కిం వా నేతి. 23

తా॥ 'ఇటులు కాదు.[24] అగ్నికి వేడిమి వెలుగు లెట్టివో నీకు చైతన్య మట్టిదని చెప్పాడును. రెండు దివ్వెల వెలుగు లొకదాని వెలుగున కింకొకదాని వెలు గుపకరింపవలసిన పని యేమి యని దృష్టాంతముగూడ చూపితిని. కావున అగ్నికి వేడిమి వెలుగులవలె నిత్యమై నిర్వికారమగు చైతన్యస్వరూపము చే నీ బుద్ధిలోని కెక్కినదాని నెల్ల[25] తెలిసికొనుచుంటివి. ఇటులు ఎల్లప్పుడును ఆత్మ నిర్గుణమని తెలిసియు 'నిద్రలో విశ్రాంతి చెంది చెంది, జాగ్రత్ స్వప్నములందు దుఃఖమనుభవించుచున్నా'ననియు 'ఇదియే నా స్వభావమా? లేక నైమిత్తికమా?'[26] యనియు నేల యడిగితివి? ఈమోహము తొలగినదా? లేదా?' అని గురు వనెను. 23

మూ॥ ఇత్యుక్తః శిష్య ఆహ-భగవన్,అపగతః త్వత్ప్రసాదాత్ వ్యామోహః కింతు మమ కూటస్థతాయాం సంశయః కథం? శబ్దాదీనాం స్వతః సిద్ధిర్నాస్తి, అచేతనత్వాత్; శబ్దా

(24) బంటు దొరలలోని జడభాగమే ఒండొరుల చైతన్యమునకు ఉపకరించునుగాని ఒండొరుల చైతన్య మొండొరుల జడభాగమున కుపకరింపదు.

(25) నిర్వికారమగు చైతన్యమువయిన నీయందధ్యస్తమైన సమస్తమును నీవు తెలిసికొందువు.

(26) ౨౫ వా. చూ.

ద్యాకార ప్రత్యయోత్పత్తేస్తు తేషామ్ ప్రత్యయానా మిత రేతర వ్యావృత్త విశేషణానాం నీల పీతా ద్యాకారవతాం స్వతః సిద్ధ్యసంభవాత్ । తస్మా ద్బాహ్యాకార నిమిత్తత్వం గమ్యతే ఇతి బాహ్యాకారవత్ శబ్దాద్యాకారత్వసిద్ధిః । తథా ప్రత్యయానామపి అహం ప్రత్యయాలమ్బన వస్తుభేదానాం సంహతత్వాత్ అచైతన్యోపపత్తేః స్వార్థత్వా సంభవాత్ – స్వరూప వ్యతిరిక్త గ్రాహక గ్రాహ్యత్వేన సిద్ధిః । శబ్దాదివ దేవ అసంహతత్వే సతి చైతన్యాత్మకత్వాత్ స్వార్థోఽపి అహం ప్రత్యయానాం నీల పీతా ద్యాకారాణా ముపలబ్ధేతి విక్రియా వా నేవ, కూటస్థ ఇతి సంశయః. ౭౪

తా॥ 'అయ్యా తమ దయచే నా మోహము తొలగెను గాని నేను కూటస్థుడనా? (వికారములేనివాడనా?) అని సంశయము' అని శిష్యుడనెను. – 'సంశయమేమో చెప్పు'మని గురువనెను. 'అచేతనము లగుటచే శబ్దాదులు[27] తమంతతాము స్ఫురింపవు.[28] శబ్దాద్యాకారములగు జ్ఞానములు (చిత్తవృత్తులు) ఉదయించుటచే అవి స్ఫురించును; తమలో తాము వేరయి నలుపు పసుపు మొదలగు ఆకారములు కలవిగా కానిపించు

(27) ఆడిపదముచే స్పర్శ రూప రస గంధములును అనంతములగు వీని భేదములును గ్రాహ్యములు.

(28) "ప్రపంచమునందు తెలియబడని వస్తువు లెన్నియో యున్నవి. ఒకనిచే వినబడి ఒరులచే వినబడని శబ్దాదు లెన్నియోకదా! వీనికి ఉనికి లేదా?" అనుచో తెలియబడు వస్తువునకే అస్తిత్వముగాని తెలియబడని వస్తువులకు తెలియబడినపిదపనే అస్తిత్వము. తెలియబడని వస్తువు లుండుగాక! తమ అస్తిత్వ ప్రయోజనము తనకు తెలియదుగదా! కాన తెలియువానికే దాని అస్తిత్వము. దృష్టి సృష్టివాదము, సృష్టి దృష్టివాదము అరయునది.

జ్ఞానములు[29] (చిత్తవృత్తులు) తమంత తాము[30] ఉదయింపవు. కాన వానికి బాహ్యాకారములు హేతువని ఊహింప నగుటచే బాహ్యాకారములవలె శబ్దాద్యాకారములు సిద్ధించును. (స్ఫురించును) శబ్దాదులవలెనే నేనను జ్ఞాన మవలంబముగా గలిగి వేరు వేరయిన సుఖ దుఃఖ రాగేచ్ఛాదులగు చిత్తవృత్తులు సమూహములగుట (అనేకవస్తు మేళనమున పొడమినవగుట) నచేతనములని చెప్పనొప్పుటచేతను తమకొరకు తా ముపయుక్తములు కానందువలనను తమకంటె వేరగు గ్రహీతచే[31] గ్రహింపబడి సిద్ధించును. (స్ఫురించును) ఆత్మ సంఘాతము కాకున్నను చైతన్యస్వరూపుడును, స్వార్థుడును అయినను నలుపు పసపు మొదలగు ఆకారములు కల చిత్తవృత్తుల

---

(29) నల్లకలువ అనునెడ 'నల్ల' అను విశేషణము తెల్ల ఎఱ్ఱ మొదలగు రంగులు కల కలువలను వేరు చేయును. నల్లకలువ ఎఱ్ఱకలువ కాదు, తెల్ల కలువ కాదు. ఇటులే నల్లనివస్తువు నాకారము గొన్న చిత్తవృత్తి తెల్లని లేక పచ్చనివస్తువు నాకారముగొన్న చిత్తవృత్తికాదు. నల్లకలువ తెల్లకలువ ఎఱ్ఱకలువలవలె నీల శ్వేత పీత వస్త్వాకార చిత్తవృత్తు లితరేతర వ్యావృత్త విశేషములు. అనగా పరస్పర భిన్నములు. చిత్తవృత్తు లిటులు మారుటచే పరిణామస్వభావములు. అధిష్ఠానమగు జ్ఞానసామాన్య మపరిణామి.

(30) జడములగు శబ్దాదులు శబ్దాద్యాకారములు గొన్న చిత్తవృత్తులచే స్ఫురించును. కాన శబ్దాదులును జ్ఞానరూపములే యని విజ్ఞానవాదు లందురు. కాని బాహ్యపదార్థములు లేనియెడల శబ్దాది చిత్తవృత్తులు కలుగవు. కలుగని యెడల శబ్దాదిజ్ఞానము కలుగదు. కాన స్వతఃస్ఫురణ లేమి శబ్దాదులు జ్ఞానమాత్రస్వరూపములు కావు. ఇంద్రియములకు విషయములయిన వెలుపటి వస్తువుల వలననే శబ్దాద్యాకార చిత్తవృత్తు లుదయించుటచే శబ్దాదుల వలననే శబ్దాదిజ్ఞానములు కలుగును గాని తమంత దాము కలుగవు. మరి ఆ శబ్దాదులు చైతన్యముకంటె వేరు.

(31) గ్రహీత = ఆత్మ లేక కూటస్థుడు.

నెరుగువాడు[32] కావున వికారము కలవాడే కాని కూటస్థు డెటులగునని శంశయము' అని శిష్యు డనెను. ౭౪

మూ॥ తం గురు రువాచ — న యుక్త స్తవ సంశయః। యత స్తేషాం ప్రత్యయానాం నియమేన అశేషతః ఉపలబ్ధే రేవ అపరిణామిత్వాత్ కూటస్థత్వసిద్ధౌ నిశ్చయ హేతుమేవ అశేష చిత్త ప్రచారోపలబ్ధిం సంశయహేతుమాత్థ। యది హి తవ పరిణామిత్వం స్యాత్, అశేష స్వవిషయ చిత్తప్రచారోప లబ్ధిర్న స్యాత్, చిత్తస్యేవ స్వవిషయే, యథాచేన్ద్రియాణాం స్వవిషయేషు। న చ తథా ఆత్మన స్తవ స్వవిషయైక దేశోప లబ్ధిః। అతః కూటస్థ తైవ తవేతి. ౭౫

తా॥ 'నీ సంశయము యుక్తము కాదు. ఏలయనిన ఆ చిత్తవృత్తుల నశేషముగా తప్పక ఎఱుగుటవలననే అపరిణామి వగుట జేసి నీకు కూటస్థత్వము సిద్ధించుచుండగా నిశ్చయ హేతువగు అశేషచిత్త ప్రచార జ్ఞానమునే సంశయహేతువుగా చెప్పుచున్నావు. నీవేగనుక పరిణామివేని స్వవిషయచిత్త ప్రచారమును నిశ్శేషముగా ఎఱుగకపోదువు. చిత్తమును ఇంద్రియములును తమకు గోచరములయిన విషయములలో ఒకదాని తరువాత మరియొకటిగా ఒకొ్కక విషయమునే తెలిసి కొనును.[33] ఆత్మవగు నీకు ఆ చిత్తేంద్రియములకువలె స్వవిష

(32) బుద్ధ్యుపహితమగు ఆత్మలో భేదము లేకున్నను భ్రాంతులు గ్రాహ్య గ్రాహక గ్రహణ భేదములను చూచుచుందురు. ఉప. సా. శ్లో. ౧౮-౧౪౨.

(33) వెలుగులో నున్న కుండ వెలుగు నెక్కినటులు బుద్ధిలో పడ్డ కుండ బుద్ధి నెక్కినని యనదగును. బుద్ధి నెక్కుట యనగా బుద్ధి వ్యాపించుట. బుద్ధి వ్యాప్తిలో క్రమ ముండును. (౧౭౬) మొదట జ్ఞానవ్యాప్తి

యమునం దొరకపా లెరుకగాక సమస్తమును ఎరుక యగు చున్నది. దానివలన నీవు కూటస్థుడవే'[34] అని (వికారము కల వాడవు కావు) గురువు చెప్పెను. ౭౫

మూ॥ తత్రాహ — ఉపలబ్ధిర్నామ ధాత్వర్థో విక్రియైవ, ఉపలబ్ధుః కూటస్థాత్మతా చేతి విరుద్ధమ్. ౭౬

తా॥ 'జ్ఞానము ధాత్వర్థము[35] కదా ! అది వికారమే. (అట్టి జ్ఞానములో కర్తయగు) జ్ఞాత (నిర్వికారుడు) కూటస్థుడని యనుట విరుద్ధముకదా!' అని శిష్యుడనెను. ౭౬

మూ॥ న ధాత్వర్థవిక్రియాయామ్ ఉపలబ్ధ్యుపచారాత్। యో హి బౌద్ధః ప్రత్యయః స ధాత్వర్థో విక్రియాత్మకః ఆత్మనః ఉపలబ్ధ్యాభాస ఫలావసాన ఇతి ఉపలబ్ధిశబ్దేన ఉపచర్యతే।

---

యగును. (అది విషయాకారము పొందును) పిదప ఆత్మ ప్రతిబింబముచే విషయము భాసించును. కాలాకాశములవలె వ్యాపకుడై సర్వాధ్యక్షుడై అనుగత ప్రకాశరూపుడగు ఆత్మకు క్రమము లేదు (౧౫౭) కారణము నపేక్షించి విషయమును గ్రహించు జ్ఞాన మొకేసారి విషయముల నన్నిటి వ్యాపింపజాలకపోవుటచే చిత్తమువలె పరిణామి. (౧౫౮) ఉప॥ సా॥ శ్లో॥

(34) వృత్తి ఆభాసుడు ఘటము, ఈ సమూహము చిత్తుచే భాసింపజేయబడును. ఘటమాత్రఫలముకలవాడగుటచే ఆభాసునివలన ఘటమాత్రమే స్ఫురించును. (పంచ-౭-౧౪)

చిన్మాత్ర జ్యోతి స్వరూపుడనగు నాచే నెల్లదేహములందలి బుద్ధులు ప్రకాశింపజేయబడుచున్నవిగాన నేను సర్వమునకును ఆత్మను.

(ఉప॥ సా॥ శ్లో॥ ౧౪. ౭)

(35) ఈ వెనుక జెప్పిన - ఎరుగుట - తెలియుట - ఉపలబ్ధి - జ్ఞానము ఇవి అన్నియు పర్యాయపదములు.

యథా ఛిదిక్రియా ద్వైధీభావఫలావసానేతి ధాత్వర్థేన ఉప
చర్యతే తద్వత్. ౮౭

తా॥ 'విరుద్ధము కాదు. ఇచట జ్ఞానము అముఖ్యార్థ
మయిన ధాత్వర్థవికారమునందు ఉపచరించినది.[36] చిత్తవృత్తి
ఒక వ్యాపారము. వ్యాపారము వికారాత్మకము. ఆ వ్యాపా
రము (చిత్తవృత్తి) జ్ఞానరూపమగు[37] ఆత్మయొక్క ప్రతిబిం
బమును ఫలముగా పర్యవసించును. ఇటులగుటచే చిత్తవృత్తికి
జ్ఞానమని గౌణముగా వ్యవహారము. (కట్టెలు నరకుచున్నాడు
అను నెడ) నరకు అను క్రియ, రెండు తునియలుగా విడిపడుట

---

(36) ఫలము, వ్యాపారము ఇవి రెండును ధాత్వర్థములు - "ఫలవ్యాపా
రయో ర్ధాతుః -" (వై. భూషణసారము) వ్యాపారాశ్రయుడు కర్త, ఫలా
శ్రయుడు లేక ఫలాశ్రయము కర్మ. వ్యాపారము సామాన్యముగా ముఖ్యార్థ
మగుచుండును. "దేవదత్తుడు కుండ నెరుగుచున్నాడు" అనునపుడు 'ఎరుగు'
అను ధాతువునకు ఎరుగుట కనుకూలమగు 'కుండమీద చూపులు పరపుట'
మొదలగు వ్యాపారమంతయు అర్థము. వ్యాపారమెల్ల వికారమే. వ్యాపా
రాశ్రయుడగు జ్ఞాత నిర్వికారు డగుటెటులు అని ప్రశ్న.

(37) దేవదత్తుడు కుండ నెరుగుచున్నా డనునపుడు ఎరుగుట కనుకూల
వ్యాపారముకంటె ఫలమగు ఘట జ్ఞానము ముఖ్యము. చూపు పరపినందు
వలన కుండ ఎరుగబడె గదా! ఇచట ఘటజ్ఞానము ముఖ్యము, వ్యాపార
మముఖ్యము. ఇదియే ఉపచారము లేక గౌణము. ఇంతియకాక వ్యాపార
మెల్ల ఆత్మ ప్రతిబింబముగా పర్యవసించును - "బుద్ధిలో ప్రతిబింబము పడి
జ్ఞానము కలుగును" - "చైతన్య ప్రతిబింబేన వ్యాప్తో బోధో హి జాయతే"
(ఉప॥సా॥ శ్లో॥ ౫-౫) "ఘటజ్ఞానము చిత్ ప్రతిబింబఫలము"- "జ్ఞాత త్వం
నాను కుంభే తచ్చిదాభాస ఫలోదయః" (పంచ ౮-౧౦) = కుండ
ఎరుక చిదాభాసవ్యాప్తికి ఫలము. (బ్రహ్మచైతన్యవ్యాప్తికి కాదు. అది వృత్తి
పుట్టకముందును ఉండనేయున్నది. కంటితో గాంచకముందు కుండ యను
ఎరుక ఉండునా ?)

యను ఫలమునందు పర్యవసించి ధాత్వర్థముగా ఎటులు ఉపచ రించుచున్నదో[37A] అటులే జ్ఞానము చిత్తవృత్తి[37B] రూప మగు ఫలముగా ఉపచరించునని' గురు వనగా— ౭౭

మూ॥ ఇత్యుక్తః శిష్య ఆహ – నను భగవన్, మమ కూటస్థత్వ ప్రతిపాదనం ప్రతి అసమర్థో దృష్టాన్తః । కథం ? ఛిదిః ఛేద్యవిక్రియావసానా ఉపచర్యతే యథా ధాత్వర్థత్వేన తథా ఉపలబ్ధిశబ్దోఽప్యుపచరితోఽపి ధాత్వర్థో బౌద్ధప్రత్యయః ఆత్మనః ఉపలబ్ధి విక్రియావసానశ్చేత్, నాత్మనః కూటస్థతాం ప్రతిపాదయితుం సమర్థః. ౭౮

తా॥ 'అయ్యా ! తాము చూపిన దృష్టాంతము 'నేను వికారము లేనివాడను (కూటస్థుడను)' అని చెప్పజాలదు.' అని శిష్యు డనెను.

'ఏల ?' అని గురు వడిగెను.

'నరకుట యను వ్యాపారము నరకబడు కట్టెయలు మొదలగువానిలో కలిగించు వికారముగా ఎటు లుపచరిం చునో అటులు ఎరుగుట యను వ్యాపారము చిత్తవృత్తి యను

(37-A) రెండు తుండెములుగా అగుటకు అనుకూలమగు గొడ్డలితో చెట్టును కొట్టుట మొదలయిన వ్యాపారమంతయు నఱకు ధాతువున కర్థము. రెండు తుండెము లగుట ఫలము. ఇచట అదియే ముఖ్యార్థము.

(37-B) "చిత్తము మట్టివంటి ద్రవ్యము. చిత్తపరిణామమగు జ్ఞానము కుండవలె ద్రవ్యమగుగాని క్రియ యెటులగును ?" అనుచో చిత్తము కుండ వలె మారదు. దాని వ్యాపారము సంకోచ వికాసములు. విషయాకార మగు ననుట కిదియే అర్థము. ఘటాకారము పొందునని యనగా ఘటమును వ్యాపించుట అని అర్థము. వికాసమే వ్యాప్తి. కావున క్రియారూపమగు ధాత్వర్థమే బుద్ధి.

గౌణార్థమున వాడబడినను జ్ఞానస్వరూపమగు ఆత్మలో వికారము కలిగించునదిగా[38] పర్యవసన్నమగునేని 'ఆత్మ కూటస్థుడు' అని సమర్థింపలేదు.' అని శిష్యుడనెను. ౭౮

మూ॥ గురు రువాచ – సత్యమేవం స్యాత్, యది ఉపలబ్ధ్యుపలబ్ధ్రోః విశేషః। నిత్యోపలబ్ధిమాత్ర ఏవ హి ఉపలబ్ధా। న తు తార్కికసమయ ఇవ అన్యా ఉపలబ్ధిః అన్య ఉపలబ్ధా చ. ౭౯

తా॥ జ్ఞానమునకును జ్ఞాతకును విశేష మేదేనున్న యెడల నీవు చెప్పునది నిక్కమే కావచ్చును.[39] ఏలయనగా జ్ఞాత నిత్యజ్ఞానమాత్రుడే. తార్కికుల సమయమందువలె జ్ఞానము వేరు, జ్ఞాత వేరగువాడును కాదు.' అని గురువనెను.

మూ॥ సనూపలబ్ధి ఫలావసానో ధాత్వర్థః కథమితి. ౮౦

తా॥ 'ధాత్వర్థము (వ్యాపారము) జ్ఞానఫలముగా పర్యవసన్నమగు టెటులు ?' అని శిష్యుడు ప్రశ్నించెను. ౮౧

మూ॥ ఉచ్యతే – శృణు – ఉపలబ్ధ్యాభాస ఫలావసాన ఇత్యుక్తమ్। కిం న శ్రుతం తత్ త్వయా, నతు ఆత్మా విక్రియోత్పాదనావసాన ఇతి మయోక్తమ్. ౮౧

తా॥ 'చెప్పెదను వినుము. (క్రియ యనబరగు చిత్తవృత్తి) జ్ఞానరూపమగు ఆత్మని ప్రతిబింబ మను ఫలముగా

(38) నఱుకుటకు ఫలము రెండు తుండెములుగా వేరిమి. ఇదియు క్రియయే. ఇటులు జ్ఞానఫలముగూడ క్రియయే. కాన క్రియతోగూడిన జ్ఞాత కూటస్థుడగునను టెటులు ? అని శంక.

(39) అనుభవమే యగుటచే ఆత్మ అనుభావ్యము కాదు. అనుభవిత అనుభవము అనుభావ్యము ఒకటియే యని తాత్పర్యము. (పంచ-౫-౧౩)

పర్యవసించు నని యంటివి; నీవు వినలేదా ? ఆత్మలో కలిగింప బడిన వికారము ఫలమని నేను చెప్పలేదే' అని గురు వనెను. (చూ. ౭౭) ౮౧

మూ॥ శిష్య ఆహ — కథం తర్హి కూటస్థే మయి అశేష స్వవిషయ చిత్తప్రచారోపలబ్ధృత్వ మిత్యాత్థ. ౮౨

తా॥ 'అటులగుచో కూటస్థుడనగు నన్ను నాజ్ఞానము నకు విషయములగు చిత్తవృత్తుల నన్నిటికిని జ్ఞాతనుగా నెటులు చెప్పితిరి ?' అని శిష్యుడు ప్రశ్నించెను. ౮౨

మూ॥ తం గురు రువాచ — సత్యమవోచమ్, తేనైవ కూటస్థతా మబ్రువం తవ. ౮౩

తా॥ 'సత్యమే చెప్పితిని. ఆ హేతువుచేతనే (చిత్త వృత్తులను నిశ్శేషముగా ఒకేసారిగా ఎరుగుటచేతనే) నీవు నిర్వికారుడవగు కూటస్థుడవని అంటి'నని గురు వనెను. ౮౩

మూ॥ యద్యేవం భగవన్, కూటస్థ నిత్యోపలబ్ధి స్వరూపే మయి శబ్దాద్యాకార బౌద్ధప్రత్యయేషు చ మత్స్వ రూపోపలబ్ధ్యాభాస ఫలావసానవత్సు ఉత్పద్యమానేషు క స్స్వ పరాధో మమ. ౮౪

తా॥ 'ఇటులగు నెడల నిర్వికార నిత్యజ్ఞాన స్వభావుడనగు నాయందు నా స్వభావమగు జ్ఞానమునకు ప్రతిబింబములుగా పర్యవసన్నములై శబ్దాద్యాకార చిత్తవృత్తు లుదయించుచున్న వన్న మాట. ఇందు నా తప్పేమి స్వామీ ?' అని శిష్యు డనెను. ౮౪

**మూ॥** సత్యం, నాస్త్యపరాధః కింతు అవిద్యామాత్రస్త్వపరాధః ఇతి ప్రాగేవావోచమ్. ౮౫

తా॥ 'నిక్కమే. తప్పు లేదు.[40] 'అవిద్యామాత్రమే తప్పు' అని వెనుకనే చెప్పితి' నని[41] గురు వనెను. ౮౫

**మూ॥** యది భగవన్, సుషుప్త ఇవ మమ విక్రియా నాస్తి, కథం స్వప్నజాగరితే. ౮౬

తా॥ 'అయ్యా! నేను నిదురలోవలె నిర్వికారుడనేని జాగ్రత్ స్వప్నావస్థలమాట?' అని శిష్యు డనెను. ౮౬

**మూ॥** **తం గురురువాచ** – కిం త్వనుభూయేతే త్వయా **సతతమ్.** ౮౭

తా॥ '(వానిమాట తరువాత చూతము) నీవు వానిని **సతతము**ను అనుభవించుచున్నావు కద!' అని గురు వనెను.

**మూ॥** **శిష్య ఉవాచ** – బాఢమనుభవామి, కింతు విచ్ఛిద్య విచ్ఛిద్య న **తు సతతమ్.** ౮౮

తా॥ 'లెస్సగ ననుభవించుచున్నాను. గాని **సతతము**గాక నడుమ నడుమ ననుభవించుచునే యున్నాను' అని శిష్యు డనెను. ౮౮

---

(40) "నీకు నామాటమీద శ్రద్ధ లేకపోవుటతక్క వేరొక తప్పులేదు. వేరుగా గ్రహించుట యను అవిద్యచే భ్రమ కలిగెను" అని ఒక అర్థము. "నీ యుద్దేశ్యమును వెలివరచుటలో తప్పులేదుగాని అవిద్య ఆత్మస్వరూపము తెలియకుండ నీ కనులు కప్పెను" అని యింకొక అర్థము.

(41) ౮౫ - ౫౦ - వా. చూ.

మూ॥ తం గురు రువాచ – తర్హ్యాగన్తుకే త్వేతే, న తవాత్మభూతే। యది తవాత్మభూతే చైతన్యస్వరూపవత్ స్వతః సిద్ధే సంతతే ఏవ స్యాతామ్ । కించ, స్వప్నజాగరితే న తవ ఆత్మభూతే, వ్యభిచారిత్వాత్ వస్త్రాదివత్ । న హి యస్య యత్ స్వరూపం తత్ తద్వ్యభిచారి దృష్టమ్ । స్వప్నజాగరితే తు చైతన్యమాత్రత్వాత్ వ్యభిచరతః । సుషుప్తే చేత్ స్వరూపం వ్యభిచరేత్ తత్ నష్టం నాస్తీతి వా బాధ్యమేవ స్యాత్, ఆగన్తుకానాం అతద్ధర్మాణాం ఉభయాత్మకత్వదర్శనాత్ యథా ధన వస్త్రాదీనాం నాశో దృష్టః, స్వప్నభ్రాన్తిలబ్ధానాం తు అభావో దృష్టః. ౮౯

తా॥ అటులగునెడల ఇవి వచ్చుచు పోవుచుండునవికాని ఆత్మభూతములు (స్వభావము) కావు. అవి నీ కాత్మభూతములును చైతన్యస్వరూపమువలె స్వతస్సిద్ధములును అగునెడల సతతము ఉండియే ఉండును. వస్త్రాదులవలె నివి ఎడబాయుచుండునుగదా! ఎవని కేది స్వరూపమో అది యెపుడును లోపింపదు. చైతన్య మెప్పుడును లోపింపకయుండగా స్వప్న జాగరితములు నడుమ నడుమ వచ్చుచు పోవుచు నుండును. శుద్ధచైతన్యమగు ఆత్మ నిదురలో లుప్తముగాదు. స్వప్న జాగరితములో లోపించును. కాన ఈయవస్థ లాత్మస్వరూపములు కావు. చిత్ స్వభావము లేనివిగనుకనే యివి నిదురలో కనిపింపవు. తమ అవస్థలోనే అనుభవమునకు వచ్చుచు అన్యావస్థలలో అనుభవమునకు రానివానికి నాశముగాని బాధగాని సంభవించును.[42] ఆగంతుకము లాత్మధర్మములు కావు. వస్త్రా

(42) బాధకుగాని నాశమునకుగాని యోగ్యము అగునది, ఆత్మకు స్వభావము కాదు. ఇవి ఆగంతుకములు.

ములకువలె వీనికి నాశము కలదు. కలలో గాంచిన కానుగాని త్రాటిలో దోచిన త్రాచుగాని ఉత్తవేకదా !' అని గురు వనెను. ౮౯

మూ॥ నను ఏవం భగవన్, చైతన్యస్వరూపమపి ఆగన్తుకం ప్రాప్తమ్ । స్వప్న జాగరితయోరివ సుషుప్తే అనుపలబ్ధేః । అచైతన్యస్వరూపో వా స్యామహమ్. ౯౦

తా॥ 'ఇటు లగు నెడల అయ్యా ! జాగ్రత్ స్వప్నములలో చూచుచున్నటులు[43] నిదురలో చూడకపోవుటవలన చైతన్యస్వరూపము గూడ ఆగంతుక మనియే (వచ్చుచు పోవుచునుండునదియే) అని అనుకొనవలసివచ్చుచున్నది. లేక నే నచైతన్యస్వభావుడ ననవలసి వచ్చుచున్నది' అని శిష్యుడనెను. (జ్ఞానము నా కాగంతుక మనవలసి వచ్చుచున్నది.)

మూ॥ న, పశ్య, తదనుపపత్తేః । చైతన్యస్వరూపం చేత్ ఆగన్తుకం పశ్యసి, పశ్య । నైతత్ వర్షశతేనాపి ఉపపత్త్యా కలయితుం శక్నుమో వయమ్, అన్యోవాఽచైతన్యోఽపి సంహతత్వాత్ పారార్థ్యమ్ అనేకత్వం నాశిత్వం చ న కేనచిదుపపత్త్యా, వారయితుం శక్యమ్ । అస్వార్థస్య స్వతః సిద్ధ్యభావాదిత్యవోచామ । చైతన్యస్వరూపస్య తు ఆత్మనః స్వతఃసిద్ధేః అన్యానపేక్షత్వం న కేనచిత్ వారయితుం శక్యమ్, అవ్యభిచారాత్. ౯౧

---

(43) "నేను శ్రోతను" ఇత్యాదిగా జాగ్రదవస్థయందును "నేను ద్రష్టను" ఇత్యాదిగా స్వప్నావస్థయందును గల యీ యెఱుకతోపాటు ఈ రెండవస్థలును నిద్రలో లేకపోవుటచే "నిద్రలో నా కెఱుకయేలేదు" అని దీని అభిప్రాయము.

తా॥ 'కాదు, పరికింపుము. అటులు అనుకొనుటకు ఉపపత్తి లేదు. చైతన్యస్వరూపమును ఆగంతుకముగా చూతువేని ఊఁ, చూడు. మేము నూరేండ్లకేని ఇందులకు ఉపపత్తి కల్పింపలేము. ఎంత తెలివితక్కువవానికేని ఇది తెలియును. చిత్తవృత్తులు ఉపాధిగా గల జ్ఞానము **సంహతము.** (అనేక వస్తుమిళితము) అది పరార్థముకాదనియు అనేకము కాదనియు నశించునది కాదనియును ఎవనికిని ఉపపత్తి చూపి నిర్ణయింప శక్యము కాదు. ఒరులకొరకు ఉనికి గొనునది తనకు దానై యునికి గొనునది కాదని చెప్పితిమి.[44] చైతన్య స్వరూపమగు ఆత్మ స్వతఃసిద్ధమగుటవలన అన్యము నపేక్షింపదు. ఇదెవకును కాదన వీలు లేదు. ఏలనగా ఆ చైతన్యము వచ్చుచు పోవుచు నుండునదికాక ఎల్లపుడును ఉండునది.' అని గురువనెను. ౯౧

మూ॥ నను వ్యభిచారో దర్శితో మయా సుషుప్తే న పశ్యామీతి. ౯౨

తా॥ 'నిదురలో నాకు తెలివి లే' దని దాన చైతన్యమాగంతుకమని నేను చెప్పకొంటినే' అని శిష్యుడనెను. ౯౨

మూ॥ న, వ్యాహతత్వాత్ । కథం వ్యాఘాతః పశ్యత స్తవ న పశ్యామీతి వ్యాహతం వచనమ్ । న హి కదాచిత్ భగవన్ సుషుప్తే మయా చైతన్య మన్యద్వా కించిత్ దృష్టమ్ । పశ్యన్ తర్హి సుషుప్తే త్వం । యస్మాత్ దృష్టమేవ ప్రతిషేధసి, న దృష్టిమ్ । యా తవ దృష్టిః తచ్చైతన్యమితి మయోక్తమ్ । యయా త్వం విద్యమానయా న కించిత్ దృష్ట

(44) ౫౬ వా. చూ.

మితి ప్రతిషేధసి సా దృష్టిః త్వద్చైతన్యమ్। తర్హి సర్వత్ర అవ్యభిచారాత్ కూటస్థనిత్యత్వం సిద్ధం స్వత ఏవ, న ప్రమాణాపేక్షమ్। స్వతః సిద్ధస్య హి ప్రమాతుః అన్యస్య ప్రమేయస్య పరిచ్ఛిత్తిం ప్రతిప్రమాణాపేక్షా। యా తు అన్యా నిత్యాపరిచ్ఛిత్తిః అపేక్ష్యతే అన్యస్య అపరిచ్ఛిత్తిరూపస్య పరిచ్ఛేదాయ, సా హి నిత్యైవ కూటస్థా - స్వయం జ్యోతిః స్వభావా। ఆత్మని ప్రమాణత్వే ప్రమాతృత్వే వా న తాం ప్రతిప్రమాణాపేక్షా, తత్స్వభావత్వాత్। యథా ప్రకాశన ముష్ణత్వం వా లోహోదకాదిషు పరతః అపేక్షతే అగ్న్యా దిత్యాదిభ్యః, అతత్స్వభావాత్ న అగ్న్యాదిత్యాదీనాం తదపేక్షా, సర్వదా తత్స్వభావత్వాత్. ౯౩

తా॥ 'నీమాట వ్యాహతము.' (తా నన్నదానిని తానే కాదనుట).

'ఎటులు వ్యాహతము?'

'చూచుచు నేను చూచుట లేదనుట వ్యాహతమగు (విరుద్ధ) మాట.'

'అయ్యా! సుషుప్తిలో ఎరుకనేని మరి దేనినేని కొలది గానేని ఎపుడేని నే జూడలేదు.'

'అటు లేని సుషుప్తిలో నీవు చూచుచునుంటివే! ఎందు వలననందువేని నీ వా స్థితిలో దృష్టమును (విషయము) నిషేధించుచున్నావుగాని దృష్టిని (జ్ఞానము) కాదే! (విషయమును చూడలేదు అని అనుచున్నావు. 'చూడలే'దను అనుభవ

మును[45] నిషేధించుట లేదు. మరి నిరూపించుచున్నావు.) నీకు ఏ జ్ఞానము కలదో అది చైతన్యము అని నే జెప్పితిని. ఏది ఉన్నదగుచుండగా 'నేను దేనినేని చూడలేదు' అని నిషేధించు చున్నావో ఆ దృష్టి (జ్ఞానము) నీ చైతన్యము. ఇటు లది ఎపుడును ఉనికి బాయదు కావున నిత్యము కూటస్థము నగుట స్వతస్సిద్ధమే కాని దానికి ప్రమాణాపేక్ష[46] లేదు. స్వతస్సిద్ధు డయిన ప్రమాతకంటె వేరగు ప్రమేయమును (విషయమును) తెలిసికొనుటకు ప్రమాణము కావలయును. వేరగు విషయము లను దెలిసికొనుటకొరకు వానికి వేరయిన జ్ఞానము[47] కావలసి యున్నది. అది నిత్యమగు కూటస్థమే. అది స్వయంజ్యోతి స్స్వభావము కలది. ఆ జ్ఞాన మున్నదని కాని జ్ఞాతయని కాని నిరూపించుటకు ప్రమాణాపేక్ష లేదు. నీటికి వేడిమికాని ఇను మునకు వెలుతురుకాని స్వభావము కాదు. ఆ వేడిమిగాని వెలుతురుగాని సూర్యుడు అగ్ని యీ మొదలగువానివలన సంక్ర

---

(45) నిద్ర వదలి మేలుకువ గొనినవాడు "నా కేమియు తెలియలేదు" అని యనును. ఇది నిద్రావస్థయందలి అజ్ఞానానుభవస్మరణము. అనుభవములేక స్మృతి కలుగదు. కనుక నిద్రలో అజ్ఞానానుభవము కలదు. నిద్రలో ఇంద్రి యములతో మనస్సు లీనమగును. అపుడు వాని వ్యాపారము ఉండదు. కాన ఆగంతుకములగు విషయముల అనుభవము ఉండదు. చైతన్యము నిత్యము. కాన అది లోపింపదు. (బృహ. ౪-3-౨3.) చూ.

(46) వృత్తి ప్రతిఫలిత చైతన్యము ప్రమాణము. అంతఃకరణ ప్రతిఫలిత చైతన్యము ప్రమాత. జ్ఞానము లేక అవగతి ప్రమ. ఇంద్రియ గోచరమయిన దెల్ల ప్రమేయము.

(47) పరిచ్ఛేదకుడు పరిచ్ఛిత్తి పరిచ్ఛేద్యము అను త్రిపుటియు, ప్రమాత ప్రమాణము ప్రమేయము అను త్రిపుటియు, జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అను త్రిపుటియు సమములు.

మించును. ఇక ఆ సూర్యునకుగాని అగ్నికిగాని వేడిమి వెలుగు లకు ఇతరాపేక్ష లేదు. అవి ఎపుడును స్వస్వభావమే.' ౯-3

మూ॥ అనిత్యత్వే ఏవ ప్రమా స్యాత్, న నిత్యత్వే ఇతిచేత్. ౯-౪

తా॥ 'ప్రమ అనిత్యజ్ఞానమే కాని[48] నిత్యజ్ఞానము[49] కాదుగదా!' ౯-౪

మూ॥ న, అవగతేర్నిత్యత్వానిత్యత్వయోః విశేషానుపపత్తేః । న హి అవగతేః ప్రమాత్వే అనిత్యా అవగతిః ప్రమా, న నిత్యా ఇతి విశేషః అవగమ్యతే. ౯-౫

తా॥ 'కాదు, జ్ఞానములో నిత్యజ్ఞానమని ఒకటియు అనిత్యజ్ఞానమని ఒకటియు అని ఇట్టి విశేషము కలదనుట కుపపత్తి లేదు. 'అనిత్యజ్ఞానము ప్రమ; నిత్యజ్ఞానము ప్రమ కాదు' అని యెంచటకు లేదు. ఏలనగా జ్ఞానమే[50] ప్రమ.' ౯-౫

---

(48) స్మృతికంటె వేరయి అబాధితమగు అర్థమును విషయమునుగా జేయు జ్ఞానము ప్రమ. ప్రమాజ్ఞానమునకు కరణము ప్రమాణము. నేత్రాదీంద్రియము ప్రత్యక్షప్రమాణము. ప్రత్యక్షప్రమాణముచే గలుగు జ్ఞానము యథార్థ జ్ఞానము. మనము ఒకవస్తువును చూచినపుడు ఉన్నదున్నటులు మనకు తెలియును. కుండనుజూచినపుడు దానిని కుండయని యందుముగాని బండయని యనము. ఇట్టి యథార్థజ్ఞానము వస్తువునుజూచినపుడు మనకు పుట్టుచున్నది. పుట్టినదెల్ల అనిత్యము. ఇటులు విషయజ్ఞానమెల్ల అనిత్యము. దేనిని మనము చూతుమో అలవాని జ్ఞానములు పెక్కులు. కుండను జూచినపుడు కుండ, బండను జూచినపుడు బండయుగా మన జ్ఞానము మారుచుండును. కాన విషయజ్ఞానము అనిత్యము. ఇట్టి అనిత్య ప్రమేయజ్ఞానమునకే యథార్థజ్ఞానాపేక్ష యని తర్కసమ్మతముగా ప్రశ్నించినవాని అభిప్రాయము.

(49) ఆత్మజ్ఞానము. (50) శుద్ధజ్ఞానమే ౧౦3 - ౧౦౪ వా. చూ.

మూ॥ నిత్యాయాం ప్రమాతుః అపేక్షాభావః। అనిత్యాయాంతు యత్నాంతరితత్వాత్ అవగతిః అపేక్ష్యత ఇతి విశేషః స్యాదితిచేత్॥ ౯౬

తా॥ 'కాని నిత్యజ్ఞానమునకు ప్రమాతతో[51] పని లేదు. అనిత్యజ్ఞానమునకో యత్నముతో ఎడమగుటవలన ప్రమాత ఉండవలయును. ఇది విశేషము.'[52] ౯౬

మూ॥ సిద్ధా తర్హి ఆత్మనః ప్రమాతుః స్వతః సిద్ధిః ప్రమాణ నిరపేక్షతయైవేతి. ౯౭

తా॥ అటు లగుచో ఆత్మయగు ప్రమాత[53] ప్రమాణముతో పనిలేకయే సిద్ధించెను. ౯౭

మూ॥ అభావేఽపి అపేక్షాఽభావః, నిత్యత్వాత్ ఇతి చేత్ । న, అవగతేరేవ ఆత్మని సద్భావాదితి పరిహృతమేతత్.

తా॥ 'నిత్య మగుటచే ఆత్మజ్ఞానము ప్రమాణనిరపేక్షమేని నిత్యమగుటచేతనే ప్రమ[54] లేకున్నను అది ప్రమాణ నిరపేక్ష మేల కాదు?'

'అటులు కాదు. ప్రమయే ఆత్మయం దున్నది.[55] కావున అది ప్రమాణ నిరపేక్షమని పరిహరించితిమి'. ౯౮

---

(51) ప్రమాత = ప్రమాణముచే కనుగొనువాడు. (అంతఃకరణ ప్రతిబింబ చైతన్యము.)

(52) నిత్యజ్ఞానమునకును అనిత్యజ్ఞానమునకును గల భేదము.

(53) నిత్యజ్ఞానము - ౯౯ చూ.

(54) ప్రమాణముచే తెలియబడక పోవుటవలన ఆత్మ సిద్ధింప దని ప్రశ్నోద్దేశ్యము.

(55) ౯౫ - ౯౭ చూ. ప్రమ = అవగతి. శుద్ధజ్ఞానము.

మూ॥ ప్రమాతుశ్చేత్ ప్రమాణాపేక్షా సిద్ధిః కస్య ప్రమిత్సా స్యాత్। యస్య ప్రమిత్సా స ఏవ ప్రమాతా అభ్యుపగమ్యతే।తదీయా చ ప్రమిత్సా ప్రమేయవిషయైవ, న ప్రమాతృవిషయా । ప్రమాతృవిషయత్వే అనవస్థాప్రసఙ్గాత్ । ప్రమాతుః తదిచ్ఛాయాశ్చ తస్యాప్యన్యః ప్రమాతా తస్యాప్యన్య ఇతి । ఏవమేవ ఇచ్ఛాయాః ప్రమాతృవిషయత్వే ప్రమాతుః ఆత్మనః అవ్యవహితత్వాచ్చ ప్రమేయత్వానుపపత్తిః । లోకే హి ప్రమేయం నామ ప్రమాతుఃఇచ్ఛా, స్మృతి,ప్రయత్న,ప్రమాణజన్మ, వ్యవహితం సిధ్యతి, నాన్యథా అవగతిః ప్రమేయవిషయా దృష్టా । న చ ప్రమాతుః ప్రమాతా స్వస్య స్వయమేవ కేనచిత్ వ్యవహితః కల్పయితుం శక్యః ఇచ్ఛాదీనా మన్యతమేనాపి । స్మృతిశ్చ స్మర్తవ్యవిషయా న స్మర్తృవిషయా । తథా ఇచ్ఛాయాః ఇష్టవిషయత్వమేవ, న ఇచ్ఛావద్విషయత్వమ్ । స్మర్త్రిచ్ఛావద్విషయత్వేఽపి హి ఉభయోః అనవస్థా పూర్వవత్ అపరిహార్యా స్యాత్.

తా॥ 'తెలిసికొనువాడు తాను తెలియబడుటకు ప్రమాణము నపేక్షించు నెడల ఆ ప్రమాణాపేక్ష ఎవరిది? ఎవనికి ప్రమాణాపేక్ష[56] కలదో అతడే తెలిసికొనువాడుకదా ! తెలిసికొనువాని యీ ప్రమాణాపేక్షయు తెలియదగిన వస్తువును గురించియే కాని తెలిసికొనువానిని గురించి కాదు. తెలిసికొనువానిని గురించి యగునెడల తెలిసికొనువానికిని వాని

(56) తెలిసికొనువాడు ప్రమాత. (మూలము చూ.) తెలిసికొనవలయును నను కోరిక ప్రమిత్స (ప్రమాతుమ్ ఇచ్ఛా). తెలిసికొనదగిన వస్తువు ప్రమేయము. ఇంద్రియగోచరమంతయు ప్రమేయము.

అపేక్షకును అనవస్థ యేర్పడును. (ఎటులనగా తెలిసికొను వానిని వేరొక తెలిసికొనువా డుండవచ్చును. వానిని వేరొక తెలిసికొనువా డుండవచ్చును. ఇటులే తెలిసికొనువానిని తెలిసికొనదగిన ప్రమాణాపేక్షకు వేరొక తెలిసికొనువాని ప్రమాణాపేక్ష యుండవచ్చును.) మరియు తెలిసికొను తాను వ్యవహితుడు కాకపోవుటచే ప్రమేయ మగుటకు వీలులేదు. ఏలన లోకమునందు తెలిసికొనబడు వస్తువు తెలిసికొనువాని ఇచ్ఛచే స్మృతిచే ప్రయత్నముచే ప్రమాణముచే వ్యవహితమై (ఎడమై) తెలిసికొనబడును.[57] తెలియుబడు వస్తువు లిటులు గాక మరియొకరీతిగా తెలిసికొనబడవు మరియు తెలిసికొను వాడు తానే తనకు తన ఇచ్ఛాదులలో ఏయొకదానిచేతను వ్యవహితుడని కల్పింప శక్యము కాదు. ఏలయనగా స్మృతికి స్మరింపదగిన వస్తువే విషయముకాని స్మరించువాడు కాదు; ఇటులే కోరికకును కోరబడు వస్తువే విషయముకాని కోర్కి కలవాడుకాడు. స్మృతికి కర్తయగు స్మరించువాడే, మరియు కోరికకు కర్తయగు కోర్కికలవాడే విషయమగు నెడలనేనియు వెనుకటివలెనే అనవస్థ[58] తప్పదు.' ౯౯

(57) తెలిసికొనబడవలయు వస్తు వేదేని తెలిసికొనబడుటకు ముందు ప్రత్యక్షాదులలో ఏదే నొక ప్రమాణముచే వ్యవహితమగును. కోరబడు వస్తు వేదేని కోరబడుటకుముందు కోర్కిపుట్టుకచే వ్యవహితమగును. స్మరింప బడు వస్తు వేదేని స్మరింపబడుటకుముందు స్మృతిచే వ్యవహితమగును. సమ కూర్పబడవలసిన వస్తు వేదేని సమకూడుటకుముందు ప్రయత్నముచే వ్యవ హితమగును.

(58) స్మృతి స్మరింపదగినవస్తువునే విషయముగా జేసికొనును. కోర్కియు కోరదగిన వస్తువునే విషయముగా జేసికొనును. స్మరించువాడు తన కోరికకు గోచరుడు కాడు, కోర్కికలవాడు తన కోరికకు గోచరుడు కాడు, ఇటులయి

మూ॥ నను ప్రమాతృవిషయావగత్యనుత్పత్తౌ అనవగత ఏవ ప్రమాతా స్యాదితిచేత్. ౧౦౦

తా॥ 'అయ్యా! తెలిసికొనువాడు విషయముగాగల తెలివి (జ్ఞానము) లేదయేని అపుడు తెలిసికొనువాడు అవగతుడు కాకయేపోవునుగదా! (తెలియఁబడనివాఁడే యగును గదా.)' ౧౦౦

మూ॥ న, అవగన్తుః అవగతేః అవగన్తవ్య విషయత్వాత్ అవగన్తృ విషయత్వే చ అనవస్థా పూర్వవత్స్యాత్। అవగతిశ్చాత్మని కూటస్థ నిత్యాత్మజ్యోతిః అన్యతః అనపేక్షైవ సిద్ధా అగ్న్యాదిత్యాద్యుష్ణప్రకాశవదితి పూర్వమేవ ప్రసాధితమ్। అవగతేః చైతన్యాత్మజ్యోతిషః స్వాత్మని అనిత్యత్వే ఆత్మనః స్వార్థతానుపపత్తిః కార్యకారణసఙ్ఘాతవత్ సంహతత్వాత్ పారార్థ్యం దోషవత్త్వం చ అవోచామ। కథమ్? చైతన్యాత్మజ్యోతిషః స్వాత్మని అనిత్యత్వే స్మృత్యాది వ్యవధానాత్ సాన్తరత్వమ్। తతశ్చ తస్య చైతన్యజ్యోతిషః ప్రాగుత్పత్తేః ప్రధ్వంసాచ్చోర్ధ్వమాత్మన్యేవాభావాత్ చక్షురాదీనామివ సంహతత్వాత్ పారార్థ్యం స్యాత్। యదా చ తత్ ఉత్పన్నమ్ ఆత్మని విద్యతే, న తదా ఆత్మనః స్వార్థత్వమ్। తద్భావాభావాపేక్షా హి ఆత్మానాత్మనోః స్వార్థత్వపరార్థత్వసిద్ధిః। తస్మాత్ ఆత్మనః అన్య నిరపేక్షమేవ నిత్యచైతన్యజ్యోతిష్ట్వమ్. ౧౦౧

---

నను స్మరించువాడుగాని కోరువాడుగాని మరియొకని స్మృతికిని మరియొకని కోరికను గోచరించు ననునెడల ఆ స్మరించువాడు మరియొకని స్మృతికిని ఆ కోరువాడు మరియొకని కోరికను గోచరించునను అనవస్థ ఏర్పడును.

తా॥ తెలిసికొనువాని తెలివికి తెలియబడు వస్తువు విషయమగుటవలన నీవు చెప్పినది సరికాదు. తెలిసికొనువాడు తెలివికి విషయమగునేని వెనుక చెప్పిన చందముగా అనవస్థ[59] యేర్పడును. అగ్ని సూర్యుడు మొదలగువారికి వేడిమి వెలుతురులవలె ఆత్మకు నిర్వికారము నిత్యము స్వయంప్రకాశము[60] నగు జ్ఞాన మితరాపేక్ష లేకయే సిద్ధమయినదని వెనుకనే[61] సాధింపబడినది. స్వాత్మలో చైతన్యాత్మ జ్యోతిరూపమగు జ్ఞానము అనిత్యమయినయెడల[62] తానే తన కగుటకు (స్వార్థత) అనుపపత్తియు దేహేంద్రియముల ప్రోవువలె కలగూరగంపయగుటచే ఒకులకొరకు ఉనికి గొనవలయుటయు దోషవత్త్వమును ఆత్మకు కలుగునని చెప్పితిమి. ఎటువంటివేని వినుము. ఆత్మలో స్వయంప్రకాశమగు జ్ఞానము అనిత్యమగునేని స్మృతి మొదలగువాని ప్రవేశముచే వ్యవహితత్వము[63] కలుగును. అందువలన పుట్టుకకు ముందును అడగినపిదపను ఆత్మచైతన్యజ్యోతి ఆత్మలోనే లేకపోవుటచేసి ఆత్మ కన్ను మొదలగువానివలె కలగూరగంపయగుటవలన ఇతరోపయోగమునకే ఉనికి గొనవలసివచ్చును. జ్ఞాన ముత్పన్నమై[64] ఆత్మలో

---

(59) ౯౯ వా. చూ.

(60) "అయం పురుషః స్వయంజ్యోతిః" = "ఆత్మ స్వయంప్రకాశమయిన వెలుగు". (బృహ ౪ - ౩ - ౯)

(61) ౯౩ చూ.

(62) ౬౪ నుండి ౭౩ వరకు గల వాక్యములను చూచునది.

(63) ౯౯ చూ.

(64) కార్యకరణముల ప్రోవగు అనాత్మ ఉత్పన్నమగు జ్ఞానముచే తెలియబడును. ఆత్మ ఆగంతుకము కాదు. అనగా ఉత్పన్నము కాదు. అది నిత్యచైతన్యజ్యోతిః స్వరూపము. కావున ఆత్మకు పరప్రకాశాపేక్ష లేదు.

నున్నచో ఆత్మ తనకు దా గాదు. నిత్యమైన జ్ఞానము ఉండుట వలననే ఆత్మకు స్వాతంత్ర్యము[65] సిద్ధించుటయు నిత్యజ్ఞానము లేమివలననే అనాత్మకు ఒరులకొరకు తా నునికి గొనుట సిద్ధించుటయునుగదా! కావున ఆత్మ అన్యాపేక్ష లేకయే నిత్యచైతన్యజ్యోతిస్స్వభావమని తేలిపోయినది. ౧౦౧

మూ॥ నను ఏవం సతి అసతి ప్రమాఽఽశ్రయత్వే, కథం ప్రమాతుః ప్రమాతృత్వమ్. ౧౦౨

తా॥ 'ప్రమాణముచే ఉత్పన్నముకాని జ్ఞానమున కాశ్రయను కాడేని తెలిసికొనువా డెట్లు తెలిసినవా డగును ?' (ప్రమాతకు ప్రమాతృత్వ మెట్లు ?) ౧౦౨

మూ॥ ఉచ్యతే – ప్రమాయాః నిత్యత్వే అనిత్యత్వే చ రూపవిశేషాభావాత్। అవగతిర్హి ప్రమా। తస్యాః స్మృతీచ్ఛాదిపూర్వికాయాః అనిత్యాయాః కూటస్థ నిత్యాయా వా న స్వరూపవిశేషో విద్యతే। యథా ధాత్వర్థస్య తిష్ఠత్యాదేః ఫలస్య గత్యాది పూర్వకస్య అనిత్యస్య అపూర్వస్య నిత్యస్య వా రూపవిశేషో నాస్తీతి తుల్యో వ్యపదేశో దృష్టః – 'తిష్ఠన్తి మనుష్యాః' 'తిష్ఠన్తి పర్వతాః' ఇత్యాది। తథా నిత్యావగతిస్వరూపేఽపి ప్రమాతరి ప్రమాతృత్వ వ్యపదేశో న విరుధ్యతే ఫలసామాన్యాదితి. ౧౦౩

తా॥ నిత్యమయినను అనిత్యమయినను ప్రమకు[66] రూపవిశేషము లేదు. అవగతియే – జ్ఞానమే – ప్రమ. (ప్రమాణ

(65) స్వాతంత్ర్యము = స్వార్థత – తనకు తానే యగుట.

(66) భ్రమ జ్ఞానము కాని యథార్థజ్ఞానము. (ప్రమాణజన్యము) ౯౪ శ్లో ౧ టవ టీక చూచునది.

జన్యమగు జ్ఞానము నిత్యమనుము అనిత్యమనుము, పరమార్థమున జ్ఞానములో భేదము లేదు. జ్ఞాన మనునది (ప్రమాణజన్యమయినను జ్ఞానమే.) అనిత్య మనబడు స్మృతీచ్ఛాది పూర్వకమగు[67] జ్ఞానమును, నిర్వికారమును నిత్యము నగు జ్ఞానమును పరమార్థమున నొకటే. ఎటులనగా 'మనుష్యులు నిలిచియున్నారు, కొండలు నిలిచియున్నవి' అను నీ మొదలగు వాడుకలలో (నిలుచు) నిలిచియుండు అను నీ మొదలగు ధాతువులకు అర్థమగు నడకమానుట అను ఫలము మనుష్యులయెడ అనిత్యము, కొండలయెడ నిత్యము. ఏల యనగా మనుష్యులు ఇపుడు కాకున్నను ఇంకొకయపుడు నడవగలవారు. కొండలో నడవనే లేవు. నిత్యానిత్యమగు ఈ ఫలములో రూపవిశేష మేమియు[68] లేకపోబట్టి రెంటియెడను ఒక ధాతువే ఉపయో

(67) ౯౯ చూ.

(68) సంస్కృతములో - "మనుష్యా స్తిష్ఠన్తి, పర్వతా స్తిష్ఠన్తి" అనునెడ "తిష్ఠన్తి" అను క్రియ ష్ఠా = (గతి నివృత్తౌ) ధాతునిష్పన్నము. ష్ఠా ధాత్వర్థము నడక మానుట. దీనికి తెలుగులో చక్కగా సరిపోవు ధాతువు లేకున్నను "నిలుచు" అను ధాతువు కొంతవరకు సరిపోవును. "మనుష్యులు నిలిచియున్నారు, కొండలు నిలిచియున్నవి" అని పై రెండు వాక్యములను తెలిగింపవచ్చును. 'నిలుచు' అను ధాతువునకు గల అర్థములలో 'నడకమానుట' అనునదియు ఒక అర్థము. మనుష్యులు నిలిచియున్నారను వాక్యమునందలి నిలిచియుండుట నడవగలవారల క్రియ. కొండలు నిలిచియున్నవి అనునెడ నిలిచియుండుట నడవలేని స్థావరముల క్రియ. ఈ క్రియ నడకమున్నుగాగల మానుట యను నర్థము కలదగుటచే నడచువారలయెడ అనిత్యమును నడవలేని స్థావరములయెడ నిత్యమును అయినను రూపభేదము లేక "మనుష్యులు నిలిచియున్నారు, కొండలు నిలిచియున్నవి" అని ఒకే విధముగా వాడబడుచున్నవి.

గింపబడినది. ఇటులే ప్రమాణజన్యమగు జ్ఞానమును నిత్య జ్ఞానమును ఫలసామాన్యము కతన[69] ఒకటియేకాన నిత్యజ్ఞాన స్వరూపు డయినను ప్రమాతయెడ ప్రమాతృత్వ వ్యవహారము విరుద్ధము కాదు. (జ్ఞాతను జ్ఞాత యని యనుట విరుద్ధము కాదు.) ౧౦౩

మూ॥ అత్రాహ శిష్యః - నిత్యావగతి స్వరూపస్య ఆత్మనః అవిక్రియత్వాత్ కార్యకరణైః అసంహత్య తక్షాదీనామివ వాస్యాదిభిః కర్తృత్వం నోపపద్యతే, అసంహత స్వభావస్య చ కార్యకరణోపాదానే అనవస్థా ప్రసజ్యతే। తక్షాదీనాం తు కార్యకరణైః నిత్యమేవ సంహతత్వమితి వాస్యాద్యుపాదానే నానవస్థా స్యాదితి. ౧౦౪

తా॥ ఈయెడ శిష్యు డిటులు ప్రశ్నించుచున్నాడు - 'నిత్య జ్ఞానస్వరూపుడగు ఆత్మ వికారము లేనివాడు. అట్టివాడు దేహేంద్రియాదుల సంబంధము లేక కర్త కాజాలడు. ఉలి మొదలగువానిని చేపట్టక వడ్రంగి మొదలగువారు కర్తలు కానేరరుకదా! దేహేంద్రియాదులతో కలియని స్వభావము

(69) ప్రమాణమునకు ఫలము ప్రమ. ప్రమ ప్రమాత నాశ్రయించుకొని యుండును. ప్రమాత యనగా ఎరుగువాడు లేక జ్ఞాత. ఈ ప్రమాత లేక జ్ఞాత చిద్రూపుడు. అంతఃకరణము వ్యాపారాశ్రయము. ఇది చిద్భిన్నము. కేవలాంతఃకరణమునకు ప్రమ లేదు. నిర్వికారమగు ఆత్మకు కర్తృత్వము లేదు. అనగా ఇతడు వ్యాపారాశ్రయుడు కాడు. ఆత్మాంతఃకరణములకు పరస్పరాధ్యాసచే కర్తృత్వసిద్ధి. ఇటులు ప్రమాణాపేక్ష లేని కూటస్థాత్మకు ప్రమాతృత్వ మధ్యాసచే కలుగుటబట్టి మిథ్యయై ప్రతిబింబమున కొదవిన ప్రమాతృత్వము ఫలసామాన్యముకతన కూటస్థాత్మయెడ వ్యపదిష్టము. ౧౦౭ చూ.

కలవాడు ఆ దేహేంద్రియాదులను కరణములనుగా నుపయో గించు నెడల అనవస్థ యేర్పడును. మరి వజ్రదంగులు మొదలగు వారికి మాత్ర మనవస్థ యేర్పడదా అని యనుచో వా రెప్పుడును దేహేంద్రియాదులతో సంయుక్తు లగుచునే యుండు వారు. వారు ఉలి మొదలగువానిని కరణములనుగా చేకొందు రేని అనవస్థ చొరబడదు.' ౧౦౪

**మూ॥ ఇహ తు అసంహతస్వభావస్య** కరణానుపా దానే కర్తృత్వం నోపపద్యత ఇతి కరణముపాదేయం, **త**దుపా దానమపి వి**క్రియై**వేతి **త**త్కర్తృత్వే కరణాన్తరముపాదేయమ్ **త**దుపాదానేఽపి అన్యదితి ప్రమాతుః స్వాతంత్ర్యే అనవస్థా **అ**పరిహార్యా స్యాత్ ఇతి । నచ క్రియైవ ఆత్మానం కారయతి, అనిర్వర్తితాయాః స్వరూపాభావాత్ । అథ **అ**న్యత్ ఆత్మానం ఉపేత్య క్రియాం కారయతీతి చేత్, న; అన్యస్య స్వతఃసిద్ధత్వా విషయత్వాద్యనుపపత్తేః । న హి ఆత్మనః అన్యత్ అచేతనం వస్తు స్వప్రమాణకం దృష్టమ్ । శబ్దాది సర్వమేవ అవగతి ఫలావసాన ప్రత్యయప్రమితం సిద్ధం స్యాత్ । అవగతిశ్చేత్ ఆత్మనోఽన్యస్య స్యాత్, సోఽపి ఆత్మైవ **అ**సంహతః స్వార్థః స్యాత్, న పరార్థః । న చ దేహేన్ద్రియ విషయాణాం స్వార్థ తామ్ అవగన్తుం శక్నుమః । అవగత్యవసాన ప్రత్యయాఽపేక్ష సిద్ధి దర్శనాత్. ౧౦౫

తా॥ 'దేహేంద్రియాదులతో అంటిముట్టని స్వభావము కలవాడు కరణములను చేకొననిచో కర్త కాజాలడు. కావున కరణముల గొనవలయును. కరణములను గొనుటయుగూడ నొక వికారమే, అనగా క్రియయే. కావున ఈక్రియలో కర్తయగుటకు

ఇతరకరణములను చేకొనవలెను. ఈ కరణములను చేకొనుటకు మరల ఇతరకరణములను చేకొనవలసివచ్చును. కావున వేని తోడను తాకు దగులు లేని యాత్మ కర్త[70] కావలసివచ్చు నెడల అనవస్థ తప్పింపరానిదగును (కాన కర్త కాదు). పోనీ,

(70) "అసంగో హ్యయం పురుషః" = "ఈ పురుషుడు సంగము లేనివాడు" (బృహ - ౪ - ౩ - ౧౬) అని ఆత్మకు అకర్తృత్వమును, "ఏష హి ద్రష్టా శ్రోతా మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః" = "విజ్ఞానాత్మయగు నీ పురుషుడు చూచువాడు, వినువాడు, మననము చేయువాడు, తెలిసికొనువాడు, చేయువాడు" (ప్ర - ౪ - ౯) అనియు, కలలో "స ఈయతే యత్ర కామమ్" = "అతడు కోరిన చోటునకు పోవును" (బృహ. ౪ - ౩ - ౧౨) అనియు, "స్వే శరీరే యథాకామం పరివర్తతే" = "తన శరీరమునందు ఇచ్చవచ్చినటులు తిరుగాడును" (బృహ - ౨ - ౧ - ౧౮) అనియు, "యజేత" = "యజ్ఞముచేయునది" "జుహుయాత్" = "హోమము చేయునది" "దద్యాత్" = "దానము చేయునది" అనియు కర్తృత్వముగూడ శ్రుతి చెప్పుచుండుటబట్టి ఆత్మ కర్తయా అకర్తయా? లోకమున కరణముల గొని చేయు కర్తృత్వమొకటియు తనయునికిచేతనే జరగిపోవు కర్తృత్వమొకటియు మొదలుగా కొన్ని కర్తృత్వములు కానిపించుచున్నవి. ఉలి బాడిస మొదలగు పనిముట్లతో (కరణములతో) పనిచేయు వడ్రంగికి కర్తృత్వమున్నది. దాపున నున్నంతమాత్రముననే మంకెనపూవు స్ఫటికము నెఱ్ఱవారించి కర్త యగుచున్నది. వివక్షాధీనములగు కర్తృత్వము లింకను ఉన్నవి. వీనిలో ఆత్మకు ఉభయ విధములగు కర్తృత్వము లున్నవి. జాగ్రత్ స్వప్నములందు బుద్ధ్యుపహితుడగు జీవుడు ఉలియు బాడిసయును గొని పనిచేయు వడ్లంగివంటివాడు. అజ్ఞానోపహితుడై నిద్రలోనున్న జీవుడు ఉలి బాడిసల వాచి విశ్రమించిన వడ్రంగివంటివాడు. (బృహ - ౩ - ౨౧ నుండి ౩-౩౨ వరకు చూ.) మరియు తానున్నమాత్ర ఎఱ్ఱదనము పొరయగా మంకెన పూవు కర్తయని చెప్పబడుచున్నది. స్వసన్నిధిమాత్రమున జడములు ప్రేరితములు కాగా ఆత్మ కర్తయని చెప్పబడును. ఈరీతిగా ఆత్మకు గల కర్తృత్వ మౌపాధికము. (బ్రహ్మ. సూ. ౨-౩-౩౩ నుండి ౨-౩-౪౦ వరకుగల శాంకర భాష్యమున కర్త్రధికరణమెల్ల నరయునది.)

క్రియయే ఆత్మచే చేయించుననియందువా, క్రియ నిష్పన్నము కానిదే రూపుగొనదు[71]. (కర్త లేనిదే క్రియయెటులుజరుగును?) ఇక వేరొకటి[72] దాపరించి (పొడమి) ఆత్మచే పనిచేయించు నందువేని ఆత్మకుగాక వేరొకదానికి స్వయంసిద్ధియు అవిషయతయు నెటు లుపపన్నమగును? ఆత్మకంటె అన్యమగు అచేతన వస్తు వేదియు స్వయంసిద్ధమై కానరాదు. శబ్దాదులన్నియు ఆత్మ ప్రతిబింబముగా పర్యవసించిన చిత్తవృత్తులచే ప్రమితములై[73] స్ఫురించును. ఆత్మకంటె (వేరుగదోచు) వేరొకనికి[74] అవగతి యగునందువా అతడును దేహేంద్రియాదులతో అంటిముట్టని వాడును స్వార్థుడు నగు ఆత్మయే యగును. మరి పరార్థుడు

---

(71) పూర్వమీమాంసాభిప్రాయ మిచట విమర్శమునకు విషయము: క్రియ యనగా వ్యాపారము. అది కర్తను ఆశ్రయించును. అది కర్తచే నిష్పన్నము కావలయునది. కర్త చేయనిదే నిష్పన్నముకాక, ఇకముందు కర్తచే కాబోవుక్రియ, కర్తచే నెటులు చేయించును? దానికి స్వరూపసిద్ధియే లేదే. పోనీ ప్రయత్నమును క్రియ యని యందురా? (౯౯ చూ). అదియు కర్తృవ్యాపారమే. ఇక కర్తయే కాని ఆత్మచే అది యెటులు చేయించును?

(72) ఈ "వేరొకటి" పూర్వమీమాంస చెప్పు అపూర్వము. అపూర్వము నియోగమని యనుచో దీని కింకను నిష్పత్తి లేదుగాన ఇది చేయింపజాలదు. పూర్వమే సిద్ధించిన ధర్మాధర్మములని యనుచో అవి అచేతనములు. (ఈ యపూర్వము స్వర్గము అను ఫలము సమకూరువరకును ఉండునని పూర్వమీమాంస చెప్పును.)

(73) ప్రమాణముచే నిశ్చితము లయినవి.

(74) ప్రత్యగాత్మకంటె ఈశ్వరుడు వేరని నైయాయికు లందురు. కాని అతడు ప్రత్యగాత్మకంటెను పరమాత్మకంటెను వేరుకాడు.

కాదు. పోనీ దేహేంద్రియ విషయములు స్వార్థము[75]లందమా వానికి ఆత్మప్రతిబింబములుగా పర్యవసించిన చిత్తవృత్తుల యపేక్ష కలదు. ౧౦౫

మూ॥ నను దేహస్యావగతౌ న కశ్చిత్ ప్రత్యక్షాది ప్రత్యయాన్తరం అపేక్షతే. ౧౦౬

తా॥ 'అయ్యా! దేహమును తెలిసికొనుట కెవడును ప్రత్యక్ష ప్రమాణాదులను కోరడే.' ౧౦౬

మూ॥ బాఢమ్, జాగ్రతి ఏవం స్యాత్ । మృతి సుషుప్త్యోస్తు దేహస్యాపి ప్రత్యక్షాది ప్రమాణాపేక్షైవసిద్ధిః । తథైవ ఇన్ద్రియాణామ్ బాహ్యా ఏవ హి శబ్దాదయో దేహేన్ద్రియాకార పరిణతా ఇతి ప్రత్యక్షాది ప్రమాణాపేక్షైవ హి సిద్ధిః । సిద్ధిరితి చ ప్రమాణఫల మవగతి మవోచామ । సా చ అవగతిః కూటస్థా స్వయంసిద్ధాత్మజ్యోతిః స్వరూపేతి చ. ౧౦౭

తా॥ 'అగును, జాగ్రదవస్థలో ఇటులే. చావునందును నిదురయందును దేహమునకును ప్రత్యక్షాది ప్రమాణాపేక్ష ఉన్నది. అటులే ఇంద్రియములకును ఉన్నది. బాహ్యములే యగు శబ్దాదులు (సూక్ష్మభూతములు) దేహేంద్రియాకారములుగా పరిణమించినవి గాన వీని యునికి (సిద్ధి) ప్రత్యక్షాది ప్రమాణాపేక్షమే. సిద్ధియనగా ప్రమాణమునకు ఫలమగు అవగతియే యనియు మరి యీ యవగతియే కూటస్థ స్వయం సిద్ధాత్మ జ్యోతిస్స్వరూప యనియు[76] చెప్పితిమి. ౧౦౭

(75) దేహేంద్రియములకు తమలో తమ కలయికవలన అవగతి కలుగు నని చార్వాకు లందురు. వారికిని దేహేంద్రియాదులు అవగత్యాశ్రయములు కాక అవగమ్యములే. (76) ౧౦౩ - ౧౦౫ చూ.

మూ॥ అత్రాహ చోదకః - అవగతిః ప్రమాణానాం ఫలం కూటస్థ నిత్యాత్మజ్యోతిః స్వరూపేతి చ విప్రతిషిద్ధమ్. ఇత్యుక్త వన్తమాహ - న విప్రతిషిద్ధమ్ । కథం తర్హి కూటస్థా నిత్యాపి సతీ ప్రత్యక్షాది ప్రత్యయాన్తే లక్ష్యతే తాదర్థ్యాత్ । ప్రత్యక్షాది ప్రత్యయస్య అనిత్యత్వే అనిత్యేవ భవతి తేన ప్రమాణానాం ఫలం ఇతి ఉపచర్యతే. ౧౦౭

తా॥ ఈయెడ శిష్యుడు చోదన చేయుచున్నాడు. - 'అవగతి ప్రమాణములకు ఫలమని ఒకమూల చెప్పుచు, అదియే కూటస్థ నిత్యాత్మజ్యోతిస్స్వరూప యని ఒకమూల చెప్పుట పరస్పర విరుద్ధము కాదా ?

'విరుద్ధము కాదు.'

'అటు లగునెడల అవగతి ఫల మెటు లగును?'

'అది కూటస్థము నిత్యము అయినను చిత్తవృత్తులు దానిని పరిస్ఫుట మొనరించు కరణము లగుటవలన ఆ చిత్త వృత్తులచే గ్రహింపబడి ప్రమాణఫల మని లక్షింపబడును. (అనగా ప్రమాణఫల మనుట గౌణము) చిత్తవృత్తిచే గలుగు ప్రత్యక్షాది జ్ఞాన మనిత్య మగునెడల ననిత్యమువలె తోచును. కావున ప్రమాణఫల మనుట గౌణము[77]. ౧౦౭

(77) పరిశుద్ధమగు జ్ఞానమే ప్రమాత యనియు జ్ఞానమనియు ప్రమాణ ఫల మనియు గౌణముగా చెప్పబడును. ౯౮ నుండి యింతవరకును చెప్పిన వాక్యము లన్నిటికిని ఇది సారాంశము. "ఆత్మజ్ఞానము ఒకటే" అది చిత్త వృత్తులచే స్ఫుటమై విజ్ఞానానుసంధానముచే తత్తద్రూపముగా భాసించును" (బ్ర. సూ. ౨-3-౧౭. శాంకరభాష్యము చూచునది.)

మూ॥ యద్యేవం భగవన్! కూటస్థ నిత్యావగతిః ఆత్మజ్యోతిః స్వరూపైవ స్వయంసిద్ధా, ఆత్మని ప్రమాణ నిరపేక్షత్వాత్, తతోఽన్యత్ అచేతనం సంహత్యకారిత్వాత్ పరార్థమ్। యేన చ సుఖ దుఃఖ మోహ ప్రత్యయావగతి రూపేణ పారార్థ్యమ్, తేనైవ స్వరూపేణ అనాత్మనః అస్తిత్వం నాన్యేన రూపాన్తరేణ, అతో నాస్తిత్వమేవ పరమార్థతః। యథా హి లోకే రజ్జుసర్పమరీచ్యుదకాదీనాం తదవగతి వ్యతిరేకేణ అభావో దృష్టః, ఏవం జాగ్రత్స్వప్న ద్వైతభావస్యాపి తదవగతి వ్యతిరేకేణ అభావో యుక్తః। ఏవమేవ పరమార్థతః భగవన్, అవగతే ఆత్మజ్యోతిషః నైరన్తర్యభావాత్ కూటస్థనిత్యతా అద్వైతభావశ్చ, సర్వప్రత్యయ భేదేషు అవ్యభిచారాత్। ప్రత్యయ భేదాస్తు అవగతిం వ్యభిచరన్తి। యథా స్వప్నే నీల పీతాద్యాకార భేదరూపాః ప్రత్యయాః తదవగతిం వ్యభిచరన్తః పరమార్థతో న సన్తీత్యుచ్యన్తే, ఏవం జాగ్రత్యపి। నీల పీతాది ప్రత్యయభేదాః తామేవావగతిం వ్యభిచరన్తః అసత్యరూపా భవితుమర్హన్తి। తస్యాశ్చ అవగన్తే రన్యః అవగన్తా నాస్తీతి న స్వేనస్వరూపేణ స్వయముపాదాతుం హాతుం వా శక్యతే, అన్యస్య చ అభావాత్. ౧౦౯

తా॥ 'ఇటు లగునెడల స్వామీ! తన్ను దెలుపుటకు ప్రత్యక్షాది ప్రమాణములలో దేనితోడను పని లేనందువలన నిలువెల్ల వెలుగయినదియు మార్పు లేకుండునదియు ఎపుడును ఉండునదియు నగు ఎరుక తనంతట దా వెలుగుచుండునదియే. దానికి వేరయిన వెల్ల అచేతనములు. భూతాదులు తమకంటె వేరయినవానికొరకు (ఆత్మకొరకు) కలిసి పనిచేయుటచే అచే

తన మంతయు వే రొకనికొరకు. దానికి సుఖ దుఃఖ మోహ ములను కలిగించు చిత్తప్రత్యిజ్ఞానము[78] రూపము. ఆ రూపు తోనే దానియునికి గాని దానికి దీనికంటె మరియొక రూపు లేదు. కావున దానికి ఉనికి యనునది లేకపోవుటయే పర మార్థము.[79] ఎటులనిన తాడులో తాచు, ఎండమావులలో నీరు ఈ మొదలయినవి కొన్ని మనకు ఎరుకయగును. ఎరుకయే కాని అచట పాముగాని నీరుగాని కనబడునా? ఇటులే కలయం దును మెలకువయందును కనబడు ద్వైతభావమున కా యెరుక యేకాని దానికి వేరుగా లేమియే యుక్తము. ఓ భగవానుడా! ఇటులే యెపుడును ఉండుటవలన ఎరుకయగు ఆత్మచైతన్యము నిత్యము కూటస్థము. మరియు చిత్తవృత్తులలో ఏ యొకదాని యందును లేకపోవుట లేదుగాన అద్వైతము. ఆత్మ ఉండుచునే యుండగా చిత్తవృత్తు లెడబాయుచుండును. ఎటులనిన కలలో నల్లనివియు పచ్చనివియు నగు రూపములతో పొడమి వేరు వేరయిన చిత్తవృత్తులు పరమార్థమునకు లేవని చెప్పబడును. ఏలనగా దేనిచే తాము తెలియబడునో ఆ యెరుక[80] నిరంతర మును ఉండుచునే యుండగా తాము ఉండవు. ఇటులు జాగర మందును నీల పీతాది భిన్నములగు చిత్తవృత్తులు ఆయెరుకనే

---

(78) దానికి అధిష్ఠానజ్ఞానముకంటె వేరు ఉనికి లేదు.

(79) సాంఖ్యు లచేతనమునకు స్వతంత్రమగు అస్తిత్వము చెప్పిరి. అది యుక్తము కాదు.

(80) ఘటజ్ఞానము పటజ్ఞానము ఈ మొదలుగాగల సకలపదార్థ జ్ఞాన ములయందును జ్ఞానము అనువృత్తము. ఘటాదికమగు పదార్థ మెల్లయు వ్యావృత్తము. కావున జ్ఞానము నిత్యము. ఘటాదికమగు పదార్థ మెల్లయు అనిత్యము.

యెడబాయుచుండును గాన అసత్యరూపము లని అనదగును. అట్టి అవగతి[81] నెరుగు వేరొక అవగంత లేడు[82] కాన[83] అది తనచే గ్రహించుటకును వీలుకాదు, త్యజించుటకును వీలుకాదు. తానుతక్క వేరొకటి లేదుకదా!' ౧౦౯

మూ॥ తథైవేతి। ఏషా అవిద్యా యన్నిమిత్తః సంసారో జాగ్రత్స్వప్న లక్షణః। తస్యాః అవిద్యాయాః విద్యా నివర్తికా। ఇత్యేవం త్వమ్ అభయం ప్రాప్నోషి, నాతః పరం జాగ్రత్స్వప్న దుఃఖ మనుభవిష్యసి । సంసారదుఃఖా న్ముక్తోఽసీతి. ౧౧౦

తా॥ 'నీవు చెప్పినది సరియైనదే. జాగ్రత్ స్వప్నానుభవలక్షణమైన సంసారమునకు ఏది కారణమో అది అవిద్య[84]. విద్య అవిద్యను పోగొట్టును. ఇటులు నీ వభయము[85] పొందితివి. ఇటుపిదప జాగ్రత్ స్వప్న దుఃఖ[86] మనుభవింపవు. సంసార దుఃఖమునుండి ముక్తుడవు'. ౧౧౦

మూ॥ ఓమితి. ౧౧౧

తా॥ 'ఓమ్' అని శిష్యు డనెను. ౧౧౧

కూటస్థాద్వయాత్మబోధ ప్రకరణము
సమాప్తము.

---

(81) ఆత్మ. (82) ౧౦౫ - ౭౪ చూ.

(83) స్వయంప్రకాశమగుటచే వేరొక అవగంత ఉండడు.

(84) ౪౯ చూ. (85) బృహ. ౪-౨౪ చూ.

(86) ౪౭ వా. దాని టీక చూ.

రూపము లని అనదగును.
ంత లేదు[82] కాన[83] అది
్యజించుటకును వీలుకాదు.
౧౦౯

్య యన్నిమిత్తః సంసారో
్యయాః విద్యా నివర్తికా।
, నాతః పరం జాగ్రత్స్వప్న
ా న్మక్తోఽసీతి. ౧౧౦

దే. జాగ్రత్ స్వప్నను
కారణమో అది అవిద్య[84].
నీ వభయము[85] పొందితివి.
మనుభవింపవు. సంసార
౧౧౦

౧౧౧

ెను. ౧౧౧

న ప్రకరణము

ు.

ర చూ.
అనగంత ఉండదు.
౹-౨ర చూ.

# పరిసంఖ్యాన ప్రకరణమ్

**మూ॥** ముముక్షూణామ్ ఉపాత్త పుణ్యా పుణ్య క్షపణ పరాణామ్ అపూర్వానుపచయార్థినః పరిసంఖ్యాన మిద ముచ్యతే- అవిద్యాహేతవో దోషాః వాఙ్మనః కాయప్రవృత్తిహేతవః—, ప్రవృత్తేశ్చ ఇష్టానిష్ట మిశ్రఫలాని కర్మాణి ఉపచీయన్తే ఇతి తన్మోక్షార్థమ్. ౧౧౨

**తా॥** కూడబెట్టిన పుణ్యా పాపముల క్షయము చేసికొన వలయు నని అనుకొని క్రొత్తవానిని కూడబెట్టుకొనగోరని ముముక్షువులకు—

అవిద్య దోషములకు కారణము, అవి వాఙ్మనః కాయ ముల ప్రవృత్తికి కారణములు, ఆ ప్రవృత్తివలన ఇష్టానిష్ట మిశ్రఫలములు కల కర్మలు పెరిగిపోవునుగావున అవి అన్నియు పోవుటకు ఈ పరిసంఖ్యానము[87] చెప్పబడుచున్నది. ౧౧౨

**మూ॥ తత్ర** శబ్ద స్పర్శ రూప రస గన్ధానాం విషయాణాం శ్రోత్రాది గ్రాహ్యత్వాత్ స్వాత్మని పరేషు వా విజ్ఞానాభావః। తేషామేవ పరిణతానాం యథా లోష్టాదీనామ్।

---

(87) అపూర్వ - నియమ - పరిసంఖ్యాన - భేదముచే విధులు మూడు. అపూర్వవిధి = దేనిచేతను తెలియనిదానిని చేయజెప్పుట. నియమవిధి = వేరొకరీతిగను కార్యము సిద్ధించుచుండగా ఇటులే చేయుమని చెప్పుట. పరిసంఖ్యానవిధి = రెండు ఒకసారి చేయవలసిరాగా దీనినే చేసితీరున దని చెప్పుట. త్రివర్గసాధనమగు విషయసుఖమునకును మోక్షసాధనమగు విషయ నివృత్తికిని ప్రయత్నింపవచ్చు ననుచోట విషయసుఖమును నిరసించి నివృత్తిని విధించుట.

శ్రోత్రాదిద్వారైశ్చ జ్ఞాయన్తే। యేన చ జ్ఞాయన్తే సః జ్ఞాతృత్వాత్ అతజ్జాతీయః। తే హి శబ్దాదయః అన్యోన్యసంసర్గిత్వాత్ జన్మ వృద్ధి విపరిణామా పక్షయ నాశ సంయోగ వియోగా విర్భావ తిరోభావ వికార వికారి క్షేత్ర బీజాద్యనేక ధర్మాణః, సామాన్యేన చ సుఖ దుఃఖాద్యనేక కర్మాణః। తద్విజ్ఞాతృత్వాదేవ తద్విజ్ఞాతా సర్వశబ్దాది ధర్మవిలక్షణః. ౧౧౩

తా॥ చెవి మొదలగువానిచే గ్రహింపదగిన వగుటవలన శబ్ద స్పర్శ రూప రస గంధము లను విషయములకు స్వపరిణామములయిన లోష్టాదులకువలె స్వపర జ్ఞానము లేదు. వానిని తెలిసికొనుటకు శ్రోత్రాదులు ద్వారములు. ఎవనిచే నివి తెలిసికొన బడుచున్నవో అతడు తెలిసికొనువాడుకాన ఆ దినుసు వేరు. ఇక ఆ శబ్దాదు లొండొండ కలయుచుండుటవలన పుట్టుట పెరుగుట ముదియుట చిక్కుట చచ్చుట కలయుట విడిపోవుట వచ్చుట పోవుట కార్యమగుట కారణమగుట క్షేత్రమగుట బీజమగుట యీ మొదలగు పెక్కు ధర్మములు కలవి. వెరసి అవి యన్నియు సుఖ దుఃఖానేక ధర్మములు కలవి. వాని నెరుగుటవలననే వాని నెరుగువాడు సకల శబ్దాది ధర్మములకంటె విలక్షణుడు. ౧౧౩

మూ॥ తత్ర శబ్దాదిభిః ఉపలభ్యమానైః పీడ్యమానో విద్వాన్ ఏవం పరిసంచక్షీత. ౧౧౪

తా॥ వానిలో చెవి మొదలగువానికి తగులు శబ్దాదులచే విచలితుడగు విద్వాంసుడు ఇటులు మాటిమాటికి అలవాటు చేసికొనవలయును. ౧౧౪

మూ॥ శబ్దస్తు ధ్వని సామాన్యమాత్రేణ విశేష ధర్మైర్వా షడ్ జాదిభిః ప్రియైః స్తుత్యాదిభిః ఇష్టైః అనిష్టైశ్చ అసత్య బీభత్స పరిభవాఽఽక్రోశాదిభిః వచనైర్మాం దృక్స్వరూపః భావ మసంసర్గిణ మవిక్రియ మచల మనిధన మభయ మత్యన్త సూక్ష్మ మ విషయం గోచరీకృత్య స్ప్రష్టుం నైవార్హతి, అసం సర్గిత్వా దేవ మామ్। అత ఏవ న శబ్దనిమిత్తా హానిః వృద్ధిర్వా। అతో మాం కిం కరిష్యతి స్తుతి నిన్దాది ప్రియాప్రియత్వాది లక్షణః శబ్దః । అవివేకినం హి శబ్దమాత్మత్వేన గతం ప్రియః శబ్దో వర్ధయేత్ అప్రియశ్చ క్షపయేత్, అవివేకిత్వాత్; న తు మమ వివేకినో వాలాగ్రమాత్రమపి కర్తు ముత్సహతే ఇతి । ఏవమేవ స్పర్శ సామాన్యేన తద్విశేషైశ్చ శీతోష్ణ మృదుకర్క- శాది జ్వరోదర శూలాది లక్షణైశ్చ అప్రియైః ప్రియైశ్చ కైశ్చిత్ శరీరసమవాయిభిః బాహ్యాగన్తుక నిమిత్తైశ్చ న మమ కాచిత్ విక్రియా వృద్ధిహానిలక్షణా అస్పర్శత్వాత్ క్రియతే, వ్యోమ్న ఇవ ముష్టిఘాతాదిభిః । తథా రూపసామాన్యేన తద్విశేషైశ్చ ప్రియాప్రియైః స్త్రీవ్యఞ్జనాది లక్షణైః అరూపత్వాత్ న మమ కాచిత్ హానిః వృద్ధి ర్వా క్రియతే । తథా రససామా న్యేన తద్విశేషైశ్చ ప్రియాప్రియైః మధురామ్ల లవణ కటు తిక్త కషాయైః మూఢబుద్ధిభిః పరిగృహీతైః అరసాత్మకస్య మమ న కాచిత్ హానిః వృద్ధిర్వా క్రియతే । తథా గన్ధ సామా న్యేన తద్విశేషైః ప్రియాప్రియైః పుష్పాద్యనులేపనాదిలక్షణైః అగన్ధాత్మకస్య న మమ కాచిత్ హానిః వృద్ధిర్వా క్రియతే, । 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథాఽరసం నిత్య మగన్ధ వచ్చ యత్' ఇతి శ్రుతేః. ౧౧౧

తా॥ “శబ్దము ధ్వని సామాన్యమాత్రముచేగాని, షడ్జము మొదలగు విశేషధర్మములచేగాని, ప్రియములును ఇష్టములు నగు స్తుతి మొదలగు వానిచేగాని, అనిష్టములగు కల్లమాటలచేగాని, కుళ్ళు మాటలచేగాని, ఒట్టులచేగాని, తిట్టులచేగాని నన్ను, జ్ఞానస్వభావుని, వేనితోడను కలయనివానిని, వికారము లేనివానిని, అచలుని, అమరుని, అభయుని, అత్యంత సూక్ష్ముని, అవిషయుని, గోచరునిగా చేసికొని వేనితోడను కలియనివాడను గనుకనే స్పృశింపజాలదు. కావుననే నాకు శబ్దము మొదలగునవి చేయు ఎగ్గు లగ్గులు లేవు. కావున స్తుతి నింద ప్రియము అప్రియము ఈ మొదలగు లక్షణములు కల శబ్దము నన్నేమి చేయగలదు? ఆత్మకు సంబంధించిన దని తలచు అవివేకిని వివేకము లేనివాడగుటజేసి ప్రియమగు శబ్దము పొంగజేయును, అప్రియమగు శబ్దము కుంగదీయును. వివేకినగు నాకు వెంట్రుకవాసియేని యేమేనియు జేయజూడదు. ఇటులే స్పర్శ సామాన్యముచేగాని అప్రియములును శీతోష్ణ మృదు కర్కశాది జ్వరోదర శూలాది లక్షణములును, ప్రియములను శరీర సంబద్ధములును బాహ్యాగంతుక నిమిత్తములు నగు స్పర్శ విశేషములచేగాని స్పర్శకు ఆవలివాడ నగు నాకు పిడికిలి పోటులచే ఆకాశమునకువలె లోటుపాటులు లేవు. ఇటులే రూప సామాన్యముచేగాని ప్రియాప్రియములై ఊతరోతలు పుట్టించు రూప విశేషములచేగాని రూపముకంటే వేరయిన నాకు వచ్చునదిగాని పోవునదిగాని యేమియు లేదు. ఇటులు రససామాన్యముచేగాని ప్రియాప్రియములై మూఢబుద్ధులచే చేకొనబడి మధురామ్ల లవణ కటు తిక్త కషాయము

లను రూప విశేషములచేగాని రసముకంటె వేరయిన నాకు మేలు గీళ్లు లేవు. ఇటులే గంధసామాన్యముచేగాని ప్రియా ప్రియములును పూలు పూతలు మొదలగు లక్షణములు కల గంధ విశేషములచేగాని గంధముకంటె వేరగు నాకు హెచ్చు లొచ్చులు రావు. ఏలనగా నేను శబ్ద స్పర్శ రూప రస గంధములు లేనివాడను, అవ్యయుడను, నిత్యుడను' అని శ్రుతి౮౮ చెప్పుచున్నది. ౧౧౫

మూ॥ కించ – య ఏవ బాహ్యాః శబ్దాదయః తే శరీరాకారేణ సంస్థితాః, తద్గ్రాహకైశ్చ శ్రోత్రాద్యాకారైః, అన్తఃకరణద్వయ తద్విషయాకారేణ చ అన్యోన్య సంసర్గిత్వాత్ సంహతత్వాచ్చ సర్వక్రియాసు। తత్రైవం సతి విదుషో న మమ కశ్చిత్ శత్రుః మిత్రం ఉదాసీనో వా అస్తి। తత్ర యది కశ్చిత్ మిథ్యాజ్ఞానాభిమానేన ప్రియమప్రియం వా ప్రయుయుంక్షేత క్రియాఫలలక్షణం తన్మృషైవ ప్రియుయుంక్షతే సః। తస్యావిషయత్వాన్మమ, 'అవ్యక్తోఽయ మచిన్త్యోఽయమ్' ఇతి స్మృతేః। తథా సర్వేషాం పఞ్చానామపి భూతానామవికార్యత్వాత్, అవిషయత్వాత్, 'అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయమ్' ఇతి స్మృతేః। యాపి శరీరేన్ద్రియ సంస్థానమాత్ర ముపలక్ష్య మద్భక్తానాం విపరీతానాం చ క్రియాఽక్రియాది ప్రయుయుంక్షా, తజ్జా చ ధర్మాధర్మాది ప్రాప్తిః సా తేషామేవ, నతు మయి అజరే అమృతే అభయే, 'నైనం కృతాకృతే తపతః', 'న కర్మణా వర్ధతే నో కనీయాన్–' 'స బాహ్యాభ్యన్తరో హ్యజః'

(౮౮) 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్' (కఠ. 3-౧౫)

'నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః' ఇత్యాది శ్రుతి స్మృతిభ్యః । అనాత్మ వస్తునశ్చ అసత్త్వాత్ ఇతి పరమో హేతుః । ఆత్మ నశ్చ అద్వయత్వ విషయాణి, ద్వయస్య అసత్త్వాత్, యాని సర్వాణి ఉపనిషద్వాక్యాని విస్తరశః సమీక్షితవ్యాని సమీక్షితవ్యానీతి. ౧౧౬

తా॥ మరియు వెలుపలివగు శబ్దాదులే శరీరాకారము తాల్చినవి. మరియు నివి అన్ని పనులలో అన్యోన్యము కలయుట వలనను కలిసి పనిచేయుటవలనను తమ్ము గ్రహించు శ్రోత్రాద్యాకారముగను మనోబుద్ధ్యాకారముగను తత్తద్విషయాకారముగను పరిణామము పొందినవి. ఇది యెల్ల ఈ చంద మగుట వలన నాకు శత్రు మిత్రోదాసీనులని యెవరును లేరు. ఇటులు కావున ఎవడేని అహంకారముచే నాకు ప్రియముకాని అప్రియముగాని చేయదలచెనేని అతని ప్రయత్నము విఫలము. 'ఇతడవ్యక్తుడు, ఇతడచింత్యుడు' అని స్మృతియందున్నటులు[89] నేను ప్రియాప్రియములకు విషయము కాను. ఇటులే పంచభూతములచేగాని మరి యేభూతముచేగాని వికారము కలిగింపదగినవాడనుగాను - 'ఇతడు నరకదగినవాడు కాడు, తగులబెట్టదగినవాడు కాడు' అని స్మృతిలో[90] నున్నట్లు నేను వానికి విషయము కాను. నన్ను శరీరేంద్రియముల కూర్పే యని తలచి నాభక్తులుగాని వ్యతిరిక్తులుగాని నాకు మేలుగీల్లు చేయదలతురేని వానివలన బొడము ధర్మాధర్మములు - 'విహితావిహితకర్మలు రెండును ఇతని (బ్రహ్మవేత్తను) సంతాపము నొందజేయ జాలవు'[91] అనియును 'కర్మచే నితని మహిమ పెరు

(89) ౨-౨౫ గీత. (90) ౨-౨౪ గీత. (91) ౪-౪-౨౨ బృహ.

గదు, తరుగదు[92] అనియును 'లోపలివానితో వెలుపలివానితో గూడియుండువాడు, మరియు పుట్టనివాడు'[93] అనియును 'లోక దుఃఖము ఇతనిని అంటదు; ఆ దుఃఖము బాహ్యము'[94]అనియును ఈ మొదలయినవి శ్రుతిస్మృతులలో నున్నటులు అజరుడను అమరుడను అభయుడను అగు నాకు చెందవు, మరి వారినే చెందును. అనాత్మవస్తువు నాలో లేకపోవుటనునది ఇందులకు ముఖ్య హేతువు.

ద్వయము లేనందువలన ఆత్మాద్వయత్వమును గూర్చి యే యుపనిషద్వాక్యములు కలవో వానిని తప్పక వివరముగా పారజూచునది.

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యస్య
శ్రీ గోవిన్ద భగవత్పూజ్యపాద శిష్యస్య
శ్రీ మచ్ఛంకర భగవతః కృతౌ
ఉ ప దే శ స హ స్రాం
గద్యప్రబన్ధః సమాప్తః.



(92) ౪-౪-౨౩ బృహ. (93) ౨-౧-౨ ముం. (94) ౫-౧౧ కఠ.

# పీ ఠి క

ఇంచుమించు ముప్పది చినచిన్న వాక్యములుగల యీ 'పఞ్చీకరణమ్' అనునది ఉపాసన నుపదేశించు గ్రంథము. ఇది మాండూక్యమునకు కుఱుచమేను (సూక్ష్మశరీరము) అని చెప్పవచ్చును. సాధకులు ఎల్లపుడును నలవరుచుకొనదగిన భావనాత్మక విషయము నిది బోధించును.

సురేశ్వరాచార్యులవారు దీనికి వార్తికము రచించి రనుచో దీని ప్రాముఖ్య మెఱుకపడును. శ్రీ పిన్నింటి మల్లు శాస్త్రిలవారు సురేశ్వరులవారి యీ పఞ్చీకరణవార్తికమునకు దర్పణ మను వ్యాఖ్య వ్రాసి తెలుఁగువారి కీర్తి వెలయించిరి.

ఈ మల్లుశాస్త్రిలవారివంశములోనివారును శ్రీ పిన్నింటి బ్రహ్మదేవశాస్త్రిగారి కుమారులు నగు శ్రీ వేంకటశాస్త్రిగారు (భీమనపల్లి వాస్తవ్యులు – అమలాపురం తాలూకా) దర్పణ కర్తలగు శ్రీ మల్లుశాస్త్రిలవా రిప్పటికి ఇన్నూఱేండ్ల వెనుకటి వారని చెప్పియున్నారు. ఈ పిన్నింటి మల్లుశాస్త్రిగారి తర్క-వ్యాకరణ వేదాంతాది దర్శనస్వరూపము ఈ దర్పణమున చక్కగా ప్రతిబింబించెను.

శ్రీరంగమున వాణీవిలాస ముద్రాలయమువారు 'వేదాన్త సార వార్తికరాజ సంగ్రహ – పఞ్చీకరణ వార్తికములను' ఒక చిన్న పుస్తకముగను, పఞ్చీకరణ – సమ్మిశ్రపఞ్చీకరణ – పఞ్చీకృత – సాధనచతుష్టయ సముచ్చయము అనువాని నొక చిన్న పుస్తకముగను అచ్చొత్తించిరి. మొదటి పుస్తకమున

రెండవదగు పఞ్చీకరణవార్త్తికము శ్రీసురేశ్వరాచార్యులవారిది. ఈ రెండవ చిన్నపుస్తకమునందలి నాలుగింటికిని కర్త ఎవరో తెలియదు. ఈ రెండుపుస్తకములయు వ్రాఁతప్రతులు తంజావూరి కోటలోని సరస్వతీమహాల్ గ్రంథాగారమునం దగపడిన వని వాణీవిలాసముద్రాలయమువారు ప్రకటించిరి. ఈ రెండవ పుస్తకమునందలి పఞ్చీకరణ – సమ్మిశ్రపఞ్చీకరణ – సాధనచతుష్టయ సంపత్తి – అనునవి పఞ్చీకరణవ్యాఖ్యలు. ఇవి సులభములు సరళములు నగుటచే శ్రీశంకరభగవత్పాదుల పఞ్చీకరణమును సులభముగా తెలిసికొనుటకు ఇందు చేర్చితిని. సురేశ్వరులవారి వార్త్తికము చేర్చుటకును ఇదియే కారణము. శ్రీరంగము వాణీవిలాస ముద్రాలయమువారు శాంకర గ్రంథావళి పదవ సంపుటమునందలి పఞ్చీకరణమునకును, శ్రీ మల్లు శాస్త్రిలవారి (దర్పణమునుబట్టి) పాఠమునకును 'పఞ్చీకృతమ్ అను వాణీవిలాస ముద్రిత గ్రంథపాఠమునకును స్వల్పభేదములు కలవు. వానిని చాలవట్టు దీన చూపితిని. దర్పణమునఁ గల విశేషములను కడుఁ గొలఁదిగా చేర్చితిని.

— వేలూరి శివరామశాస్త్రి.

ఓమ్

# పఞ్చీకరణమ్

అథాతః పరమహంసానాం సమాధివిధిం వ్యాఖ్యాస్యామః. ౧

తాత్పర్యము.

పరమహంస లెటులు సమాధి పొందుదురో వర్ణించెదగలము. ౧

సచ్ఛబ్దవాచ్య మవిద్యా శబలం బ్రహ్మ। బ్రహ్మణో ఽవ్యక్తమ్ అవ్యక్తా న్మహత్ । మహతోఽహంకారః । అహంకారా త్పఞ్చ తన్మాత్రాణి । పఞ్చ తన్మాత్రేభ్యః పఞ్చ మహాభూతాని । పఞ్చమహాభూతేభ్యోఽఖిలం జగత్. ౨

తాత్పర్యము.

సత్ అను శబ్దమునకు అర్థమగు బ్రహ్మము అవిద్యాశ్రయము. అట్టి బ్రహ్మనుండి అవ్యక్తము, దానినుండి మహత్తత్త్వము, దానినుండి అహంకారము, దానినుండి పంచతన్మాత్రలు, వానినుండి పంచమహాభూతములు, పంచమహాభూతములనుండి సమస్తప్రపంచమును పుట్టెను. ౨

పఞ్చానాం భూతానా మేకైకం ద్విధా విభజ్య స్వార్ధభాగం విహా యార్ధభాగం చతుర్ధా విభ జ్యేతరేషు యోజతే పఞ్చీకరణం మాయారూపదర్శన మధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపఞ్చం ప్రపఞ్చ్యతే. ౩

## తాత్పర్యము.

అయిదు భూతములలో ఒక్కొక్క భూతమును రెండు చెక్కలు చేయునది. ఒకచెక్క నటుంచి రెండవ చెక్కను మరల నాలుగు చీలికలు చేసి యితరములందు కలిపినయెడల మాయారూపముగా కానుపించు పంచీకరణ మగును. అదియే ప్రపంచము. దాని నధ్యారోపాపవాదములచే ఉత్తదని నిరూపింతుము. 3

## పఞ్చీకరణమ్*

(ఒక్కొకభూతమును పంచభూతాత్మకముగా చేయుట)

ఓమ్. పఞ్చీకృత పఞ్చమహాభూతాని♦ తత్కార్యం సర్వం విరా డిత్యుచ్యతే । ఏతత్ స్థూలశరీర మాత్మనః‡ । ఇన్ద్రియై రర్థోపలబ్ధిర్ జాగరితమ్ ఏ తత్† దుభయాభిమాన్యాత్మా విశ్వః । ఏతత్ త్రియ మకారః. ౪

## తాత్పర్యము.

ఓమ్. పంచీకృతమగు పంచమహాభూతములును ఆ మహాభూతములవలన పొడమినదెల్లయు విరాట్టని చెప్పబడును.

---

* తఞ్జానగర గ్రంథభాండాగారస్థ పుస్తకే ఓమిత్యారభ్య ముద్రితాంశః 'పఞ్చీకృతమ్' ఇతి శీర్షికయా అస్తి. సమాప్తౌ చ పఞ్చీకృత మిత్యేవాస్తి.

♦ అపఞ్చ పఞ్చవత్ సంపద్యమానాని కృతమ్ పఞ్చీకృతమ్ । అభూత తద్భావే చ్విప్రత్యయః । చ్విప్రత్యయాన్తానాం పఞ్చానాం పఞ్చీకృత శబ్దానాం సరూపైకశేషః । తతః మహాభూతశబ్దేన కర్మధారయః ఇతి దర్పణమ్.

‡ 'ఆత్మన ఇంద్రియైః' ఇతి పాఠాంతరమ్.

† 'తదుభయాభిమానీ' పాఠాంతరము.

ఈ విరాడ్రూప మాత్మకు స్థూలశరీరము. ఇంద్రియములచే విషయముల నెరిగికొనుట జాగ్రదవస్థ. ఈ రెంటిని అభిమానించు ఆత్మ అనగా నేనని అనుకొనువాడు విశ్వుడు.

ఈ మూడును అనగా విరాట్పురుషుడు విశ్వుడు జాగ్రదవస్థయు వెరసి అకారము. (ఓమ్ అనుదాన అ + ఉ + మ్ = అను మూడు అక్షరము లున్నవి. అందు మొదటిదగు అకారము విరాడ్విశ్వజాగరితములని తలపవలయును.) ౪

*అపఞ్చీకృత పంచమహాభూతాని పఞ్చ తన్మాత్రాణి మనో బుద్ధి శ్చేతి సప్తదశకం లిఙ్గం భౌతికం♦ హిరణ్యగర్భ ఇత్యుచ్యతే । ఏతత్ సూక్ష్మశరీర మాత్మనః । కరణే షూపసంహృతేషు జాగరిత సంస్కారజః ప్రత్యయః స విషయః స్వప్న ఇత్యుచ్యతే । తదుభయాభిమా న్యాత్మా తైజసః । ఏత త్త్రియ ముకారః. ౫

తాత్పర్యము.

అపంచీకృతములైన పంచమహాభూతములు తన్మాత్రములు మనస్సు బుద్ధియు అను నీ పదియేడును లింగమనియు (భూతములవలన అయినది కావున) భౌతికమనియు హిరణ్య

* 'అపఞ్చీకృత పఞ్చమహాభూతాని తత్కార్యంచ సప్తదశకం' ఇతి పాఠాన్తరమ్ । తత్ర - 'న పఞ్చీకృతాని అపఞ్చీకృతాని, అపఞ్చీకృతాని చ తాని మహాభూతాని' ఇతి విగ్రహః । తచ్ఛబ్దేన సూక్ష్మభూత పరిగ్రహః.

♦ భౌతిక మని చెప్పుటచే సాంఖ్యులయు పౌరాణికులయు మతము నిరసింపబడినది. వారు ఇంద్రియములను భౌతికములని చెప్పరు. కావున వేదాంతులమతమున పంచీకృతభూతకార్యమగు భౌతికసప్తదశకము అపఞ్చీకృతభూతములును లింగము. అదియే హిరణ్యగర్భుడు.

గర్భు డనియు చెప్పబడును. ఇది ఆత్మకు సూక్ష్మశరీరము లేక కుచుచమేను. కరణములు విశ్రాంతిగొనగా జాగ్రదవస్థయందలి సంస్కారమువలన గలిగిన యొుక స్వప్న మనబడును. ఈ రెంటిని అభిమానించువాడు తైజసుడు. ఈ మూడును ఉకారము. ౫

శరీరద్వయకారణ మాత్మాజ్ఞానం సాభాస మవ్యాకృత మిత్యుచ్యతే । ఏతత్ కారణ శరీర మాత్మనః । త చ్చ న సత్, నా సత్, నాపి సదసత్ । న భిన్నమ్, నా భిన్నమ్, నాపి భిన్నాభిన్నం కుతశ్చిత్ । న నిరవయవమ్, న సావయవమ్ । నో భయమ్ । కిం తు కేవల బ్రహ్మైకత్వ జ్ఞానావ నోద్యమ్ । సర్వప్రకార జ్ఞానోపసంహారే బుద్ధేః కారణాత్మ నాఽవస్థానం సుషుప్తిః । త దుభయాభిమాన్యాత్మా ప్రాజ్ఞః । ఏత త్త్రియం మకారః. ౬

## తాత్పర్యము.

స్థూలశరీరమునకును సూక్ష్మశరీరమునకును కారణమును చిదాభాసునితో అనగా ప్రతిబింబముతో గూడినదియు ఆత్మ నాశ్రయించినదియు నగు అజ్ఞానమునకు అవ్యాకృతమని పేరు. ఇది ఆత్మకు కారణశరీరము. అది ఉన్నది కాదు లేనిదియు గాదు, ఉనికి లేములు కలదియు గాదు, మరియు వేరయినది కాదు, వేరు కానిదియు గాదు, ఈ రెండును అయినదియు గాదు. అనగా ఏవిధముగనయినను (అనిర్వచనీయము) చెప్ప తరముగానిది, మరియు నిరవయవమును గాదు, సావయవమును గాదు, ఉభయమును గాదు. మరి యేమనిన బ్రహ్మైక్యజ్ఞానము

చేతనే పోగొట్టదగినది. ఎరుకయెల్లయు బాసి బుద్ధి కారణ రూపముగా నుండుట నిదుర. ఈ రెంటి నభిమానించువాడు ప్రాజ్ఞుడు. ఈ మూడును మకారము. ౬

†అకార ఉకారే, ఉకారో మకారే, మకార ఓంకారే ఒహమ్యేవ. ౭

తాత్పర్యము.

అకారము నుకారమునందును, ఉకారమును మకారము నందును, మకారమును ఓంకారరూపమగు 'నేను' నందును లయింపజేయునది. ౭

అహ మాత్మా సాక్షీ* కేవల శ్చిన్మాత్ర♦ స్వరూపః, నా జ్ఞానమ్, నాఒపి తత్కార్యమ్ । కింతు నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్య స్వభావమ్‡ పరమానందాద్వయమ్§ । ప్రత్యగ్భూతచైతన్యమ్ బ్రహ్మైవాహ మస్మీ త్యభేదే నావస్థానం సమాధిః । 'తత్త్వమసి' 'బ్రహ్మాహ మస్మి' 'ప్రజ్ఞాన

---

† 'అకార ఉకార మకారోఒహ మేవాహం సాక్షీ చిన్మాత్ర స్వరూపో నాజ్ఞానం తత్కార్యం వా.' పాఠాంతరము.

* కర్తృత్వాదులు లేనివాడు, ఉదాసీనుడు బోద్ధ అని అర్థము. 'సాక్షిత్వము సాక్ష్యనిరూప్యముకదా కర్తృత్వాదు లెటులు లేవు?' అని అనుసెడల ఆ సాక్ష్యము కల్పితముగాన మిథ్య. నిమిత్తము లేనియెడల నైమిత్తికమును పోవుగాన సాక్ష్య మెటులు మిథ్యయో సాక్షిత్వముగూడ అటులు మిథ్య యని యెంచునది.

♦ 'కూటస్థః కేవల చిన్మాత్రః' అని పాఠాంతరము.

‡ 'సత్యపరమానందాద్వయం బ్రహ్మైవాహ మస్మి.' పా.

§ 'పరమానంద సందోహాద్వయ వాసుదేవః' అని పాఠాంతరము.

మానందం బ్రహ్మ' 'అయ మాత్మా బ్రహ్మ' ఇత్యాది శ్రుతిభ్యః । ఇతి పఞ్చీకరణమ్ భవతి.¶ ౮

తాత్పర్యము.

నేనాత్మను సాక్షిని కేవలుడను చిన్మాత్రస్వరూపుడను. కాని మరి అజ్ఞానము కాను, అజ్ఞానకార్యము కాను. ఇక నిత్యుడను శుద్ధుడను బుద్ధుడను సత్యస్వభావుడను పరమానందాద్వయుడను ప్రత్యగాత్మను అగు నేను బ్రహ్మమనే యని యునికి సమాధి — 'నీవు బ్రహ్మమవు' 'నేను బ్రహ్మమను' 'బ్రహ్మము ప్రజ్ఞానము, ఆనందము' 'ఈ యాత్మ బ్రహ్మము' అని ఈ మొదలగు శ్రుతులు 'నేను బ్రహ్మమ'నని అభేదముగా నుండుటలో ప్రమాణము. ఇది పఞ్చీకరణము. ౮

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యస్య
శ్రీ గోవింద భగవత్పూజ్యపాదశిష్యస్య
శ్రీమచ్ఛంకర భగవతః కృతౌ
పఞ్చీకరణమ్ సమాప్తమ్.

---

¶ 'సమాధి' రిత్యస్యానంతరం — 'అయ మాత్మా బ్రహ్మ' ఇత్యాది శ్రుతిభ్యః । జాయతేఽస్తి విపరిణమతే వివర్ధతేఽపక్షీయతే వినశ్యతీతి షడ్భావవికారాః । అశనాయా పిపాసా శోక మోహ జరా మరణాని షడూర్మయః । అస్తి నాస్తి నాస్తీత్యేతా శ్చతుష్కోటయో హేయాజ్ఞేయా పాపాఖ్యాపి చతుష్కోట్యన్తరమ్ । ఆత్మనానాత్మా నోపాదీయతే న త్యజ్యతే స్వాత్మ విక్రియావరోధాత్ । అనాత్మ నాత్మా నోపాదీయతే న త్యజ్యతే, అద్వయత్వా దాత్మనః । ఆత్మనా వాస్య దనాత్మా నోపాదీయతే న త్యజ్యతే అక్రియత్వా దాత్మన ఇతి.

ఇతి పఞ్చీకృతమ్ సమాప్తమ్.

ఇతి తంజనగరభాండాగారస్థ పుస్తకపాఠః.

# పఞ్చీకరణ వార్తికమ్

## శ్రీ సురేశ్వరాచార్య కృతమ్

ఓంకారః సర్వవేదానాం సారస్తత్త్వ ప్రకాశకః
తేన చిత్త సమాధానం ముముక్షూణాం ప్రకాశ్యతే. ౧

ఆసీదేకం పరం బ్రహ్మ నిత్యముక్త మవిక్రియమ్
తత్స్వమాయా సమావేశా ద్బీజ మవ్యాకృతాత్మకమ్. ౨

తస్మా దాకాశ ముత్పన్నం శబ్ద తన్మాత్ర రూపకమ్
స్పర్శాత్మక స్తతో వాయుః తేజోరూపాత్మకం తతః. ౩

ఆపో రసాత్మికా స్తస్మా త్తాభ్యో గన్ధాత్మికా మహీ
శబ్దైక గుణ మాకాశం శబ్ద స్పర్శ గుణో మరుత్. ౪

శబ్ద స్పర్శ రూప గుణై స్త్రిగుణం తేజ ఉచ్యతే
శబ్ద స్పర్శ రూప రసై ర్గుణై రాప శ్చతుర్గుణాః. ౫

## పంచీకరణ వార్తిక తాత్పర్యము

తత్త్వమును వెలుగొందించు ఓంకారము వేదసారముకావున ముముక్షు
ల కట్టి ఓంకారమునందు చిత్తసమాధి తెలుపబడుచున్నది. ౧

మొమ్మొదట నిత్యముక్తమును నిర్వికారమును అగు బ్రహ్మమే
ండెను. అది తన మాయతో గూడి అవ్యాకృత మనబడు జగద్బీజ
మాయెను. ౨

దాన శబ్ద తన్మాత్రమగు ఆకాశము, దాన స్పర్శ తన్మాత్ర మగు
ాయువు, దాన రూపతన్మాత్రమగు తేజము, దాన రసతన్మాత్రమగు
లము, దాన గంధతన్మాత్రమగు భూమియు పొడమెను. ఆకాశమున
బ్ద మొకటియు, వాయువున శబ్దస్పర్శములును, తేజమున శబ్దస్పర్శ రూపము

శబ్ద స్పర్శ రూప రస గన్ధైః పఞ్చగుణా మహీ
తేభ్యః సమభవత్సూత్రం లిఙ్గం సర్వాత్మకం మహత్. ౬

తతః స్థూలాని భూతాని పఞ్చ తేభ్యో విరాడభూత్
పఞ్చీకృతాని భూతాని స్థూలానీత్యుచ్యతే బుధైః. ౭

పృథివ్యాదీని భూతాని ప్రత్యేకం విభజేద్ ద్విధా
ఏకైకం భాగమాదాయ చతుర్ధా విభజేత్పునః. ౮

ఏకైకం భాగమేకస్మిన్భూతే సంవేశయే త్క్రమాత్
తతశ్చాకాశభూతస్య భాగాః పఞ్చ భవన్తి హి. ౯

లును, జలమున శబ్ద స్పర్శ రూప రసములును, భూమిని శబ్ద స్పర్శ రూప రస గంధములను గుణములును గలవు. ఆకసము మొదలగు పంచతన్మాత్రల వలన ప్రపంచమునకెల్ల ఆత్మయు సర్వలింగాత్మకమును అగు సూక్ష్మ శరీరము లేక సూత్రము పొడమెను. ౩ – ౬

సూత్రమని చెప్పబడు లింగ ముపాధిగాగల బ్రహ్మమువలన అయిదు స్థూలభూతములు పొడమి వానివలన విరాడ్రూపమగు బ్రహ్మాండ మేర్పడెను. పంచతన్మాత్రలు పంచీకృతములై స్థూలభూతములు నాబడును. (పంచీకృతములును వెనుకచెప్పబడిన పంచతన్మాత్రల తామసాంశములే స్థూలభూతములుగాని తదతిరిక్తములుకావు.) ౭

పుడమి మొదలగు సూక్ష్మభూతములను విడివిడిగా నొక్కొక్కదాని రెండేసి చెక్కలొనర్చి ఒక అయిదు సగపాళ్ళ నటుంచి మిగిలిన సగపాళ్ళను నాలుగేసి తునియలు చేయునది. ౮

ఒక్కొక్కభూతపు సాబాలి నాలుగు తునియలను వరుసగా ఒక్కొక్క భూతమునందు కలుపుచు బోయిన స్థూల భూత మేర్పడును. కాగా ఆకాశభూతమున అయిదుభాగము లేర్పడును. ౯

వాయ్వాదిభాగా శ్చత్వారో వాయ్వాదిష్వేవమాదిశేత్
పఞ్చీకరణ మేతత్స్యా దిత్యాహు స్తత్త్వవేదినః. ౧౦

పఞ్చీకృతాని భూతాని తత్కార్యంచ విరాడభూత్
స్థూలం శరీర మేతత్స్యా దశరీరస్య చాత్మనః. ౧౧

అధిదైవత మధ్యాత్మ మధి భూతమితి త్రిధా
ఏకంబ్రహ్మ విభాగేన భ్రమాద్భాతి న తత్త్వతః. ౧౨

ఇన్ద్రియై రర్థవిజ్ఞానం దేవతానుగ్రహాన్వితైః
శబ్దాదివిషయం జ్ఞానం తజ్జాగరిత ముచ్యతే. ౧౩

వాయువు మొదలగు భూతములందును ఇతర భూతాంశములను కలిపిన యెడల స్థూలభూతము లయి దేర్పడును. తత్త్వవేత్తలు దీనినే పంచీకరణ మని చెప్పుదురు. ౧౦

పంచీకృతములైన భూతములును వానికార్యమగు ప్రపంచమును విరాట్టని చెప్పబడును. శరీరము లేని ఆత్మకు ఈ విరాడ్రూపమే స్థూలశరీరము అని పేరుకొనబడును. ౧౧

అధిదైవతము అధ్యాత్మము అధిభూతము అని భ్రాంతి గొలుపుచు సజాతీయ విజాతీయ స్వగత భేద రహితమగు బ్రహ్మ మొకటియే ముత్తెరగుల గానుపించు గాని అది నిక్కువము కాదు. ౧౨

దేవతానుగ్రహము గల యింద్రియములచే శబ్దాదులగు విషయములయు అర్థములయు ఎరుక జాగ్రదవస్థ. (బాహ్యాంతఃకరణ కరణకమును శబ్దాదివిషయకమును అగు జ్ఞానము జాగరితము.) ౧౩

శ్రోత్ర మధ్యాత్మ మిత్యుక్తం శ్రోతవ్యం శబ్దలక్షణమ్
అధిభూతం తదిత్యుక్తం దిశ స్తత్రాధిదైవతమ్. ౧౪

త్వగధ్యాత్మ మితి ప్రోక్తం స్ప్రష్టవ్యం స్పర్శలక్షణమ్
అధిభూతం తదిత్యుక్తం వాయు స్తత్రాధిదైవతమ్. ౧౫

చక్షురధ్యాత్మ మిత్యుక్తం ద్రష్టవ్యం రూపలక్షణమ్
అధిభూతం తదిత్యుక్త మాదిత్యోఽత్రాధిదైవతమ్. ౧౬

జిహ్వాధ్యాత్మం తయాస్వాద్య మధిభూతం రసాత్మకమ్
వరుణో దేవతా తత్ర జిహ్వాయా మధిదైవతమ్. ౧౭

శ్రోత్ర మధ్యాత్మము§ (శబ్దము శబ్దార్థమును అగు) శ్రోతవ్య మధిభూతము♦ దిక్కు లధిదైవతము.* ౧౪

మేను అధ్యాత్మము, స్ప్రష్టవ్యము లేక తాకదగినది (స్పర్శగల వస్తువులును స్పర్శమును) అధిభూతము, వాయువు అధిదైవతము. ౧౫

కన్ను అధ్యాత్మము, కాంచదగినది అధిభూతము, సూర్యు డధిదైవతము. ౧౬

నాలుక అధ్యాత్మము, ఆస్వాదింపదగినది అధిభూతము, వరుణుడు అధిదైవతము. ౧౭

---

§ 'ఆత్మని అధ్యాత్మమ్'. ఆత్మ=ఆత్మగా అభిమానింపబడు దేహము లేక స్థూలశరీరము. సంయోగముగాని తాదాత్మ్యముగాని ఆధారాధేయభావమును నియమించు సంబంధము.

♦ 'దేవతాసు అధిదైవతమ్' విభక్త్యర్థే అవ్యయీభావః.

* ('భూతేషు అధిభూతమ్') భూతము లనగా ఆకాశాదులు. దిక్కు లనగా పది దిక్కులను అభిమానించు ఒకానొక జీవుడు అని తాత్పర్యము. ఇటులే ముందుముందును గ్రహించునది.

ఘ్రాణ మధ్యాత్మ మిత్యుక్తం ఘ్రాతవ్యం గన్ధలక్షణమ్
అధిభూతం తదిత్యుక్తం అశ్వినా వధిదైవతమ్. ౧౮

వాగధ్యాత్మ మితి ప్రోక్తం వక్తవ్యం శబ్దలక్షణమ్
అధిభూతం తదిత్యుక్త మగ్ని స్తత్రాధిదైవతమ్. ౧౯

హస్తావధ్యాత్మ మిత్యుక్త మాదాతవ్యం చ యద్భవేత్
అధిభూతం తదిత్యుక్త మిన్ద్ర స్తత్రాధిదైవతమ్. ౨౦

పాదావధ్యాత్మ మిత్యుక్తం గన్తవ్యం తత్ర యద్భవేత్
అధిభూతం తదిత్యుక్తం మృత్యు స్తత్రాధిదైవతమ్. ౨౧

పాయు రిన్ద్రియ మధ్యాత్మం నిసర్గ స్తత్ర యో భవేత్
అధిభూతం తదిత్యుక్తం మృత్యు స్తత్రాధిదైవతమ్. ౨౨

ముక్కు అధ్యాత్మము, మూచూడదగినది అధిభూతము, అశ్వినులు అధిదైవతములు. ౧౮

పలుకు అధ్యాత్మము, పలుకదగినది అధిభూతము, అగ్ని అధిదైవతము. ౧౯

చేతులు అధ్యాత్మము, చేకొనదగినది ఈయదగినది అధిభూతము, ఇంద్రుడు అధిదైవతము. ౨౦

పాదము అధ్యాత్మము, రాదగినదియు పోదగినదియు అధిభూతము, విష్ణు వధిదైవతము. ౨౧

పాయువు అధ్యాత్మము, విసర్జనీయము అధిభూతము, మృత్యువు అధిదైవతము. ౨౨

ఉపస్థేన్ద్రియ మధ్యాత్మం *స్త్రియాద్యానన్దకారణమ్
అధిభూతం తదిత్యుక్త మధిదైవం ప్రజాపతిః. ౨౩

మనోఽధ్యాత్మ మితి ప్రోక్తం మన్తవ్యం తత్ర యద్భవేత్
అధిభూతం తదిత్యుక్తం చన్ద్రస్తత్రాధిదైవతమ్. ౨౪

బుద్ధి రధ్యాత్మ మిత్యుక్తం బోద్ధవ్యం తత్ర యద్భవేత్
అధిభూతం తదిత్యుక్త మధిదైవం బృహస్పతిః. ౨౫

అహంకార స్తథాధ్యాత్మ మహం కర్తవ్యమేవ యత్
అధిభూతం తదిత్యుక్తం రుద్రస్తత్రాధిదైవతమ్. ౨౬

చిత్త మధ్యాత్మ మిత్యుక్తం చేతవ్యం తత్ర యద్భవేత్
అధిభూతం తదిత్యుక్తం క్షేత్రజ్ఞోఽత్రాధిదైవతమ్. ౨౭

మూత్రము విడుచు అవయవము అధ్యాత్మము, స్త్రీ పురుషులకు సుఖము కలిగించు విస్పృష్టి అధిభూతము, ప్రజాపతి అధిదైవతము. ౨౩

మనస్సు అధ్యాత్మము, మనన మొనరింపదగినది అధిభూతము, చంద్రుడు అధిదైవతము. ౨౪

బుద్ధి అధ్యాత్మము, బోద్ధవ్యము అధిభూతము, బృహస్పతి అధిదైవతము. ౨౫

అహంకార మధ్యాత్మము, నేనని అభిమానింపదగినది (స్థూలశరీరము) అధిభూతము, రుద్రు డధిదైవతము. ౨౬

చిత్త మధ్యాత్మము, చేతవ్య మధిభూతము, క్షేత్రజ్ఞుడు (క్షేత్రమనగా మేను. దాని నెరుగువాడు క్షేత్రజ్ఞుడు) అనగా ప్రత్యగాత్మ అధిదైవతము. తమస్సు అధ్యాత్మము, వికార మధిభూతము, ఈశ్వరు డధిదైవతము. (తమస్సు = అజ్ఞానము. అధ్యాత్మము = శుద్ధచైతన్యము. వికారము=భూత

* 'స్త్ర్యాద్యానందకారణమ్' ఇతి పాఠే గణభంగః । 'స్త్రియాద్యానందకారణ' మితి పాఠే ఇయజ అప్రాప్తిః । 'స్త్ర్యాదికానందకారణమ్' ఇతి పాఠోఽస్తి వా?

తమోఽధ్యాత్మ మితి ప్రోక్తం వికార స్త్రయో భవేత్
అధిభూతం తదిత్యుక్త మీశ్వరోఽత్రాధిదైవతమ్. ౨౮

బాహ్యా స్తైః కరణై రేవం దేవతానుగ్రహాన్వితైః
స్వం స్వం చ విషయజ్ఞానం తజ్జాగరిత ముచ్యతే. ౨౯

యే యం జాగరితావస్థా శరీరం కరణాశ్రయమ్
య స్తయో రభిమానీ స్యా ద్విశ్వ ఇత్యభిధీయతే. ౩౦

విశ్వం వైరాజరూపేణ పశ్యే ద్భేద నివృత్తయే
జ్ఞానేన్ద్రియాణి పఞ్చైవ పఞ్చ కర్మేన్ద్రియాణ్యపి. ౩౧

శ్రోత్రం త్వఙ్నయనం జిహ్వా ఘ్రాణం చేన్ద్రియ పఞ్చకమ్
వాక్పాణి పాద పాయూపస్థాః కర్మేన్ద్రియ పఞ్చకమ్ ౩౨

మనో బుద్ధి రహంకార శ్చిత్తం చేతి చతుష్టయమ్
సంకల్పాఖ్యం మనోరూపం బుద్ధి ర్నిశ్చయరూపిణీ. ౩౩

భౌతికరూపము). తమతమ అధిష్ఠానదేవతల యనుగ్రహముతో గూడిన బాహ్యేంద్రియములచేతను అంతరింద్రియములచేతను ఆయాయా విషయముల యెఱుక కలుగుట జాగ్రదవస్థ. ౨౭ - ౨౯

ఈ జాగ్రదవస్థను, జాగ్రదవస్థకు కారణమైన ఇంద్రియాదుల కాశ్రయమగు శరీరమును అభిమానించువాడు విశ్వుడు. ౩౦

భేదము పోవుటకు విశ్వుని విరాడ్రూపునిగా తలచునది. జ్ఞానేంద్రియము లయిదు. మఱి కర్మేంద్రియము లయిదు. చెవి మెయి కన్ను ముక్కు నాలుక అనబడు నీ యయిదును జ్ఞానేంద్రియములు. పలుకు కాలు కేలు వాయువు గుహ్యము అనబడు నీ యయిదును కర్మేంద్రియములు. ౩౧-౩౨

మనస్సు బుద్ధి అహంకారము చిత్తము అను నివి నాలుగు. ఈ నాలుగింటిలో తలపోయునది మనస్సు, నిశ్చయించునది బుద్ధి, అభిమానాత్మక మహంకారము, అనుసంధించునది చిత్తము. ౩౩ - ౩౪

అభిమానాత్మక స్తద్వ దహంకారః ప్రకీర్తితః
అనుసంధాన రూపం చ చిత్త మిత్యభిధీయతే. ౩౪

ప్రాణోఽపాన స్తథా వ్యాన ఉదానాఖ్య స్తథైవచ
సమానశ్చేతి పఞ్చైతాః కీర్తితాః ప్రాణవృత్తయః. ౩౫

ఖ వాయ్వగ్న్యమ్బుక్షితయో భూతసూక్ష్మాణి పఞ్చచ
అవిద్యా కామకర్మాణి లిఙ్గం పుర్యష్టకం విదుః. ౩౬

ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అనబడు నివి ప్రాణవ్యాపారములు లేక వృత్తులు. ౩౫

ఆకాశము వాయువు అగ్ని జలము భూమి అనబడు నివి భూతసూక్ష్మములు లేక తన్మాత్రములు. ఇవి♦ అవిద్య కామము కర్మము అను వానితో కలిసి లింగశరీరము లేక పుర్యష్టక* మనియు చెప్పబడును. ౩౬

---

♦ ఇంద్రియములకును మనస్సునకును ప్రాణములకును కారణమగు భూతములును లింగశరీరమునం దంతర్భూతములు.

* పురివంటిది అనగా భోగమునకు సాధనము, జ్ఞానేంద్రియములు ఒకటవపురి. కర్మేంద్రియములు 2 వ పురి. ప్రాణాది పంచకము 3 వ పురి. మనో బుద్ధి చిత్తాహంకారములు 4 వ పురి. భూతసూక్ష్మములు 5 వ పురి, అవిద్య 6 వ పురి. అవిద్య = వెనువెనుకటిభ్రమవలన కలిగి వాసనారూపముగా నెలకొనిన బుద్ధ్యాత్మల తాదాత్మ్యాధ్యాస. కామము ఇచ్ఛావిశేషము. ఇది 7 వ పురి. కర్మలు పూర్వజన్మములందలివి. ఇవి 8 వ పురి.

ఇంద్రియములు పదియు, ప్రాణములు భూతములు పదియు, అంతఃకరణాదులు నాలుగును, అవిద్యా కామక్రోధములు మూడును చేరసి ఇరువదొకటి యగుగాని పదియేడనుట ఎటులు? 'సప్తదశక మనునది కార్యవిశేషణము అనినయెడల అపుడు భూతములు వెలియై ఇరువది రెండని అనవలయును గదా!' అని యనినచో నిక్కమేకాని అంతఃకరణాదులు నాలుగును, కామమును మనోవృత్తిరూపమగుటచేతను అవిద్యాకర్మలు బుద్ధ్యాశ్రితము

ఏతత్సూక్ష్మశరీరం స్యాన్మాయికం ప్రత్యగాత్మనః
కరణోపరమే జాగ్రత్సంస్కారోత్థ ప్రబోధవత్. ౩౭

గ్రాహ్య గ్రాహకరూపేణ స్ఫురణం స్వప్న ఉచ్యతే
అభిమానీ తయోర్యస్తు తైజసః పరికీర్తితః. ౩౮

హిరణ్యగర్భరూపేణ తైజసం చిన్తయే ద్బుధః
చైతన్యాభాస కథితం శరీరద్వయ కారణమ్, ౩౯

ఆత్మాజ్ఞానం తదవ్యక్త మవ్యాకృత మితీర్యతే
న సన్నాసన్న సదస ద్భిన్నాభిన్నం న చాత్మనః. ౪౦

మాయవలన కలిగిన యీ లింగశరీరమే ప్రత్యగాత్మకు సూక్ష్మశరీరము ఇంద్రియములు అలసి ఊరకయున్నపుడు జాగ్రదవస్థయం దోదవిన సంస్కారముచే పుట్టిన యెరుకవలె నుండునదియు ఎరుగబడునదియు ఎరుగునదియుగా స్ఫురించుట స్వప్నావస్థ.* ఈ స్వప్నావస్థ, సూక్ష్మశరీరము - నేనని అనుకొనువాడు తైజసుడని చెప్పబడును. తైజసుని హిరణ్యగర్భరూపమున చింతించునది. ౩౭-౩౮

చిదాభాసునితో ఖచితమై పెద్దమేనికి కురుచమేనికి కారణమై ఆత్మనాశ్రయించిన అజ్ఞానము అవ్యాకృత మని చెప్పబడును. అది ఉనికి

---

లగుటచేతను బుద్ధిగతైకత్వమును ఆశ్రయించి పదియేడని గ్రహింపవలెను. శ్రీ శంకర భగవత్పాదులు ఆత్మబోధనమున—

'పఞ్చప్రాణ మనో బుద్ధి దశేంద్రియ సమన్వితమ్
అపఞ్చీకృత భూతోత్థం సూక్ష్మాఙ్గం భోగసాధనమ్'

అని చెప్పిరి. కరణరూపమగు మనో బుద్ధి చిత్తాహంకారవృత్తికల మనసుకంటె బుద్ధితత్త్వమును కర్తృరూపముగా తత్త్వాంతరమని అరయునది.

---

* కర్తృ కరణ ల్యుడంత గ్రాహ్య గ్రాహక శబ్దద్వయమున కేకశేషము చేసి పిదప ద్వంద్వము చేయునది. ప్రమాతృ ప్రమాణ ప్రమేయ త్రితయ రూపముగా స్ఫురించునది స్వప్నము అని అర్థము.

న సభాగం న నిర్భాగం న చాప్యుభయ రూపకమ్
బ్రహ్మాత్మైకత్వ విజ్ఞాన హేయం మిథ్యాత్మకారణాత్. ౪౧

జ్ఞానానా ముపసంహారో బుద్ధేః కారణతః స్థితిః
వటబీజే వటస్యేవ సుషుప్తి రభిధీయతే. ౪౨

అభిమానీ తయోర్యస్తు ప్రాజ్ఞ ఇత్యభిధీయతే
జగత్కారణరూపేణ ప్రాజ్ఞాత్మానం విచిన్తయేత్. ౪౩

విశ్వతైజస సౌషుప్త విరాట్సూత్రాక్షరాత్మభిః
విభిన్నమివ సన్మోహా దేకం సత్యం చిదాత్మకమ్. ౪౪

గాదు, ఉత్తది కాదు, ఉనికియు ఉత్తదియు గాదు♦ అది వేరు కాదు, కాకయుఁపోదు, ఈరెండును అనియు చెప్పరాదు. ౩౯-౪౦

అది భాగముతో గూడినది కాదు, భాగముతో కూడనిది కాదు, ఈ రెండును గాదు. మిథ్యారూపమగుటచేసి ఆత్మయు (తానును) బ్రహ్మమును ఒకటి యను ఎరుకచే పోఁజూడదగినది. ౪౧

కల మెలకువలలోని యెరుకల నన్నిటిని బాసి బుద్ధి తనకు కారణమగు అజ్ఞానమునందు మఱ్ఱివిత్తులో మఱ్ఱిచెట్టువలె నెలకొనియుండుట సుషుప్తి. ౪౨

ఈ రెంటి నభిమానించువానిని ప్రాజ్ఞు డని యందురు. ఇతనిని జగత్కారణ మగు ఈశ్వరునిగా తలచునది. ౪౩

చైతన్య మొక్కటియె యయినను మోహావశమున విశ్వతైజస ప్రాజ్ఞ విరాడ్ఢిరణ్యగర్భేశ్వర రూపములచే వేరుగా కానిపించును. ౪౪

---

♦ ఉనికి (సత్తు) = అబాధ్యత్వము. అజ్ఞానము అబాధ్యము కాదు. శ్రుతి స్మృతి పురాణము లజ్ఞానము బాధ్య మని చెప్పును. కాన సత్తుకాదు. ఇది ఉత్తది కాదన వీలుకాదు. ఏలన 'నే నజ్ఞుడను' అను ప్రతీతి ఉన్నదికదా! కావున అసత్తును అనగా ఉత్తదియు కాదు. కావుననే సదసద్రూపమును గాదు.

విశ్వాదికం త్రయం యస్మా ద్వైరాజాది త్రయాత్మకమ్
ఏకత్వేనైవ సంపశ్యే దన్యాభావ ప్రసిద్ధయే. ౪౫

ఓంకారమాత్ర మఖిలం విశ్వప్రాజ్ఞాది లక్షణమ్
వాచ్య వాచకతాభేదా ద్భేదేనా నుపలబ్ధితః. ౪౬

అకారమాత్రం విశ్వః స్యా దుకార స్తైజసః స్మృతః
ప్రాజ్ఞో మకార ఇత్యేవం పరిపశ్యే త్క్రమేణ తు. ౪౭

సమాధికాలా త్ప్రాగేవం విచిన్త్యాతి ప్రయత్నతః
స్థూల సూక్ష్మ క్రమాత్సర్వం చిదాత్మని విలాపయేత్. ౪౮

అకారం పురుషం విశ్వ ముకారే ప్రవిలాపయేత్
ఉకారం తైజసం సూక్ష్మం మకారే ప్రవిలాపయేత్. ౪౯

మకారం కారణం ప్రాజ్ఞం చిదాత్మని విలాపయేత్
చిదాత్మాహం నిత్య శుద్ధ బుద్ధ ముక్త సదద్వయః. ౫౦

భేదజ్ఞానము పోవుటకు విశ్వాదులగు మూగురను వైరాజాదులగు మూగురను ఒకనిగా తలచునది. ౪౫

నామరూపమాత్రభేదమే కాని, మరేమియు భేదము లేమి విశ్వుడాదిగా ఎల్లయు ఓంకారమాత్రమే. ౪౬

విశ్వుని అకారమనియు తైజసుని ఉకారమనియు ప్రాజ్ఞుని మకారమనియు భావించునది. ౪౭

సమాధి కలుగుటకు మున్నిటులు ధ్యానించి ధ్యానించి స్థూల సూక్ష్మ కారణక్రమముగా సర్వమును చిదాత్మయందు లయింపచేయునది. ౪౮

అది యిటులు : అకారమును విరాట్పురుషుని విశ్వుని స్థూలమును జాగ్రదవస్థను ఉకారమునందును, ఉకారమును తైజసుని సూక్ష్మశరీరమును స్వప్నావస్థను మకారమునందును, మకారమును కారణశరీరమును సుషుప్త్యవస్థను ప్రాజ్ఞుని 'నేను చిద్రూపుడను నిత్యుడను శుద్ధుడను బుద్ధుడను ముక్తు

పరమానన్ద సందోహో వాసుదేవోఽహ మోమితి
జ్ఞాత్వా వివేచకం చిత్తం తత్సాక్షిణి విలాపయేత్. ॥౧

చిదాత్మని విలీనం చ తచ్చిత్తం న విచాలయేత్
పూర్ణబోధాత్మనాసీత పూర్ణాచల సముద్రవత్. ॥౨

ఏవం సమాహితో యోగీ శ్రద్ధా భక్తి సమన్వితః
జితేన్ద్రియో జితక్రోధః పశ్యే దాత్మాన మద్వయమ్. ॥౩

ఆదిమధ్యావసానేషు దుఃఖం సర్వమిదం యతః
తస్మాత్సర్వం పరిత్యజ్య తత్త్వనిష్ఠో భవే త్సదా. ॥౪

యః పశ్యే త్సర్వగం శాన్త మానన్దాత్మాన మద్వయమ్
న తేన కించి దాప్తవ్యం జ్ఞాతవ్యం వావశిష్యతే. ॥౫

కృతకృత్యో భవేద్విద్వా జ్జీవన్ముక్తో భవేత్సదా
ఆత్మన్యారూఢ భావస్తు జగదేత న్నవీక్షతే. ॥౬

డను సదసద్వ్యయుడను' అని తెలిసి ఏతద్ వివేచకమగు చిత్తమును దానికి సాక్షియగు చైతన్యమునందు లయింపజేయునది. ౪౯-౫౧

చిత్తము చిదాత్మలో లయ మయినయెడల దానిని బెసకనీయవలదు. అపుడు పూర్ణజ్ఞానస్వరూపముతో అలలు లేని మున్నీరివలె నుండునది. ౫౨

ఇటులు సమాధి పొందిన యోగి శ్రద్ధాభక్తులతో ఇంద్రియములను కోపమును జయించి తన్నద్వయునిగా వరయునది. ౫౩

ఈ ప్రపంచ మంతయు ఆది మధ్యావసానములందు దుఃఖరూప మగుటచే పరిత్యజించి ఆత్మనిష్ఠ నొందునది. ౫౪

ఎవడు తన్ను వ్యాపకునిగను శాంతునిగను ఆనందముగను కేవలునిగను జూచునో వానికి వలయునదిగాని తెలియవలయునదిగాని మిగులదు. ౫౫

తెలిసినవాడు చేయవలసిన పనిని చేసినవాడై జీవన్ముక్తు డగును. ఆత్మారూఢు డీజగతిని కనడు. ౫౬

కదా చిద్వ్యవహారేషు ద్వైతం యద్యపి పశ్యతి
బోధాత్మా వ్యతిరేకేణ న పశ్యతి చిదన్వయాత్. ౫౭

కిం తు పశ్యతి మిథ్యైవ దిఙ్మోహేన్దు విభాగవత్
ప్రతిభాసః శరీరస్య తదా ప్రారబ్ధ సంక్షయాత్. ౫౮

తస్య తావదేవ చిర మిత్యాది శ్రుతి రబ్రవీత్
ప్రారబ్ధస్యానువృత్తి స్తు ముక్తస్యాభాసమాత్రతః. ౫౯

సర్వదా ముక్త ఏవ స్యాత్ జ్ఞాతతత్త్వః పుమానసౌ
ప్రారబ్ధ భోగశేషస్య సంక్షయే తదనన్తరమ్. ౬౦

అతడు వ్యవహరించునపుడు ద్వైతమును కనుగాక, అన్నిటను చైతన్య మంటియుండు టెరిగి ఆ ద్వైతమును జ్ఞానరూపము నగు ఆత్మకంటె వేరగు దానిగా గనడు. ౫౭

ఇక నెటులు గాంచుననిన దిగ్భ్రాంతివలెను (తూర్పు చూచి పడమర అని అనుకొనుట) చంద్రభేదమువలెను (ఒకే చంద్రుని ఇరువురు చంద్రులనుగా గాంచుట) మిథ్యగా (ఎరిగిన ఆప్తుడు ఇది తూర్పుగాని పడమర గాదని చెప్పగా మిథ్యగా గ్రహించినటులును, 'నీ కన్ను చెదరినది ఒకే ఒక చంద్రు డిరువురుగా నీకు కనబడుచున్నా'రని ఆప్తుడు చెప్పినపిదప మిథ్యగా తలచినటులును) తలచును. అపుడు ప్రారబ్ధ ముండుటవలన ప్రతిభాస శరీర ముండును. (అజ్ఞానమునకు ఆవరణ విక్షేప ప్రతిభాస నాశములని త్రివిధ నాశము లున్నవి. ఆత్మ పరోక్షము కామి ఆవరణవిక్షేపనాశములు కలిగినను ప్రారబ్ధ మున్నంతమేరకు ప్రతిభాసనాశము కలుగమి అజ్ఞానకార్యమగు శరీరాది ప్రతిభాసము ఉండును.) ౫౮

ప్రారబ్ధము నశించునంతవరకును జీవన్ముక్తునకు ప్రతిభాస శరీర ముండును. 'ప్రారబ్ధము నశించునంతవట్టె జీవన్ముక్తునకు విలంబము. ప్రారబ్ధ నాశ సమకాలముననే అతనికి విదేహకైవల్య మని శ్రుతి చెప్పెను. తత్త్వ మెరిగినవా డెపుడును ముక్తుడే. అతనికి ప్రారబ్ధానువృత్తి ఆభాసమాత్రము. ప్రారబ్ధశేషానుభవము పూర్తియయినంతట అవిద్యా తిమిరమున కావలి

అవిద్యా తిమిరాతీతం సర్వాభాస వివర్జితమ్
ఆనన్ద మమలం శుద్ధం మనోవాచా మగోచరమ్. ౬౧

వాచ్య వాచక నిర్ముక్తం హేయోపాదేయ వర్జితమ్
ప్రజ్ఞాన ఘన మానన్దం వైష్ణవం పదమశ్నుతే. ౬౨

ఇదం ప్రకరణం యత్నాత్ జ్ఞాతవ్యం భగవత్తమైః
అమానిత్వాది నియమైః గురుభక్తి ప్రసాదతః. ౬౩

ఇమాం విద్యాం ప్రయత్నేన యోగీ సన్ధ్యాసు సర్వదా
స మభ్యసే దిహాముత్ర భోగానాసక్త ధీః సుధీః. ౬౪

ఇతి శ్రీ సురేశ్వరాచార్యకృతం పఞ్చీకరణవార్తికమ్
సంపూర్ణమ్.

దియు, సర్వాభాస వివర్జితమును (శరీరాదులు లేనిదియును) మల రహితమును పరిశుద్ధమును మనస్సునకును వాక్కునకును గోచరింపనిదియు శబ్దమును అర్థమును లేనిదియును (నామముగాని రూపముగాని లేనిది అనగా అద్వితీయ మని తాత్పర్యము) హేయత్వోపాదేయత్వములు లేనిదియును (ఉపదేశసాహస్రి చివరభాగము చూచునది) ప్రజ్ఞాన ఘనమును ఆనంద ఘనమును (ఎరుక ముద్ద, ఆనందపుముద్ద అనగా ఎడతెరపిలేని ఎరుకయు ఆనందము అని తాత్పర్యము) వ్యాపకమును (అవిచ్ఛిన్నము) అగు బ్రహ్మస్వరూపము నొందుచున్నాడు. ౬౨

అమానిత్వ మదంభిత్వము మొదలగు నియమములు కల భగవత్తములగు ముముక్షువులచే గురుభక్తి సంపాదిత గురుప్రసాదము వలన ఈ ప్రకరణమును ప్రయత్నించి తెలిసికొనునది. ఇహాముత్ర ఫల భోగములం దనాసక్తుడగు యోగి సంధ్యలయం దెల్లపుడును ఈ విద్య నభ్యసించునది. ౬౩,౬౪

ఇది శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య
సురేశ్వరాచార్య విరచిత పఞ్చీకరణ వార్తికమునకు
తెలుగు తాత్పర్యము సమాప్తము.



# పఞ్చీకరణము

[ "పఞ్చీకరణమ్ అను పేరితో తెలిగింపబడిన యీ దిగువ గ్రంథమునకు మూలమగు సంస్కృతగ్రంథము తంజావూరి శరభోజీ నగరి గ్రంథాగారమున గలదు." అని శ్రీరంగమున వాణీవిలాస ముద్రాయంత్రమున అచ్చుపడిన గ్రంథమున ఉన్నది. ]

తన్ను దా నెరుగగోరువానికి 'త్వం'-పదార్థమును వివేచించుకొన ఇరువదినాలుగు తత్త్వము లెటులు పుట్టెనో చెప్పుచున్నాము. త్రిగుణాత్మకమగు అజ్ఞానము బ్రహ్మము నాశ్రయించుకొని యున్నది. దానినుండి ఆకాశము మొదలగు సూక్ష్మభూతములు పుట్టుచున్నవి. వానినుండి శ్రోత్రము మొదలగు ఇరువదొక్క-తత్త్వములు పుట్టినవి.

పంచీకృతములగు స్థూలభూతములనుండి విషయములు పుట్టెను. ఎటులు? ఆకాశసాత్త్వికభాగమునుండి శ్రోత్రము, వాయుసాత్త్వికభాగమునుండి త్వగింద్రియము, అగ్ని సాత్త్వికభాగమునుండి కన్ను, జలసాత్త్వికభాగమునుండి జిహ్వ, భూసాత్త్వికభాగమునుండి ముక్కు-ను పుట్టెను. ఇవి జ్ఞానేంద్రియములు — 'శ్రోత్ర మాకాశే వాయౌ త్వగగ్నౌ చక్షు రప్సు జిహ్వా పృథివ్యాం ఘ్రాణమ్' అని శ్రుతి చెప్పుచున్నది. ఆకాశము మొదలగు నయిదు భూతములయు సాత్త్వికాంశముల మొత్తమునుండి అంతఃకరణము పొడమెను. ఆ యంతఃకరణము మనస్సనియు బుద్ధియనియు అహంకారమనియు చిత్తమనియు నలుదెరగులు.

ఆకాశ రజోభాగమునుండి వాగింద్రియమును వాయు రజోభాగమునుండి పాణీంద్రియమును అగ్నిరజోభాగమునుండి

పాదేంద్రియమును, జల రజోభాగమునుండి గుహ్యేంద్రియ మును, భూ రజోభాగమునుండి పాయ్వింద్రియమును పుట్టెను. ఇవి కర్మేంద్రియములు. ఆకాశాదులగు అన్నిటియు రజో భాగమునుండి ప్రాణము పొడమెను. ఆ ప్రాణము హృదయము మొదలగు స్థానముల భేదముచే అయిదు తెరగు లాయెను. హృదయమునందు ప్రాణమనియు గుదమునం దపానమనియు నాభియందు సమానమనియు కంఠమునందు ఉదానమనియు శరీరమునం దంతటను వ్యాప్తమయి యున్నది వ్యానమనియు చెప్పఁబడును. 'ప్రాణోఽపానో వ్యాన ఉదానః సమాన ఇత్యేత త్సర్వం ప్రాణ ఏవ' అని శ్రుతియు చెప్పెను.

ఆకాశాదుల తమోభాగములను దేనికి దానికి రెండు రెండుగా విభజించి ఆ రెంటిలో ఒకసాబాలును నాలుగుగా చీల్చి ఆ చీలికలను ఇతరభూతముల సాబాలులందు స్వాంశ మును విడిచిపెట్టి క్రమముగా కలుపుచువచ్చినచో ఆకాశము మొదలయిన పంచీకృతస్థూలభూతము లుత్పన్నము లగును. ఇటులు భూతము లుత్పన్నముకాగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను అయిదు విషయములు పొడమి ఆకాశాదుల యందు వరుసగా ఒకటి రెండు మూడు నాలుగు అయిదు విధములయిన గుణములు కలవిగా వేర్పడుచున్నవి. పంచీ కృతములగు భూతములవలన స్థూలశరీరము పొడమెను — 'అథాతః పృథివ్యాది మహాభూతానాం సమవాయః శరీరమ్' అని శ్రుతి.

శరీరమునందు కఠినాంశములగు ఎముకలు మాంసము వెంట్రుకలు మొదలగునవి భూమి. ద్రవాంశములగు నెత్తురు

నీరుడు మొదలగునది నీరు. ఉష్ణాంశములగు ఆకలి దప్పి నిదుర మొదలగునది అగ్ని. రాకపోకలు మొదలగునది గాలి. ఛిద్రము కామము క్రోధము మొదలగునది ఆకాశము — 'యత్ కఠినమ్ సా పృథివీ, యద్ ద్రవం తదాపః, య దుష్ణం తత్తేజః, య చ్చరతి స వాయుః, యత్ సుషిరం త దాకాశ మిత్యుచ్యతే' అని శ్రుతి. దీని కనుగుణముగా స్మృతి ఇటులు కలదు:—

అస్థి చర్మ తథా స్నాయు రోమ మాంసం తథైవ చ
పృథ్వ్యాః పఞ్చవిధా స్తజ్జ్ఞైః సమాసేన ప్రకీర్తితః.

రక్తం మూత్రం తథా శ్లేష్మా శుక్రం మేదస్తు పఞ్చమమ్
అపాం పఞ్చవిధా స్తజ్జ్ఞైః సమాసేన ప్రకీర్తితః.

క్షుత్తృష్ణా చ తథా నిద్రా ఆలస్యం రతి రేవ చ
వహ్నేః పఞ్చవిధా స్తజ్జ్ఞైః సమాసేన ప్రకీర్తితః.

ప్రచా రోత్తర ణారోహాః తథా చోత్థాన రేచనే
వాయోః పఞ్చవిధా స్తజ్జ్ఞైః సమాసేన ప్రకీర్తితః.

కామః క్రోధశ్చ లోభశ్చ మోహశ్చైవ భయం తథా
వ్యోమ్నః పఞ్చవిధా స్తజ్జ్ఞైః సమాసేన ప్రకీర్తితః.

శబ్ద స్పర్శ రూప రస గంధములు శ్రోత్రాదులగు జ్ఞానేంద్రియములకు విషయములు. వచ నాదాన గమన విసర్గానంద ములు వాగాదికర్మేంద్రియములకు విషయములు. సంకల్పము అధ్యవసాయము అభిమానము అవధారణము — ఇవి అంతఃకరణ చతుష్టయమునకు విషయములు.

చెవి మొదలగు పదునాలుగు ఇంద్రియములకు క్రమ ముగా దిగాదులు అధిపతులని యిటులు చెప్పబడెను—

దిగ్వాతార్క ప్రచేతోఽశ్వి వహ్నీంద్రో పేంద్ర మృత్యవః
తథా చంద్ర శ్చతుర్వక్త్రో రుద్రః క్షేత్రజ్ఞ ఈశ్వరః॥

చెవి మొదలగు పదునాలుగింద్రియములకు అధ్యాత్మ సంజ్ఞయు వానికి విషయములగు శబ్దాదుల కధిభూతసంజ్ఞయు ఇంద్రియాధిపతులగు దిగాదులకు అధిదైవసంజ్ఞయు చెల్లును. అవి యిటులు:—

| అధ్యాత్మము | అధిభూతము | అధిదైవము |
|---|---|---|
| చెవి | వినదగినది (శబ్దము మొ॥) | దిక్కు |
| మేను | తాకదగినది (విషయము) | గాలి |
| కన్ను | చూడదగినది | సూర్యుడు |
| వాక్కు | పలుకదగినది | అగ్ని |
| కాలు | నడవదగినది | విష్ణువు |
| పాయువు | విడువదగినది | మిత్రుడు |
| ఉపస్థము | ఆనందింపదగినది | ప్రజాపతి |
| అంతఃకరణము | నిర్వికల్పస్ఫురణము | నారాయణుడు |
| మనస్సు | మననము చేయదగినది | చంద్రుడు |
| బుద్ధి | బోద్ధవ్యము | బృహస్పతి |
| చిత్తము | చేతయితవ్యము | క్షేత్రజ్ఞుడు |
| అహంకారము | అహంకర్తవ్యము | రుద్రుడు |
| సత్త్వము | జ్ఞాతవ్యము | విష్ణువు |
| రజస్సు | వికృతిపొందదగినది | ఈశ్వరుడు |

అని యీరీతిగా అధ్యాత్మాధిభూతాధిదైవములు శ్రుతిచే చెప్పబడెను. ఇటులే మిగిలినఇంద్రియములయెడలను ఊహించుకొనునది. ఇటులు ఇరువదినాలుగు తత్త్వముల పుట్టుక. వీని కంటె పరమును కూటస్థము నగు నాత్మతత్త్వమును వివేచించి తెలిసికొనువాడు అమృతుడు కాగలడు. 'తరతి శోక మాత్మవిత్' = 'ఆత్మను తెలిసికొనువాడు శోకమును దాటును' అని శ్రుతి చెప్పెనుగదా! ఇటులు స్మృతియు చెప్పెను:—

> 'పఞ్చవింశతి తత్త్వజ్ఞో యత్ర కుత్రాశ్రమే భవేత్
> జటీ ముండీ శిఖీ వాపి ముచ్యతే నాత్ర సంశయః'

= ఇరువదియయిదు తత్త్వముల నెరిగినవాడు జడలు దాల్చిగాక, ముండనము చేసికొనుగాక, సిగ పెంచుకొనుగాక ముక్తుడగును. మరియు —

> 'క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తజ్ జ్ఞానం మతం మమ'

అని భగవద్వచనము.

పఞ్చీకరణము సమాప్తము.



# సమ్మిశ్ర పఞ్చీకరణము

ఇటుపిదప పంచీకృతములగు పంచమహాభూతములవలన శారీరోత్పత్తికొఱకు భూతముల యొండొంటి కలగలుపు చెప్పబడుచున్నది — జ్ఞాతృత్వము, వ్యానము, చెవి, వాక్కు, శబ్దము : వీనిని ఆకాశతత్త్వములనియు; మనస్సు, సమానము, మేను, చేయి, తాకు : వీనిని వాయుతత్త్వములనియు; బుద్ధి, ఉదానము, కన్ను, కాలు, రూపము : వీనిని అగ్నితత్త్వములనియు; పిత్తము, అపానము, నాలుక, గుహ్యము, రసము : వీనిని జలతత్త్వము లనియు; అహంకారము, ప్రాణము, ఘ్రాణము, గుదము, గంధము : వీనిని భూతత్త్వములనియు బ్రహ్మాదులు చెప్పుదురు. భూతము లిటులుకాగా వీనిని వేనికి వానిని రెండుగా రెండుగా విభజించి, ఒకొక సాబాలు నటుంచి, మిగులు సాబాళ్ళను నాలుగేసి భాగములుగా చీల్చునది. ఇపుడు ఆకాశము మొదలగు భూతముల సాబాలును విభజింపగా ఏర్పడిన నాలుగు భాగములను వాయ్వగ్ని జల భూముల సగపాళ్ళతో కలిపినయెడల క్రమముగా వ్యానము శ్రోత్రము వాక్కు శబ్దము : ఇవి ఏర్పడును. వాయ్వర్ధ చతుర్భాగము లాకాశాగ్ని జలభూమ్యర్ధభాగములతో కలిసి క్రమముగా బుద్ధి ఉదానము కాలు రూపము : ఇవి ఏర్పడును. జల చతుర్భాగములు ఆకాశ వాయ్వగ్ని భూమ్యర్ధభాగములతో కలసి చిత్తము అపానము నాలుక రసము : ఇవి ఏర్పడును. నేలసాబాలి నాలుగుచీలికలును ఆకాశ వాయ్వగ్ని జలార్ధభాగములతో కలసి అహంకారము ప్రాణము ఘ్రాణము అపానము : ఇవి ఏర్పడును. ఆకాశాంశము లంతఃకరణాంశము

లును ఆకాశముతోడను భూతములతోడను కలిసి, వాయ్వంశ
ములును సమానాదివాయువులును మిగులు భూతములతో
కలిసి, జ్ఞానేంద్రియములును అగ్న్యంశములును భూతములతో
కలిసి కర్మేంద్రియములును జలాంశములును భూతములతో
కలిసి భూమి విషయము లయినను మిగులు భూతములతో
కలసి ఏకైకభూత మేకైకగుణము కలదిగను ఐదేసిగుణములు
కలదిగను ఆయెను. పయిభూతము క్రిందిభూతమునకును పయి
గుణము క్రిందిదానికిని కారణము గావునను, కార్యమునందు
కారణ మనువర్తించును గావునను, స్వగుణము ప్రధానము
గను అన్యగుణ మప్రధానముగను ఉండుట జేసియును ఇటులు
కల్పన చేయబడెను.

అయిదు ప్రాణములును మనోబుద్ధులును పది యిం
ద్రియములును : వీనితో గూడి అపంచీకృత భూతములవలన
బొడమినది సూక్ష్మశరీరము లేక కురుచ మేను. ఇది భోగ సాధ
నము. దిక్కులు వాయువు సూర్యుడు మొదలగువారు అధి
దైవములు. ఒక తత్త్వమునుండి మరొక తత్త్వము పుట్టె,
అయిదై, ఆ యైదును ఇరువదై దాయెను.

అది యిటులు : ఆకాశమువలన వాయువు మొదలయిన
భూతములు పొడమెను. ఒక ఆకాశము ఐదాయెను. ఆకా
శము కారణము, వాయువు కార్యము. ఇటులే మరల వాయువు
కారణము, అగ్ని కార్యము. ఇటులే అగ్ని కారణము, జలము
కార్యము. ఇటులే జలము కారణము, భూమి కార్యము. కారణ
గుణములు కార్యమున సంక్రమించుట జేసి వాయువునకు ఆకాశ
గుణమగు శబ్దమును స్వగుణమగు స్పర్శమును ఇటులే మిగిలిన

భూతములకును కారణగుణములును స్వగుణమును కలిగెను. ఇందు స్వప్రధానముగా స్వగుణమును కారణగుణ సంక్రమణముచే పరగుణమును కలిగెను. మఱియు పరస్పర (భాగ) సమ్మేళనముచే ఒక్కొకభూతమున కయిదేసి గుణములు కలిగి ఐదైదాయెను. జడ మిట్టులు బలిసి చైతన్యముతో కలిసి విరాట్పురుషు డేర్పడెను. తత్త్వచింతకు లిట్టులు పంచభూతవిభాగ మూహింతురు. బ్రహ్మాండ మీ పంచభూతకార్యము. తత్త్వ మెరిగినవారు శిష్యులకు అధ్యారోపాపవాదములచే బ్రహ్మము మీద ప్రపంచ మారోపితమని తెలియజెప్పుదురు. ఈ పంచీకృతి నెరిగినవాడు ముక్తుడగుటకు సందియము లేదు. పంచవింశతి తత్త్వజ్ఞు డే యాశ్రమమునందున్నను జడలు దాల్చినను ముండన మొనరించుకొనినను సిగ దాల్చినను ముక్తుడే.

సమ్మిశ్ర పఞ్చీకరణము సమాప్తము.



## సాధన చతుష్టయ సంపత్తి.

సాధన చతుష్టయము బడసిన పిదప, నిత్యానిత్య వస్తువివేకము ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము శమదమాదిసంపద ముముక్షుత్వము అనునవి సాధన చతుష్టయము. బ్రహ్మము నిత్యము, జగమెల్ల అనిత్యమని తెలియుట నిత్యానిత్యవస్తువివేకము. — ' తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవ మే వాముత్రపుణ్యచితో లోకః క్షీయతే ' అని శ్రుతి ॥ 'భూలోకమునందు కర్మచే సంపాదింపబడిన ఆలు బిడ్డలు

మొదలగువా రెటులు నశింతురో అటులే స్వర్గము మొదలగు లోకములందును పుణ్యముచే సంపాదింపబడినదియు నశించును ' అని దీనికి అర్థము. — ' పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా న్నాస్త్యకృతః కృతేన । తద్విజ్ఞానార్థం గురు మే వాభిగచ్ఛే త్సమిత్పాణిః శ్రోత్రియంబ్రహ్మనిష్ఠమ్ ' అని శ్రుతి॥ కర్మచే సంపాదింపబడిన పదునాలుగు లోకములం దున్న వారిని పరీక్షించి అనిత్యులనుగా నిశ్చయించి బ్రాహ్మణుడు బ్రహ్మసాక్షాత్కారము కోరి నిర్వేదము పొందునది. కర్మచే మోక్షము కలుగదు. కాన బ్రహ్మజ్ఞానమునకు సాంగముగా వేదము నధ్యయనము చేసినట్టియు, బ్రహ్మసాక్షాత్కారము కలట్టియు, గురువుకడకు సమిత్పాణియై చనునది. ' శాంతో దాంత ఉపరత స్తితిక్షుః శ్రద్ధావిత్తో భూత్వాఆత్మన్యేవాత్మానం పశ్యేత్ ' అని శ్రుతి॥ ' శాంతః = అంతరింద్రియ మనోనిగ్రహము కలవాడు. దాంతః = బహిరింద్రియ చక్షురాది నిగ్రహము కలవాడు. ఉపరతః = విషయాభిలాష లేవియు లేనివాడు. తితిక్షుః = శీతోష్ణములు, సుఖదుఃఖములు మానావమానములు మొదలగు ద్వంద్వములు సహించువాడు. శ్రద్ధావిత్తః, భూత్వా = శ్రద్ధయే ధనముగా గలవాడై, ఆత్మని = విశుద్ధాంతఃకరణము, నందు (ప్రతిబింబించిన) ఆత్మానం = పరమాత్మను. పశ్యేత్ = సాక్షాత్కరించునది అని దీనికి అర్థము. ముముక్షుత్వ మనగా మోక్షేచ్ఛ.

సాధన చతుష్టయ సంపత్తి సమాప్తము.

—♦—

# సవరణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౦ | ౬ | తీరినవుడు | తీరినపుడు |
| ౨౧ | ౪ | చెందివ | చెందిన |
| ౨౧ | ౧౩ | స్వభావజినితేన | స్వభావజనితేన |
| ౨౧ | ౧౬ | నేత్యర్థః | నేత్యర్థఃఅని |
| ౨౮ | ౨౧ | నిరుణః | నిర్గుణః |
| ,, | ,, | నిరఞనః | నిరఞ్జనః |
| ౩౦ | ౧౦ | దవ్పులు | దప్పులు |
| ౩౨ | ౧౦ | ఆత్మ నః | ఆత్మనః |
| ౩౩ | ౪ | యుత సిద్ధములు | యుతసిద్ధములు |
| ౩౮ | ౧౫ | అధ్యాసికః | ఆధ్యాసికః |
| ౫౪ | ౧౭ | ప్రత్య గ్విశేషణము | ప్రత్యగ్విశేషణము |
| ౬౨ | ౬ | నావ్యత్వశ్యతి | నాన్యత్పశ్యతి |
| ౭౩ | ౧౪ | అను తెలివి | అనుతెలివి |
| ౭౬ | ౨౨ | ఎవఆత్మా | ఏషఆత్మా |
| ౭౮ | ౨౦ | శ్రీమత్త్పరమ | శ్రీమత్ పరమ |
| ౮౦ | ౮ | సిద్ధనుయనది | సిద్ధమయినది |
| ౭౪ | ౧౮ | జాగ్రత్ సుషుప్తులలో | జాగ్రత్ స్వప్న సుషుప్తులలో |
| ౭౫ | ౧౯ | ఏమో | ఏదో |
| ౮౩ | ౧౮ | చుచూటు | చూచుట |
| ౮౮ | ౯ | ప్రత్న గాత్మ | ప్రత్యగాత్మ |
| ౯౧ | ౪ | పమాణాపేక్ష | ప్రమాణాపేక్ష |
| ,, | ౧౬ | త్వం | త్వమ్ |
| ,, | ౧౭ | త్వం | త్వమ్ |
| ౯౨ | ౩ | ఏమో | ఏదో |
| ౫౦ | ౧౪ | సన్నిథే | సన్నిధా |
| ౬౨ | ౭ | ప్రతిస్టిత | ప్రతిష్ఠిత |
| ౯౫ | ౩ | వర్ణకము | వర్ణకమ్ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౯౫ | ౧౫ | అధ్యారోపా-జ్ఞేయన్ | అధ్యారోపాపవాదాభ్యా మేవజ్ఞేయమ్ |
| ౯౭ | ౧౧ | సూత్మ్మసృష్టి | సూక్ష్మసృష్టి |
| ,, | ౧౯ | స్దూల | స్థూల |
| ౯౯ | ౧౭ | విష్టో | విష్ణోర్హిరణ్య |
| ౧౦౩ | ౧౨ | శమనార్ద | శమనార్థ |
| ౧౦౪ | ౬ | పరీక్ష్య | 'పరీక్ష్య - బ్రహ్మనిష్ఠమ్' |
| ౧౦౬ | ౧౯ | పవిష్ట | ప్రవిష్ట |
| ౧౦౯ | ౨ | చతుర్ధ | చతుర్థ |
| ౧౧౨ | ౧౦ | పరిగ్రహోదుఃఖ | పరిగ్రహోద్దుఃఖ |
| ౧౧౩ | ౬ | గూర్జరోఽహం | ఘూర్జరోఽహం |
| ౧౧౬ | ౨ | రపమ | పరమ |
| ,, | ౪ | శరీదరిప | శరీరపరి |
| ,, | ౫ | శరీర్పప | శరీరపరి |
| ,, | ౬ | శరిరపరి | శరీరపరి |
| ,, | ౧౪ | వ్యర్ధశుక | వ్యర్థశుక్ల |
| ౧౧౮ | ౬ | సత్స్వపి | సత్స్వపి |
| ౧౨౦ | ౫ | పుల్కా | పుల్కస |
| ,, | ౭ | సిద్దయేత్ | సిద్ధ్యేత్ |
| ౧౨౨ | ౩ | అధ్యాసిక మేవ | ఆధ్యాసిక మేవ |
| ,, | ౭ | తస్మాదా త్మనః | తస్మాదాత్మనః। |
| ,, | ౨౧ | మాపస | మానస |
| ౧౨౪ | ౪ | సమగ్వ్విచార | సమ్యగ్విచార |
| ౧౨౫ | ౨ | సన్వ్యంభసా | నస్వ్యంభసా |
| ,, | ౧౭ | త్రివిదమపి | త్రివిధమపి |
| ౧౨౬ | ౭ | స్పటికఇవ | స్ఫటికఇవ |
| ౧౨౭ | ౯ | సంబధోఽపి | సంబంధోఽపి |
| ,, | ౨౦ | అత్మతత్వమపి | ఆత్మతత్వమపి |
| ౧౩౦ | ౩ | మహాధ్యాయే | షష్ఠాధ్యాయే |
| ,, | ౧౩ | ఉపపత్యాఖ్యం | ఉపపత్త్యాఖ్యం |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౩౦ | ౨౦ | భేధవత్కారణ | భేదవత్కారణ |
| ౧౩౧ | ౬ | ప్రవిష | ప్రవిష్ణ |
| ,, | ౬ | భేధం | భేదం |
| ,, | ౧౪ | పదార్ధ | పదార్థ |
| ౧౩౨ | ౫ | తాత్పర్యావధారణం | తాత్పర్యావధారణం |
| ౧౩౪ | ౧౫ | సహాస్ర | సహాస్రి |
| ,, | ౨౩ | కర్తదా | కర్తదాలేక |
| ౧౪౦ | ౧౭ | పాణ | ప్రాణ |
| ౧౪౧ | ౧౭ | బూత | భూత |
| ౧౪౨ | ౧౫ | అవాంతేం | అవాంతర |
| ౧౪౭ | ౧౩ | కార్య మొన | కార్యమైన |
| ౧౫౨ | ౧౬ | గురు మేవాభి | సగురుమేవాభి |
| ౧౫౫ | ౧౩ | ఇది | ఇవి |
| ౧౫౯ | ౧ | చతుర్ధ | చతుర్థ |
| ౧౬౬ | ౨౩ | చెప్పుకొన్నా | చెప్పుకొన్నా |
| ౧౭౮ | ౧౧ | మహూపురూ | మూపురూ |
| ౧౮౨ | ౨ | అచ్లాఅయిన | అట్లాఅయిన |
| ౧౮౩ | ౧౨ | అబుగాది | ఆబుగాది |
| ౧౮౬ | ౧౮ | తామము | నామము |
| ౧౮౭ | ౯ | సనాకృత | సహాకృత |
| ,, | ౧౨ | పరప్రకాశములు | పరప్రకాశ్యములు |
| ౧౮౯ | ౨౧ | సీమావం | సీమానం |
| ౧౯౧ | ౨౦ | క్రియాలచే | క్రియలచే |
| ౧౯౯ | ౧౪ | నాన్యతేపశ్యతి | నాన్యత్ పశ్యతి |
| ౨౦౩ | ౩ | త్రితీర్ఘం | త్రితీర్షం |
| ౨౦౪ | ౨౪ | ఏతమువలె | ఏతమువంటి |
| ౨౦౭ | ౨౧ | గ్రహించురది | గ్రహించునది |
| ౨౧౬ | ౧౭ | నీవిసుట | నీవనుట |
| ౨౨౦ | ౨౦ | యద్వ్యాప | యద్వ్యాప |
| ౨౨౫ | ౧౦ | తదేవాను | తదేవాను |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౨౫ | ౨౦ | ప్రత్యకాది | ప్రత్యక్షాది |
| ౨౨౭ | ౨౫ | ఆపస్తంభ | ఆపస్తంబ |
| ౨౨౯ | ౧౨ | దదల్పమ్ | తదల్పమ్ |
| ౨౩౧ | ౧౪ | బడయకుడ | బడయకుండ |
| ౨౩౩ | ౧౮ | తళ్య | తస్య |
| ౨౩౫ | ౭ | ప్రతిపత్యా | ప్రతిపత్త్యా |
| ౨౩౯ | ౭ | అత్మ | ఆత్మ |
| ,, | ౨౩ | దర్మము | ధర్మము |
| ౨౪౦ | ౧౨ | భగవతో త్తం | భగవతో క్తం |
| ౨౪౨ | ౧౪ | దేహాత్మనోంసవ్వం | దేహాత్మనోరసత్వం |
| ౨౪౩ | ౨౦ | అత్మయందు | ఆత్మయందు |
| ౨౪౬ | ౮ | వదరమ్ | బదరమ్ |
| ౨౪౭ | ౧౫ | అకాశము | ఆకాశము |
| ౨౫౬ | ౩ | శంశయము | సంశయము |
| ౨౫౭ | ౧౨ | ఫలావాసనఇతి | ఫలావసానఇతి |
| ౨౬౦ | ౨౩ | కూటసుడగు | కూటస్థుడగు |
| ౨౬౪ | ౯ | చు ్నటులు | చున్నటులు |
| ,, | ౧౫ | ఉపపత్యా | ఉపపత్త్యా |
| ౨౬౭ | ౨౨ | పలిత | ఫలిత |
| ౨౭౦ | ౧౮ | ప్రమాణము | ప్రమాణము |
| ౨౭౨ | ౧౧ | అగ్న్యాది | అగ్న్యాది |
| ౨౭౩ | ౮ | జ్యోతిరూప | జ్యోతిరూప |
| ౨౭౫ | ౧౮ | "గనుష్యా స్త్రీమన్ని" | "మనుష్యా స్త్రీమన్ని" |

## శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి రచనలు

### 1. అమ్మతో ముచ్చటలు — రు 1-50

ఇందు 600 లకు పైగా పద్యములు కలవు. సాధక, భక్తలోకమునకు విజ్ఞానపథ ప్రదర్శకములగు చక్కని భావములు కలవు. ధారాళమైన శైలి. ప్రతివారు చదువతగినది.

### 2. దేవపూజా రహస్యము — రు 1-75

ఇందు పూజా స్వరూప, సంకల్ప, కాలాదులు; అధికార, మూర్తి, మంత్రరహస్యములు మొదలగు సాంప్రదాయిక రహస్యములు వివరముగా వివరింపబడినవి. పూజకుసంబంధించిన యిట్టిగ్రంథ మింతవరకు వెలువడలేదు.

### 3. సౌందర్యలహరి — రు 0-75

శ్రీ శంకరభగవత్పాదుల కృతికి ఆంధ్రపద్యము, నూతన వివరణ, కని విని యెరుగని శ్రీ శర్మగారి స్వానుభవవిశేషములతో నలరారుచున్న గ్రంథరాజము.

### 4. భీమేశ్వర నుతి — రు 0-50

శివాష్టోత్తరశతనామములకు ప్రతినామమునకు గల విశేషార్థములతో 108 పద్యములు భాష్యమువలె నొప్పు గ్రంథము. కంఠస్థము చేయతగినది.

### 5. శ్రీ రాజవిద్యా గీత — రు 2-00

భగవద్గీత నవమాధ్యాయమునకు విపుల వ్యాఖ్యానము. రామాయణ మున సుందరకాండవలె గీతలో నవమాధ్యాయము తలమానికము.

### 6. దేవీసూక్త పరమార్థము — రు 0-75

ఋగ్వేదమందలి యెనిమిది ఋక్కులకు విశేషార్థ మిందు వివరింప బడినది. దేవీసూక్తము చండీస్తోత్రమునకు ప్రాణము వంటిది. సాధకులకు కరదీపిక వంటిది.

### 7. శ్రీ సత్యనారాయణశర్మ సాధనము — రు 1-50

ఇందు సత్యజ్ఞానానంద బ్రహ్మరూపమును నిరూపించుచు శుద్ధా ద్వైతము బోధించు గ్రంథరాజము. ఉపాసనారహస్యము లిందు తేటతెల్ల ముగ వివరించిరి.

## 8. శాస్త్రసాధనము — రు 0_50

ఇందు భగవద్గీతకు, సప్తశతికికల సమన్వయము వివరింపబడినది. చండీ సప్తశతీ తత్త్వసారము.

## 9. మహాసౌర మంత్రపాఠము — రు 0_75

సస్వరము. ఆంధ్ర పద్య, ఆంగ్ల గద్యానువాదములు గలవు. సూర్య యంత్రము, సూర్యపటలము గలవు. ఇందలి పద్యపఠనమువలన సర్వ కామ్యములు సిద్ధించును.

## 10. సిద్ధాన్త శిఖామణి — రు 3_00

(శ్రీ రేణుకాగస్త్య సంవాదరూప శైవశాస్త్రము)

ఇందు 21 పరిచ్ఛేదములు, 1400 పైగా శ్లోకములు గలవు. ఈ గ్రంథమున అనేక సన్నివేశములు భగవద్గీతను బోలియున్నవి. డెమ్మీ సైజు షుమారు 350 పేజీలు. మంచి గ్లేజుకాగితము. చక్కని బైండు.

☞ ఈ పది గ్రంథములు తీసికొనిన పోస్టుఖర్చులు ఉచితము. ముందుగ రు. 10/- లు అడ్వాన్సు పంపవలయును. కొలది ప్రతులే గలవు. మీ ఆర్డరు వచ్చునప్పటికి ఉన్న గ్రంథములు మాత్రమే పంపబడును.

# భారతీయ తత్త్వశాస్త్రము

## రచయిత : శ్రీ నిర్వికల్పానందస్వామి

మంచి గ్లేజుకాగితము. క్రౌను 1/8 సైజు. 192 పేజీలు. చక్కని బైండు. సుందరమైన ఆకృతి. వెల రు. 2-0-0 లు. పోస్టేజి అదనము.

ఈ గ్రంథమున షడ్దర్శనములు అనగా గౌతమ, కణాద, కపిల, పతంజలి, జైమిని, వ్యాసమహర్షుల భావములు సులభముగ వర్ణింపబడినవి.

వ్యాససూత్రముల ననుసరించి శంకర, రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, బలదేవ, భాస్కర, విజ్ఞానభిక్షు, శ్రీకంఠాచార్యులను సంప్రదాయ ప్రవర్తకుల మతములు నిష్పాక్షికముగ వివరింపబడి, శంకరులవారి అద్వైతముతో వానికిగల సాదృశ్యముగూడ నిరూపింపబడుటయేగాక, అద్వైతమే సర్వదర్శన శిరోభూషణమని సూచింపబడినది.

## అభిప్రాయములు

"భారతీయ తత్త్వశాస్త్ర సంతతిని సూక్ష్మంగా తెలుసుకోవగోరు వారి కిది ఉపయోగకారి." — ఆంధ్రప్రభ (24-7-49)

"షడ్దర్శనములకు సంబంధించిన వాఙ్మయము నంతటిని ఆవలోడన గావించి, తాము సేకరించిన విషయజాలమును ఈ గ్రంథములో పండిత పామర రంజకముగా ఆంధ్రులకు సమర్పించినందులకు స్వామిజీ ఎంతయూ అభినందనీయులు." — ఆంధ్రపత్రిక (17-4-49)

# సాధన గ్రంథ మండలి, తెనాలి.

---

## శ్రీ సత్యానందాశ్రమ గ్రంథమాల

1. భగవద్గీతామృత తరంగిణి (4 సంపుటములు)

భగవాన్ శ్రీ సత్యానందమహర్షులవారి "తత్త్వార్థానుబోధిని" యను జ్ఞానరత్న సమన్వితమైన విపులవ్యాఖ్యానముతో నలరారు బృహద్గ్రంథము.

| | |
|---|---|
| ప్రథమ సంపుటము (1, 2 అధ్యాయములు) | వెల రు. 3-00 |
| ద్వితీయ సంపుటము (3, 4 అధ్యాయములు) | 4-00 |
| తృతీయ సంపుటము (5, 6 అధ్యాయములు) | 4-00 |
| చతుర్థ సంపుటము (7, 8 అధ్యాయములు) | 4-00 |

2. శ్రీ సత్యానందమహర్షి [116 చిత్రములతోడను అందులకు సంబంధించిన చారిత్రాంశములతోడను అలరారుచున్నది] రు. 1-50
3. బ్రహ్మానందతీర్థ విజయము ... వెల రు. 2-00
4. శ్రీకృష్ణార్జున సంవాదము వెల రు. 2-00
5. విశ్వాసము [ప్రార్థన గీతావళి - తృతీయముద్రణము] 0-50
6. మన గురుదేవులు [శ్రీవారి పద్యరూప చరిత్ర, దండకము] 0-25

పై గ్రంథము లన్నిటికి పోస్టేజి ప్రత్యేకము.

కలయువారు:- కార్యదర్శి, శ్రీ సత్యానందాశ్రమము,
ఇనమడుగు. (పోస్టు) నెల్లూరుజిల్లా.